# దేవాలయములు-తత్త్వవేత్తలు

రచయిత:

శ్రీ వి.టి. శేషాచార్యులు




ప్రచురణ:

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1997

**DEVALAYAMULU – TATTVAVETTALU**

by

**Sri V.T. Seshacharyulu**



T.T.D. Religious Publications Series No. 281

**First Edition** :1985
Reprint :1997

Copies :2,000

**Price : Rs. 19-00**



Published by:

M.K.R. Vinayak, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati – 517 507.



Printed at:

Keerthi Offset Printers,
Tirupati – 517 501.

# ముందుమాట

మానవుని ఐహికజీవితానికి, ఆధ్యాత్మిక జీవితానికి విడదీయరాని సంబంధం నెలకొనివుంది. ఈ ఉభయ జీవిత రంగాలకు చక్కని సమన్వయాన్ని సాధించడానికి అత్యంత పురాతన కాలంలోనే మనదేశంలో ఆవిర్భవించిన పవిత్రసంస్థ దేవాలయం.

ప్రార్థన కోసం, పూజకోసం, దేవతావిగ్రహాల రక్షణకోసం కట్టబడిన కట్టడమే దేవాలయం. జీవునికి దేహంలాగ సచ్చిదానంద స్వరూపుడైన పరమాత్మునికి శరీరంలాగ వెలసినటువంటిదే దేవాలయం. గుండెలోని పరమాత్మను సాకారునిగా గుడిలో దర్శించడానికే దేవాలయాలు. ఈ దేవాలయాలు మన సంస్కృతీ వికాసానికీ, మత ధార్మికావలంబనకీ, వాస్తు శిల్పకళానైపుణ్యానికీ ప్రధాన కేంద్రాలుగా ఉన్నాయి.

దేవాలయం స్థిరంగా ఉండి ప్రజానీకానికి అన్నివిధాలా స్ఫూర్తిని అందించేది. కాగా తత్త్వవేత్త మానవాళికి తన సందేశాలు, రచనల మూలంగా ఆవశ్యకత ననుసరించి ఎప్పటికప్పుడు ఆదర్శపథాన్ని నిర్దేశిస్తూ ఉంటాడు.

భారతదేశంలో ఎంతోమంది తత్త్వవేత్తలు మానవుల తాత్త్విక చింతనాభివృద్ధికి తోడ్పడ్డారు. వారిలో ఆళ్వార్లు, నాయనార్లు మొదలైన ఎందరో మహనీయులు ఆయాకాలాల్లో ఉద్భవించి భక్తిమార్గం ద్వారా ముక్తిని సులభంగా పొందవచ్చునని బోధించారు.

భారతదేశంలో జన్మించిన భక్తి-మత-తత్త్వవేత్తల జీవితాలను వారు బోధించిన బోధనలను, సంఘంలోగల దురాచారాలను నిర్మూలించడానికి ప్రయత్నించిన సంఘ సంస్కర్తల జీవిత విశేషాలను ప్రసిద్ధ రచయితయైన శ్రీ వి.టి. శేషాచార్యులుగారు ఈ గ్రంథంలో సులభశైలిలో, సంగ్రహంగా వివరించారు. పెక్కు గ్రంథాలను పరిశీలించి రచించిన ఈ గ్రంథాన్ని 1985 సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానంవారు ప్రచురించారు.

DEVALAYAMULU - TATTVAVETTALU

by

Sri V.T. Seshacharyulu



T.T.D. Religious Publications Series No. 281

First Edition :1985
Reprint :1997

Copies :2,000

Price : Rs. 19-00




Published by:
M.K.R. Vinayak, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 507.




Printed at:
Keerthi Offset Printers,
Tirupati - 517 501.

# ముందుమాట

మానవుని ఐహికజీవితానికి, ఆధ్యాత్మిక జీవితానికి విడదీయరాని సంబంధం నెలకొనివుంది. ఈ ఉభయ జీవిత రంగాలకు చక్కని సమన్వయాన్ని సాధించడానికి అత్యంత పురాతన కాలంలోనే మనదేశంలో ఆవిర్భవించిన పవిత్రసంస్థ దేవాలయం.

ప్రార్థన కోసం, పూజకోసం, దేవతావిగ్రహాల రక్షణకోసం కట్టబడిన కట్టడమే దేవాలయం. జీవునికి దేహంలాగ సచ్చిదానంద స్వరూపుడైన పరమాత్మునికి శరీరంలాగ వెలసినటువంటిదే దేవాలయం. గుండెలోని పరమాత్మను సాకారునిగా గుడిలో దర్శించడానికే దేవాలయాలు. ఈ దేవాలయాలు మన సంస్కృతీ వికాసానికీ, మత ధార్మికావలంబనకీ, వాస్తు శిల్పకళానైపుణ్యానికీ ప్రధాన కేంద్రాలుగా ఉన్నాయి.

దేవాలయం స్థిరంగా ఉండి ప్రజానీకానికి అన్నివిధాలా స్ఫూర్తిని అందించేది. కాగా తత్త్వవేత్త మానవాళికి తన సందేశాలు, రచనల మూలంగా ఆవశ్యకత ననుసరించి ఎప్పటికప్పుడు ఆదర్శపథాన్ని నిర్దేశిస్తూ ఉంటాడు.

భారతదేశంలో ఎంతోమంది తత్త్వవేత్తలు మానవుల తాత్త్విక చింతనాభివృద్ధికి తోడ్పడ్డారు. వారిలో ఆళ్వార్లు, నాయనార్లు మొదలైన ఎందరో మహనీయులు ఆయాకాలాల్లో ఉద్భవించి భక్తిమార్గం ద్వారా ముక్తిని సులభంగా పొందవచ్చునని బోధించారు.

భారతదేశంలో జన్మించిన భక్తి-మత-తత్త్వవేత్తల జీవితాలను వారు బోధించిన బోధనలను, సంఘంలోగల దురాచారాలను నిర్మూలించడానికి ప్రయత్నించిన సంఘ సంస్కర్తల జీవిత విశేషాలను ప్రసిద్ధ రచయితయైన శ్రీ వి.టి. శేషాచార్యులుగారు ఈ గ్రంథంలో సులభశైలిలో, సంగ్రహంగా వివరించారు. పెక్కు గ్రంథాలను పరిశీలించి రచించిన ఈ గ్రంథాన్ని 1985 సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానంవారు ప్రచురించారు.

హైందవ సమాజంలో దేవాలయాలకు తత్త్వవేత్తలకుగల ప్రాధాన్యాన్ని చక్కగా చాటుతున్న ఈ గ్రంథాన్ని ఇపుడు యథాతథంగా పునర్ముద్రిస్తున్నాము. ఆర్షధర్మాసక్తులైన పాఠకులు వెనుకటిలాగే ఈ ప్రచురణను సమాదరిస్తారని భావిస్తున్నాం.

కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# మనవి

ఓం నమో శ్రీనివాసాయ

స్వాయంభువ మనుచక్రవర్తి వంశములోనివాడైన భరతుని పరిపాలన మహోన్నత మగుటచే ఈ దేశము అతనిపేరుతో భారతభూమిగా ప్రసిద్ధి గాంచి యున్నది. ప్రాచీన ఔన్నత్యంగల మన దేశాన్ని ఎందరో విదేశీయులు దర్శించి, సమస్తరంగములలోగల మన విలువలను గ్రహించి వారి దేశములకుబోయి, అక్కడగల ప్రజలకు చెప్పి, ఎంతగనో శ్లాఘించియుండిరి. ఎంతో ప్రఖ్యాతి గాంచిన భారతదేశములో ఎన్నో మతము లున్నను హిందూమతములోగలసేవ, త్యాగం, ధర్మం, ప్రేమ మొదలగునవి సర్వాంగములై అనేకత్వములో ఏకత్వమును దర్శిస్తూ సర్వమతసమన్వయమునకు ప్రసిద్ధి గడించాయి. భారతీయ ఆధ్యాత్మికతత్త్వపు విలువలను నేటికిని పాశ్చాత్యులు గ్రహించి మన సంప్రదాయమార్గములను వారు అనుసరించుచుండుట చాలా గర్వించదగిన విషయము.

ప్రతిమానవుడు ముఖ్యముగా ఇహలోకచింతన పరలోకచింతన చేయుచుండును. ఇహలోకచింతనలో మానవు లందరు ఐకమత్యముగా మెలగుచూ ఒకరి అభిప్రాయములు మరియొకరు తెలుసుకొనుచూ శాంతిసౌఖ్యములతో జీవితము గడిపే మార్గమును బోధించునదే మతము. ప్రపంచములోగల అన్ని మతములు బోధించు మార్గములు వేరైనప్పటికిని గమ్యస్థానము ఒక్కటే. అదే విధముగ పరలోకచింతనలో మానవుడు ఇహలోకములో తాను నిర్వర్తించ వలసిన ధర్మములు నిర్వర్తించి ముక్తిబొందుటకు తగిన మార్గముకొరకు ప్రయత్నించుచుండును. ముక్తిబొందుటకు అనేకమార్గములు చెప్పబడినను నిష్కళంక భక్తిమార్గము ద్వారానే ముక్తి సులువుగా పొందవచ్చునని మహనీయులు బోధించియుండిరి.

వీటిని మనస్సులో నుంచుకొని ప్రపంచములోను, ముఖ్యముగా భారత దేశములోను జన్మించిన భక్తి-మత-తత్త్వవేత్తల జీవితములు వారు బోధించిన విలువైన బోధనలు, సంఘములోగల కుళ్ళును దురాచారాలను నిర్మూలించుటకు ప్రయత్నించి ప్రాణములను సహితము లెక్కచేయక సంఘశ్రేయస్సుకు పాటు పడిన సంఘసంస్కర్తల జీవిత విశేషములు, ఎంతగనో ప్రఖ్యాతివహించిన హిందూమతం అభివృద్ధి గాకుండుటకు గల కారణములు, ఆటంకములు. పాఠక మహాశయులకు అందచేద్దామనే సత్సంకల్పముతో ఈ పుస్తకమును వ్రాసితిని. తిరుమల తిరుపతి దేవస్థానంవారు నాయందు దయవుంచి ఈ పుస్తకమును స్వకీయ ప్రచురణగా అంగీకరించుట నా భాగ్యముగా భావించితిని.

వేటపాలెం,
1-8-1985.

— వి. టి. శేషాచార్యులు.

# దైవప్రార్థన

## గాయత్రీ ధ్యానము

ముక్తావిద్రుమహేమనీలధవళచ్ఛాయైః ముఖైస్త్రీక్షణై
ర్యుక్తామిందుకలానిబద్ధమకుటాం తత్త్వార్థవర్ణాత్మికామ్,
గాయత్రీం వరదాభయాంకుశకశాం శుభ్రం కపాలం గదాం
శంఖం చక్రమథారవిందయుగళం హస్తైర్వహంతీం భజే.

## శ్రీ పద్మావతీ నుతి

ఈశానాం జగతోఽస్య వేంకటపతేః విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షస్థలనిత్యవాసరసికాం తత్క్షాంతిసంవర్ధినీమ్,
పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్.

## శ్రీ వేంకటేశ స్తుతి

వందే శ్రీ నయనోత్పలస్య శశినం శేషాచలాధీశ్వరం
బ్రహ్మాద్యైర్చితపాదపద్మయుగళం లోకైకనేత్రోత్సవమ్,
వాసిష్ఠైస్సనకాదిభిర్మునిగణైస్సంసేవ్యమానం సదా
భక్తానామఖిలార్థదాయినమహం శ్రీ వేంకటేశం గురుమ్.

ఓం నమో వేంకటేశాయ శేషాద్రినిలయాయ చ,
వైకుంఠాగతసద్ధేమవిమానాంతర్గతాయ చ.

శంఖచక్రవరానమ్రలసత్కరతలాయ చ,
వైఖానసమునిశ్రేష్ఠపూజితాయ నమో నమః.

నాన్యం వదామి న శృణోమి న చింతయామి
నాన్యం స్మరామి న భజామి న చాశ్రయామి,
భక్త్యా త్వదీయచరణాంబుజమంతరేణ
శ్రీశ్రీనివాస పురుషోత్తమ దేహి దాస్యమ్.

## శివ ధ్యానము

హస్తేఽక్షమాలాం హృది రామతత్త్వం
జిహ్వాగ్రభాగే వరరామమంత్రమ్,
యన్మస్తకే కేశవపాదతోయం
శివం మహాభాగవతం స్మరామి.

## శ్రీ వైఖానస సంప్రదాయ గురుస్తవము

శ్రీలక్ష్మీవల్లభారంభాం విఖనోమునిమధ్యమామ్,
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్.

శ్రౌతస్మార్తాత్మికం కర్మ నిఖిలం యేన సూత్రితమ్,
తస్మై సమస్తవేదార్థవిదే విఖనసే నమః.

దేవరాజదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్,
భృగ్వాదిమునిభిర్మాన్యం వందే శ్రీవిఖనోమునిమ్.

వందే భృగుం తపోనిష్ఠం మరీచిం తం మహామునిమ్,
అత్రిం చైవ త్రికాలజ్ఞం కశ్యపం బ్రహ్మవాదినమ్.

శ్రీవేంకటేశకరుణామృతసేకలబ్ధ
వేదాంతదేశికపదాయ బుధోత్తమాయ,
వైఖానసాన్వయపయోధిసుధాకరాయ
శ్రీశ్రీనివాసగురవే మహతే నమోఽస్తు.

నారాయణం సకమలం సకలామరేంద్రం
వైఖానసం మమ గురుం నిగమాగమేంద్రం,
భృగ్వత్రికశ్యపమరీచిముఖాన్ మునీంద్రాన్
సర్వానహం కులగురూన్ ప్రణమామి మూర్ధ్నా.

## నమ్మాళ్వార్ల స్తోత్రము

మాతా పితా యువతయస్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన మదన్వయానామ్,
ఆద్యస్య నః కులపతేర్వకుళాభిరామం
శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా.

## శ్రీ రామానుజ స్తవము

యో నిత్యమచ్యుత పదాంబుజ యుగ్మ రుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే,
అస్మద్గురోర్భగవతోఽస్య దయైకసింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే.

శ్రీభాష్యకారో జయతు రామానుజజగద్గురుః,
ముముక్షూణాం చ సర్వేషాం శ్రీమదష్టాక్షరప్రదః.

యత్పాదపద్మద్వయమాశ్రితానాం
సంసారసింధో స్తరణాయ పోతమ్,
రామానుజం తం రమణీయమూర్తిం
సేవే సదా సంయమిసార్వభౌమమ్.

## శ్రీ శంకరాచార్యధ్యానము

శ్రుతిస్మృతి పురాణానామాలయం కరుణాలయమ్.
నమామి భగవత్పాద శంకరం లోకశంకరమ్.

# విషయ సూచిక

# దేవాలయములు-తత్త్వవేత్తలు

## మొదటి భాగము

## 1. భగవంతుడు-భగవత్తత్త్వము

### భగవంతుడు

"సర్వం ఖల్విదం బ్రహ్మ", "సర్వం విష్ణుమయం జగత్"- ఈ ప్రపంచ సృష్టి-స్థితి-లయము లొనర్చువాడెవడు? ఆయన ఎక్కడ నుండును? ఎట్లుండును? మొదలైన వివరములు తెలుసుకొన వలయునన్నది ఎవ్వరికి అంతుబట్టని విషయము. ఎవ్వరును విశదీక రించి చెప్పలేని విషయము. మొత్తముమీద ఏదో ఒకశక్తి, దానిని భగవంతు డనుడు, పరమేశ్వరు డనుడు, జగత్కారణుం డొకడుండి తీరవలయు ననెడి సిద్ధాంతము సర్వు లంగీకరించిన విషయము. ఆయన భగవంతు డనియు, ఆయన తత్త్వాలే భగవత్తత్త్వములనియు శాస్త్రములు చెప్పుచున్నవి. ప్రపంచములో ఏ ప్రాంతము వా రే విధముగా భావించినను మొత్తముమీద సర్వప్రపంచ వ్యవహారములు నడుపుచున్న వాడే భగవంతుడు. అతనిని బ్రహ్మయనియు, విష్ణు వనియు, శివు డనియు, శక్తి యనియు చెప్పుచున్నారు. మరికొందరు సర్వజగత్తునకు విష్ణువే మూలాధారమనియు చెప్పుచున్నారు. నామ రూపాత్మకమైన ఈ ప్రపంచా న్నంతటినీ సృష్టించి, అందులో ప్రత్యణువులో ప్రవేశించి యుండేవాడు విష్ణువు. అందుకనే ఆయన్ని విశ్వం అన్నారు. అసలు విష్ణువు అంటేనే సర్వత్రా వ్యాపించి ఉండువాడని అర్థము.

ఆ యర్థాన్నే "ఈశావాస్య మిదం సర్వం" అనియు, "సర్వం ఖల్విదం బ్రహ్మ" యనియు ఉపనిషత్ వాక్యములు దెలుపుచున్నవి. అదే విషయాన్ని

"జ్యోతీంషి విష్ణుః భువనాని విష్ణుః
వనాని విష్ణుః గిరయో దిశశ్చ,
నద్య స్సముద్రాశ్చ స ఏవ సర్వం....

అని విష్ణుపురాణం వివరించి యున్నది. దానిని బట్టి సూర్య చంద్రాదులలోని తేజస్సు, చతుర్దశ భువనాలు, వనాలు, పర్వతాలు, దశ దిశలు, నదులు, సముద్రాలు, ఇవి అవి అనే వివక్షత లేక సర్వం ఆయన రూపమే అని తేలుతుంది. అందుకనే ఆయన ప్రపంచాన్ని సృష్టిస్తాడు; పోషిస్తాడు. తిరిగి తనలో లీనం చేసుకుంటాడు. అన్ని ప్రాణులలోను అంతర్యామిగా ఉంటాడు. సర్వజీవులకు ఆశ్రయమిచ్చి సంరక్షకుడుగా ఉంటాడు. సర్వధర్మాలకు ఆధారభూతుడుగా నుండి సర్వప్రాణులకు మోక్షాన్ని ప్రసాదిస్తాడు. ఉపనిషత్తులు, ముఖ్యముగా సంగ్రహముగా, భగవంతుని గురించి తెలిపే విషయాలు. ఇన్ని మహోత్కృష్టగుణాలు గల ఆయన్ని మహర్షులు భగవానుడన్నారు. ఎప్పుడు ప్రపంచాన్ని సృష్టించాలి? ఎప్పుడు ప్రళయాన్ని కల్పించాలి? ఎప్పుడు ఎలా జరగాలి? అన్న సర్వవిషయాలు ఆయనకే తెలుసు. అంతటి వాడు మఱొకడు లేడు. ఈ బ్రహ్మస్వరూపము మాటలచే నిరూపింప శక్యము గానిది. సర్వదేవతలకు మూలము బ్రహ్మ పదార్థము. ఎన్నడూ సముద్రము చూచియుండని వానికి అది యెట్టిదో ఒకడు తెలుపవలసి వచ్చిన యెడల, ఎటు చూచిననూ ఏదో విశాలమైన నీటిమయ మగు పెద్ద తావు అని చెప్పును గాని, ఇంక నేమియు వర్ణించి చెప్ప లేడు. బ్రహ్మము సమస్తగుణాతీతము. బ్రహ్మము దీపము వంటిది. దాని వెలుతురులో సమస్తకార్యములు చేయ వచ్చును. బ్రహ్మము వాక్కునకును, మనస్సునకును అంద

రానిది. బ్రహ్మము ఒక్కటియే సత్యము, నిత్యము. సృష్టి స్థితి లయ కర్మలు లేని వానినిగా భావించు నప్పుడే బ్రహ్మమనియు, పురుషు డనియు చెప్పబడును. సృష్టి స్థితి లయ కర్మలను చేయుచూ కర్మ పరతంత్రుడై యున్నట్టుల భావన చేయునప్పుడు, వానిని శక్తి యనియు, మాయ యనియు, ప్రకృతి యనియు చెప్పుదురు. అతి పవిత్రమైన భాగవతములో చెప్పబడినట్లుగ ననేకమంది భక్తులు భగ వంతుని ప్రార్థించినప్పుడు భగవంతుని గురించి ఏ నిర్ణయము చేయ లేక ఏ రూపములో నున్నాడో తెలుసుకొనలేక ఎక్కడనున్నది తెలి యక ఎవరి యిష్టము వచ్చి నట్లు వార నేకవిధములుగ భక్తితో భగ వంతుని ప్రార్థించి తరించిరి.

భాగవతములో ప్రథమస్కంధమునందు కుంతీదేవి శ్రీకృష్ణుని గురించి ఈ క్రింది విధముగా స్తుతించెను-

కం. పురుషుం డాద్యుఁడు ప్రకృతికి
బరుఁ డవ్యయుఁ డఖిలభూత బహిరంత ర్భా
సురుఁడును లోకనియంతయు
బరమేశ్వరుఁడైన నీకుఁ బ్రణతులగు హరీ!

భాగవతములో ప్రథమస్కంధమునందు, భీష్ముడు శ్రీకృష్ణ పరమాత్మను గురించి ఈ క్రింది విధముగా ప్రార్థించెను-

మ. ఒక సూర్యుండు సమస్త జీవులకుఁదా నొక్కొక్కఁడై తోచు పో
లిక నే దేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్నజ
న్య కదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచునుండు నట్టి హరి నే ప్రార్థింతు శుద్ధుండనై.

భాగవతములోని సప్తమ స్కంధమునందు భగవంతుడైన హరి గురించి ప్రహ్లాదుడు ప్రార్థించిన విధము-

కం. ఇందు గలఁ డందు లేఁడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలఁడు దానవాగ్రణి వింటే.

భాగవతములో అష్టమ స్కంధమునందు హరిని గురించి గజేంద్రుడు స్తుతించిన విధము-

ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపల నుండు లీనమై
యెవ్వని యందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁడనాది మధ్యలయుఁ డెవ్వఁడు సర్వము దానయైన వా
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్.

కం. లోకంబులు లోకేశులు
లోకస్థులు దెగిన తుది నలోకంబగు పెం
జీఁకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్.

కం. కలఁడందురు దీనుల యెడఁ
గలఁడందురు పరమయోగి గణములపాలం
గలఁడందు రన్ని దిశలను
గలఁడు కలం డనెడు వాఁడు గలఁడో లేఁడో.

పరమాత్ముని గూర్చి పురాణ కర్త లిట్లు సంస్తుతించు చున్నారు.

సృష్టి-స్థితి-లయములు నిర్వర్తించుచు సర్వవ్యాపకు డైన ఆ భగవంతునికి అనేక రూపములు అనేక నామములు సిద్ధములై యున్నవి. ఆ దేవుని ప్రపంచము నందంతటు నొక్కొక్కప్రాంతమునం దొక్కొక్క రూపముతో నొక్కొక్క నామముతో పూజించెదరు.

**యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్,**
**మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః.**

**భ. గీ. 4-11**

ఎవ రే రీతిగ సకాములై గాని నిష్కాములై గాని నన్ను ఉపాసించు చున్నారో వారి నా రీతిగనే అనుగ్రహించు చున్నాను. సకాములకు కామ్యఫలమును, నిష్కాములకు ముక్తి నొసగుచున్నాను. ఎవరు ఏ రూపములో ప్రార్థించుచున్నారో వారిని ఆ యా రూపములలో నను గ్రహించుచున్నాను.

సర్వస్య చాహం హృది సన్నివిష్టో,
మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనం చ.

భ. గీ. 15-15

"సర్వప్రాణుల మనస్సులయందు నేనే వసించుచున్నాను వారలకు స్మృతి, జ్ఞానము, మాంద్యము పుట్టు చున్నవి. అనేక వేదములచె నెఱుగ దగిన వాడను, వానిని జేసిన వాడను, తెలిసిన వాడను గూడా నేనే."

అనాదికాలములో మహర్ష్యాదులు తమ ఆధ్యాత్మిక జ్ఞాన చింతనతో, తమ తపశ్శక్తితో, భగవంతుని గురించి వారి అభి ప్రాయములు దెలిపియుండిరి. భగవంతుని గురించి తెలుసుకొనుటకు ఎంతో ఆత్మజ్ఞానము, దృఢసంకల్పము, చిత్తశుద్ధి ముఖ్యనియమములు. ఇవి చాలా అవసరము.

భగవంతునికి మనము దూరముగా నున్నంత కాలము అంటే భగవత్తత్త్వము తెలుసుకో లేనంత కాలము అతనిని అనేక రూపము లతో, ననేక నామములతో ధ్యానించి భగవంతుని తత్త్వము తెలుసు కొన్న తరువాత ఆయన సాన్నిధ్యమునకు చేరి నప్పుడు ఆయన కెట్టి నామములు లేవనియు, ఏ రూపము లేదనియు తెలుసుకొందుము.

సగుణస్వరూపముగా భావించి అనుకుంటున్న భగవంతుడే నిర్గుణుడు. అతడే సగుణ నిర్గుణాలు రెంటికి నతీతుడైన సచ్చిదానందస్వరూపుడు. ఉపనిషత్తులు మొదలగు గ్రంథములు రూప నిర్ణయము చేయలేదు. మహత్తులలో మహత్తనియు, అణువులలో సూక్ష్మాణు వనియు, సృష్టింప బడిన ప్రతిపదార్థములో భగవంతుడు గలడనియు, అందుకనే ఆయ నను సర్వవ్యాపకుడనియు చెప్పుచున్నవి.

"క్షీరే సర్పిః తిలే తైలం పుష్పే గంధః ఫలే రసః, కాష్ఠే అగ్నిః"- క్షీరమునందు నెయ్యివలె, నువ్వులలో నూనెవలె పుష్పము నందు (వాసన) గంధమువలె, ఫలమునందు రసమువలె, కాష్ఠము (కొయ్య) నందు అగ్నివలె భగవంతుడు అంతర్యామియై యుండెను.

1. మనకు సముద్రము, ఆకాశము నీలముగానే కనపడ తాయి. వాస్తవానికి వాటికి ఏ రంగు లేదు. సమీపించిన కొద్దీ మనకు కనబడేది ఏ రంగు కాదు. నిజస్వరూపము మాత్రమే గోచ రించును.

2. పాలలో నుండి నెయ్యి వచ్చుననెడి విషయము అందరికీ తెలిసినదే. తెలియని వారికి ఎట్లు వచ్చునో చెప్పు మని ప్రశ్నించి నప్పుడు వాటి వివరము విడమరచి చెప్పినప్పుడే వారు చక్కగా గ్రహించి తెలుసుకొన గలరు గాని వివరముగా చెప్పనప్పుడు వారు నమ్మరు.

3. మూగవాడు షడ్రసోపేతములగు సమస్త పదార్థములను భుజించి, ప్రతి పదార్థము యొక్క రుచిని తెలుసుకొనగలడు గాని నోటితో వివరించి చెప్ప లేడు.

4. విద్యుచ్ఛక్తి గూడా జలము నుండి వచ్చునని తెలుసు కొన్నాము గాని, మన నేత్రములకు కనపడదు. దానిని మనము నిత్యము ఎన్నో విధములుగా నుపయోగించు కొనుచున్నాము.

5. మంచుగడ్డ ఘనీభవించిన నీరే అయినను, మంచుగడ్డ సాకారరూపం. అందు అంతర్లీనమైన నీరే, నిరాకారమైన జలము.

6. సాకారుడు-నిరాకారుడు గూడా ఆ భగవంతుడే. సాకార బ్రహ్మమువల్లనే నిరాకారబ్రహ్మము పొంద దగుననెడి విషయము ముఖ్యము.

7. అటులనే భగవత్తత్త్వము. పరిశుద్ధమైన ఆత్మజ్ఞానమువల్ల తెలుసుకొనవలసిన విషయమే గాని సులభమైన విషయము గాదు. ప్రతి జీవిలోనుండు ఆత్మ స్ఫటికమువలె నిర్మలముగనే యుండును. కాని మనము ఆచరించెడి మంచి చెడు కర్మలవల్ల దాని నిర్మలత్వము బోధ పడ గలదు. వడ్లగింజలోని బియ్యపుగింజ తెల్లగనే శుభ్రము గనే యుండును. ఆ బియ్యము మనకు కావలసి నప్పుడు వడ్లపై గల పొట్టును తీసి తవుడు మొదలైన పదార్థములను వేరుచేసి నప్పుడే భుజించుటకు దగినవై స్ఫటికములవలె ప్రకాశించెడి తెల్లనిబియ్యము మనకు లభ్యమగును. లేని యెడల ముడివడ్లు మామూలు రూపములో నుండును. అటులనే పరిశుద్ధమైన ఆత్మను ఆవరించు కొని యుండెడి మాయను తొలగించి నప్పుడే ఆ యాత్మ నిర్మలముగ నుండును. భగవంతుని గురించి మహర్ష్యాదులు గూడా వారు పొందిన అను భూతులు ముందుతరముల వారికి నందజేసి మార్గదర్శకులైరి.

> అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత.
> అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా.
>
> భ. గీ. 2-28

శ్రీకృష్ణపరమాత్మ అర్జునునితో ప్రాణికోట్లన్నియు మొదట కనపడక, మరల కనపడి, తిరిగి అంతరించిపోవునని, భ్రాంతి రూపములైన ఈ దేహముల కొఱకై దుఃఖింప నేల? అదియును గాక, ఆదియందు ఏ అవ్యక్తరూపము కలిగియున్నదో అట్టి అవ్యక్తరూపమునే తిరిగి అంత్య మున ధరించు చుండెడి దానికై శోకింపనేల యని బోధించెను.

భగవంతుని గురించిగాని, ఈ ప్రాణికోట్ల జీవితరహస్యమును గురించి గాని మహర్ష్యాదులు, తత్త్వవేత్తలు వారికి గల ఆధ్యాత్మిక జ్ఞానమువల్లనో, భౌతికంగా వారు గ్రహించిన జ్ఞానమువల్లనో ఎన్నో విషయములు తెలుసుకొనగలిగి యుండిరి. వారు తెలుసుకొన్న విషయములు, ఆచరించుటకు వీలయిన పద్ధతులు దేశకాల పరిస్థితులను చెప్పియుండిరి. మరణించిన తరువాత, తిరిగి జన్మించి గతము చెప్పినవారు ఎవ్వరూ లేరు. మరణించిన వారు మరణించిరే గాని, తిరిగి ఏమైనది అంతుబట్టని విషయము.

ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞైః
త్రేతాయాం ద్వాపరేఽర్చయన్,
యదాప్నోతి తదాప్నోతి
కలౌ సంకీర్త్య కేశవమ్.

కృతయుగమున విష్ణువును ధ్యానించియు (తపస్సుచేత), త్రేతాయుగమున యజ్ఞములచేతను, ద్వాపరయుగమున భగవంతుని అర్చించి సపర్యలు చేయుటచే లభించు ఫలము కలియుగమున కేవలము హరిని స్తోత్రము చేయుటవలననే మానవునకు ముక్తి లభించునని శుకయోగీంద్రుడు చెప్పినట్లు తెలియు చున్నది.

బ్రహ్మాండ పురాణము గూడా "కలౌ సంకీర్త్య కేశవమ్" అనియు కీర్తించి యున్నది. అనాదికాలములో మహర్ష్యాదులు వారికి గల దృఢసంకల్పబలము వల్ల కందమూలములను, జలమును, వాయువును భక్షించుచు ఘోరతపస్సులు చేసి భగవంతునిలో నైక్యమైనట్లు దెలియుచున్నది. తరువాతి కాలములో మోక్షముబొందుటకు యజ్ఞయాగములకు అధిక ప్రాధాన్య మిచ్చిరి. ఈ యజ్ఞములు ముఖ్యముగా (పంచయజ్ఞములు) అయిదని తెలిపియుండిరి. 1. దేవ, 2. ఋషి. 3. పితృ, 4. మనుష్య, 5. భూతయజ్ఞములు గృహస్థుడు నిత్యము చేయవలసి యున్నట్లు తెలియుచున్నది.

1. దేవతలకు = హవిర్దానము వలనను
2. ఋషులకు = స్వశాఖా వేదాధ్యయనము వలనను
3. పితృదేవతలకు = తర్పణాదికముల వలనను
4. మానవులకు = అతిథిసత్కారముల వలనను
5. భూతములకు = బలి యొసగి తృప్తి పరచుట వలనను

కామనా శూన్యుడై, కర్మయొనర్చు మనుష్యుడు నిశ్చయముగ ముక్తి బొంద గలడు. ముఖ్యముగ జనకుడు మున్నగు మహాత్ములు కర్మల వలననే ఆత్మజ్ఞానమును బొందియుండిరి. భక్తితో స్వధర్మానుష్ఠానమున నెవ్వని నారాధించి జ్ఞానులు ముక్తి బొందిరో అట్టి పరమానంద స్వరూపుడగు భగవంతుని సర్వవిధములగు కర్మలచే సంతుష్టు నొనర్ప నగును.

మానవుల జీవితములు ఆయుర్దాయములు గూడా యుగములను బట్టి మారుచుండును. కృతయుగములో మానవులు ఎన్నో వేల సంవత్సరములు ఆయుర్దాయము గలిగి మనకన్న వేయి రెట్లు దేహబలము గలిగి యుండెడి వారు. ఈ నాడు మనము అనుభవించే రోగములు, కష్టములు, ఆ యుగములో లేవు. ఒకవేళ యున్నను చాలా తక్కువ. వారి దేహబలము, బుద్ధిబలము, హెచ్చుగా నుండెడిది. అందువలననే వారు ఘోరతపస్సులు చేయగలిగిరి. కృతయుగము నాటి ఉన్నతమైన ఆదర్శ జీవితము త్రేతాయుగములో లేదు. అందువలననే కృతయుగములో గల తపస్సులు తగ్గి యజ్ఞయాగములకు ప్రాధాన్యము గలిగి ఆ యుగములో నా పద్ధతి నాచరించిరి. (పుత్రకామేష్టియాగము - అశ్వమేధయాగము మొ॥) త్రేతాయుగములోని ప్రభావము ద్వాపరయుగములో మరింత తగ్గెను. వర్ణాశ్రమ ధర్మములను సహితము పాటింపక ద్రోణ, కృప, అశ్వత్థామలు, బ్రాహ్మణులై గూడా క్షత్రజీవికను చేపట్టి యుద్ధరంగములో ప్రవేశించి యుద్ధములు జేసిరి.

కలియుగములో వంద సంవత్సరములు జీవించుటయే దుర్ఘటముగా నున్నది. గతయుగముల చరిత్రను బట్టి చూచిన చాలా ఆశ్చర్యముగా నుండును. 1. కృతయుగములో అస్థిపంజరము ఎముకలు ఉన్నంతవరకు ప్రాణ ముండెడిది. 2. త్రేతాయుగములో మాంసము కండరము లున్నంతవరకు ప్రాణ ముండెడిది. 3. ద్వాపర యుగములో రక్త మున్నంత వరకు ప్రాణ ముండెడిది. కాని కలి యుగములో ఆహారము తీసుకొను శక్తి యున్నంత వరకే ప్రాణ ముండుటకు వీలున్నది. ఇవి యన్నియు, యుగ పరిణామములు. ప్రతి యుగము నందును భగవంతుడు ఆ యా కాలముల కుచితము లైన యవతారములు దాల్చి ధర్మసంస్థాపన చేయు చుండును.

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

భ. గీ. 4. 7-8

ఎపుడు వర్ణాశ్రమధర్మములు పతనమంది అధర్మము అభివృద్ధి బొందునో అప్పుడు నన్ను నేనే సృష్టించు కొనుచుందును. అనగా నా మాయ చేతనే శరీరమును గ్రహించుచున్నాను. (అవతరించు చుందును).

సాధుసజ్జనులను రక్షించుట కొఱకును, దుర్మార్గులను వినాశ మొనర్చుట కొఱకును ధర్మము లెస్సగా స్థాపించుట కొఱకును, ప్రతి యుగము నందును నొక్కొక్క కాలములో నొక్కొక్క అవతారముదాల్చి తాను చేయవలసిన ముఖ్యకార్యములు నిర్వర్తించుచుందు నని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునికి బోధించెను.

# 2. భగవంతుని యవతారములు

శ్రీమహావిష్ణువు యొక్క ద్వారపాలకులైన జయవిజయులు సనక సనంద సనత్సుజాత సనత్కుమారుల వలన శాపగ్రస్తులై తిరిగి శ్రీమన్నారాయణుని సన్నిధి యందు ద్వారపాలకులుగా త్వరలో చేరుకొనవలయుననే ఆసక్తిచే భగవంతునికి విశ్వాసపాత్రులై భక్తి గలిగి సత్ప్రవర్తనులై ఏడుజన్మలు గడపుదానికన్న బలవద్విరోధులుగా నుండి వైరముతో భగవంతుని మూడుజన్మలలోనే పొందుటకు వరములు పొందియుండిరి. 1. కృతయుగములో హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా జన్మించి వరాహనారసింహులచే మరణించిరి. 2. త్రేతాయుగములో రావణకుంభకర్ణులుగా జన్మించి రామునిచే హతులైరి. 3. ద్వాపరయుగములో శిశుపాల దంతవక్త్రులుగా జన్మించి శ్రీకృష్ణునిచే వధింపబడి త్వరలోనే వైకుంఠము చేరి శ్రీమన్నారాయణుని దివ్య చరణారవిందములు సేవించుచు ద్వారపాలకులైన విషయము మన పురాణ గ్రంథములవల్ల స్పష్టముగా తెలియుచున్నది.

పై అవతారములతో సహా మొత్తము శ్రీమన్నారాయణుడు దశావతారము లెత్తి ఆ యా కాలములయందు నిర్వర్తించవలసిన ముఖ్యధర్మములు నిర్వర్తించి తమ యవతారములు పూర్తిచేసుకొనిరి.

## భగవంతుని రూపములు

పరత్వం చ తతో వ్యూహం విభవం చాంతరాత్మకం అర్చావతారం

1. పరస్వరూపము, 2. వ్యూహస్వరూపము, 3. విభవస్వరూపము, 4. అంతర్యామిస్వరూపము, 5. అర్చాస్వరూపము అని భగవంతుని స్వరూపము అయిదు విధములుగా చెప్పబడియున్నది.

1. పరస్వరూపము: శ్రీ వైకుంఠము నందు వేంచేసి యుండు భగవత్స్వరూపము. ఈ రూపము నిఖిల జగదుదయ స్థితి ప్రళయ కారణము, సనాతనము, నిత్యము, అప్రమేయము, అచింత్యమునై దేవతలకు గూడా చూడ నలవి కానిది.

నిత్యముక్తోపభోగ్యత్వాత్ పరవ్యూహాత్మనో హరేః

అన్నటుల అనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరుల చేతను సనక సనందాది ముక్త పురుషుల చేతను ననుభవింప దగినట్టిది గనుక నిది సర్వులు దర్శింప, సేవింప నధికారము కలది గాదు.

2. వ్యూహస్వరూపము: పాలకడలియందు శేషశయనము మీద బరుండి యుండి బ్రహ్మ రుద్రేంద్రాది దేవతాగణముల ప్రార్థనముల నాలకించుచు, వారి వాంఛితములు దీర్చుచు సర్వకాల సర్వావస్థల యందు వారిని సంరక్షించుచుండు నట్టి స్వరూపము. ఈ వ్యూహస్వరూపము (విష్ణు, పురుష, సత్య, అచ్యుత అనిరుద్ధు లని) పంచమూర్తులుగను, (వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధు లని) చతుర్మూర్తులుగను శ్రీవైష్ణవశాస్త్రములగు వైఖానస పాంచరాత్రశాస్త్రములందు చెప్పబడి యున్నది. ఇదియును, మానవుల కలభ్యమై, నిత్యముక్తోపభోగ్యమును, బ్రహ్మ రుద్రేంద్రాది దేవతా సేవ్యము నై యున్నది గనుక సర్వులు సేవింప నధికారము లేనిదే.

3. విభవస్వరూపము: భగవానుడు భూతలమున కవతరించి, సాధు పరిత్రాణమును. దుష్టధ్వంసము, ధర్మసంస్థాపనము గావించి భూ భారము నడంచి జగద్రక్షణ మొనర్చుట కనేకావతారములు దాల్చెను. దశావతారముల నిందులో జేర్చవచ్చును. ప్రత్యేక కారణము వల్ల మత్స్యావతారాదిరూపములతో నవతరించి ఆ కార్యము పూర్తి కాగానే అంతర్ధానమగును.

రామ కృష్ణావతారములు పూర్ణావతారములు. వారి పూర్తి చరిత్ర మనకు తెలియును. ఈ అవతారములలో గూడా అంశావతారములు ఆవిర్భావావతారములు అనుభేదములు గూడా గలవు. భగవాను డేదో యొక కాలమునం దేదో యొకరూపముతో నవతరించి తన యవతారకృత్యము పూర్తిచేసుకొని తిరిగి స్వస్థానమునకు జేరుటయే విభవరూపము.

తత్కాలసన్నికృష్టైకలక్ష్యత్వాద్విభవాత్మనః

అన్నట్లు ఆ కాలమునందున్న వారిచే జూడబడు నట్టిది యగుటచే నిదియును సర్వులు దర్శించి, ప్రార్థించుట కధికారముగలది గానట్టిదై యున్నది. జ్ఞాన బోధావతారములు: హయగ్రీవ దత్తాత్రేయులు. వీరు జ్ఞానబోధనకొరకే అవతరించిరి.

4. అంతర్యామిస్వరూపము: సమస్త ప్రాణుల హృదయములందు సూక్ష్మరూపమున నుండుటయే అన్తర్యామి స్వరూపము.

విశుద్ధైర్యోగసంసిద్ధైశ్చింత్యత్వాదంతరాత్మనః

అనునట్లు యమనియమాసనాద్యష్టాంగ యోగసిద్ధులగు యోగులచే చూడంబడు స్వరూపము గనుక నిదియును సర్వాధికారముకలది గాకయుండెను.

5. అర్చాస్వరూపము: భగవంతుడు సర్వాంతర్యామి అనియు, సమస్త జీవరాసులలో భగవంతుడు గలడనియు, భగవంతుడు లేని ప్రదేశమే లేదనియు శ్రుతి స్మృతి పురాణాదులు స్పష్టముగా తెలిపియుండెను. భగవంతుని చేరుటకొఱకై కఠోరతపస్సులు, యజ్ఞయాగాదులు చేసి పలువురు ధన్యులైరి. అందరికి అట్టి శక్తి గల్గుట దుర్లభముగదా! అట్టి శక్తిసామర్థ్యములు లేని ప్రాణికోటికి సైతము భక్తియోగమువలన ముక్తి నొసంగుటకు, భగవంతుని అర్చారూపమే

మిక్కిలి సులభమైయున్నది. భక్తవత్సలుడగు భగవానుడు భక్తుల యం దనుగ్రహము గలవాడై భక్తులచే నిర్దేశింపబడిన, బింబముల యందు, దివ్యసాన్నిధ్యమును కల్పించుకొని వేంచేసియుండు స్వరూపమే "అర్చాస్వరూపము". "అర్చాత్మన్యేవ సర్వేషామధికారో నిరంకుశః" అన్నట్లు ఈ అర్చాస్వరూపమును దర్శించుకొనుటకు పూజించు కొనుటకు సర్వులకు అధికారము గలదు. యోగులు, భోగులు, పండితులు, పామరులు, పురుషులు, స్త్రీలు అను భేదము లేకుండా సర్వులూ సేవించి పూజించి స్తుతించి నమస్కరించి తరించుట కందుబాటుగానుండు భగవత్స్వరూపమే ఈ "అర్చాస్వరూపము".

అర్చావతారస్సర్వేషాం బాంధవో బంధువత్సలః

అను ప్రమాణము ననుసరించి తరతమ భావములు లేక సమస్త జీవులకు బంధువై, బంధువాత్సల్యముగలవాడై యుండును.

"భగవంతునికి బంధు" వనగా భగవత్తీర్థ ప్రసాదములు అనుదినము, అనుభవించుచు ఆశ్రయించి యుండువాడని వేదములు గూడా చెప్పుచున్నవి.

అర్చారూపములు నాలుగు విధములుగా నున్నట్లు తెలియుచున్నది.

1. **స్వయంవ్యక్తములు:** పుణ్యక్షేత్రములలో భగవానుడు స్వయముగా వెలయుట.

2. **దివ్యములు:** మహేశ్వరుడు, బ్రహ్మ, మహేంద్రుడు మున్నగు దేవతలచే ప్రతిష్ఠితమైనవి.

3 **సైద్ధములు:** (ఆర్షములు) మంత్రసిద్ధులగు మహర్ష్యాదులచే ప్రతిష్ఠింపబడుట.

4. **మానుషములు:** హరిభక్తులైన జనులు, భక్తితో ప్రతిష్ఠ చేయుట. భగవానుని పంచవిధస్వరూపములలోని యర్చాస్వరూపము

సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును, సర్వమలభము, సర్వ గమ్యము, సర్వప్రాప్యమునై యున్నది. పై రూపములలో నున్న భగవంతుని భక్తితో ప్రార్థించి సేవించినవారికి ముక్తి వచ్చుట స్పష్టము.

ముక్తిలో గూడ నాలుగు విధము లున్నవి-

1. సాలోక్యముక్తి: భగవంతు డుండు లోకములో భక్తు డుండుట.

2. సామీప్యముక్తి: భగవంతుని అంతరంగ భృత్యులలో చేరి భగవంతుని సమీపమున నుండుట.

3. సారూప్యముక్తి: ఒక విధముగా భగవదాకారము గలిగి యుండుట.

4. సాయుజ్యముక్తి: భగవత్స్వరూపముతో బాటు భగవ దానందము నందుచు, భగవంతునిలో లీన మగుట.

ఈ అర్చారూపములకు, అర్చనాది విధులు ఏ పద్ధతిలో నే విధముగా జరుపవలయునో, చూపించవలసిన కర్తవ్యము గూడా భగవంతునియందే యుండెను. ఉత్తర భారతదేశములో భాగవత పద్ధతి ననుసరించి విష్ణ్వర్చనము జరుగుచున్నది. దక్షిణ భారత దేశములో అనాదినుండియు విష్ణ్వాలయములలో విష్ణ్వర్చనము విఖనస పాంచరాత్ర సిద్ధాంతముల ననుసరించి జరుపబడుచున్నది. శివా లయములలో అనాది నుండియు ఆదిశైవులని వ్యవహరింపబడుచున్న శైవబ్రాహ్మణులు అర్చనాది విధులను జరుపుచున్నారు. ఈ శాఖీయులు మనదేశములో ఏ యే ప్రాంతము లందున్నారు? వీరి వృత్తి, మతము ఆచారవ్యవహారములు, అర్చనాది విధానములు, ఏ సంప్రదాయము ననుసరించి యున్నవి? మొదలైన అంశములు వివరముగా తెలుసు కొనుట చాలా ముఖ్యము.

# 3. దేవాలయములు (దివ్యస్థలములు)

అర్చావతారమూర్తుల సమారాధనార్థము, దేవాలయము లేర్పడినవి. సమస్త భక్తజనులు స్వయముగా భగవదర్చామూర్తిని తనివితీర దర్శించి, పూజించి, సేవించుటకు దేవాలయ నిర్మాణము చాలా ముఖ్యము. దేవాలయములు, విద్యాలయములు లేని ప్రాంత ములను చూడజాలము. ఇవి రెండును మానవుని జ్ఞాన సంపన్నుని గావించి తరింప జేయును. అట్టి పవిత్రదేవాలయములను, పావనదివ్య స్థలములను గురించి యీ ప్రకరణమున పరిశీలింప యత్నింతుము:

"దివ్యో దేవ ఏకో నారాయణః" అను శ్రుతివాక్యము నను సరించి-

"జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున.

భ. గీ. 4-9

అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థాఽనుచిన్తయన్.

భ. గీ. 8-8

అను గీతాచార్యుని సూక్తి ననుసరించి, దేవుని యవతారములు, కృత్యములు, దివ్యములు. దేవునికి సంబంధించిన దంతయు దివ్యమే, అప్రాకృతమే. భక్తోద్ధరణకై భక్తసంరక్షణకై అర్చారూప ధారియైన భగవానుడు భక్తసులభుడై భక్తనిర్దిష్టములగు బింబముల యందు సన్నిహితుడై వేంచేసి యుండు స్థలములు దివ్యములే. అప్రాకృ తములే కాని, అదివ్యములు గావు. ప్రాకృతములు గావు; దివ్య శబ్దము దేవతావాచకమే గాక శ్రేష్ఠవాచకమునై యున్నది.



భగవానుడు అప్రాకృత దివ్యమంగళ విగ్రహుడు, దివ్య కల్యాణ గుణ గణ పరిపూర్ణుడు, దివ్యలోక నివాసుడు, దివ్యాయుధుడు, దివ్య వాహనుడు, దివ్యశక్తి సంపన్నుడు, దివ్యపీతాంబరుడు, దివ్యానర్ఘ సువర్ణమణిమయకిరీట కేయూరాంగద మకరకుండలాద్యనేకభూషణ భూషితుడు, దివ్యకరుణాకటాక్షవీక్షణాలంకృతుడు. ఇట్టి భగవానుని నివాసమగు నిలయము (దేవాలయము) దివ్యస్థలము. అప్రాకృత స్థలము. ఇందువలన దేవాలయము లందుగల స్వయంవ్యక్తాది స్థల విభేదములను పాటింపక దేవాలయము లన్నింటిని దివ్యస్థలములని వ్యవహరించుట ప్రసిద్ధమై యున్నది.

భారతభూమియందు అనంతకాలము నుండియు అనేక దేవాలయములు అరణ్య నదీ తీర పర్వత ప్రదేశము లందు ప్రకాశించు చున్నవి. గ్రామముల యందు గృహముల యందు వేంచేసి యున్న అర్చామూర్తుల కన్న మహాక్షేత్రము లందు వేంచేసి యున్న భగవ దర్చామూర్తుల మహామహిమలు చాలా గొప్పవనియు, అచట గల దేవుని మాహాత్మ్యముతో పాటు, అరణ్య నదీ పర్వత మాహాత్మ్యములు గూడా కలిసి యున్నందున మాహాత్మ్య మినుమడించి యుండునని మహాజనుల విశ్వాసము. "యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" యన్నట్లు మానవుడు మనమునం దెట్టి భావన కలిగి యుండునో అట్టి భావనకు తగిన ఫల సిద్ధిని బొందు చుండును. భగవత్సాన్నిధ్యము మహాక్షేత్రములందును, గ్రామములందును, గృహములందును న్యూనాధికములు లేక సమముగనే యుండును. పలు క్షేత్రములలో అనేక రూపములతో నుండు అర్చామూర్తులను దర్శించినప్పుడు ఒక విధమైన మనశ్శాంతి కల్గును. భక్తులయొక్క భక్తిశ్రద్ధలను బట్టి పరమేశ్వరుడు వాంఛితార్థముల నిచ్చుచుండును. దేవాలయములందు స్థలభేదమున్నదేగాని ఫలభేదము లేదు; సాన్నిధ్య భేదముకూడ లేదు. ప్రతివారు భగవంతుని సేవించుటకొఱకై మన

దేశములో ప్రతిగ్రామమునందు ఆగమశాస్త్రములు చెప్పిన ప్రకారము దేవాలయములను ప్రతిష్ఠించిరి. తమిళములో "కోయిల్"-తెలుగులో కోవెలయనియు నందురు. సంస్కృతమున దేవాయతన, దేవాలయ, భగవన్మందిర, దివ్యస్థల శబ్దములకు భగవదాలయము లని యర్థము. ఇట్లే అప్రాకృతస్థలములు, దివ్యదేశములు, పుణ్యక్షేత్రములు, మహాస్థలములు అను నామాంతరములు గూడా దేవాలయములకు గలవు.

ఈ కాలములో మనము చూచుచున్న దేవాలయములలో కొన్ని కృతయుగ త్రేతాయుగ ద్వాపరయుగముల నుండియు నున్నవి. ఆ యుగములలో ఇంత పెద్ద ఉన్నతమైన దేవాలయములు నిర్మించు సాధనములు లేవు. కలియుగములో నాలుగయిదు వేల సంవత్సరముల లోనే పెద్దపెద్ద దేవాలయములు నిర్మింప బడినవి. ఇతర యుగములలో మానవుల మనోబలము స్థిరమైనది, తీవ్రమైనది. అందువలన వారు మానసికముగనే భగవంతుని మిక్కిలి ప్రసన్నుని జేసికొనిరి. భగవంతునివల్ల నిర్ణయింపబడిన కర్మల ననుసరించి తమ కర్తవ్యము నాచరించుచు భగవంతునిలో సందర్శించుట సమర్థులైరి. భగవంతుని సేవయే వారి పరమ లక్ష్యముగా నుండెడిది.

కొన్ని దేవాలయములలో సకలవర్ణముల వారు, విధి నియమ రహితముగ తర తమ భావములు లేక సర్వవేళల స్వామి నర్చించుకొనుటకు వీలుండును. ప్రయాగ, గయ, కాశి, జగన్నాథము, శ్రీశైలము మొదలైన మహాస్థలములలో ఎల్లరు స్వయముగ స్వామి వారి నభిషేకించి పూజలు జరుపుకొనెడి యాచారము, పూర్వము నుండియు అమలునందు గలదు.

కొన్ని దేవాలయములు మహర్ష్యాదులు తమ దివ్య తపో మంత్రశక్తులచేత మానవకల్యాణము కొఱకు కొన్ని విధినియమము లేర్పరచి శాస్త్రోక్త విధానమున నిర్మించిరి. వారు ఆగమములలో

చెప్పబడిన ప్రకారము యంత్ర దిగ్బంధము గావించి స్వామి వారిని ప్రతిష్ఠించిరి. దేవాలయములకు వారు పెట్టిన ఆంక్షలు, నియమములు విస్మరింప బడినచో దేవాలయముల దివ్యశక్తి క్రమముగ నంతరించు నని వారి అభిప్రాయము.

ప్రస్తుత కాలములో గూడ భక్తజనులు భగవంతుని సేవించి ప్రార్థించి వారి జన్మలు తరింప జేసుకొనుటకై ప్రతిగ్రామములోను దేవాలయములు నిర్మించు చుండిరి. దేవాలయములు లేని కొన్ని గ్రామములలో భజనమందిరముల నేర్పాటు చేయుచుండిరి. వీటిలో శాస్త్రోక్త పద్ధతిని ఏర్పాటు చేసిన శిలావిగ్రహములు లేకపోయినను భగవంతుని పటములను బెట్టి భక్తజనులు పూజించు చుందురు.

దేవాలయములు నిర్మించునప్పుడు వాటికి సంబంధించి ముఖ్యముగా నిర్మించ వలసిన భాగములు–

1. గర్భాలయము 2. అంతరాలయము 3. ముఖమండపము 4. ఆలయవిమానము 5. విమానకలశము 6. ధ్వజస్తంభము 7. ఆలయప్రాకారము 8. గాలిగోపురము 9. కల్యాణమండపము 10. ఉత్సవసమయము లందు స్వామివారిని ఊరేగించెడి వాహనము లుంచుటకు వాహనశాల 11. యజ్ఞశాల 12. ఆలయములోపల బావి మొదలగునవి చాలా ముఖ్యము. వీటి నిర్మాణములు ఏ యే పద్ధతులలో ఎటుల నిర్మింప వలయునో, దేవాలయములకు సంబంధించిన శాస్త్రములలో స్పష్టముగా తెలిపియుండిరి. దేవాలయ ప్రతిష్ఠ, అర్చన, ఉత్సవములను ఏ యే శాస్త్రపద్ధతుల ప్రకారము జరుపుకొన వలయునని నిర్ణయించుకొందురో ఆ యా శాస్త్రములలో అనుభవముగల పండితుల ద్వారా ఆ యా కార్యములు జరుపుకొనుట యుక్తము.

**శిఖరం శీర్షమిత్యాహుః గర్భగేహం గళం తథా,**
**మంటపం కుక్షిరిత్యాహుః ప్రాకారం జానుజంఘయోః.**
**గోపురం పాదమిత్యాహుః ధ్వజో జీవ స్సముచ్యతే.**

1. శిఖరం = స్వామివారి శిరస్సు, 2. గర్భాలయము = స్వామి వారి కంఠము, 3. మంటపము = స్వామివారి కుక్షి (ఉదరము), 4. ప్రాకారము = స్వామివారి మోకాళ్ళు, పిక్కలు, 5. గోపురము = స్వామివారి పాదములు, 6. ధ్వజము = స్వామివారి జీవస్థానము అని ప్రమాణ వచనము.

1. అన్ని దేవాలయములలో అగమశాస్త్ర పద్ధతి ననుసరించి తయారుచేయించి ప్రతిష్ఠింపబడిన శిలావిగ్రహములకు ధ్రువమూర్తులు, మూలవిరాట్టులు అని పేరు. ఈ ధ్రువమూర్తికే "ధ్రువబేర" మని మరియొక పేరు.

2. తామ్రాది లోహములతో చేయబడిన విగ్రహములకు కౌతుకమూర్తు లని పేరు. కౌతుకమూర్తులనే "కౌతుకబేర"మందురు. ఈ కౌతుకమూర్తులను ధ్రువబేర సమీపమునందే యుంచి సమస్త పూజోపచారములు సమర్పించు చుందురు.

3. తరువాత ఉత్సవ విగ్రహములు చాలా ముఖ్యము. వీటినే "ఉత్సవబేర" మందురు. అనగా ఉత్సవవిగ్రహములకు ఆలయోత్సవ, గ్రామోత్సవ, కల్యాణోత్సవాదులను గావించుచుందురు.

4. నాలుగవ బేరమును "స్నపన బేర" మందురు. నిత్య నైమిత్తికాభిషేకములను ఈ బేరమునకు చేయుదురు.

5. అయిదవ బేరమునకు "బలిబేర" మని పేరు. ఈ బేర మును పురస్కరించుకొని ఆలయ, గ్రామ బలులను వేయుదురు. ఇవియే పంచబేరములు.

శిలావిగ్రహమైన మూలవిరాట్టునకును, తామ్రాదిలోహములతో తయారుచేయబడిన స్వామివారి విగ్రహమునకును, ఇరుప్రక్కల అమ్మవార్ల విగ్రహములను గూడా ప్రతిష్ఠ చేయుదురు. మూలస్వామి వారికి బంగారము, వెండి, ఇత్తడితో తయారు చేయబడిన తొడుపులు చేయించి, ముఖము మాత్రము కనపడు లాగున తొడుపులు ధరింప చేయుదురు. స్వామివారికి, అమ్మవార్లకు స్వరూపములు (బొట్టు) బంగారము, వెండితో తయారుచేయించి పెట్టుదురు. మూలస్వామి వారి పై భాగమున బంగారము, వెండి, ఇత్తడితో తయారుచేయబడిన మకరతోరణ ముంచెదరు. పంచలోహములతో తయారుచేయబడిన ఉత్సవవిగ్రహములకు అర్చకులు సమస్తాలంకారములు చేయుచుం దురు. తరువాత భగవదర్చనకు కావలసిన పరికరములు చాలా ముఖ్యము. 1. గంట, 2. దీపారాధన చేయుటకు ప్రమిదలు, 3. తీర్థ పాత్రలు, 4. ఉద్ధరణి, 5. శఠారి, 6. తులసి ఉంచుటకు, కర్పూరము వెలిగించుకొనుటకు పళ్లెము. అర్చనానంతరము స్వామివారికి విసరు టకు వింజామరలు, ఉత్సవ సమయములందు స్వామివారిని ఊరేగిం చుటకు వాహనములు మొదలైనవి అత్యంత ముఖ్యములై యున్నవి.

స్వామివారికి "బ్రహ్మోత్సవములు" (తిరునాళ్ళు) సంవత్స రమున కొక పర్యాయము నిర్ణీతమానములో 3, 5, 7, 9 రోజులు దీక్షగ ఆ యా దేవాలయములకు సంబంధించిన అగమ పద్ధతులలో జరుపబడును. ఈ బ్రహ్మోత్సవములందు, ఇతర ముఖ్య పర్వదినముల యందు ఉత్సవవిగ్రహములను సమస్తాలంకారములతో వాహనముల మీద వేంచేపు చేసి, గ్రామములలో ఊరేగించెదరు. ఈ తిరునాళ్ళ సమయములో గ్రామములోని ప్రజలు చాలా ఆనందోత్సాహములతో గడపెదరు. చుట్టుప్రక్కల గ్రామముల లోని ప్రజలు గూడా ఈ సమయములలో చాలా సంతోషముతో గడపెదరు. ఈ తిరునాళ్ల కాలమున సమస్తాలంకారములు చేసిన భగవంతునికి గరుడసేవ, హను

మంతసేవ, శేషవాహనసేవ, పొన్నమానుసేవ, ఏకాంతసేవ, వసంత సేవ, తెప్పసేవ మొదలగు సేవలు ఎంతో వైభవముగా జరిపెదరు. తిరునాళ్ల చివరిరోజున రథోత్సవము చాలా గొప్పగా చేసెదరు. "రథస్థం కేశవం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే" - రథముమీద వేంచేసియున్న స్వామిని దర్శించిన వారికి తిరిగి జన్మలేదని శాస్త్రములు చెప్పుచున్నవి. అన్ని ఉత్సవములకన్న రథోత్సవము అత్యంత ప్రధానమై యున్నది. మిగిలిన అన్ని ఉత్సవములకన్న రథోత్సవ సమయమందు సమస్త ప్రజలు తమ నిత్యకృత్యములు త్వరగా పూర్తిజేసుకొని రథోత్సవ సమయములో అమితోత్సాహముతో పాల్గొనెదరు. ఈ స్వామివారి రథమును అతి పవిత్రముగ నెంచి ప్రతివారు తర తమ భేదములు లేక లాగెదరు. కన్నులపండువుగ నుండెడి ఈ ఉత్సవము సంవత్సరమున కొక పర్యాయము వచ్చుటచే చాలా ప్రాముఖ్యము వహించియున్నది.

**ఉత్సవము :**

"ఉత్సూతే హర్షం ఇతి ఉత్సవః" - ఆనందమును అధికముగా ఇచ్చునది అని అర్థము. ఉత్సవముల వైభవములు యాత్రికులకు ఆనందాతిశయము కలిగించును.

దేవాలయములలో ఉత్సవములు రెండు కారణములచే జరుగుచుండును.

1. భగవంతుడు ఏ రూపములో ఎందువల్ల నవతరించునో దాని స్మరణకొరకు-

2. కనీసము ఈ తిరునాళ్ల సమయములోనైనా భగవంతుని దర్శించుకొనుటకు వీలుగా నుండునని ఏర్పాటు చేసియుందురు. ఈ విధమైన వారు చాలామంది యుందురు. అందుచేత సమస్త జనులకు భగవద్దర్శనమునకు అవకాశము గలుగును. ఈ లక్ష్యముతోనే

భగవంతుని ఊరేగింపులు, ఉత్సవములు జరుగుచుండును. మన మతములో భగవద్భక్తికి సాధనము లెన్నియో కలవు. భగవదారాధన గూడా ఎన్నియో విధముల చేయవచ్చును. నిత్యము భగవంతుని పూజించలేని పూజాసాధనములు ఇళ్లలో లేని గ్రామవాసు లందరిని సమావేశపరచి, వారందరికి భగవదారాధనకు అవకాశము కలిగించుటకే దేవాలయములలో పూజలు ఏర్పాటు గావింపబడినవి.

# 4. అర్చన - అర్చకులు

దేవాలయములను నిర్మించి స్వామిని ప్రతిష్ఠించిన తరువాత, స్వామివారిని అర్చించుటకు పూజించుటకు, అనాదినుండియు, కొన్ని సంప్రదాయములు గల వారిని భగవదర్చకులుగా నియమించిరి. ఈ అర్చనావిధానము ఏ పద్ధతిలో ఎట్లు జరుపవలయునో, వారి విధులు ఎవ్వియో, మొదలైన వివరములు ఈ ప్రకరణములో తెలుసు కొందము.

అర్చకస్య తపోయోగాత్ అర్చనస్యాతిశాయనాత్,
బింబానామాభిరూప్యాచ్చ త్రిభిస్సాన్నిధ్యముచ్యతే.

అర్చకుని తపోనిష్ఠవల్లను, అర్చనముయొక్క విశిష్టతవల్లను, మూర్తి యొక్క సౌందర్యము వల్లను, విగ్రహమునందు ప్రతిమయందు భగవత్సాన్నిధ్యము గలుగు చున్నది. భగవచ్ఛాస్త్రముల యందు. పై విధముగా చెప్పబడి యున్నది.

యాజకా ఏవ మద్భక్తాః మచ్ఛరీరం హి యాజకాః,
యే జనాస్తాన్ వినిందంతి భవంతి మమ నిందకాః.

యాజకు లనగా అర్చకులు, అనగా భగవంతుని పూజించువారు. నన్ను పూజించు వారే నా భక్తులు. "యజ" ధాతువునకు దేవుని పూజయేగదా మొదటి అర్థము. భగవదర్చకులను ఎవరు నిందించెదరో వారు నన్ను నిందించినవా రగుచున్నారనియు, అర్చకులు నా శరీర భాగమనియు భగవద్వాక్యము.

"అర్చకస్తు హరిస్సాక్షాత్ చరరూపీ న సంశయః", "విష్ణ్వ ర్చకో విష్ణుసదృశః", "నావిష్ణు ర్విష్ణు మర్చయేత్", "నారుద్రో రుద్ర మర్చయేత్" ఇత్యాది ప్రమాణ వచనములను బట్టి భగవదాలయ నిర్మాణానంతరము, భగవదర్చకుల స్థానము అత్యంత పవిత్రమై, ప్రధానమై యున్నదనుటలో అతిశయోక్తి లేదు.

అర్చకప్రభావము చాలా గొప్పదై యున్నట్లు పై వాక్యముల వల్ల స్పష్టముగా దెలియుచున్నది. దైవసంబంధమైన స్థానములలో అర్చకస్థానము తరువాతనే ఇతర స్థానములు ప్రాముఖ్యముగలవై యున్నవి. భగవంతునికి సంబంధించి నిత్యము సలిపెడి దైవ కార్యములలో, ఏ మాత్రము లోపమున్నను దేశానికి, గ్రామములకు అరిష్టములు సంభవించు నని శాస్త్రములు చెప్పుచున్నవి. భగవంతుని తరువాత దేశములో సమస్త మానవ కల్యాణము కొరకు దేశము యొక్క శాంతి కొరకు, మానవులందరి పక్షమున ప్రతినిధియై, భగవంతునికి చేయు అర్చనలో ఏ కళంకము లేకుండ, నిస్స్వార్థము పక్షపాతము లేని విశాలబుద్ధితో, సద్భక్తితో భగవంతుని సేవించి తాను తరించి, ప్రజలందరిని తరింపజేయు వృత్తులలో, అర్చనావృత్తి అనాదినుండియు ప్రాముఖ్యము వహించియున్నది.

వీరు నిత్యము ప్రాతఃకాలమున లేచి, కాలకృత్యములు నెర వేర్చుకొని, స్నానమాచరించి, పరిశుభ్రమైన వస్త్రములు ధరించి, ఎవరి మతానుసారము వారు పుండ్రమును (బొట్టు) ధరించి, దేవా లయమునకు బోయి దేవాలయమునందు గల, మాలిన్యద్రవ్య ములను బయట పారబోయవలెను. తీర్థపాత్రలు శుద్ధిచేసి, తీర్థము నుంచుకొని దీపారాధనచేసి, తులసి, పుష్పములు, మొదలైన పూజా ద్రవ్యములతో స్వామివారికి అర్చన చేయుదురు. తరువాత స్వామి వారికి అన్నము, పెరుగు, నెయ్యి, వలయు పదార్థములు, నివేదన గావించుదురు. సాయంసమయమునందు స్వామివారికి దీపారాధన చేసి, అవసరనివేదన సమర్పించుదురు. స్వామి వారికి శాస్త్రములలో చెప్పబడిన రీతిగ నిత్యకర్తవ్యములను చేయుట అర్చకుల ప్రధాన ధర్మమై యున్నది.

"రాజ రాష్ట్ర గ్రామ యజమానాచార్యార్చక పాచకపరిచా రకాభివృద్ధ్యర్థం, అస్మిన్గ్రామే స్థితానాం, ప్రజానాం, బ్రాహ్మణాది

సర్వవర్ణానాం సర్వేషాం భక్తజనానాం చ వ్యాధి చోర దుర్భిక్షానా వృష్టిరాజబాధాది సర్వోపద్రవశాంత్యర్థం సమస్త సన్మంగళా వాప్త్యర్థం" అర్చకులు దేవాలయములలో నిత్యము సమస్త ప్రజలు యోగక్షేమములు గలిగియుండు నట్లుగను, వ్యాధులు రాకుండ. దొంగల భయము నుండి, శత్రువుల దండయాత్రల నుండి, అగ్ని క్షామాది సంకటములనుండి ప్రజలను కాపాడవలసినదిగను కోరుచు అందరి పక్షమున ప్రతినిధులుగ వారే స్వామివారి చరణముల కడ మంత్రపుష్పములను సమర్పించెదరు. పై విధముగ అర్చకులు దేవాలయములలో నిత్యపూజలు సల్పుచున్నారు.

వీరు ఇతర వృత్తులు పాటింపక ప్రజాపక్షమున అర్చనాది విధులను సక్రమముగా నిర్వర్తించుటకే, అనాదినుండియు దాతలు మాన్యము లిచ్చి వలయు సౌకర్యములు గల్పించి వీరిని పోషించిరి.

చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. భ.గీ.7-16

ఆపదయందున్నవాడు, భగవంతుని తెలుసుకొన గోరువాడు, ధనము నభిలషించువాడు, ఆత్మజ్ఞానము గలిగినవాడు అను నీ నాలుగు విధములైన పుణ్యాత్ములగు జనులు నన్ను సేవించుచున్నారు. ఆత్మ జ్ఞానముగలిగి ప్రతిఫలాపేక్షలేని భక్తులు చాలా అరుదు. ముఖ్యముగా భగవానుడు చెప్పినట్లు, భగవంతుని సేవించేవారిలో, ఆపదయం దున్న వారే చాలామంది గలరు.

అర్చకులస్థానము తరువాత పరిచారకుల నిత్యవిధులు వారు దేవాలయములో చేయవలసిన ముఖ్యకర్తవ్యములు తెలుసు కొనుట ముఖ్యమై యున్నది.

**పాచకులు:**

అర్చకస్థానము తరువాత స్వామివారి నైవేద్యమునకు సంబం ధించిన ప్రసాదములు చేయువారు చాలా ముఖ్యులు. వీరు నిత్యము

పరిశుభ్రముగా స్నానమాచరించి ఉతికి ఆరవేసిన వస్త్రములు ధరించి ప్రసాదములు చేయు పాత్రలను మలినము లేకుండా తోముకొని ఆ పాత్రలలో స్వామివారికి నివేదనము చేయు ప్రసాదములు అన్నము మొదలైన పదార్థములు వండి తయారుచేసి సకాలములో అర్చకులకు ఆ ప్రసాదములు అందజేసిన తరువాతనే అర్చకులు స్వామివారికి ప్రసాదములు నివేదనము చేయుదురు. ఈ ప్రసాదము లను దేవాలయములకు సంబంధించినవారు మాత్రమే తీసుకొందురు. భక్తులకు ఇచ్చే ప్రసాదములు గూడా స్వామివారికి నివేదనము చేసిన తరువాత భక్తజనుల కా ప్రసాదములు ఇచ్చెదరు.

**ఆచార్యస్థానము :**

వీరు ముఖ్యముగ భగవదాలయములలో నిర్ణీత సమయము లలో స్వామివారికి సంబంధించిన సుప్రభాత పఠనము, వేదమంత్ర ములు, భక్తికి సంబంధించిన ప్రబంధములు విధిగా పఠించెదరు. పురాణములు చెప్పుట, భక్తజనులకు భక్తిప్రబోధము గావించుటయే వీరి ముఖ్యకర్తవ్యము.

**పరిచారకులు :**

వీరిలో అనేక వృత్తులకు సంబంధించిన వారందరు స్వామి వారికి పుష్పమాలలు తయారు చేయువారు, భజంత్రీలు (వాద్య ములు వాయించువారు), ఉత్సవ సమయములందు భగవంతుని వాహనములు మోయువారు, ఆ సమయము లందు దీపములు (కాగ డాలు) పట్టువారు, దేవాలయప్రాంగణము పరిశుభ్రము చేయువారు, స్వామివారికి ప్రసాదములు వండు పాత్రలు శుభ్రము చేయువారు, ఇంకా తదితరులు చాలామంది గలరు. వీరు సకాలములో ఎవరు చేయవలసిన కార్యములు వారు సరిగా నిర్వర్తించుటయే వీరి ముఖ్య ధర్మమై యున్నది.

# 5. అర్చకులు - సంప్రదాయములు

అనాది నుండియు విష్ణ్వాలయములలో "వైఖానస", "పాంచ రాత్ర" సంప్రదాయముల ననుసరించియు, శివాలయములలో "ఆదిశైవుల" సంప్రదాయ పద్ధతి ననుసరించియు స్వామివారికి అర్చనాపద్ధతులు జరుపబడుచున్నవి. ఈ సాంప్రదాయిక విషయములు ఈ ప్రకరణము నందు దెలుప బడుచున్నవి.

## విశిష్టాద్వైతమతము — వైఖానసులు

లోకము నుద్ధరించుటకై పలుమతములు ప్రముఖులచే ప్రస్తావించబడి యున్నవి. అనేకములైన చిల్లరమతములు కాల ప్రవాహ గర్భములో గలసిపోయినను విశిష్టాద్వైతమతము అగ్రస్థానమున నిలచి యున్నదనుటలో నతిశయోక్తి లేదు. జీవాత్మ - పరమాత్మ - సంబంధమును గురించి చక్కగా పరిశీలనము గావించి సకల మానవాళికి శ్రీ మహావిష్ణువే ఉపాస్యదైవముగా విశిష్టాద్వైత మెన్నడో నిర్వచించి నిరూపించినది.

1. పరమాత్మ వేరు - జీవాత్మ వేరు; జివాత్మ పరమాత్మ యగు విష్ణువును భక్తిప్రపత్తులతో నర్చించి మోక్షమును బడయవచ్చు ననియు, 2. జీవుడు - ప్రకృతి - ఈశ్వరుడు - అను తత్త్వములు మూడున్నూ నిత్యసత్యము లనియును, విశిష్టాద్వైతము విశదీకరించు చున్నది.

"విశిష్టాద్వైతసిద్ధాంత గురోరస్మద్గురోర్మతమ్"
"విశిష్టాద్వైతవాదీ చ విఖనా బ్రహ్మవిత్తమః"
"విశిష్టాద్వైతముత్పన్నం విఖనాద్యైర్మహర్షిభిః"
"విశిష్టాద్వైతసిద్ధాంత మూలభూతాయ మంగళమ్"

ఈ మొదలగు ప్రమాణవచనముల ననుసరించి యీ విశిష్టాద్వైత సిద్ధాంతములను ప్రప్రథమమున సర్వజగదాధారభూతుడైన శ్రీ మహావిష్ణువు యొక్క దివ్యాంశముతో నవతరించిన శ్రీవిఖనో మునీంద్రులు ప్రబోధించినట్లు తెలియు చున్నది.

ఈ పరమపవిత్ర తాత్త్వికవాదమును బహుళ వ్యాప్తికి దెచ్చిన పూజ్యులు భృగు, మరీచి, అత్రి, కశ్యపులు అను మహర్షులు. వీరు శ్రీవిఖనోముని చరణసరోజముల సన్నిధిలో విశిష్టాద్వైత పావనతత్త్వ మును గ్రహించినవారై తమచే చెప్పబడిన సంహితలలో బాగుగా వివరించి తరువాత కాలమున వచ్చెడి సాధకు లందరును తరించుటకై మంచి బాటను చూపించిరి. భగవన్మానస పుత్త్రులగు భృగ్వాది మహర్షులచే ప్రవర్తింప చేయబడి యున్నందున ఈ విశిష్టాద్వైత సిద్ధాంతము అనాదికాలము నుండియు నున్నట్లు దెలియు చున్నది.

వేద వేదాంతసమ్మతమై మహర్షిగణ ప్రకాశితమై విరాజిల్లు చున్న ఈ విశిష్టాద్వైత సిద్ధాంతము, ప్రాచీనులైన శ్రీ వైఖానస వైష్ణవుల చేతను, శ్రీపాంచరాత్ర వైష్ణవుల చేతను, పూజ్యులు, మహాభక్తులైన అళ్వారుల చేతను, శ్రీ వైష్ణవాచార్యుల చేతను ఆచరింపబడుచు ప్రబోధింప బడుచున్నది.

## వైఖానసులు — వారి వృత్తాంతము

ఏ కాలము నుండి ఈ శాఖీయులు మన దేశములో నే యే ప్రాంతము లందున్నారు? వీరి వృత్తి - మతము - ఆచారవ్యవహార ములు ఏ యే సంప్రదాయముల ననుసరించియున్నవి? మొదలగు విషయములు ఏ కొద్దిమంది పండితులకో తప్ప చాలామందికి తెలియదు.

విఖనోముని శ్రీమన్నారాయణోపదేశమును బొంది మానుష దైవిక కర్మలను బోధించు శ్రీసూత్రమును, శ్రీశాస్త్రమును, లోకాను

గ్రహకాంక్షతో నన్నుగ్రహించిరి. వైఖానస కల్పసూత్రమునకు శ్రీసూక్తమనియు, వైఖానస భగవచ్ఛాస్త్రమునకు శ్రీశాస్త్రమనియు నామాంతరములు. ఈ సూత్రశాస్త్రములకు కర్త విఖనోముని కాగా, తత్ప్రవర్తకులు భృగు మరీచ్యత్రి కశ్యప మహర్షులు. వైఖానసము పరమ వైదికమని "శ్రౌతం వైఖానసం ప్రోక్తం" అను పద్మపురాణ వచనము వలన దెలియుచున్నది. వైఖానసమందలి కర్మకలాపమునందు విఖనోముని వేదమంత్రములనే ఉపయోగించుకొన్నాడు. వేదముల నాధారముగా జేసుకొనియే వైఖానసము చెప్పబడియున్నది.

## శ్రీ విఖనోముని యావిర్భావము

శ్రీమన్నారాయణుడు అర్చావతారుడుగ నవతరింపబోవు సమయమున తన అర్చనావిధానము నెఱుకపరచి ప్రజలను తరింపజేయు నిమిత్తము అనన్యచింతతోను, అత్యంత భక్తిశ్రద్ధలతోను సర్వజగత్ శ్రేయస్సుకొరకు తనను అర్చించుటకు విశిష్ట శక్తిసంపన్నుడైనయొక మహామునిని సృజింపుమని బ్రహ్మదేవున కాజ్ఞాపించెను. బ్రహ్మ ఆ కార్యసాధనను గూర్చి ఆలోచనాపరుడై యుండగా పరమాత్మ ఆతని యందంతర్భూతుడై అట్టి మహామునిని తానే సృజింపదలచి వేదాంత తత్త్వ మీమాంసాఖనన మొనర్చెను. తత్ఫలితముగనే మహాశక్తి సంపన్నుడైన ఒక మహాముని అవతరించి భగవంతుని యెదుట ప్రాంజలియై నిలిచెను.

పిమ్మట వేదవేదాంతముల యందలి సారము మూర్తీభవించెనో యన శంఖచక్రములు, కిరీటము, ఊర్ధ్వపుండ్రములు, పద్మాక్షమాలికలు, దండ కమండలులు, జటాచ్ఛటలును గలిగి, శుద్ధసత్త్వమయుండును, సర్వలోకేశ్వరార్చితుడునై విఖనసుడు రెండవ మహావిష్ణువో యన నొప్పుచుండెను. ఈ మహనీయుడే శ్రీమహావిష్ణు మానసపుత్రుడు.

స్వాయంభువమనోః కాలే యుగాదౌ శుక్లవత్సరే,
శ్రవణే శ్రావణే మాసి పూర్ణిమా సోమవాసరే,
సింహలగ్నేన సంయుక్తే విఖనాః ప్రాప నైమిశమ్.

విఖనోముని స్వాయంభువ మనువు కాలమందు మొదటి యుగము (కృతయుగము) శుక్లసంవత్సర శ్రావణపూర్ణిమ సోమవారమునాడు శ్రవణానక్షత్రము నందు సింహలగ్నములో నైమిశారణ్యమును ప్రవేశించెను.

శ్రీ మహావిష్ణువు వేదోక్త విధానముగా నారాధించు పద్ధతులను బోధించి ఏకాయనీయ, యజుశ్శాఖానుసారముగ నొక సూత్రమును రచింపుమనియు అది వైఖానససూత్రమను పేర, జగద్విఖ్యాతము కాగల దనియు భృగు, అత్రి, కశ్యప, మరీచి మహర్షులు నలుగురు నీకు ముఖ్యశిష్యు లయ్యెదరనియు, విఖనోమునీంద్రున కానతిచ్చెను. భగవంతుడే విఖనసుడని నామకరణ మొనర్చి దైవిక, మానుషికము లగు కర్మలను విశదీకరించుచు, సమస్తములగు వేదశాస్త్రములను, స్వయముగా నుపదేశించెను. విఖనసుడు భగవంతుని యాజ్ఞాను సారముగ 32 విభాగములుగల కల్పసూత్రమును, ఒకటిన్నర కోటి ప్రమాణముగల భగవచ్ఛాస్త్రమును రచించెను. విఖనసమహాముని, తాను శారీరక, దైవిక, కర్మకలాపమునందు చెప్పిన మంత్రములను వేదరాశినుండి సంగ్రహించిరి.

ఋషికి-మునికిగల భేదమిట్లు చెప్పబడుచున్నది-

ఋషి : "సాంగచతుర్వేదతపోయోగా దృషిః"-షడంగసహితముగ చతుర్వేదముల నధ్యయనమొనర్చి తపస్సంపన్నుడగు వాడు ఋషి.

**ముని :** "నారాయణపరాయణో నిర్ద్వంద్వో **మునిః**"- నారాయణ పరాయణుడై ద్వంద్వాతీతుడగు వాడు ముని.

ద్వంద్వాతీతు డనగా సుఖదుఃఖములు, కలిమిలేములు, శీతోష్ణ ములు మొదలగు వాటిని పాటింపని వాడు.

"విఖన" స్సనగా విష్ణువునకును, బ్రహ్మకును అర్థ ముండి యున్నట్లు దెలియుచున్నది.

"విఖనా ఇతి వై విష్ణు స్తజ్జా వైఖానసా స్స్మృతాః"

1. "వైఖానస్సామగాయనః" - ఈ మొదలగు ప్రమాణ ములవలన విఖనసుడని, విష్ణువునకు పేరున్నటుల దెలియుచున్నది.

2. "విఖనసార్థితో విశ్వగుప్తయే" అను భాగవత ప్రమాణము ననునరించి, బ్రహ్మకును విఖనసుడని పేరున్నటుల దెలియుచున్నది.

విఖనసముని ముఖ్యశిష్యులైన భృగు; మరీచి. అత్రి, కశ్యపులు నాలుగులక్షల గ్రంథము అధికారసంహిత, తంత్రకాండము లను పేర్లతో వ్రాసియుండిరి. ఈ గ్రంథములు దేవాలయనిర్మాణ ప్రతి ష్ఠార్చనోత్సవములకు సంబంధించిన అనేక ముఖ్యవిషయములను తెలియపరచుచు ఆధ్యాత్మిక పురోభివృద్ధికి ఎంతగనో దోహదమొనర్చు చున్నవి.

విఖనసముని చెప్పిన సూత్రమునందు గల నిషేకము మొద లగు సంస్కారములచే నంస్కరింపబడి, వైఖానన సూత్రానుసారమును చరిత-క్రియా జ్ఞాన యోగవిశిష్టమును నగు వైఖానస భగవచ్ఛాస్త్రము నందు జెప్పబడినవిధముగ, స్వార్థ-పరార్థములందు(స్వగృహములందు ఆలయములందు) శ్రీమన్నారాయణు నర్చించుట కధికారము గల వైష్ణవ బ్రాహ్మణులు వైఖానసు లని పిలువబడుచున్నారు. వైఖానస సూత్రానుష్ఠాతలు గనుక వైఖానసు లనబడుచున్నారు.

"విఖనసమునినా ప్రోక్తం సూత్రమధికృత్య తన్మార్గాను సారిణో వైఖానసాః" అని వైఖానసశబ్దము పండితులచే నిర్వచింపబడి

యున్నది. సర్వదేవతలలో విష్ణుదేవుని బరదైవతముగ నుపాసించుట వలన వైష్ణవులై యున్నారు. "విష్ణు ర్దేవతా యేషాం తే వైష్ణవాః" అని వైష్ణవ శబ్ద నిర్వచనము. ఎవరికి విష్ణువు పరదైవతమో వారు వైష్ణవులు. విష్ణువునందు సర్వభారమును సమర్పించి, సర్వకాల సర్వావస్థల యందును తనను గాపాడు వాడు సర్వేశ్వరుడగు విష్ణువు ఒక్కడే యని నమ్మియుండు వాడు వైష్ణవుడు.

వైఖానస సూత్రమునందు విష్ణుపారమ్యము, విష్ణ్వారాధనము జెప్పబడి యున్నది. ఈ సూత్రమునందు ఆదిమధ్యాంతములందు విష్ణువు కీర్తింపబడి యున్నందున సకల కల్పసూత్రములలో నుత్తమమైనదనియు, వైష్ణవమైన దనియు

"యత్సూత్రాంతమధ్యే తు గీయతే విష్ణురవ్యయః,
ఏతద్ధి వైష్ణవం సూత్రం సర్వసూత్రోత్తమం హి తత్."

అను ప్రమాణములను బట్టి తెలియుచున్నది.

"ఆద్యత్వాత్సర్వసూత్రాణాం వైష్ణవత్వాచ్చ తత్తు వై,
మయానువర్తితం తద్వత్కాశ్యపాత్రిమరీచిభిః."

అను భృగుమహర్షి వచనము ననుసరించి అన్ని సూత్రములలో మొదటిదియు, విష్ణుపరమైనదియు నగు వైఖానససూత్రమందు చెప్పబడిన సంస్కారములచే సంస్కరింపబడు చున్న వైఖానసులు-సహజ వైష్ణవులు, జన్మవైష్ణవులు నై యున్నారు.

వైఖానసులకు ఆగర్భవైష్ణవులను వ్యవహారము కలదు.

"అహమేవ గురుస్తేషాం గర్భవైష్ణవజన్మనామ్"

(శ్రీనివాసదీక్షితీయము) గర్భవైష్ణవులగు వైఖానసులకు నేనే గురువు నని భగవద్వాక్యము.

గర్భవైష్ణవు లనగా: తల్లికడుపున నున్నపుడే ఎనిమిదవ నెల యందు, వైఖానససూత్రమందు శ్రీవైష్ణవత్వసిద్ధికై చెప్పబడిన విష్ణుబలి యను సంస్కారముచే సంస్కరింపబడి వైష్ణవత్వమును పొందినవారు.

అష్టమ మాసమునందు శుభదినమున వైదికములు_ విష్ణుదేవ తాకములునగు మంత్రములతో విష్ణ్వారాధన పూర్వకముగా పాయ సమును, అగ్నియందు హోమము జేసి, హోమశేష పాయసమును, శంఖచక్రములచే నంకిత మొనర్చి, యా పాయసమును అష్టమమాస గర్భవతియగు స్త్రీచే ప్రాశనము చేయించెదరు. ఈ పాయస ప్రాశనము వలన గర్భస్థజీవునకు శ్రీవైష్ణవత్వము సిద్ధించుచున్నదని శ్రీవైఖానస సంప్రదాయజ్ఞుల దివ్యసిద్ధాంతము. వైఖానసులు తత్త్వత్రయవాదులు అనగా విశిష్టాద్వైతమతస్థులు. ఈ వైఖానస కల్పసూత్రము విశిష్టా ద్వైతులకు గ్రాహ్యమైన "త్రిదండసన్న్యాస" విధిని జెప్పినది. భగవ ద్రామానుజులవారు తమ ఆపస్తంబసూత్రములో త్రిదండసన్న్యాస విధానములేదు గనుక "అనుక్తమన్యతో గ్రాహ్యం" అను ప్రమాణము ననుసరించి వైఖానససూత్రోక్త రీతిగ త్రిదండసన్న్యాసమును స్వీకరించి రని సంప్రదాయజ్ఞులు చెప్పుచున్నారు. త్రిదండసన్న్యాసము తీసుకొన దలచినవారలకు వైఖానససూత్రమే ఆధారమని తెలియుచున్నది.

త్రిదండసన్న్యాస మనగా _

చిత్_జీవుడు, అచిత్_ప్రకృతి, ఈశ్వరుడు అనెడి తత్త్వత్రయ మును పరబ్రహ్మయందలి భాగము లనియు, వాస్తవమునకు మూడు భాగములు సైత మొకే యొక తత్త్వమును వెల్లడించుననియు, చిద చిద్విశిష్ట బ్రహ్మ స్వరూపమే జగత్కారణ మనియు త్రిదండధారణము నందు ద్యోతక మగుచుండును.

త్రిదండసన్న్యాస స్వీకారరీతి వైఖానసేతర సూత్రములయం దెచ్చటను గూడ ప్రస్తావింపబడి యుండలేదు.

మూడు వెదురు కఱ్ఱలను కలిపి కట్టిన దండమును కాషాయ వస్త్రముచే నలంకరించి, దండధారణ శాస్త్రవిధి ననుసరించి ధరించుటయే త్రిదండధారణ మనబడును. దీనినే త్రిదండసన్న్యాస మందురు. వానప్రస్థాశ్రమమును దీసికొనవలసినదిగా కల్పసూత్ర కారు లందరు చెప్పినారు. కాని తదాశ్రమస్వీకారపద్ధతిని చెప్పియుండ లేదు. ఆ యాశ్రమమును దీసికొనవలసిన విధానమును ఆ యాశ్రమ ధర్మములను వైఖానససూత్రము పరిపూర్ణముగ జెప్పినది.

ఆపస్తంబ బోధాయనాశ్వలాయన కాత్యాయనాది సూత్ర ములవారు తమ తమ సూత్రములందు లేని విషయమును, ఇతర సూత్రములనుండి గ్రహించవలయు నని నిర్ణయింపబడియున్నందున ఆపస్తంబాదు లందరును, వైఖానస సూత్రము ననుసరించి వాన ప్రస్థాశ్రమమును దీసికొనవలసియున్నది. ఇతర సూత్రములవారు, వానప్రస్థాశ్రమ స్వీకార విషయమై ఈ వైఖానస సూత్రము ననుస రించుచున్నందువలన వానప్రస్థులగు వీరందరు, వైఖానస శబ్దముతో వ్యవహరింప బడుచున్నారు. వానప్రస్థులకు వైఖానస సూత్రాను సరణముబట్టియే వైఖానసు లను నామాంతర మేర్పడియున్నది.

శ్రీరామచంద్రమూర్తి వనవాసమును జేయు సమయమున విఖనస మహామునిచే చెప్పబడిన వానప్రస్థాశ్రమ ధర్మము ననుస రించెనని-

1. రామాయణము నందలి అయోధ్యాకాండమునం దిట్లు గలదు.

"తతో వైఖానసం మార్గ మాస్థిత స్సహ లక్ష్మణః"

"విఖనసా ప్రోక్తం వైఖానసం మార్గం వానప్రస్థ ధర్మం"

2. పరాశరస్మృతి వ్యాఖ్యానములో మాధవాచార్యులు(విద్యా రణ్యస్వామి) ఇట్లు వ్రాసిరి-

"తాదృశోఽరణ్యం గత్వా వైఖానస సూత్రోక్త మార్గేణాగ్ని మదధ్యాత్"

3. "వానప్రస్థః వైఖానస శాస్త్రసముదాచారః" అని బోధాయనసూత్రము. వానప్రస్థుడు వైఖానసశాస్త్రము ననుసరించి ఆశ్రమ ధర్మములను ఆచరించవలెను. ఇట్లే ఆపస్తంబమహర్షి మొదలగు కల్ప సూత్రకారు లందరు చెప్పిరి.

4. "వైఖానసమతే స్థితః"-మనుస్మృతి"

"వైఖానసః=వానప్రస్థః ; తద్ధర్మ ప్రతిపాదక శాస్త్రదర్శనే స్థితః ; తేనైతదుక్తం అన్యదపి వైఖానసశాస్త్రోక్తం, ధర్మమనుతిష్ఠేత్" అని కుల్లూకభట్టు వ్యాఖ్యానము.

"విఖనసాప్రోక్తం సూత్రం వైఖానసమతమ్. తత్ర హి వాన ప్రస్థధర్మస్య పూర్ణ ఉపదేశః" అని స్మృతిముక్తా ఫలమను ధర్మశాస్త్రము నందు వైద్యనాథదీక్షితులు ఇట్లు వ్యాఖ్యానించిరి.

ఇట్లే గౌతముడు, యాజ్ఞవల్క్యుడు మొదలగు స్మృతి కర్త లందరు చెప్పియుండిరి.

## వానప్రస్థాశ్రమధర్మము

వానప్రస్థాశ్రమమును దీసికొనదలచిన వ్యక్తి బ్రహ్మచర్యము నవలంబించి భార్యతో గాని, భార్యలేక గాని అడవులలోనికి బోయి పర్వత నదీతీరములలో నొక పర్ణశాలను నిర్మించుకొని వైఖానస శాస్త్రమునందలి విధానానుసారముగ అగ్నికార్యమును నిర్వహించుచు శ్రీమన్నారాయణుని ధ్యానించుచు తపోధనుడై యుండవలెను. వాన ప్రస్థాశ్రమమును స్వీకరించిన వారు, ఉప్పు, కారము, పులుసు, తీపి మొదలగు పదార్థముల త్యజించవలెను. అడవులలోదొరకు ఫలములు, దుంపలు మొదలగు వాటిని మాత్రమే భుజించవలెను. అతిథి అభ్యా

గతులను పూజించవలెను. నేలపై దర్భలు పరచుకొని పరుండవలెను. భార్య ఉపచారములు మాత్రమే చేయవలెను.

వైఖానసులను గురించి ప్రముఖులగు పండితులు వ్రాసిన వ్యాసముల నిచట నుదాహరించు చున్నాము.

బ్రహ్మశ్రీ శతావధాని చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రిగారు 19-5-1948 ఆంధ్ర వారపత్రిక యందు "వైఖానసులూ - వైష్ణవులూ" అను శీర్షికతో నొకవ్యాసమును వ్రాసియున్నారు. ఆ వ్యాసమును పూర్తిగా జూడగోరు వా రా పత్రికను గాని 'కథలు - గాథలు' అను పుస్తక భాగములను గాని జూడగోరు చున్నాను. అందులోని కొన్ని భాగముల నీ దిగువ వ్రాయు చున్నాను.

........ వైష్ణవులకు రామానుజులు గురువులు. వైఖానసులకు గురుపీఠమంటూ లేనే లేదు. వారు స్వయంగురువులు. విఖనస్సు అనే ఋషిసూత్రాన్ని బట్టి వీరు శ్రౌత స్మార్తాది కర్మకలాపాన్ని నిర్వర్తించుకుంటారు. వైష్ణవులు స్మార్తులతో బాటు వైదికకర్మలు ఆపస్తంబాది సూత్రాలను బట్టి నిర్వర్తించుకోవడమే గాని వైఖానసుల మాదిరిగా స్పెషలు సూత్రమంటూ లేదు. వైఖానసం రామానుజీయ వైష్ణవమతం కంటె చాలా ప్రాచీనము; ఎంతప్రాచీనమో తెలిసిన వారు లేరు.

........ వారికీ, వీరికీ కలయిక లేదు. వీరు విఖనససూత్ర ప్రకారం (విష్ణువును) పూజిస్తారు. వారు పాంచరాత్రాగమాన్ని బట్టి (విష్ణువును) పూజిస్తారు. వైఖానసులకు తప్త చక్రాంకనం లేదు. కాని ఒక విధమైన అంకనం వుంది. దాన్ని వారు గర్భచక్రాంకన మని వ్యవహరిస్తారు. 'శ్రీనివాస స్మృతి' అనే ధర్మశాస్త్రం ప్రత్యేకించి వుంది. దానిలో "అహమేవ గురుస్తేషాం గర్భవైష్ణవజన్మనామ్" అని భగవంతుడు చెప్పినట్లు వుంది. నా విద్యార్థిదశలో ఆ గ్రంథం నేను తాళపత్రాలలో నున్నది చదివియున్నాను. పై శ్లోకాన్ని బట్టి చూస్తే

ఆదివైష్ణవులు వైఖానసులే అని స్పష్టపడుతుంది. గర్భవతులుగా నున్నపుడు ఎనిమిదవమాసములో ఆ యా చక్రాంకనం వారు సమంత్రకంగా జరుపుకొంటారు.

......... వైష్ణవులు వైఖానసులకు వ్యతిరేకులై రామానుజ శిష్యత్వాన్ని బలవంతంగా అంట గడతారు. అంతేనే గాని నిన్న మొన్న పుట్టిన రామానుజులవారికి ఆ అగర్భవైష్ణవులు వైఖానసులు ఎంతమాత్రము శిష్యులు కారు. రామానుజులు అవతరించే నాటికి ఉన్న విష్ణుస్థలాలన్నీ విఖనససూత్ర ప్రకారం అర్చింపబడే వే కాని పాంచ రాత్ర ఆగమప్రకారము కాదు.

........ ప్రస్తుతం మనకు కావలసింది, వైఖానసులు వైష్ణవ గురువు రామానుజుల శిష్యులు కారనిన్నీ ........... వారి వైష్ణవం అనాదిగా వస్తూవున్న దనిన్నీ దురభిమాన గ్రహావేశధూమ ధూపితులు కొందరు ఆ యీ అనాదివైష్ణవులైన వైఖానసులకు రామానుజ శిష్యత్వాన్ని అంటుగట్టాలని ప్రయత్నించినా రనిన్నీ ఆ యత్నం కొంత వరకు ఫలించినా పూర్తిగా ఫలించ లేదని తెలుతుంది.

"శ్రౌతస్మార్తాది కర్మలు: శ్రౌతకర్మ లనగా శ్రుతి యందు చెప్పబడినవి. హవిర్యజ్ఞ సోమయజ్ఞములు మొదలైనవి శ్రౌతకర్మలు.

స్మార్తకర్మ లనగా స్మృతుల యందు చెప్పబడినవి. వివాహోపనయన పాకయజ్ఞాదులు మొదలైనవి స్మార్తకర్మలు.

శ్రీ కొట్రా శ్యామలకామశాస్త్రిగారు తమ 'ఆంధ్రవాచస్పత్య' మను నిఘంటువు నందు వైఖానస బ్రాహ్మణులను గూర్చి యిట్లు వ్రాసినారు—

"శ్రీ" వైఖానసబ్రాహ్మణులు ద్రావిడులలో నొక తెగ. వీరు ఏకాయన యజుశ్శాఖీయులు వైఖానస సూత్రానుష్ఠాతలు, వైదికులు, భట్టాచార్యులు అను బిరుదము గల వారు, గర్భచక్రాంకన పరులు.

ఆత్మార్థయజనమునను శ్రీశాస్త్రోక్త పరార్థయజనమునను నారాయణుని తప్ప ఇతర దైవముల నారాధింపని ఏకాంత వైష్ణవులు; వీరు ద్రవిడ ఆంధ్ర, కన్నడ దేశము లందున్నారు.

### * వైఖానసము – వైష్ణవము :

వేదమంత్రములు ముఖ్యదేవతను అగ్ని, ఇంద్ర, మిత్ర, వరుణాది వివిధ నామధేయములతో వర్ణించు చున్నవి. దీనికి అన్య విధముగ ఉపనిషత్తులు బ్రహ్మన, సత్, ఆత్మ మొదలగు నామధేయములతో భగవంతుని వ్యవహరించుచున్నవి. ముఖ్యదేవత సృష్టి, స్థితి లయకారుడు భగవంతు డొకడే అయినను పురాణగాథలలో త్రిమూర్తులుగ కేంద్రీకరింపబడినది. ఉపనిషత్తుల వలెగాక వేదమంత్రములు భగవంతుని స్త్రీ పురుష రూపములుగను అభివర్ణించినవి.

మన మతచరిత్ర అంతయు వేదమంత్రములనే ఆశ్రయించి యున్నది. మన ముఖ్యదేవత స్త్రీ లేక పురుష వ్యక్తిత్వము గలిగి, ముఖ్యముగ "జ్ఞాన-ఆనందస్వరూపమై" యొప్పుచున్నది. నిజస్థితిని తగ్గించుటయే జ్ఞానుల అంత్యధ్యేయముగాన వారికి భగవానుడు నిర్గుణాత్మకముగా, నిరాకారముగా, సహాయకారి. కాని మతమునకు ముఖ్యదేవత (భగవంతుడు) సగుణుడుగా గాని, సాకారుడుగా గాని, సాకారచిహ్నములతో గాని ఉండుట ఎంతేని అవసరము. మానవదృష్టి నుండి భగవంతుని చేరగోరు వారికి పై విధానము ఉపయోగము. బహుశః అర్థము చేసికొనలేని వారి అనుభవములకు భగవంతుని రూపము మిక్కిలి యుక్తమై యున్నది. వేదములలో లభించు ముఖ్య దేవతానామములలో విష్ణువు ఒకటి. విష్ణువు సర్వోత్కృష్టదేవతగ

* ఈ విభాగం – శ్రీ ఎ. ఆర్. తాతాచారియర్‌గారి ఆంగ్లమూలమునకు, శ్రీ ఎ. శ్రీరామచక్రవర్తిగారి తెలుగు అనువాదము. చూ. సప్తగిరి పత్రిక (తెలుగు) సెప్టెంబరు, 1977.

కొనియాడబడి యున్నాడు. బ్రాహ్మణములలో విష్ణువునకు సంబంధించిన పురాణగాథలు అనేకము గలవు. వైదికకర్మ లన్నియు విష్ణుపరముగ గుర్తింపబడి యున్నవి.

విష్ణువు యొక్క సర్వోత్కృష్టత ముఖ్యదేవతా ప్రాతిపదికగా వేదములలో వైష్ణవము ఆరంభమై యున్నది. వేదకాలానంతరము గొప్పఋషియైన విఖనసు డొక్కడే పై విషయములను లోకవిశదము గావించెను. వైష్ణవమునకు మూలపురుషుడు విఖనసుడనుటలో అతిశయోక్తి ఏ మాత్రము లేదు. పాంచరాత్రికులవలె గాక తన యభిప్రాయములను వేదవాఙ్మయముతో మాత్రమే నిర్దుష్టపరచి అనుసరించెను.

విఖనసుని బోధన ఫలితముగ పాంచరాత్రము ఆవిర్భవించెనని కూడ చెప్పవచ్చును. దేవాలయములలో భగవంతుని విగ్రహముల ద్వారా ఆరాధన ప్రారంభమగుట విఖనసుని ప్రతిభ వలననే. అదే విధముగ పాంచరాత్రికులచే అనుసరింపబడెను. పాంచరాత్రాగమమునకు ప్రథమమున తాంత్రికమంత్రములు, ముద్రలు, యంత్రములు మొదలైనవి తోడ్పడినవి. తర్వాత పాంచరాత్రశాస్త్రము ఉపనిషత్ స్థానమునకు బదులుగా నిర్దిష్టసిద్ధాంతములతో ప్రత్యేకముగ నేర్పడి బహుళముగ వృద్ధి నొందినది. ఇది వేదమంత్రములు, ఆచారక్రియలపై ఆధారపడి యున్నది.

వేరొకవిధముగ చెప్పవలయునన్న విఖనసుడు తన సిద్ధాంతములకు, ఆచారక్రియలకు వేదములను మాత్రమే ప్రాతిపదికగ తీసికొనెను. విఖనసుని ఆరాధనావిధానములో అవైదికము లెచ్చటను లేవు. విఖనసుని వైష్ణవ మందలి ఆసక్తి కల్పసూత్రములలో నిరూపింపబడినది. వేదకాల ఆచారక్రియావాఙ్మయమే కల్పసూత్రములు. ఆపస్తంబ, బోధాయన, సత్యాషాఢ తదితరులు వైదికకర్మలను

విశదపరచి కల్పసూత్రములను రచించిరి. విఖనసుడు మాత్రమే వైదికక్రియావాఙ్మయ మందు వైష్ణవతత్త్వమును ప్రవేశ పెట్టెను. కనుక వారి వేదక్రియలు పూర్తి వైష్ణవ స్వభావము కలిగియున్నవి. ముల్లోకములను తన పాదములతో కొలుచుటను వర్ణించుచు విష్ణు ప్రాప్తికి చెందు మంత్రమును విఖనసుడు ప్రముఖముగ చెప్పెను. భగవంతు డీ మంత్రమును విశదీకరించుటకే త్రివిక్రమావతారమును వహించె నని ప్రఖ్యాతి చెందిన భట్టరువారు సాయించిరి.

ఈ మంత్రమునకు అసమాన ప్రాముఖ్యము ప్రాచీన తమిళ సంప్రదాయములలో కలదు. విష్ణువు "నెదుమల్", "నెడియాన్ కున్రమ్" మొదలగు నామములతో వ్యవహరింప బడెను. వైదికక్రియా కలాపములతో వైష్ణవఉత్సాహాతిశయమును విఖనసుడు అనేక ఘట్టములలో నిరూపించినట్లు మనము చూపవచ్చును. మరియొక రమ్యమైన సన్నివేశము కూడ కలదు

వైదికక్రియాకలాపములకు దర్భలను సమకూర్చు విధానమును యజుర్వేద బ్రాహ్మణములు నిర్ణయించు చున్నవి. కుశలను కోయు ప్రధాన ఋత్విక్కునకు మొదటి మొక్కను కోయకుండా వదలి మిగతా వాటిని కోసి ఉపయోగించు విధానము ఉపదేశింప బడినది. విష్ణువునకు సమర్పించు భావముతో వివరించి ప్రథమ కుశను వదలునట్లు తెల్పెను. ఈ సందర్భమును బ్రాహ్మణము లేమియు ఉదాహరించ లేదు. విఖనసుడు వైష్ణవుడుగాన యిది ప్రథమమున విష్ణువునకు సమర్పించు నట్లుగా తీసికొనెను. విఖనసుడు మాత్రమే అసత్యోచ్చారణకున్నూ, అవైదికాచార నిర్మూలమునకును, వేదముల లోని వైష్ణవమంత్రములను నిర్ణయించెను.

భారతదేశములోని విఖనసుల అనుచరులందరు అగర్భవైష్ణవులు. వీరు వైష్ణవత్వము కొఱకు ఇతర ప్రత్యేక దీక్షను తీసికొన నవసరము

లేదు. కాని యితర ఋషిసంప్రదాయములకు చెందిన వారు వైష్ణవత్వము బొందుటకు ప్రత్యేకదీక్ష నవలంబించుట అత్యావసరమై యున్నది. ఇతర గృహ్యాసూత్రకారుల వలె గాక విఖనస గృహ్యాసూత్రములోని వైదిక కర్మలు, విష్ణుప్రాముఖ్యమును వక్కాణించు చున్నవి. కనుక విఖనస ఋషి మూలవైష్ణవ స్థాపకుడు; వారి అనుచరులు ప్రాచీనవైష్ణవులు.”

అనాదినుండియు నేటి వరకు ఆంధ్ర, ద్రావిడ, కర్ణాటక రాష్ట్రముల యందు పేర్వడసిన విష్ణ్వాలయములలో వైఖానసులే అర్చకులుగా నున్నారు. చోళరాజులు విష్ణుపూజా నిమిత్తము వైఖానసులను తమ దేశమునకు రప్పించు కొన్నట్లు తెలియు చున్నది. ఈ శాఖీయులు దేశమునం దే ప్రాంతము నందున్నను మతము ఆచార వ్యవహారములు నొక్కటిగనే యుండి పంక్తిభోజనములు, సంబంధ బాంధవ్యములు గలిగి యున్నారు. నేటికిని వైఖానససూత్ర ప్రకారము దేవు నారాధించుచున్న ప్రసిద్ధదేవాలయములలో తిరుపతి, తిరుమల, మధుర, శ్రీవైకుంఠము, వానమామలై, నవతిరుపతి, మహాబలిపురము, తిరువల్లిక్కేణి, శ్రీపెరుంబూదూరు, మంగళగిరి, చోళంగివరము, వేదాద్రి మున్నగు క్షేత్రములు గలవు. వీరు బౌద్ధమత కాలమున ఉత్తర హిందూస్థానమును వదలి దక్షిణ దేశమునకు వచ్చి గోదావరి, కృష్ణ, కావేరి ప్రాంతముల యందు నివాస మేర్పరచుకొనిరి. ఆంధ్ర దేశమున గల గోదావరి, కృష్ణ, గుంటూరు జిల్లాలలో వీరి సంఖ్య విశేషముగను, తదితర జిల్లాలలో స్వల్పముగను గన్పట్టు చున్నది. తమిళ దేశములో తంజావూరు, తిరుచినాపల్లి, చెంగల్‌పట్టు, చిత్తూరు జిల్లాల యం దధికముగను, మిగిలిన తమిళ జిల్లాలయందు కొలది గను, కొచ్చిన్, కూర్గు, మలబార్, మైసూరుప్రాంతములలో స్వల్పము గను వీరు నివసించు చున్నారు. వీరి గృహములు గ్రామమునకు ఒకటి రెండు తప్ప ఎక్కువగా కనపడుట లేదు. వీరు చాలా కాలము

నుండి విష్ణ్వర్చనమును వానితో బాటు ఆయుర్వేద వైద్యమును ఉపవృత్తిగ బెట్టుకొని జీవించుచున్నారు. ఆళ్వారులను మఠాధిపతులను పూజ్యభావముతో జూచుట వీరి కిష్టము. వీరు తొలుత నుండియు స్వయంప్రతిభతో జీవించుచుండిరి.

ఎన్నో యుగముల నుండి గురుపీఠములులేక స్వయమాచార్యులై జన్మతోనే వైష్ణవులై యున్న వైఖానసులు రామానుజీయ వైష్ణవపద్ధతులను అంగీకరించనందుననే అనాదినుండియు వైఖానసులే అర్చకులుగా గల శ్రీరంగమునందు రంగనాథాలయములో వైఖానసులను తొలగించి పాంచరాత్ర విధానము నమలు పరచినట్లు శ్రీ "కోయిల్ ఒళగు" (శ్రీరంగక్షేత్ర మాహాత్మ్యము) అను తమిళ గ్రంథము నందు, 'శ్రీ వేంకటేశ్వరేతిహాసమాల' అను గ్రంథము నందును గలదు. శ్రీరామానుజాచార్యులకు పూర్వము శ్రీరంగము మొదలగు మహాక్షేత్రము లందు విష్ణువు నారాధించు వారు వైఖానసులే యని బ్రహ్మాండాది పురాణములు స్పష్టముగ చెప్పుచున్నవి.

శ్రీ వేంకటాచలపతి వైఖనసార్చనాపరతంత్రుడేయని "వైఖానస మఖారంభో వృషజ్ఞోయో వృషాచలః" అని శ్రీ వేంకటేశ్వర సహస్రనామస్తోత్రము, "వైఖానస మునిశ్రేష్ఠపూజితాయ నమో నమః" అని వేంకటేశ్వర అష్టోత్తరశతనామస్తోత్రము చెప్పుచున్నది. శ్రీరామానుజాచార్యుల వారు తాము చేయవలసిన కార్యములు నెరవేరినవని తలచి దేహత్యాగము చేయ నెంచి మూడు అహోరాత్రములు భగవంతుని ప్రార్థించుచు, తన నిర్యాణానంతరము తన భక్తులు పూజించుకొనుటకై శిలావిగ్రహమును చేయించి తన పదునారు కళలను ఆ శిలావిగ్రహము నందుంచవలయునని భావించి పాంచరాత్ర విధానమున ప్రయత్నించి విఫలు డాయెను. ఆ శక్తి ఆ శాస్త్రము నందు లేదని గ్రహించి శ్రీమచ్ఛేషాంశ సంభూతుడగు రామానుజులు విశాలహృదయు డగుటచే వైఖానససిద్ధాంతము నందు గల గొప్ప

తనమును గ్రహించి "తిరువరంగత్తముడనార్" అను వైఖానసు నాశ్రయించి, విఖనససూత్ర ప్రకారముగ బింబశుద్ధి చేయించి దిన మున కొక కళ చొప్పున షోడశ కళలను ఆ విగ్రహము నందు న్యాసము చేయించెను. అనంతరము శ్రీవైఖానసశాస్త్ర నిష్ణాతులు, క్రియా ప్రయోగ దక్షు లొనరించిన మహత్కార్యమునకు అమందా నందమంది—

**అనిందితాచార మనన్యభాజనం**
**దాస్యైకనిష్ఠం కరణత్రయేణ,**
**అనారతం శ్రీపతిపాదపద్మయోః**
**భజామి వైఖానస మాదివైష్ణవమ్.**

అని కొనియాడిరి.

శ్రీరామానుజాచార్యుల వారి జన్మస్థలమైన శ్రీ పెరుంబుదూరు (భూతపురి) నందు శ్రీ కేశవమూర్తిని హారీతమహర్షి వైఖానస విధా నముననే ప్రతిష్ఠించి పెరుమాళ్ళు నర్చించుటకు వైఖానసులనే నియ మించినట్లు భూతపురి మాహాత్మ్యము తెలుపుచున్నది. నేటికిని వైఖా నసులే ఆ స్వామిని అర్చించుచున్నారు. కేశవస్వామివారి ఆలయ ములో తనశిలావిగ్రహమును ప్రతిష్ఠచేయుమని చెప్పినట్లు వైఖానసులే అర్చకులుగా నుండుట కంగీకరించినట్లు గూడా స్థలపురాణములో చెప్పబడియున్నది.

వైఖానస సిద్ధాంతమునందు నారాయణుడు పరబ్రహ్మ; నారా యణు నుండి అభివ్యక్తమైన వ్యూహములు అయిదు. విష్ణు-పురుష-సత్య-అచ్యుత-అనిరుద్ధ అనెడి నామములతో పిలువబడుచున్నవి. ఈ విషయమై మహాభారత మిట్లు చెప్పుచున్నది—

**కథం త్వమర్చనీయోఽసి మూర్తయః కీదృశశ్చ తే,**
**వైఖానసాః కథం బ్రూయుః కథం వా పాంచరాత్రిణః.**

విష్ణుం చ పురుషం సత్య మచ్యుతం చ యుధిష్ఠిర,
అనిరుద్ధం చ మాం ప్రాహుః వైఖానసవిదో జనాః.
వేదే వైఖానసే సూత్రే యో ధర్మః పరికీర్తితః,
సర్వైర్వైస్స ధర్మోఽనుష్ఠేయః నాత్ర కార్యా విచారణా.

వేదమునందు వైఖానస సూత్రమునందు ఏ ధర్మము చెప్పబడినదో ఆ ధర్మము అందరిచేతను విచారణారహితముగ అనుష్ఠింపదగినది.

వైఖానసులు శ్రీవిఖనోముని దివ్యసిద్ధాంతమును తు,చ తప్పక శిరసావహించి శ్రీ మన్నారాయణుని అనుగ్రహమునకు పాత్రులగు చున్నారు.

# 6. శ్రీపాంచరాత్రము

పంచరాత్ర మనగా – "పంచసు రాత్రిషు యత్ప్రోక్తం తత్ పంచరాత్రమ్, పంచరాత్రమేవ పాంచరాత్రమ్" అను నిర్వచనమును బట్టి అయిదు రాత్రులయందు జెప్పబడినది పంచరాత్రమే. పంచరాత్రము = శ్రీ మన్నారాయణునిచే పూర్వమొక సమయమున నయిదు గురికి (శ్రీదేవి–బ్రహ్మ–అనంత–గరుడ–విష్వక్సేనులకు లేక బ్రహ్మ, ఇంద్ర... ....) ఉపదేశించిన శాస్త్రము పంచరాత్ర మని సార్థకనామముచే పిలువబడుచున్నది.

1. శ్రీమహావిష్ణువు బ్రహ్మదేవున కయిదురాత్రు లుపదేశించిన శాస్త్రము పంచరాత్రము. 2. శాండిల్య–ఔపగాయన–మౌంజాయన–కౌశిక–భారద్వాజ మహర్షులకు శ్రీమన్నారాయణునిచే నయిదురాత్రు లుపదేశింపబడిన శాస్త్రము పంచరాత్రము. ఇంక నిట్లే మరి కొన్ని పంచరాత్ర శబ్దనిర్వచనములను కొందరు చెప్పుచున్నారు.

ఆగమము–తంత్రము–సాత్వతము–భగవచ్ఛాస్త్రము అని పంచరాత్రమునకు మరికొన్ని పేర్లు గలవు. ఇది చరిత, క్రియా, జ్ఞాన, యోగము లను నాలుగు భాగములుకల గొప్ప వైష్ణవ శాస్త్రము. నారదుడు మొదలగు మహర్షు లీ శాస్త్రమునకు ప్రవర్తకులైయున్నారు. ఈ శాస్త్రావతరణమును గురించి చెప్పిన విశేషములను పంచరాత్ర సంహితలయందు జూడనగును. శ్రీమహావిష్ణు ప్రతిష్ఠార్చనోత్సవాది విషయములను, అర్చావతారవైభవములను, భక్తిప్రపత్తులతో గూడిన భగవదారాధనమే మోక్షసాధన మను సిద్ధాంతమును చక్కగా నిరూపించు తాత్త్వికవిషయము లనేకము లీ శాస్త్రమునందు జెప్పబడియున్నవి. ఈ పంచరాత్ర సంహితలు నూట ఎనిమిదిగ బేర్కొనబడుచున్నవి.

పాద్మసంహిత, భారద్వాజసంహిత, పరాశరసంహిత, ఈశ్వర సంహిత, విష్ణుతిలకసంహిత, పరమేశ్వరసంహిత, కపింజలసంహిత మొదలగు నష్టోత్తర సంహితలలో-

**సాత్వతం పౌష్కరం చైవ జయాఖ్యం తంత్రముత్తమమ్,**
**రత్నత్రయ మితిఖ్యాతం తద్విశేష ఇహోచ్యతే.**

అను ప్రమాణమువలన సాత్వత, పౌష్కర, జయాఖ్య సంహితలు రత్నత్రయ మని ప్రసిద్ధిని గడించియున్నవని తెలియుచున్నది.

ఈ పంచరాత్రము ననుసరించియుండు వారలే పాంచరాత్రులు. పాంచరాత్రు లేదేని యొకే యొక సూత్రము గలవారు గాక అనేక సూత్రము గలవారై యున్నారు. పంచరాత్రమునం దాచార్యార్చక లక్షణములు చెప్పు సందర్భమున శాఖాసూత్రములు వివక్షింపబడ లేదు గనుక పాంచరాత్రులలో శుక్లయజుశ్శాఖీయులగు కాత్యాయన సూత్రులు, కృష్ణయజుశ్శాఖీయులగు ఆపస్తంబసూత్రులు మొదలగు వారు గలరు. తమిళనాడునందలి శ్రీరంగక్షేత్రమున శ్రీరంగనాథుని బూజించు ప్రధానార్చకులు కాత్యాయన సూత్రీయులగు పాంచ రాత్రులు. ఆంధ్రదేశమందలి భద్రాచలక్షేత్రమున శ్రీ సీతారాముల నర్చించు ప్రధానార్చకులు ఆపస్తంబసూత్రీయులగు పాంచరాత్రులు. ఏ సూత్రము ననుసరించిన వారైనను శ్రీపాంచరాత్రాచార్యుల వలన పంచరాత్ర ఆగమోక్త ప్రకారముగ స్వార్థ యజనా (గృహదేవతార్చన) ధికారము నొసంగు పంచసంస్కారదీక్షను (తప్తశంఖ చక్రాంకనము-ఊర్ధ్వపుండ్రమును ధరించుట-భగవన్నామధారణము-వైష్ణవమంత్రా నుష్ఠానము-విష్ణుపూజనము ఇవి పంచసంస్కారములు) పరార్థయజనా (ఆలయార్చనము) ధికారమును నొసంగు చక్రాబ్జమండలదీక్షను తీసి కొని స్వార్థపరార్థముల యందు విష్ణువు నర్చించుట కధికారమును సంపాదించుకొని వంశపరంపరగా భగవదారాధనము చేయువారు పాంచరాత్రులని పిలువబడు చున్నారు.

పాంచరాత్రులు శ్రీమన్నారాయణుని వ్యూహస్వరూపమును వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ నామములచే నాలుగు విధములుగ జెప్పుచున్నారు.

అన్యే త్వేవం విజానంతి మాం రాజన్ పాంచరాత్రికాః,
వాసుదేవం చ రాజేంద్ర సంకర్షణమథాఽపి వా,
ప్రద్యుమ్నం చానిరుద్ధం చ చతుర్మూర్తిః ప్రచక్షతే.

అని మహాభారతములో గలదు.

భగవద్విషయ ప్రబోధకములగు వైఖానస పాంచరాత్రములను గూర్చి భగవద్వాక్యము: "వైఖానసం పంచరాత్రం నేత్రయుగ్మ సమం మమ"– వైఖానస పంచరాత్రశాస్త్రములు రెండు నాకు రెండు నేత్రముల వంటివని భగవంతుడు చెప్పినాడు.... ....కవితార్కిక కేసరి శ్రీవేంకటేశ్వరాజ్ఞాలబ్ధ సర్వతంత్ర శ్రీమాన్‌వేదాంతదేశికస్వామి వారు "శ్రీవేంకటేశఘంటాంశం, వందే వేదాంతదేశికమ్" అను ప్రమాణ వచనమును బట్టి శ్రీవేంకటేశునిఘంటాంశయని తెలియుచున్నది.

ఈ వేదాంతదేశికస్వామి వారు 'శరణాగతదీపిక' యందు, వైఖానసపాంచరాత్రులను ధన్యులని ఈ క్రింది విధముగ శ్లాఘించిరి–

త్వాం పాంచరాత్రికనయేన పృథగ్విధేన
వైఖానసేన చ పథా నియతాధికారాః,
సంజ్ఞావిశేషనియమేన సమర్చయంతః
ప్రీత్యా నయంతి ఫలవంతి దినాని ధన్యాః.

ఓ శ్రీమన్నారాయణా! వైఖానసులు పాంచరాత్రులుశాస్త్రముచే నియమింప బడిన అధికారము గల వారై వైఖానస పంచరాత్రోక్త విధి ననుసరించి నీ చరణాంబుజములను నిరంతర మర్చించు దినములను, ఫలవంతములుగ జేసికొనుచు మహానందముతో కాలమును గడపుచున్నారు. వారు ధన్యులు గదా!

పాంచరాత్రము సాక్షాత్ నారాయణముఖోద్గతమైన ధర్మ మనియు, హితకరమనియు, సర్వశాస్త్రములలో నుత్తమమైన దనియు, శీఘ్రఫలప్రదమైన దనియు బ్రహ్మదేవుడు లోకుల ననుగ్రహింప దలచి తన జనకుడైన శ్రీమన్నారాయణుని ద్వారా అయిదు రాత్రు లలో ఈ శాస్త్రరహస్యము లన్నింటిని గ్రహించె ననియు నారదుడు చెప్పెను. శ్రీవిష్ణు నారాధించు విధానములతో గూడిన రహస్యము లన్నింటిని నారదుడు తన తండ్రి వద్ద తెలిసికొనిన వా డగుటచే సంసారసాగరనిమగ్నులైన మానవులవగాహన మొనర్చించుకొన్నచో, నిస్సంశయముగ విష్ణుసాయుజ్యము బొందగలరని మిగిలిన మహర్షు లకు వివరించెను.

ఈ శాస్త్రము సృష్ట్యాదినుండియు, బహుళప్రచారములోనుండి అన్నియుగములయందు జీవించియున్నది. పాంచరాత్రమునుగురించి మహాభారతము శాంతిపర్వమునందు చక్కగా వివరింపబడెను. ప్రపం చములో పాంచరాత్రము సజీవమై, మనోహరమై, ఆస్తికమతములలో నొకటిగ యుండి పరిపూర్ణమైన మతముగా ప్రఖ్యాతి గాంచియున్నది. సాంఘిక సాంస్కృతిక జీవితముపై, వైష్ణవ పాంచరాత్ర సిద్ధాంతము అద్భుతప్రభావము చూపి సర్వవ్యాప్తమై సుస్థిరముగా నున్నది.

వైష్ణవాచార్యులలో పేర్వడసి ప్రసిద్ధిగాంచిన యామునా చార్యుల వారు, పాంచరాత్ర విధానముననే వైష్ణవము స్వీకరించి మిక్కిలిగా కొనియాడెను. పాంచరాత్రులకు జయాఖ్య-విష్ణుసాత్వత అహిర్బుధ్న్యసంహితలు ముఖ్యములైన ఆగమశాస్త్రములు. ఈ శాస్త్రము లందు ముఖ్యముగ విష్ణ్వారాధన, ఆలయమండపాది నిర్మాణవిధాన ములు, మంత్ర-యంత్ర-పునశ్చరణలు-ప్రాయశ్చిత్తములు, కార్యకర్మ సాధనములు విశదీకరింపబడినవి. పాంచరాత్రాగమములు మూడు విధములుగా నున్నట్లు తెలియుచున్నది. 1. శ్రీపాంచరాత్రము, 2. శుకపాంచరాత్రము, 3. ఘంటాపాంచరాత్రము (గృ. సూ. ధర్మ

ములు 11 పేజి ఐక్కిరాల రాఘవాచార్యులు). వీరు యజుశ్శాఖాపరులు. వీరిలో కాత్యాయన, ఆపస్తంబాది సూత్రముల వారే గాక కేరళ, కర్ణాటకరాష్ట్రముల యందు బోధాయన సూత్రము గలవారు గూడ నున్నట్లు దెలియుచున్నది. వీరిలో కొందరు వడగలై, తెంగలై తెగలవారున్నను, ఏ భేదములను పాటింపక పంక్తిభోజనములు గలిగి ఆచారభేదములు లేక యుండిరి. శాస్త్రవిధిచేత నాచార్యులు "శ్రియః పతయే" అని పురాణములు చెప్పుచున్నవి. పాంచరాత్ర సిద్ధాంత ప్రకారము, అర్చన జరుగుచున్న ప్రసిద్ధ దేవాలయములు శ్రీరంగము, కంచి, తిరువళ్లూరు, అహోబిలము, సింహాచలము మొదలగు క్షేత్రములు. వీరు విష్ణువునే పరమదైవమని నమ్మి ఇతర వృత్తుల నవలంబించక, విష్ణ్వాలయములలోనే పూజలు చేయుచు సౌమ్యులై కాలము గడపుచున్నారు. ఈ సంప్రదాయములవారు ఎందువలననో వారి గురుపరంపరలో, శ్రీరామానుజీయ వైష్ణవుల పద్ధతి ప్రకారము "నాథయామునమధ్యమామ్" అని చెప్పుచున్నారు.

ఈ పరంపర ఆపస్తంబసూత్రజ్ఞులు మాత్రమే చెప్పుచున్నారా? లేక కాత్యాయన సూత్రజ్ఞులు గూడ చెప్పుచున్నారా? యని తెలియ కున్నది. పాంచరాత్ర శాస్త్రమునుబట్టి వీరు శ్రీమన్నాథమునులకు పూర్వమునుండియు, పరమవైష్ణవులై యున్నట్లు స్పష్టముగా దెలియు చున్నది.

పాంచరాత్రములో చెప్పబడిన "అనంత, గరుడ, విష్వక్సేన, బ్రహ్మేంద్రాదు"లనుగాని మహర్షులైన "ఔపగాయన, కౌశిక, శాండిల్య, భరద్వాజ, మౌంజాయన" ఋషులను గాని తమ గురుపరంపరలో చెప్పుకొనక "నాథయామునమధ్యమామ్" అని చెప్పుటవలన, ఈ సంప్రదాయముగల పాంచరాత్ర శాఖ వేరే యున్నదా అనెడి సందే హము గలుగుచున్నది. పాంచరాత్రులలో వృద్ధులు, చక్కగా తెలిసిన పండితులను విచారించగా పై విధానము క్రమముగాదని చెప్పిరి.

శ్రీమద్భాగవతం లక్ష్మీనృసింహాచార్యులు గారు, పెనుమూడి, రేపల్లె తాలూకా "లక్ష్మీపతి సమారంభాం పూర్వాచార్యసుమధ్యమామ్" అని చెప్పియుండిరి. వీరు తెలిపిన గురుపరంపరగూడ ఫలానావారిదని నిర్దేశింపక "పూర్వాచార్యసుమధ్యమామ్" అని చెప్పుటవలన ఎవరు పూర్వాచార్యు లనెడి సందేహము కలుగుచున్నది. కొంతమంది పాంచ రాత్రశాస్త్రజ్ఞులు, "లక్ష్మీపతిసమారంభాం, చతురానన మధ్యమామ్" అని స్పష్టముగా చెప్పియున్నందున ఈ పరంపరయే అనాది పాంచ రాత్రపరంపర కావచ్చునేమో యని చెప్పవలసియున్నది. ఈశాస్త్రము నకు శ్రీమన్నారాయణుడు వక్తగానుండి, నారదునినుండి బహిర్గతమై యుండినందున ఇది అత్యంత ప్రాముఖ్యము వహించియున్నది.

## నారదభక్తిసూత్రములు

భగవత్త్వబోధమునకు భాగవతులందరితో సన్నిహిత సంబంధము గలిగి యుండుటచే నారదుడే భక్తి ప్రచారమునకు ముఖ్యుడని చెప్పవలసి యున్నది. "నరస్య ధర్మో నారం తద్దదాతీతి నారదః" ధర్మప్రచారము చేయువాడు గాన మానవులకు సత్యము బోధించి పరిపూర్ణత్వమును బొందు విధానములు బోధించువాడు గాన "నర, నారద నారాయణ శబ్దముల మూడింటిని చూచినచో, నరులకు నారాయణుని చూపించువాడు నారదుడై సర్వమానవులకు ఉపదేశకుడని స్పష్టమగు చుండినందున నారద భక్తిసూత్రములు సర్వులకు ప్రాముఖ్యము వహించియుండెను. నారదభక్తి సూత్రములు మొత్తము 84 అయియున్నట్లు తెలియుచున్నది.

1. 24 సూత్రములు=భక్తిని వివరించును.
2. 9 సూత్రములు=కర్మ, జ్ఞాన, యోగముల కంటె భక్తి మార్గమె ట్లుత్తమమో వివరించును.
3. 17 సూత్రములు=భక్తిసాధన విధానములను బోధించును.

4. 16 సూత్రములు=మహాభక్తుని ప్రత్యక్ష లక్షణములను చూపించును.

5. 18 సూత్రములు=మహాభక్తులను స్తుతించును.

'ఆంధ్రవాచస్పత్యము' అను నిఘంటువు పాంచరాత్రులను గురించి ఈ క్రింది విధముగా దెలిపి యున్నది.

పాంచరాత్ర బ్రాహ్మణులు ద్రావిడులలో నొక తెగవారు. ఏకాయన యజుశ్శాఖాప్రవర్తకులు, కాత్యాయన సూత్రానుష్ఠాతలు, వైదికులు, భగవచ్ఛాస్త్రోక్త పంచసంస్కార దీక్షాపరులు, ఆత్మార్థ, పరార్థ యజనముల నారాయణుని తప్ప ఇతరదైవముల నారాధింపని ఏకాంతవైష్ణవులు. వీరు దక్షిణదేశము నందు విస్తారముగను ఆంధ్ర, కన్నడ దేశములలో అల్పసంఖ్యాకులుగ నున్నారు. ఈ శాఖీయులు ఎన్నో యుగముల నుండి స్వయమాచార్యులై, విశిష్టాద్వైతమతము ననుసరించుచున్నారు.

పాంచరాత్ర గురుపరంపర విషయములో కొంద రీవిధముగా చెప్పియుండిరి.

పాంచరాత్రప్రవక్తారం వన్దే నారాయణం ప్రభుమ్.
పరాశరం చ మైత్రేయీాం భారధ్వాజం కపింజలమ్,
వసిష్ఠాదిమునీన్ వన్దే పాంచరాత్రప్రవర్తకాన్,
అనాది వైష్ణవో విష్ణుః ఆది శ్రీపాంచరాత్రకః.

# 7. ఆళ్వారులు

భగవానుని అర్చాస్వరూపమును ప్రతిష్ఠించి ఏ యే పద్ధతుల ప్రకార మర్చింపవలయునో, అనాదినుండియు భగవదారాధనము ఏ యే పద్ధతుల ననుసరించి నిర్వర్తింపబడుచుండెనో, ఆ యర్చకులెవరో, వారి సంప్రదాయము లెవ్వియో, వారి ఆచారవ్యవహారము లెట్టివో, గత ప్రకరణములలో పరిశీలించితిమి. ఆ యర్చకులు భగవదర్చా మూర్తుల నిత్యార్చనోత్సవాది సకలవిధ భగవత్కైంకర్యముల నాచరించుటలోనే కాలము గడపిరి. కాని ఆ భగవదర్చావతార స్వభావ ప్రభావాదులను ప్రజానీకమునకు తెలియజేయుట కవకాశము లేని వారైరి. ఆ లోపమును ఈ యాళ్వారులు తీర్చి అర్చావతార మాహాత్మ్యమును లోకమునకు చాటి చెప్పిరి.

ఆ యాళ్వారులను గురించి ఈ దిగువ వివరించుచున్నాను.

ద్రవిడదేశమునందు విష్ణుభక్తు లనేకు లుదయించిరి. వారిలో కొందరు ఆళ్వారులను ద్రవిడభాషాపదముతో బిలువబడుచు సుప్రసిద్ధులై యున్నారు. ఏ దేశమునం దుద్భవించిన భక్తులనైనను నింత మందియే యని నిర్ణయించుటకు వీలులేదు. వీ రెంతమంది యైనను నుండవచ్చును కాని, వారిలో మహామహితాత్ములైన వారిని వర్గీకరించి యొక నిర్దిష్టమగు సంఖ్యతో జెప్పుటమాత్రము కనపడుచున్నది.

ఈ ఆళ్వారులు పదుగురని శ్రీ పరాశరభట్టరు వారు చెప్పి యున్నారు.

**భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ**
**శ్రీ భక్తిసారకులశేఖరయోగివాహాన్,**
**భక్తాంఘ్రిరేణు పరకాలయతీంద్రమిశ్రాన్**
**శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్.**

ఈ శ్లోకము ఆళ్వారుల అవతార క్రమమును జెప్పుట కేర్పడినదికాదు కనుకనే మొదటివారైన కాసారయోగికంటె ముందు భూతయోగిని, భట్టనాథునికన్న ముందు చెప్పదగిన భక్తిసారులను తరువాతను చెప్పినది. ఆచార్యకోటిలోని వారగు రామానుజాచార్యులనుగూడ నిందు జెప్పినది. ఏది ఎట్లున్నను ఆళ్వారులు పదుగురని పై శ్లోకము వలన దెలియుచున్నది. ఈ ఆళ్వారుల పరంపరను గూర్చి "ఉపదేశ రత్నమాల"యందు, మణవాళమహాముని లీ క్రింది విధముగ జెప్పిరి.

ద్రావిడ పాశురము :-

"పొయ్‌గైయార్, పూదత్తార్, పేయార్, పుగళ్ మళిశై
అయ్యా నరుళ్‌మాఱన్, శేరలర్‌కోన్, తుయ్యపట్ట
నాదం, అంబర్‌దాళ్‌తూళి, నఱ్పాణన్, నఱ్కలియనిన్,
ఈదివర్ తోఱ్ఱత్తడైవామింగు."

ఇందుకు సంస్కృత శ్లోకము-

కాసార, భూత, మహదాహ్వయ, భక్తిసార
శ్రీమచ్ఛఠారి, కులశేఖర, భట్టనాథాః,
భక్తాంఘ్రిరేణు, మునియాన, కలిద్రుహశ్చ
భూమౌ వితేను రమరాః క్రమశోఽవతారమ్.

నంబూరి కేశవాచార్య ప్రణీతమగు 'ఆచార్యసూక్తిముక్తావళి' యందు, "పదుగురార్యుల దలపు మీాభక్తి ననుచు, వాదిభీకర గురుడనె మోద మలర", "కపిలతీర్థము కడ కాసారభూతాగిసూరుల బదుగురఁ జూచి మ్రొక్కి", "పదుగురు సూరులు బాడి రే యద్రిని గుల శేఖరుం డెందుఁ గోరె జన్మము", "పదుగురాళ్వారు లిమ్మహాత్మున కంతేవాసులు" ఇట్లు పలుతావుల ఆళ్వారులు పదుగురనియే వ్రాయబడి యున్నది. శ్రీరంగనాథునకు "పదిమరు తిరునామం పాడుం పెరుమాళ్"అను ద్రవిడ దివ్యతిరునామము గలదు. అనగా పదుగురా

ళ్వారులు పాడిన స్వామి యని అర్థము. ఈ పదుగురాళ్వారుల పేరులు వరుసగ నీ క్రింద వ్రాయబడుచున్నవి–

1. పొయ్‌గై ఆళ్వారు : (జ్ఞానముద్ర)

వీరికి కాసారయోగి, సరోయోగి అని సంస్కృతనామములు. వీరు విష్ణుదేవుని శంఖాంశము. వర్తమాన కలియుగమునకు ముందు, గతించిన ద్వాపరయుగాంతమున అశ్వయుజమాసమందు 'శ్రవణము' వీరి జన్మనక్షత్రము.

2. పూదత్తాళ్వారు (పూదాళ్వారు) : (బ్రహ్మముద్ర)

వీరికి భూతయోగి యని సంస్కృతనామము. వీరు విష్ణుదేవుని గదాంశము. వర్తమాన కలియుగమునకు ముందు గతించిన ద్వాపర యుగాంతమున అశ్వయుజమాసమందు 'ధనిష్ఠ' వీరి జన్మనక్షత్రము.

3. పేయాళ్వారు : (అంజలిముద్ర)

వీరికి మహాయోగి, భ్రాంతయోగి యని సంస్కృత నామములు. వీరు విష్ణుదేవుని ఖడ్గాంశము. వర్తమాన కలియుగమునకు ముందు గతించిన ద్వాపరయుగాంతమున అశ్వయుజ మాసమందలి 'శతభిషము' వీరి జన్మనక్షత్రము.

4. తిరుమళిశై ఆళ్వారు : (అక్షమాలాముద్ర)

వీరికి భక్తిసారుడు అని సంస్కృతనామము. వీరు విష్ణుదేవుని చక్రాంశము. వర్తమాన కలియుగమునకు ముందు గతించిన ద్వాపర యుగాంతమున పుష్యమాసమునందలి 'మఘా' నక్షత్రము వీరి జన్మ నక్షత్రము.

5. నమ్మాళ్వారు : (వ్యాఖ్యాముద్ర)

వీరికి శఠారి–శఠకోపముని–పరాంకుశముని–వకుళాభరణుడు మొదలగు సంస్కృత నామములు గలవు. వీరు విష్ణుదేవుని సైన్యాధి

పతియగు విష్వక్సేనుని అంశము. వర్తమానకలియుగము ప్రారంభమై 43 (నలుబదిమూడు) దినములు గడచిన తరువాతవచ్చు వైశాఖమాస మందలి 'విశాఖ' వీరి జన్మనక్షత్రము.

## 6. కులశేఖరాళ్వారు (అంజలిముద్ర)

వీరు విష్ణుదేవుని 'కౌస్తుభమణి' యంశము. వర్తమాన కలి యుగమున 28వ సంవత్సరమున మాఘ మాసమందలి పునర్వసు వీరి జన్మనక్షత్రము.

## 7. పెరియాళ్వారు : (ప్రపదనముద్ర)

వీరికి భట్టనాథుడు_విష్ణుచిత్తుడు అని సంస్కృత నామములు. వీరు విష్ణుదేవుని వాహనమగు గరుత్మంతుని అంశము. వర్తమానకలి యుగమునందు నలుబది ఏడవ సంవత్సరములోని జ్యేష్ఠమాసమందలి 'స్వాతి' వీరి జన్మనక్షత్రము.

## 8. తొండరడిప్పొడి ఆళ్వారు : (పుష్పమాలాముద్ర)

వీరికి భక్తాంఘ్రిరేణువు, విప్రనారాయణుడు అని సంస్కృత నామములు. వీరు విష్ణుదేవుని వనమాలాంశము. వర్తమానకలియుగ మున 288 సంవత్సరములు గడచిన పిదప ధనుర్మాస (మార్గశిర మాసము) మందలి 'జ్యేష్ఠా' నక్షత్రము వీరి జన్మనక్షత్రము.

## 9. తిరుప్పాణాళ్వారు : (వీణాముద్ర)

వీరికి మునివాహనుడు, యోగివాహనుడు, శ్రీప్రాణయోగి, యని సంస్కృత నామములు. వీరు విష్ణుదేవుని శ్రీవత్సాంశము. వర్తమాన కలియుగమున 342 సంవత్సరములు గడచిన పిమ్మటిదగు కార్తికమాసమందలి 'రోహిణి' నక్షత్రము వీరి జన్మనక్షత్రము.

## 10. తిరుమంగై ఆళ్వారు : (ఖడ్గముద్ర)

వీరికి పరకాలుడు, కలివైరి అను సంస్కృతనామములు గలవు.

వీరు విష్ణుదేవుని ధనురంశము(శార్ఙ్గాంశము). వర్తమానకలియుగమున 397 సంవత్సరములు గడచిన పిమ్మటవచ్చు కార్తీక మాసమందలి 'కృత్తికా' నక్షత్రము వీరి జన్మనక్షత్రము.

పైని తెలిపిన ప్రామాణిక పురుషుల ప్రమాణ వచనములను బట్టి ఆళ్వారులు పదుగురను కొంటిమి. కొందరు పన్నిద్దరను చున్నారు. పై పదుగురిలో మరి యిద్దరిని చేర్చి పన్నిద్దరందురు. ఆ యిద్దరు "మధురకవి", "ఆండాళ్" అనువారు. మధురకవి నమ్మాళ్వార్ల శిష్యుడు గనుక ఆళ్వారుల కోటిలో చేరడనియు, ఆండాళ్(గోదాదేవి) లక్ష్మ్యంశగానీ, భూమ్యంశగానీ అయి విష్ణుదేవుని దివ్యమహిషి అయినందున తద్భక్తులగు ఆళ్వారుకోటిలో చేర్చ గూడదని సంప్రదాయజ్ఞులు కొందరభిప్రాయ పడుచున్నారు.

మధురకవి: (తాళముద్ర) వీరు విష్ణుసేనాపతి యగు కుముదుని యంశము. వర్తమాన కలియుగమునకుముందు గతించిన ద్వాపరయుగాంతమున చైత్రమాసము నందలి 'చిత్తా' నక్షత్రము వీరి జన్మనక్షత్రము.

**ఆండాళ్:** (శుక (చిలుక) ముద్ర) ఈమెకు గోదాదేవి యని సంస్కృతనామము. ఈమె విష్ణుదేవుని దివ్యమహిషి యగు లక్ష్మీదేవి యొక్క లేక భూదేవి యొక్క అంశము. వర్తమాన కలియుగము నందలి 98 వ సంవత్సరమున ఆషాఢమాసము నందలి 'పూర్వఫల్గుని (పుబ్బ)' నక్షత్రము ఈమె జన్మనక్షత్రము.

పైనుదాహరించిన ఆళ్వారులనే ప్రముఖులగు భక్తులని కొందరు చెప్పినను మన పురాణాదులలో ఈ క్రింది ప్రముఖులు మహనీయ భక్తులుగా పరిగణింపబడి కీర్తింపబడుచున్నారు.

**ప్రహ్లాద నారద పరాశర పుండరీక**
**వ్యాసాంబరీష శుక శౌనక భీష్మదాల్భ్యాన్,**

రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి.

వీరే గాక ధ్రువ, తుంబుర, విష్వక్సేన, అనంత, గరుడ, ఆంజనేయ, సనకసనంద సనత్కుమార సనత్సుజాతులు మొదలగు ప్రముఖ భాగవతోత్తములు పెక్కుమంది శ్రీమహావిష్ణువుని భక్తితో ప్రార్థించి తరించిరి. ఆళ్వారులు "శ్రీమద్భాగవతము నందు చెప్ప బడిన నవవిధ భక్తిమార్గములే" భక్తుల కందరకును అనుసరణీయము లని తమ దివ్యప్రబంధముల ద్వారా ప్రబోధించిరి.

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్,
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్,
ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చ నవలక్షణా.

ఆళ్వారులు, బ్రాహ్మణులు, క్షత్రియులు, శూద్రులు, హరిజనులు మొదలగు వర్ణములలో జన్మించిన మహాభక్తులు. ఆళ్వారులు విషయాసక్తులు గాక భగవంతుని యందే మనస్సునుంచి అర్చావతార ప్రభావమును వారి దివ్యప్రబంధముల ద్వారా చక్కగా బోధించి శ్రీమహావిష్ణువునకు సంబంధించిన కీర్తనలు పఠించుచు సమస్త దివ్యక్షేత్రములను దర్శించిరి. మాతృభాషయగు ద్రవిడము (తమిళము) నందు స్తుతించి భక్తిప్రపత్తులకు చిరస్థాయిని చేకూర్చి, మోక్షమార్గము ప్రదర్శన గావించి వారి జన్మలు సార్థక మొనర్చు కొనిరి. ఈ మహాభక్త కవులు విష్ణుస్తుతిపరముగ గానము చేసిన పాశురముల ద్వారా తమిళసాహిత్యమునకు చిరస్థాయిని చేకూర్చిరి. ఆళ్వారులు తాము ప్రబోధించిన భక్తిగీతములు నాలుగువేల సంఖ్య గలవి. ఆ నాలుగువేల పాశురములను విశేషపరిశ్రమతో సేకరించి శ్రీవైష్ణవాచార్యులలో ప్రముఖుడైన శ్రీమన్నాథమునులు "నాలా యిర" దివ్యప్రబంధ మనుపేర ప్రకాశింప జేసిరి.

సాంసారికములైన దుఃఖముల నుండి విడివడి పరమానంద మును బొందుటకు కఠోరమైన తపస్సులు చేయ నక్కర లేదనియు పంచాగ్నుల మధ్య ఆసీనులై యోగమున నిమగ్నులు కా నక్కర లేదనియు, జనన మరణములు జయించుటకు భక్తి ప్రపత్తులే సులభ మైన మార్గ మనియు భగవంతుని స్మరించినంత మాత్రమున భగ వంతుడు భక్తుని హృదయములో నివసించు ననియు కలికల్మషము లైన భావపరంపరలను దూర మొనరించుటకు ఒక్క భక్తిమార్గమే చాలు ననియు బోధించిరి. భక్తిమార్గములో నున్న వారు నరకమును బొందరని చెప్పిరి. భక్తిమార్గము నాశ్రయించు వారు జాతిని, కుల మును, వృత్తిని, విద్యను, ధనమును పరిగణింప వలసిన యవసర మే మాత్రము లేదనియు ఈ మహానుభావులు నిరూపించి సులువైన భక్తిమార్గములను ప్రబోధించిరి. పరమ భాగవతోత్తములైన ఆళ్వారుల భక్తిప్రబోధములు మంగళాశాసనములు వ్యాప్తి గావించిన క్షేత్రములు నేటికిని విరాజిల్లు చున్నవి. వారి ఔన్నత్యము, ప్రభావము, వర్ణనా తీతము. కలికాలములో భక్తికె ప్రాధాన్యముగల ప్రమాణవాక్యమును తు, చ తప్పక ఆచరించి, కలికాలములో వ్రతములు, తీర్థములు, యోగములు, యజ్ఞములు, జ్ఞానవిచారణ కంటె భక్తియే ముక్తి దాయకమని బోధించి అర్చాస్వరూప ప్రభావము చాటి తరించిన మహాజ్ఞానులు. హృదయములో నున్న భగవంతుని బింబరూపములో (విగ్రహ) చూపించిన మహాముని విఖనసుడు. ఆ బింబరూపములో నున్న భగవంతుని మహత్తును గురించి చాటిచెప్పిన మహనీయులు ఆళ్వారులు. ఇచట ప్రసంగవశమున దెలియ దగిన యంశమును దెలిసి కొందము. ఈ ఆళ్వారులు జన్మించుటకు ముందే ఎంతో కాలము నుండి దివ్యదేశములు లేక దివ్యస్థలము లేర్పడి సుప్రసిద్ధ ములై వెలయు చున్నవి.

దేవుడు నివసించి యుండు ఆలయములు దేవాలయములన బడుచున్నవి. దివ్యస్థలము, దివ్యదేశము, అప్రాకృతస్థలము, మహాస్థలము మొదలగునవి దేవాలయములకు పర్యాయపదములు. దివ్య, అప్రాకృత, మహత్ అను పదములకు భగవానుడని యర్థము. దివ్యుడు వేంచేసి యుండు స్థలములు దివ్యస్థలములని "దేవాలయములు, దివ్యస్థలములు" అను శీర్షిక క్రింద దెలిసికొని యుంటిమి.

దివ్యుడు వేంచేసి యుండు స్థలము, దివ్యస్థల మని చెప్పదగి యుండగా, నిట్లు చెప్పక శ్రీరామానుజ సంప్రదాయ వైష్ణవులలో కొందరు, ద్రవిడదేశీయులును, విష్ణుభక్తులునైన ఆళ్వారులచే ద్రవిడ భాషయందు జెప్పబడిన దివ్యప్రబంధము నందలి పాశురములలో నొక్క పాశురముచే నైనను పాడబడిన దేవాలయములే దివ్యదేశము లని చెప్పుచున్నారు.

వారిలో మరి కొందరు ఆళ్వారులచే పాడబడక పోయినను ఆళ్వారుల నందరిని గాని, లేక కొంతమంది ముఖ్యులను గాని, తుట్టతుదకు ఆళ్వారులలో నతి ముఖ్యుడును, ప్రపన్న జనకూటస్థుడును, ద్రవిడ ప్రబంధచతుష్టయకర్తలు నయిన నమ్మాళ్వారుల నొక్కరి నైననుగాని ప్రతిష్ఠించి పూజించుచు, ఆ యాళ్వారుల, తిరు నక్షత్రములందు, వారికి విశేషార్చనోత్సవముల నొనర్చుచు ప్రతి దినము ప్రాతఃకాలము, సాయంకాలము లందొక నిర్ణీతసమయమున ద్రవిడప్రబంధములో కొంతభాగము నైనను పఠించుచు, సేవాకాలములు జరుపుచు, అధ్యయనోత్సవాదులను జేయుచు నుండు నట్టి దేవాలయములను గూడా దివ్యదేశము లనుచున్నారు.

ఏ దేవాలయము లందు ద్రవిడ ప్రబంధము పఠింపబడు చున్నదో ఆ దేవాలయములే దివ్యదేశములు, దివ్యస్థలము లనియు, ద్రవిడప్రబంధము పఠింపబడని దేవాలయములు దివ్యదేశములు, దివ్యస్థలములు, అప్రాకృతస్థలములు, మహాస్థలములు కావనియు

లైన భక్తులలో పోతన, కబీరుదాసు, రామదాసు, త్యాగరాజు, జయదేవుడు, తుకారాం, తులసీదాసు, మీరాబాయి, సక్కుబాయి మొదలగు పరమభక్తులు అనేక భక్తి పారవశ్య మైన కీర్తనలు వ్రాసి భగవంతుని ప్రార్థించి తరించినట్లు కీర్తింపబడియుండిరి.

భగవచ్ఛాస్త్రములందు భగవంతుని విగ్రహలక్షణములు, భక్త బింబప్రతిష్ఠావిధానము గలదు. కాని భక్తులు వీరని, వారని, సంఖ్యను నిర్దేశించి చెప్పియుండ లేదు. ఆ విధానము ననుసరించి భక్తుల నెందర నైనను ప్రతిష్ఠించి పూజించుట భక్తజనుల ముఖ్య ధర్మమై యున్నది గూడ. ఆ భక్తులు ద్రావిడులా, ఆంధ్రులా, మహారాష్ట్రులా, కర్ణాటకులా అను దేశవిభజనను పాటింపక స్త్రీలా, పురుషులా అనే విచక్షణ లేకుండా భక్తులను కొలుచుటలో అనౌచిత్యము ఏ మాత్రము లేదు. భక్తులను ప్రతిష్ఠించి పూజించు ఆలయములు భక్తాలయములని చెప్పవచ్చును గాని భగవదాలయములని చెప్పుట యుక్తము గాదు.

# 8. శైవమతము - ఆదిశైవులు

గత ప్రకరణములో విష్ణ్వర్చనా విధానము విష్ణ్వర్చకులైన వైఖానస పాంచరాత్ర సంప్రదాయ వివరములు, అర్చారూపి యైన భగవంతుని ప్రభావమును, భక్తిమార్గములను తమ పాశురముల ద్వారా ప్రజలలో విరివిగా ప్రచారము జేసిన ప్రముఖులైన ఆళ్వారుల జీవితములు వారి ఔన్నత్యమును దెలిసికొని యుంటిమి. ఈ భాగములో శైవమత ప్రాశస్త్యము శివార్చన జరిపెడు ఆదిశైవుల సంప్రదాయ వివరములు ప్రముఖ శివభక్తులైన నాయనార్ల జీవిత విశేషములు తెలుసు కొనుట ప్రధానమై యున్నది.

అతి ప్రాచీనములగు మతములలో శైవమత మొకటియై యున్నది. శైవమత మనగా శివుడే జగత్కారణము, "శివాత్పరతరం నాస్తి"-శివుని కంటె పరదైవ మింకొకటిలేదు. ఆ శివుడు సాకారుడు, సగుణుడు, నిరాకారుడు, నిర్గుణుడు. అయన తన భక్తుల కొరకు కొన్ని యాకారములను ధరించును. శివుడు సకలదేవతాస్వరూపుడు. విష్ణు బ్రహ్మేంద్రాది దేవతలు శివాంశ సంభూతులు. సదాశివుని భక్తి శ్రద్ధలతో పూజించు సమస్త ప్రాణులు మోక్షము నంద గల రని చెప్పునదియే శైవమతము.

శివభక్తులు శైవు లనబడు చున్నారు. వీరి సిద్ధాంతము శివాద్వైతము. అనగా శివునితో సమానుడగు రెండవ వాడెవడు లేడని యర్థము. ద్వైతాద్వైతాది మతములలో వీరిమతము విశిష్టాద్వైతము. దీనిని శివ విశిష్టాద్వైత మనుచున్నారు. శైవమతములలో 1. ఆది శైవమతము, 2. మహాశైవమతము, 3. శుద్ధశైవమత మనియు ఇంకా ఏవో కొన్ని శైవమతము లున్నట్లు దెలియు చున్నది.

ఈ శైవవిశిష్టాద్వైతము నందలి తత్త్వములెన్ని? ఆ తత్త్వముల లక్షణము లెయ్యవి? అను మొదలగు తాత్త్వికవిషయములను

శైవసిద్ధాంతగ్రంథము లందు జూడ నగును. కామికము మొదలగు ఇరువదెనిమిది లేక ముప్పదిరెండు శైవాగమములు వీరికి ముఖ్య ప్రమాణగ్రంథములు. శ్రీకంఠాచార్యులు, నీలకంఠాచార్యులు, శ్రీకరాచార్యులు ప్రస్థానత్రయమునకు భాష్యములు వ్రాసి భాష్యకర్తలై యున్నారు.

ప్రస్థానత్రయ మన "బ్రహ్మసూత్రము-ఉపనిషత్తులు-భగవద్గీత". శ్రీకంఠ-నీలకంఠ నామము లొకరివే యని కొందరు, వేరు వేరు వ్యక్తులని మరి కొందరు చెప్పుచున్నారు. శైవమతోద్ధారకులలో 1. విశ్వారాధ్యుడు, 2. వేమనారాధ్యుడు, 3. ఉద్భటారాధ్యుడు అను ముప్వురూ ఆరాధ్య లను పేరుతో వ్యవహరింపబడుచున్నారు. వీరిని బట్టియే శైవులలో కొందరు ఆరాధ్యులను పేర వ్యవహరింపబడు చున్నారని దలంచవచ్చును. వీరే గాక మరి యింకను రేవణసిద్ధుడు, మరుళసిద్ధుడు, ఏకోరామసిద్ధుడు, శ్రీపతిపండితుడు, మల్లికార్జున పండితుడు, మంచన పండితుడు, శ్రీ కంఠశివాచార్యులు (నీలకంఠ శివాచార్యులు) మొదలగు వారు శైవమత ప్రచారము నొనర్చి, సుప్రసిద్ధి వహించిన శైవమతాచార్యులు.

శైవమునకు సంబంధించిన ఇతరాచార్యులు అనేక గ్రంథములు రచించినను బ్రహ్మసూత్రములపై నీలకంఠాచార్యులచే రచింపబడిన భాష్యము-తమిళదేశమున భక్తనాయనారులచే దెలుపబడిన అనేక పద్య గద్యాత్మక రచనలు, మరియు త్రికసిద్ధాంతమునకు జెందిన వసుగుప్తాచార్యుని నుండి అభినవగుప్తుని వరకు గల అనేక రచయితల గ్రంథములను, మహారాష్ట్రమున పాశుపత తత్త్వవిమర్శన గ్రంథ కోటియు, ఆంధ్రకర్ణాటకముల వ్యాపించియున్న లింగాయత వీర శైవసంబంధ రచనలు శైవసంప్రదాయమునకు ప్రమాణ గ్రంథములు. మొత్తము మీద ఈ గ్రంథము లన్నియు శైవపరములై విరాజిల్లినను సిద్ధాంత సాధన భాగములయందు విభిన్న శాఖలకు సంబంధించుటచే

సర్వప్రామాణికముగ నుండక పాక్షికములుగ నుండెను. కాని ఆగమములు మాత్రము సర్వప్రామాణికములై విరాజిల్లు చున్నవి. ఆగమగ్రంథములు సంస్కృతభాషలోనే గాక ద్రావిడ మొదలగు నితరభాషల యందు గలవు. ఆదిశంకరులకు పూర్వము భాష్యకర్తయైన బోధాయన మహర్షియు బ్రహ్మసూత్రభాష్యమును శైవపరముగా రచించి శివవిశిష్టాద్వైతమును ప్రతిపాదించెనని శైవుల విశ్వాసము. వీరు ఈశ్వరుని సగుణస్వరూపుడని నమ్మినను, ఈ నిర్గుణ (లింగరూపము) పరబ్రహ్మతత్త్వమును వ్యక్తపరచు ననియు, లింగరూపము తనకు చిహ్నముగ స్వీకరింపబడెననియు దెలిపెదరు.

శైవులలో వీరశైవ సంప్రదాయ మొకటి గలదు. ఈ సంప్రదాయమునకు జెందినవారు వీరశైవులని వ్యవహరింపబడు చున్నారు. వీరశైవులు లింగధారిశైవులవలె అనగా ఆరాధ్యులవలె లింగమును ధరించుదురు. ఉపనయనమును జేసుకొనరు. ఈ సంప్రదాయమును ప్రవర్తింప జేసినవాడు బసవేశ్వరుడు. ఈ సంప్రదాయ విశేషములను 'బసవపురాణము' మొదలగు వీరశైవ గ్రంథముల యందు జూడ వచ్చును.

**ఆదిశైవులు :**

శైవులలో "ఆదిశైవు"లను శాఖయు గలదు. వీరి గురు పరంపరా శ్లోక మిట్లున్నది.

సదాశివసమారంభాం శ్రీ కంఠాచార్యమధ్యమామ్,
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్.

ఆదిశైవ సంప్రదానుయాసారముగ శ్రీకంఠాచార్యులు ప్రస్థానత్రయమునకు భాష్యములను వ్రాసియున్నారు.

ఆదిశైవులకు శివబ్రాహ్మణులు, అనగా శైవ బ్రాహ్మణులనియు శివార్చకులు అనగా శివభక్తులనియును నామాంతరములు. వీరు

బోధాయన సూత్రీయులు. బోధాయన సూత్రము నందు చెప్పబడిన విధముగ కర్మకాండను నిర్వర్తించుకొందురు. శైవాగమోక్త ప్రకారముగ స్వార్థ, పరార్థములందు శివ ప్రతిష్ఠార్చనోత్సవాదులను జేయుట కధికారము కలిగియున్నారు. ఆరాధ్యులవలె, ఆదిశైవులు లింగమును ధరించరు. లింగధారణశైవులు (ఆరాధ్యులు) మృతదేహమునకు ఖననసంస్కారమును జేయుదురు. అపరకర్మను జేయరు. వారి సంప్రదాయానుసారముగ ఆరాధనము నొనర్చెదరు. ఆదిశైవులు మృతదేహమునకు దహన సంస్కారము గావించి మృతాశౌచమును బట్టుచు అపరకర్మ నాచరించెదరు. ఆరాధ్యులు వితంతువులకు కేశ ఖండనమున కొప్పుకొనరు. ఆదిశైవులు వితంతువులకు కేశఖండనము జేయించెదరు. ఆరాధ్యులకు-ఆదిశైవులకు ఆచారభేదములు పెక్కు గలవు.

బ్రాహ్మణ శాఖలను వ్రాయుచు, బ్రహ్మశ్రీ శతావధాని చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రిగారు, 14-4-1948 'ఆంధ్రవారపత్రిక' యందు ఆదిశైవులను గురించి ఈ క్రింది విధముగా వ్రాసియుండిరి.

ఆదిశైవులు శివార్చకులుగా నుందురు. ఇటీవల వెలనాట్లలో నుంచి కొన్ని గోత్రాల వారు, సాహసించి శివాలయాలకు పూజకులుగా ఏర్పడ్డారు. ఆదిశైవులను దక్షిణాదిన "గురుక్కల్" అని వ్యవహరింతురు. బహుశః ఆ శబ్దము గురుకులశబ్దమని తోచును. ఆదికాలములో వీరు పలువురు శివభక్తులకు గురుస్థానంగావుండి పంచాక్షరీ మంత్రాన్ని ఉపదేశించే వారని గూడా ఊహకు తట్టుతుంది. ఇప్పటికి దక్షిణాదిన ఈ శాఖవారిలో గొప్ప గొప్ప విద్వాంసులున్నట్లు వినికిడి. ఆవిద్వాంసుల సదాచారసంపత్తి మిక్కిలి అభినందనీయంగా ఉంటుంది. వారు తమ శాఖగానివారి ఇండ్లకు భోజనాలకు గూడా వెళ్లరు. కాని ఇతర శాఖీయులు వారి ఇళ్లలో భోజనం చేస్తారు. మనదేశంలో మాత్రము వారికి వీరికి భోజనాదికం కనపడదు. వీరికి శైవాగమము

ప్రమాణం. వీరు సగుణోపాసకులు, విగ్రహారాధనకు ప్రధానులు. శివార్చకులు శివభక్తులే గాని లింగధారణ మంగీకరింపరు. ఆదిశైవులమంటారు అంటే ఆరాధ్యశైవులకంటె ప్రాచీనులన్నమాట. వీరికి పొత్తు స్వశాఖీయులతో మాత్రమే. దక్షిణదేశంలో అందులోను చిదంబర క్షేత్రములో వీరిశాఖ విస్తరించి ఉండడమే గాకుండా ఉద్ధారమైన పండితులు గూడా ఉన్నట్లు వినికిడి. వీరిని దీక్షితులంటారనిన్నీ, వీరి వర్తన ఆ పేరుకు తగినట్లుగా ఉంటుందనిన్నీ, చెప్పగా విన్నాను. ఈ దేశంలో గూడా, వీరిలో ఆగమాలు తెలిసిన పండితులు కొందరున్నారు. శివార్చకులు గూడా ఆంధ్రులలో అంతర్భవించే బ్రాహ్మణులే .. ఆదిశైవులను గురించి 'ఆంధ్రవిజ్ఞానము' నందిట్లుగలదు.

ద్రావిడ బ్రాహ్మణశాఖలో "గురుక్కల్" వీర శైవుల మనియు శివార్చన వృత్తి గలవారమనియుం జెప్పుకొందురు. వీరిలో గొందరాంధ్రదేశమునకు జేరినవారు ఆదిశైవుల మని వాడుకొనుచున్నారు. వీరికిని అరవదేశపు వారివలెనే గురుక్కల్ బిరుదనామము కలదందురు. గురుక్కల్ అనుపదము గురుకులమని చెప్పుదురు. వీరిలో కంచి తెగయనియు, తిరువాలంగాడు తెగయనియు, వాలాజాపేట తెగ యనియు మూడు తెగలు గలవు. వీరు నాయక, దీక్షిత, భట్టర్ అను బిరుదనామములు ధరించియుందురు. ఆగమ ప్రధానముగ జెప్పెడు వేదమును వదలనివారు. బోధాయనసూత్రము వీరికి ప్రధాన గ్రంథము. ద్రావిడ, కర్ణాటక దేశములందు శివాలయముల నర్చకులుగ నుందురు.

ప్రస్తుతకాలములో విష్ణ్వాలయములందు, వైఖానస పాంచరాత్రసంప్రదాయస్థులగు వైఖానస-పాంచరాత్ర వైష్ణవులే గాక రామానుజీయ సంప్రదాయమునకు జెందిన వైష్ణవులును, శివాలయములందు ఆదిశైవులేగాక, వెలనాడు మొదలగు తెగలకు సంబంధించిన స్మార్త బ్రాహ్మణులున్నూ పూజారులుగా నున్నారు.

# 9. నాయనార్లు

విష్ణుభక్తులను ఆళ్వారులనియు, వారి ప్రభావాదులను దెలుసు కొంటిమి. అటులనే ప్రముఖ శివభక్తులు నాయనార్లని పిలువబడి యుండిరి. వీరి జీవిత విశేషములను దెలుసుకొనుటకు ప్రయత్నింతము.

నాయనార్లు 63 మంది అని దెలియుచున్నది. విష్ణుభక్తులైన ఆళ్వారులవలె నాయనార్లు శివభక్తులై శైవమతస్థులై, శైవభక్త మహాకవులై, శివుని పరంగా అనేక స్తోత్రములు, ఎన్నియో రచనలు జేసి ప్రఖ్యాతి బడసియుండిరి. శివస్తుతి పరంగా, స్వభాషయగు, ద్రవిడమునం దెనిమిదివేల సంఖ్య గల, శివగేయములను రచించి, భక్తి వాఙ్మయమునకు ప్రాముఖ్యము దెచ్చిరి. దినదిన ప్రవర్ధమాన మగుచున్న బౌద్ధ, జైనమతప్రచారము నడంచుటకు భక్తిమార్గములను ప్రబోధించుటకై తమిళ ప్రాంతములో జన్మించిరి. వీరిలో అప్పర్, జ్ఞాన సంబంధర్, సుందరమూర్తి, మాణిక్యవాచకర్ అను వారలు చాలా ముఖ్యులు. సేక్కిలార్ అను గొప్పకవి రసవత్తరముగా రచించిన "పెరియపురాణ"మను తమిళకావ్యము నం దీ నాయనారుల చరిత్రలు విపులముగా వర్ణింపబడియున్నవి. పెరియపురాణము, చాలా పవిత్రమై ప్రఖ్యాతి వహించిన గ్రంథము.

పదియవ శతాబ్దమున "నంబియార్" నంబి యనువారు, పూర్వపు గీతములను పొందుపరచి "తిరుమురై" అను పవిత్రగ్రంథముగా నేర్పరచెను. భక్తివాఙ్మయమునందు ఇవి ప్రముఖస్థానమును అలంకరించి యున్నవి. ద్రావిడ వైష్ణవులకు ఆండాళ్ రచించిన "తిరుప్పావై" పవిత్రమై ప్రాముఖ్యము వహించినట్లు, ద్రావిడ శైవులకు "మాణిక్యవాచకర్" రచించిన "తిరువెంబావు" చాలాప్రాముఖ్యము వహించియుండెను. అప్పర్, జ్ఞానసంబంధర్, సుందరమూర్తి

రచించిన శైవగీతములు "తేవార" మనబడును. వీరి ప్రతిమలు దక్షిణ భారతదేశములో శైవదేవాలయములలో ప్రతిష్ఠింపబడియున్నవి.

ఈ నాయనార్లు వివిధ వర్ణములకు చెందిన వారై జాతి, వర్ణ కులవ్యవస్థ కతీతముగ నుండుట గమనార్హము. వారిలో ఆదిశైవులు బ్రాహ్మణులు - రాజులు - వర్తకులు - కృషీవలులు - ఆటవికులు - పల్లెవారు - పంచములు - స్త్రీలు - సర్వజాతుల వారుండుట ముఖ్యము. సర్వ సమత్వము ఇచ్చట స్పష్టముగా గోచరించు చున్నది.

1. ఆదిశైవులను గురించి లోగడ తెలుపబడి యుండెను.

2. బ్రాహ్మణులు: 12 మంది. 1. గుగ్గులు కలశనాయనారు (కుంగులియకలియ), 2. మురుగ, 3. రుద్రపశుపతి, 4. చండేశ్వర, 5. అప్పూదియడిగర్ 6. తిరుజ్ఞానసంబంధమూర్తి (జ్ఞానసంబంధమూర్తి) 7. సోమానిమార 8. చిరప్పులి 9. గణనాథ 10. పూజలాల్ నాయనార్లు మొదలగు వారు. మహాముద్ర బ్రాహ్మణుడు-చిరుతొండ (బాలభక్త) నాయనారు.

3. క్షత్రియులు: 11 మంది 1. చేరమాన్ పెరుమాళ్ 2. పుకల్ చోళ (కీర్తిచోళ) 3. నెడుమార 4. ఇడంగళి 5. మంగయుర్ కరశి అమ్మ (మహిళానాయకి) 6. కోచ్చంగచోళ. వీరు ఆరుగురు రాజ్య పాలకులు. 7. మెయ్‌పొరుళ్ (స్వదస్తునాయనారు) 8. కూత్తున 9. నరసింగమునైయర్రెయ 10. అయ్యడికళ్ కొడవర్ కోన్ 11. కళర్ సింగనాయనారులు.

4. వైశ్యులు: 5 గురు. 1. ఇయర్పగై 2. అమర్నీతి 3. మూర్తి 4. కర్కకాలమ్మ 5. కలికంబనాయనారులు.

5. వెలమలు: 13 మంది. 1. ఇళయాన్‌కుడిమార 2. విర న్మిండ 3. మానక్కంజార 4. అరివాట్టాయ 5. తిరునావుక్కరసు (వాగీశనాయనారు) 6. ఏయర్ కాన్‌కలిక్కామ 7. మూర్ఖ 8. శాక్య

(శాఖ్యనాయనారు) 9. శక్తి 10. వాయిలార్ (మౌననాయనారు) 11. మున్నైయడువార్ 12. చేరుత్తజై 13. కోట్పులినాయనారులు.

6. యాదవులు: 2 ఇర్వురు. 1. తిరుమాల, 2. అనాయ నాయనారులు.

7. పుళిందులు: 1 ఒక్కరు. తిరునీలకంఠ నాయనారు.

8. మాతంగులు: 1 ఒక్కరు. తిరునీలకంఠయప్రాణనాయనారు

9. భరతులు: 1 ఒక్కరు. అతిభక్తనాయనారు.

10. శబరులు: 1 ఒక్కరు. కణ్ణప్పనాయనారు.

11. శౌండులు: 1 ఒక్కరు. ఏనాదినాయనారు.

12. తుండునాయకులు: 1 ఒక్కరు. దేశనాయనారు (మిత్ర నాయనారు.)

13. రజకులు: 1 ఒక్కరు. తిరుకురిప్పుతొండనాయనారు.

14. తైలకారులు: 1 ఒక్కరు. కలియనాయనారు.

15. పంచముడు: తిరువాళైప్పోవార్ నాయనారు. (అపర వారగమ్యనాయనారు)

16. సంశయవర్ణస్థులు: 6 ఆరుగురు. 1. వీరిభక్తనాయనారు 2. కులచ్చిరై 3. పెరుమిళవైకురుంబ 4. దండియడిగళ్ 5. కణంపుల్ల 6. కారినాయనారులు.

### తిరువళ్ళువరు:

వీరు రచించిన అతిపవిత్రమైన గ్రంథము "తిరుక్కురల్". చాలాప్రాశస్త్యం వహించియున్నది. వీరు చాలా ప్రాచీనులు. వీరు రచించిన 'తిరుక్కురల్' ధర్మము-అర్థము-కామము. అను మూడు పురుషార్థములను గురించి, మూడుభాగములుగ వ్రాయబడిన ఉపదేశ శాస్త్రము.

ఇతడు గృహస్థుడై, అతిథిపూజ, కర్మనిష్ఠుడై లౌకిక ధర్మములను శ్రద్ధతో జరుపుచు దృఢమైన శక్తిగలవాడు చక్కని కవితాశక్తి గలిగిన ప్రతిభావంతుడు. ఉద్రేకము లేక ఓర్పు, నెమ్మది స్వభావములు గలిగిన వాడు. ఆంధ్రుల తత్త్వవేత్తలలో వేమన సమకాలికుడని దెలియుచున్నది. శివభక్తులలో అరుణగిరినాథుడు సుబ్రహ్మణ్యభక్తుడై "తిరుప్పుగళ్" అను రసవత్తరమైన భక్తిగేయములను రచించి ప్రఖ్యాతి బడసియుండెను.

ఈ నాయనారుల విభజన ననుసరించి నల్వురు నాయనారులు అతిముఖ్యులుగా ప్రఖ్యాతి వహించి యుండిరి. వీరి నల్వురి కవితాశక్తి నాలుగు భక్తితత్త్వములపై నాధారపడి యుండెను.

1. అప్పర్: (తిరువక్కరసునాయనారు) దాస్యభక్తి మార్గము ననుసరించెను.

2. సుందరర్: (సుందరమూర్తి) సఖ్యభక్తి మార్గము నుపదేశించెను.

3. తిరుజ్ఞానసంబంధర్: (తిరుజ్ఞానసంబంధమూర్తి) వాత్సల్య (సత్పుత్రమార్గము) భక్తిమార్గమునకు ప్రాముఖ్య మిచ్చెను.

4. మాణిక్యవాచకర్: జ్ఞానమార్గమునకు అత్యంత ప్రాముఖ్య మిచ్చి భక్తి మార్గమును బోధించెను.

శివుడే పరదైవమని విశ్వసించి ధ్యానించి తరించిన మహాశివ భక్తు లెందరో గలరు. మార్కండేయ, చిరుతొండనంబి, సిరియాళ నంబి, భక్తనందనారు, భక్తకన్నప్ప మొదలగు వారు పెక్కుమంది గలరు. తమిళభాషలో వైష్ణవ ఆళ్వారులును, శైవనాయనారులును, గొప్ప భక్తిసాహిత్యమును నిర్మించి తమిళ వాఙ్మయమును సునంపన్నముగా జేసిన ప్రముఖులుగా కీర్తింపబడుచున్నారు.

# 10. ప్రముఖులైన కొందరు భక్తులు

భగవంతుని భక్తులైన "ఆళ్వారులు - నాయనార్లు" అర్చారూపి యైన భగవంతుని గురించి వారి భక్తి రచనల ద్వారా భక్తి ప్రబోధ ములు విరివిగా గావించి భక్తి తత్త్వమును ప్రబోధించి అనేక క్షేత్రము లలో పర్యటించి విగ్రహరూపములో నున్న భగవంతుని సేవించితరించి ధన్యులైన విషయము గత ప్రకరణములలో వివరింపబడి యుండెను. తరువాత కాలములో గూడా ప్రముఖులైన కొందరు భక్తులు ఎన్నో కష్టముల నెదుర్కొని భగవంతునే విశ్వసించి, సర్వమూ ఆ భగవంతుడే యని కొలిచి దృఢమైన భక్తితో భగవంతుని ప్రార్థించి వారి జన్మలు సార్థక మొనర్చుకొని నేటికిని కీర్తి ప్రతిష్ఠలు బడసియుండిరి. వారి జీవిత చరిత్రలు గూడా సంక్షిప్తముగా తెలుసు కొనుట యుక్తము గాన ఈ ప్రకరణములో వివరించడ మైనది.

## 1. భక్త కబీరుదాసు :

కొందరు కబీరు క్రీ. శ. 1398 లో జన్మించె ననియు, మరి కొందరు 1410లో జన్మించెననియు పలువిధములుగా చెప్పుచున్నారు. కొంతమంది బ్రాహ్మణ వితంతువునకు దైవ వరప్రసాదముగా నొక శిశువు జనింప ఆమె లజ్జావదనయై గోప్యముగా అరణ్యములో వదలి వేసినదనియు, మరి కొంతమంది ఆ శిశువు నదీప్రవాహమున కొట్టు కొనివచ్చుచుండ మహమ్మదీయ దంపతులకు దొరికినట్లు, వారణాసి యందు గల తాళ్ అను సరస్సులో వారికి లభించినదనియు ఎన్నో విధములుగా వారి జీవితచరిత్రను గురించి చెప్పుచున్నారు.

హిందువుడని చెప్పుకొనుటకు పై విధముగా చెప్పినట్లు కొంత మంది చెప్పుచున్ననూ, కబీరు గురువు రామానందుడు మాత్రము అతను మహమ్మదీయుడనియే నిశ్చయించెను.

ఇతడు చిన్నతనము నుండియు అత్యంత భక్తియుక్తుడై ఏకాంతవాసమున కన్నులు మూసుకొని ధ్యాననిమగ్నుడై యుండెడి వాడు. తండ్రియైన తమాలు వస్త్రములునేసి వానిని నగరమున విక్రయించి జీవించుచుండెడి వాడు. తండ్రి బిడ్డకు గూడా నేతపనినే నేర్పెను. ఇతని గురువైన రామానందుడు దక్షిణ హిందూస్థానమునకు చెందిన వాడైనను కారణాంతరములచే వీరి తండ్రి ఉత్తరదేశమున ప్రయాగయందు స్థిరనివాస మేర్పరచు కొనెను. రామానందుడు సంఘసంస్కరణల విషయమై జూపుచున్న అభిలాషకు రామానందుని గురువైన రాఘవానందునిచే బహిష్కరింపబడినను రామానందుడు వర్ణవ్యవస్థలను తిరస్కరించి బ్రాహ్మణాది సమస్తజాతుల వారికిని స్త్రీలకును భగవద్విషయములు బోధించి శ్రీరామచంద్రమూర్తిని అధిష్ఠాన దైవముగా భావించి వైష్ణవమతమును బోధించెను.

కబీరు భక్తియుక్తుడై దిరుగుచు వారణాసి యందు గల రామానందుని జేరి ఉపదేశింపమని కోరగా, మహమ్మదీయుడని రామానందు డుపదేశించుటకు నిరాకరించెను. కబీరు పట్టువదలక, నిత్యమూ రామానందుడు బ్రాహ్మముహూర్తమున స్నానమునకై నరుదెంచు సమయమున, ముందుగనే సోపానముల మీద బరుండి యుండెను. ఆ విషయము రామానందునికి తెలియక కబీరును త్రొక్కెను. తెలియక త్రొక్కుటచే రామానందులు వగచి "రామ - రామ" యని వచింపగ ఆ రామనామమే తారకమంత్రముగ విశ్వసించి కార్యసిద్ధియై నందులకు ఆనందించి గురువునకు సాష్టాంగవందన మాచరించి గురువు ఎదుట నిలిచెను. విశాలహృదయుడైన గురువు రామానందుడు అమందానందము నంది కబీరును మఠమునకు గొనిపోయి మంత్రోప దేశము గావించి శిష్యునిగ స్వీకరించెను.

రామానందునికి వర్ణాతీతవ్యవస్థ ఏర్పడక పూర్వము కబీరు చేరి నట్లు తెలియుచున్నది. రామానందుని చేరక పూర్వమో, అనంతరమో

ఇతడు 'లోయి' అను కన్యను వివాహమాడెను. ఈమె పేదకుటుంబములో జన్మించినందున తల్లి, తండ్రులు పోషించలేక 'లోయి' అను గుడ్డలో ఆమెను ఉంచి, దానినొక పెట్టెలోపెట్టి నీటిలో వదలి వైచిరి. స్నానమాచరించుచున్న నొకసాధువు నీటిలో తేలుచున్న ఆ పెట్టెను తీసుకొనివచ్చి తెరచిచూడగా యీ బాలిక కనపడెను. ఆమె యుక్త వయస్సు వచ్చునప్పటికి సాధువు మరణించెను. కొంతకాలమునకు కబీరు అచటుకు బోయి, ఆమెను వివాహము చేసికొనెను. ఆమె మూలమున అతనికి 'కమాలుడు-కమలి' అను ఇద్ధ్వరు బాలబాలికలు జన్మించిరి. కబీరు మరణపర్యంతము గృహస్థాశ్రమమునందే యుండి తండ్రియైన తమాలు నేతవృత్తినే అవలంబించి ధనార్జన చేసుకొని జీవించుచుండెను.

కబీరునకు కులము, జాతి పట్టింపులు లేవు. పూజాస్తోత్రములు లేవు. అర్చామూర్తిగాని, శాస్త్రములుగానిలేవు. భగవంతుని గురించి తన సహజ మాధుర్యముగల కంఠముచే స్తుతిచేయుచు, జనులను తన అనుయాయుల గావించుకొనెను. "నిరాడంబరుడు, నిరక్షరుడు యైన కబీరు సామాన్య మానవులకు కవియై మహాత్ముడై వెలుగొందెను" అని నభాకా పండితుడు చెప్పెను. పెల్లుబికిన హృదయావేదనలే అతని కీర్తనలు. ఇతడు మహమ్మదీయమున గల ఏకేశ్వరోపాసనయు, వేదాంతమునందు గల ముఖ్యసిద్ధాంతమును సమ్మేళనము చేసి గాన మొనరించెను. నాటి హిందూ, మహమ్మదీయ సంఘమున గొప్ప విప్లవకారుడై సంచలనము కలిగింపగా, మహమ్మదీయు లతనిని "సుఫీ ఫకీరు" గను, హిందువులు "రామభక్తితన్మయుని" గను స్వీకరించి, అతని మృతకళేబరమునకై పోరాడి యుండుట అతని అద్భుత వ్యక్తిత్వము, ఆకర్షణమునకు, ప్రజాగౌరవ మర్యాదలకు గొప్ప తార్కాణము. కబీరు శాసనముల ననుసరించి, శిష్యులు ఏకేశ్వరోపాసకులై విగ్రహారాధనను త్యజించి, బాహ్యాడంబరము వీడి మత్తు పదార్థములను సేవింపక ఇంద్రియములను జయించియుందురు.

వీరు నింబార్క బైరాగులవలె, రెండు శ్వేతరేఖలుగల ఊర్ధ్వ పుండ్రమును బెట్టి, మధ్యన చందనపు బిందువు నుంచెదరు. కొందరు తులసీ తావళములు కంఠమున ధరించెదరు. వారి పేర్ల చివర దాస శబ్ద ముండును. రామానందుడు కర్మకలాపములు బోధింపగా, కబీరు దాసు కర్మకలాపములను, ఆచారములను పూర్తిగా వ్యతిరేకించి, తన మతమునకు నిరాడంబరత్వము, ప్రేమ ముఖ్యసూత్రము లని బోధించెను.

ఈ విధముగా ఇతడు సంసారియై యుండియు, దేశవ్యాప్త కీర్తి నార్జించి, హిందూ మహమ్మదీయులకు ముఖ్యుడై, తన గురువైన రామానందుని మించిన వాడగుట చాలా గొప్ప విషయము. వీరు 111 సంవత్సరములు జీవించినట్లు దెలియుచున్నది.

## 2. బమ్మెర పోతరాజు

సుమారు 700 సంవత్సరముల క్రిందట గాని లేక 15వ శతాబ్దమున గాని ఏకశిలానగరములో బమ్మెర కేసనమంత్రి యను బ్రాహ్మణుడు గలడు. ఇతని భార్యపేరు లక్కమ్మ. వీరికి ఇరువురు కుమారులు గలరు. అతనికి అరఎకరము మెట్టభూమి మాత్రమే గలదు. పదిమంది చుట్టములు గలవాడగుటచే, వచ్చుపోవు వారి తాకిడి ఎక్కువగా నుండెడిది. అరఎకరములో వచ్చు ఫలసాయముతోనే పండుగ, పబ్బములు జరుగవలెను. కేసనమంత్రి శివపూజా పరాయణుడు. అతని కుమారులలో పెద్దవాడైన తిప్పన్న చురుకైనవాడు గాడు. కొంచెము స్థబ్ధుడు. చిన్నవాడు పోతన చాలా చురుకైనవాడు. గృహమునకు సంబంధించిన పనులలో తల్లిదండ్రులకు సహాయపడుచుండెడి వాడు. పోతన్నకు పశువుల పరామరిక చాలా ఇష్టము. వారి ఇంట నొక ఆవు గలదు. పోతన్నకు ఆ యావన్న ఎక్కువ ప్రేమ. దానిని ప్రతి దినము తనే అడవికి తోలుకొనిపోయి మేపుకొని వచ్చుచుండెడివాడు.

ఏకశిలానగరమున కొండ గలదు. దానికి బైరాగులబోడు అనిపేరు. ఆ కొండగుహాలలో తపస్వు లుందురని ప్రతీతి.

ఒకనాడు తను మేపుచున్న ఆవు పెద్దపొద వద్దకుబోయి తల ఎత్తి, చెవులు టిక్కరించి, బెదురుచూపులతో అంబా యని అఱచెను. ఆ యఱపునకు పోతన భయపడి తిన్నగా ఆవుకడకు బోయి చేతితో తట్టి నిమిరెను. ఆవు ఏ మాత్రము కదలక అట్లే చూచుచుండ పోతన పొదలోకి తొంగిచూడగా తేజోరాశియైన యొక మహాత్ముడు పద్మాసనమున గూర్చుండి యోగముద్రలో నుండెను. ఆయన వెనుక నాగుబాము పడగవిప్పి, ఆ మహాత్ముని తలపై గొడుగుగా పట్టి ఆడు చుండెను. పోతన్న తదేకదృష్టితో వారిని చూచి సాష్టాంగ పడెను. కొంతసేపటికి పాము కనపడలేదు. యోగి పోతన్నను బిలిచి, నీ కేమి కావలయునో కోరుకొమ్మని యడుగగా నీ దర్శనమైనట్లే, నాకు నిరంతర భగవద్భక్తియు, భగవంతుని వర్ణింపగల శక్తియు, భగవద్దర్శనము కావలయునని కోరుకొనెను. యోగి పోతన్నను దగ్గరకు పిలిచి, తారక ముపదేశించి భగవదనుగ్రహముచే నీకు పాండిత్యము, అనర్గళ కవితాధారయు, లభింప గలదనియు, భక్త శిఖామణివై భగవద్దర్శనము పొందగలవని సెలవిచ్చెను.

తనకు జరిగిన మహత్కార్య మంతయు, ఆవు వల్లనే జరిగి నదని, దాని మెడను కౌగలించుకొని ఇల్లు చేరెను. ఆతడు తండ్రితో పాటు సేద్యపు పనులు జేయుచూ, ఇంటి పనులలో తల్లికి తోడ్పడుచు సాయంకాలము విష్ణ్వాలయమునకు శివాలయమునకు బోయి, భగవద్దర్శనము జేసుకొనుచు, సమయము దొరికి నప్పుడు, సద్గ్రంథ ములను చదువుచుండెను. ఇతనికి బోధకుడు సర్వేశ్వరుడే, శివ సన్నిధిలో కూర్చుండి, "చేతులారంగ శివుని పూజింపని వాడును - నోరు నొవ్వ హరిని కీర్తింపని వాడు", దయలేని వాడు, సత్యము పలుకని వాడును, జన్మించుట, తల్లికి కడుపు చేటు అన్న భావము

స్ఫురించి, వెంటనే పద్యము వ్రాసెను. ఇటులనే నిత్యము భగవంతుని గురించి ఒకటి, రెండు పద్యములు వ్రాయు చుండెను.

చంద్రగ్రహణము రోజున, మిత్రులతో గోదావరీ స్నానమునకు బోయి పెద్ద ఇసుక దిబ్బపై కూర్చుండి, కన్నులు మూసి, ధ్యానము చేసుకొనుచుండగా, పద్మనేత్రములు గలిగిన నొక మహాపురుషుడు ప్రత్యక్ష మాయెను. ఆ పురుషుడు నేను రామభద్రుడను, నా కంకితముగా శ్రీమహాభాగవతమును తెనుగున వ్రాయుము, నీకు భవబంధములు తెగునని యాన తిచ్చి అదృశ్యు డాయెను. ఏకశిలానగరము నందుగల పెద్దల యనుమతితో భాగవత రచన ప్రారంభించెను. పోతన ఉభయ భాషలయందు సమానముగా కవిత్వము చెప్ప గలవాడు. వారు రచించిన భాగవతము నవరస భరితము. పోతనకు భక్తిరసము ప్రధానమైనది. భగవంతుని గురించి వర్ణనలు వచ్చినప్పుడు మైమరచి యుండును. ముఖ్యముగా 'అల వైకుంఠపురంబులో నగరిలో' అను పద్యము వ్రాసినప్పుడు కొంత భాగము వ్రాసి, కొరవ భాగము పూర్తి చేయుటకు తనకు స్ఫురింపనందున పొలమునకు బోయెను. ఆ సమయములో భగవంతుడైన శ్రీరామచంద్రుడే తన రూపములో వచ్చి, పూర్తి జేసినట్లు తన కుమార్తె వల్ల తెలిసికొనెను.

తనకు భగవద్దర్శనము కాకపోయినందులకు మిక్కిలి చింతించి, తన కుమార్తెకు భగవద్దర్శనమై నందులకు ఎంతగనో సంతసించెను. ఈ పరిస్థితులలో గూడా తనకు ముఖ్య జీవనాధారమైన సేద్యమునే చేయుచుండెను. పోతన కొక కుమారుడు గలడు. అతనిపేరు మల్లన్న. తండ్రి, కొడుకు లుభయులు సొంతముగనే పొలము దున్ని వ్యవసాయము జేసుకొనుచుండిరి.

భాగవత రచనలో నిమగ్నుడై నకొలది పోతనకు వ్యవసాయం మీదశ్రద్ధ తగ్గిన్నది. ఆదాయంతగ్గి కుటుంబమున జరుగుబాటుగూడా

చాలా క్లిష్టముగా నుండెను. పోతన భాగవతము తెనిగించుచున్నా డనియు, గ్రంథము సర్వోత్కృష్టముగా నున్నదని వెల్లడి యైనది. ఆ గ్రంథమును, తాను కృతిగా నందగోరి, కర్ణాటక ప్రభువు తన యాస్థానకవియు, పోతన బావమరదియు నైన శ్రీనాథునితో ప్రస్తావించెను. శ్రీనాథుడు రాజును మెప్పించి, భోగము లనుభవించు చుండెను. తన బావమరిది కటికదారిద్ర్య మనుభవించు చుండుటకు ఖేదపడుచుండెడివాడు. ఎలాగైనా, పోతన గారిని భాగవతమును రాజునకు అంకితమీయ ఒప్పించుటకు ప్రయత్నించవలెనని రాజుగారి పరివారముతో తా నందలమెక్కి ఏకశిలా నగరమునకు బోయెను. శ్రీనాథుడు తన యందలమును పోతన పొలముదున్ను సమయములో అరక వద్దకు రానిచ్చి, అక్కడ దిగి పరిహాసముగా కావ్య మొకటి రచించి, యే మహీపతి కంకితము జేసినను అగ్రహారములు, కనకాంబరము లిచ్చి పూజింతురు గదా యని పలికెను. పోతన వెంటనే "బాల రసాల సాల నవపల్లవ కోమలకావ్యకన్యను కూళలకిచ్చి అప్పడుపుకూడు" భుజించనని సమాధాన మిచ్చి, "కాటుక కంటినీరు చను గట్టు పయింబడ........" ఏడ్వవద్దని సరస్వతిని ఊరడించెను. వ్యవసాయము జేసుకొని ఉదరపోషణ జేసుకొనుచు, అడవులలో పడి యుండుట మేలుగదా యనెను.

శ్రీనాథుడు, పోతన చెప్పిన సమాధానమునకు సిగ్గుపడి, అందల మెక్కక పోతనతో బాటు, అరకవెంట నడిచియే ఇంటికి వచ్చెను. పోతన తన శక్తికొలది పరివారమున కంతయు విందు జేసెను. శ్రీనాథుడు పోతరాజుతో కర్ణాటక ప్రభువు, నీవు వ్రాయు చున్న భాగవతమును, కృతి నందగోరినాడు. నేను నీకు చెప్పి ఒప్పించెదనని వచ్చితిని. నీ తత్త్వము నెరుగక తొందరపడి పొరబాటు జేసినాను. దయయుంచి ప్రభువున కంకితము ఇవ్వవలసినదిగా కోరెను. పోతన భారతీదేవిని ఓదార్చుచు పద్యము చదివెను. శ్రీనాథుడు

దిగాలుపడి పోతరాజును నొప్పించినందులకు క్షమింపమని వేడుకొనెను. పోతన తెనుగున వ్రాసిన భాగవతమునకు గల ప్రత్యేకత, ఆ పద్యములలోని మధుర, గంభీర, భావములు రసవత్తరములు, భక్తితత్త్వముతో గూడిన పద్యములు. ఈ పద్యములు ఎంతో ప్రాముఖ్యము వహించి, బహుళ ప్రచారములై నిత్యపారాయణము చేయుటకు పవిత్రమై ఖ్యాతిగాంచి యున్నవి.

## 3. భక్తరామదాసు

గోల్కొండ రాజ్యమున నేలకొండపల్లెయను నొకగ్రామమున భగవద్భక్తుడైన కంచెర్ల లింగన్న అను బ్రాహ్మణోత్తముడు గలడు. ఇతని భార్యపేరు తల్లికాంబ వీరి కుమారుడే రామదాసు. రామదాసు మొదటిపేరు గోపన్న. రామభక్తుడై ఎల్లప్పుడూ రామనామ సంకీర్తనలు జేయుచూ పాడుచుండుటచే రామదాసని పిలుచు చుండిరి.

గోపన్నకు యుక్త వయస్సు రాగానే ఉపనయన మొనరించి విద్యాభ్యాసమునకై గురువున కొప్పగించిరి. గోపన్న రూపవంతుడగుటయే గాక జాగ్రత్తగల వాడును, దైవభక్తి గలిగి యుండెడి వాడై యుండెను. తెలివిగల వాడగుటచే కొద్ది కాలముననే సర్వశాస్త్రములు పఠించి గొప్ప పండితు డాయెను. గురువు ద్వారా రామాయణ కావ్యము బఠించు చుండినందున రాముని గురించి యెక్కువగా చెప్పబడినందున రాముని యందే గోపన్న లీనమై రామునే యెల్లప్పుడు భక్తితో ధ్యానించు చుండెను.

కొంతకాలమునకు గోపన్న తల్లితండ్రులు స్వర్గస్థులైరి. ధీరుడు, పండితుడు, జ్ఞానియగు గోపన్న త్వరలో నా దుఃఖమంతయు మరచి, తెలివి తేటలుగల నొక కన్యను వివాహమాడెను. కొంత కాలమునకు వారి కొక కుమారుడు గలిగెను. వానికి తన ఇష్టదైవమైన రాముని నామం బిడెను.... ....గోపన్నకు రాను రాను రామభక్తి ఎక్కువగు

చుండెను. రామ సంకీర్తన మొనర్చుచున్న భట్టాచార్యు లనెడి భక్తశిఖామణిని గురువుగా భావించెను. వారుగూడ గోపన్న దైవ భక్తికి నతిథి పూజలకు సంతసించి తారకమంత్ర ముపదేశించి, రామ భక్తిని మరువ వద్దని చెప్పి ఆశీర్వదించి వెడలి పోయిరి. తారక మంత్ర ముపదేశింపబడిన తరువాత గోపన్నకు రామభక్తి మరింత ఎక్కువై నిశ్చలత నొందెను. తన గృహమందు ప్రత్యేకముగ మందిరము నిర్మించి బంగారముతో రాముని విగ్రహము చేయించి, ఆ మందిర మందుంచి నిత్యము భక్తిశ్రద్ధలతో నా విగ్రహమును పూజించు చుండెను. తాను పండితుడై యుండుట వలన స్వీయముగ కీర్తనలు రచించి అపారభక్తితో పాడుచూ నృత్య మొనరించు చుండెను.

గృహస్థుడుగా నుండియే భక్తిమార్గంబున ముక్తిని బొందుట సులభమని తలంచెను. భక్తులకు భోజనసదుపాయము లొనర్చుటయే గాక నిత్యసమారాధనలు చేయుట వలన పిత్రార్జితములైన మాన్యము లన్నియు హరించెను. ఇతని బీదరికమును జూచి కొంతమంది జాలి నొందినవారు తగిన సహాయము చేయుచుండిరి.

ఒకానొక సమయమున సమారాధన సందడిలో తన కుమారు డైన రాముడు వేడిగానున్న గంజితో నిండిన తొట్టియం దాకస్మికముగ బడి మరణించెను. గోపన్న భార్య పుత్రుని యాకస్మిక మరణమును గురించి కొంతవరకు దుఃఖించినను, సద్గుణశీలి యగు నామె భర్త యొక్క భగవద్భక్తికి భంగము వాటిల్లకుండా తన విధులను సక్రమ ముగ నెరవేర్చుచుండెను. తరువాత గోపన్న గూడా పుత్రుని మరణ వార్త తెలుసుకొని మిక్కిలి దుఃఖించి మరణించిన బాలుని రామ మందిరమునకు దీసుకొని పోయి, పుత్రుని సజీవుని గావించమని ప్రార్థించెను. కొంత కాలమున కా బాలుడు శ్రీరామచంద్రుని అను గ్రహమున పరిపూర్ణ ఆరోగ్యవంతు డాయెను.

ఒకనాడు గోపన్న రామచంద్రుని మందిరమువద్ద భక్తి నిమగ్నుడై నిద్రించెను. స్వప్నములో నొక బ్రాహ్మణుడు కనపడి, వత్సా, నీవు సదా ప్రార్థించెడి రాముడు దండకారణ్యమున పవిత్ర గౌతమీ తీరమందు భద్రాచలముపై అవతరించెను. నీ వాతని కాలయము నేర్పరచి, ఉత్సవ పూజాదుల నొనర్చుచుండ వలసినదని చెప్పి నట్లాతనికి దోచెను. తాను ఆ బ్రాహ్మణుడు చెప్పిన ప్రకారము చేయ నిశ్చయించుకొనెను గాని, ద్రవ్యము లేనందున యెట్లు నెర వేర్చుదునా యని చింతించుచుండెను.

ఆ కాలములో గోల్కొండను పరిపాలించు నవాబు వద్ద అక్కన్న మాదన్న లనువారలు మంత్రి సేనాపతులుగా నుండిరి. వా రుభయులు గోపన్నకు మేనమామలై యుండిరి. నవాబు గూడా మత భేదములను పాటింపక సమాన గౌరవములతో కన్న బిడ్డలవలె ప్రజలను పాలించు చుండెను. మంత్రియైన మాదన్న తన కుమారుడు మల్లయ్య వివాహమునకు రావలసినదిగా గోపన్నకు ఆహ్వానమును బంపిరి. మేనమామలను సందర్శించ వలెననెడి కుతూహలముతో గోపన్న కుటుంబసహితుడై గోల్కొండకు జేరుకొనెను. అక్కన్న మాదన్న లిద్వురు చాలాకాలమునకు మేనల్లుని గాంచినందులకు మిగుల సంతసించిరి. మేనమామల కోరికపై గోపన్న కొంతకాలము గోల్కొండలో నుండెను.

గోపన్న భార్య తన కుటుంబ పరిస్థితులు వివరముగా అక్కన్న మాదన్నలకు దెలిపెను. వారు గోపన్న మంచిప్రవర్తనను అతని పరిస్థితులు గ్రహించి, భద్రాచలం తాలూకా తహశ్శిల్‌దారునిగా ఏర్పాటు జేసిరి. తరువాత తన స్వగ్రామమైన నేలకొండపల్లెకు బోయెను. తను నిత్యము శ్రీరాముని దర్శించి సేవించవచ్చును గదా! బ్రాహ్మణుడు కలలో తనకు చెప్పిన విషయమును సాఫల్యమును జేయు సమయ మేతెంచినదని లోలోన మహదానందమంది నవాబు

గారు బంపిన హుకుమును చేకొని భద్రాద్రికిం జని తహశ్శీల్‌దారు కడనుండి చార్జి అప్పగించు కొనెను. ఉద్యోగములో చేరిన నాటి సాయంకాలమే స్వామిని దర్శించుకొని కృతకృత్యు డాయెను. తన ఉద్యోగధర్మమును కడు జాగ్రత్తగా నిర్వహించు కొనుచు వసూ లొనర్చిన శిస్తును ఎప్పటికప్పుడు గోల్కొండ ట్రెజరీకి బంపివేయు చుండెను. శిస్తు వసూలు చేయుటలో నాతడు కఠినముగా లేక, తన సహజ మధురవాక్కులతో త్వరితముగా వసూలు గావించు చుండెను. తన ఉద్యోగధర్మమును సక్రమముగా నిర్వర్తించుకొనుచునే భక్తు లతో భజనలు చేయుచూ తన రాష్ట్రము నందంతట భజన సమాజ ములు నెలకొల్పి ప్రతివారిని భక్తిమార్గములో నుంచెను. తను భద్రాద్రి రామాలయ నిర్మాణ కార్యక్రమము చేయ సంకల్పించి, ప్రజలందరిని పిలిచి గొప్పసభ నేర్పాటు జేసెను. ఆ సభలో రామునకు ఆలయ ప్రాకార గోపుర మంటపాది నిర్మాణమునకు ఎవరికి దోచిన రీతిని వారిని సహాయము చేయవలసినదిగా కోరెను. ద్రవ్య రూపమున, వస్తుపూర్వకముగ ఎవరికి దోచిన సహాయము వారు చేయుటకు వాగ్దానములు చేసిరి. శక్తిలేనివారు పనిపాట లొనర్చి, సాయము చేయుటకు సిద్ధపడిరి. మొత్తముమీద గోపన్న తాను చేయ సంకల్పించిన భగవత్కార్యము పూర్తిచేసెను. ఆలయ, ప్రాకార, గోపుర, మంటపాది పనులు పూర్తి అయినను, సంప్రోక్షణాది కార్య క్రమములు నెరవేర్చుటకు తనవద్ద ద్రవ్యములేక, మిక్కిలి చింతించి ఖజానాయందలి సర్కారు ద్రవ్యముచేత వలయు వస్తుసామగ్రితెప్పించి ఒక శుభదినంబున సంప్రోక్షణము అతివైభవముగా పూర్తిగావించెను.

దేవాలయనిర్మాణము మొదలగు ముఖ్యకార్యములకు ఖజానా లోని ధనమంతయు ఖర్చుజేసెనేగాని, దానిని మరల ప్రభుత్వమునకు చెల్లించవలయుననే ఉద్దేశ్యముతో ఎన్నో విధములుగ ప్రయత్నించినను పరిస్థితులు అనుకూలించనందున మిక్కిలి చింతించెను. రామదాసు

ఖజానాలోని డబ్బంతయు దైవకార్యమున కుపయోగించెనని తానీషా కొంతమంది వలన తెలిసికొని ఖజానాలోని డబ్బంతయు తక్షణమే పంపమని తాఖీ దిచ్చి పైకమును తెచ్చుటకై నల్వురు సైనికులను బంపెను. రామదాసు పైక మివ్వకున్న వెంటనే బంధించి తీసుకొని రావలసినదిగా కూడా నాజ్ఞాపించెను. వారు నవాబుఆజ్ఞను గోపన్నకు చూపించిరి. గోపన్న తాను జేసిన పనిని వినయముగా భటుల కెరిం గించి, కొద్దిరోజులలో చెల్లించెదనని చెప్పినను వారు వినక గోపన్నను బంధించి తీసుకొని పోయిరి. రామనామమును జపించుచునే భటుల వెంబడి గోపన్న గోల్కొండకు బోయెను.

గోపన్న తానీషాతో ఖజానాలోని డబ్బంతయు దైవకార్యమున కుపయోగించితినని వినయపూర్వకముగా చెప్పెను. దయార్ద్రహృద యుడైన తానీషా విని క్షమించి మిన్నకుండినను, కొంతమంది చెప్పుడు మాటలు విని చివరకు గోపన్నను బందిఖానాలో బంధించి వైచెను. నిత్యమూ పైకము తెమ్మని రాజభటులు చెఱసాలలో గోప న్నను నానా బాధలు పెట్టుచుండిరి. ఎన్ని బాధలు పెట్టినను అన్నిం టిని గోపన్న ఓర్చుకొని రామతారక మంత్రమే జపించు చుండెను. అక్కన్న, మాదన్న లిర్వురు గోపన్న విషయము తెలిసియు, ధనాపేక్ష గల తానీషా మనస్సు మార్చలేక, ద్రవ్యము సమకూర్చుట తమవల్ల గాక నూరకుండిరి. అన్ని బాధలు సహించుచూ, రామనామ స్మరణ చేయుచున్న గోపన్నను చీకటిగదియందు బంధించి ఆహారము ఇవ్వ కూడదని యాజాపించెను. ఆ ఏకాంత ప్రవాస శిక్ష గోపన్నకు దైవప్రార్థన చేయుటకు మరింతగ నవకాశము కలిగించెను.

ఒక రాత్రి సమయమున విలువగల దుస్తులు ధరించి ఇరువురు సుందరాకారులు తానీషావద్దకు వచ్చి నిద్రలేపి, గోపన్నగారు మీకు ఇవ్వవలసిన ధనమును మాచేత పంపినారు. మేము గోపన్న మను జులము. నీ ధనము గైకొని యాతనిని కారాగారవిముక్తునిం గావిం

ప్రమని చెప్పి బంగారునాణెము లిచ్చి రసీదు నిమ్మని కోరగా వెంటనే తానీషా యిచ్చెను. తానీషాకు వారిని సేవించి, గౌరవించవలెనని కోరిక కలిగినను వారు ఎక్కువకాలము నిలువక పోయిరి. వారు ఎటు పోయినది తానీషాకు తెలియలేదు. మరుసటిరోజు తానీషా ఏకాంతమున రాముని భజించుచూ కాలము గడుపుచున్న రామ దాసుని చెఱనుండి విముక్తుని చేయించి, తన దర్బారుకు పిలుపించు కొని సమస్త పరివారము ముందు రామదాసుకు ప్రదక్షిణము చేసి, నమస్కరించి తనుచేసిన అపరాధమునకు మన్నింపుమని ప్రార్థించెను.

అప్పుడు రామదాసు, ఎవరి పురాకృత కర్మఫలము వా రను భవించక తప్పదని చెప్పి, మీకు దర్శనమిచ్చిన వారు రామలక్ష్మణు లేయని చెప్పెను. ఎంత పూజించియు, భజించియు, చూడజాలని ఆ పరాత్పరుని మీ రప్రయత్నముగా దర్శనము గావించు కొంటిరి. మీ పూర్వజన్మ ఫలమువలననే మీరు ధన్యులు కాగలిగితిరని విన యముగా చెప్పెను. తరువాత నవాబు రామదాసును తన ఖజానాకు గొనిపోయి సమస్త మర్యాద లొనర్చి, మరుదినంబున తానీషా బాగుగ నలంకరింపబడిన పల్లకియందు రామదాసునుంచి సకల పరివారముతో వైభవంబున గోల్కొండ నుండి భద్రాద్రికి పంపిరి.

ఈ విషయము ముందుగా తెలిసి రామదాసు భార్య, పుత్రుడు, పౌరులు నెదురుగా బోయి, రామదాసునకు స్వాగత మొసంగి గౌర వించిరి. భద్రాద్రిలో తానీషా గొప్పసభ ఏర్పాటుచేసి జరిగిన చరిత్ర నంతయు విపులముగా చెప్పెను. తానీషా కొన్ని దినములు భద్రా ద్రియందు నివసించి, భద్రాచలము తాలూకా యంతయు స్వామి వారికి జాగీరుగా నొసంగి, నా జాగీరునందు వచ్చు ఆదాయమంతయు స్వామివారి కల్యాణోత్సవాదులకై వినియోగించు నటుల ఏర్పాటు చేసెను.

కొంతకాలము గడచిన తరువాత, రామాలయంబున రామ కీర్తన గావించుచుండు సమయమున అర్చకుల భక్తుల సమక్షములో నొక దివ్యతేజస్సు బయల్వెడలి రామదాసు నందైక్యము గావించు కొని యదృశ్యమాయెను. ఈ దృశ్యమునకు అక్కడున్న వారందరు అత్యంతాశ్చర్యపడి మిక్కిలి సంతసించిరి.

ఆంధ్ర దేశములోనే గాక అనేక ప్రాంతములలో నేటికిని వీరు రచించి గానము చేసిన భక్తిరసవత్తరమైన కీర్తనలు బహుళ ప్రచార ములో నుండి సమస్త ప్రజలచే గానము గావింపబడు చుండెను. రామదాసు పేర నాటకములు ప్రదర్శించుచు, హరికథలు చెప్పుచూ, భజన సమయములందు వారి కీర్తనలు పాడుచుండుట చాలా గొప్ప విషయము. వీరిచే వ్రాయబడిన "దాశరథీ శతకము" లోని పద్య ములు, సాహిత్యమునందే గాక, భక్తిపారవశ్యముతో గూడి, కీర్తింప బడుట గమనార్హము.

## 4. భక్త త్యాగరాజు

వీరి పూర్వులు కర్నూలు జిల్లాలోని కాకర్లయను గ్రామము నుండి, తంజావూరు జిల్లాలోని తిరువారూరుకు వలస వచ్చిరి. త్యాగ రాజు తాతగారైన గిరిరాజు బ్రహ్మముగారు గొప్పసంగీతవిద్వాంసులు. వీరు భారద్వాజసగోత్రులు, ములికినాటి బ్రాహ్మణులు. ఈయన వేదాంతకీర్తనలకు మెచ్చి తంజావూరి పరిపాలకుడు షాజీరావు సన్మాన ముజేసి ఆదరించెను. గిరిరాజు బ్రహ్మముగారి అయిదవ కుమారుడే త్యాగరాజు తండ్రి రామబ్రహ్మముగార్లు. ఈయన భార్యపేరు శాంతా దేవి. వీరు గొప్ప దైవభక్తి గలవారు. ఈ దంపతులకు — 1. పంచనద బ్రహ్మము, 2. రామనాథబ్రహ్మము, 3. త్యాగబ్రహ్మము అని ముగ్గురు కుమారులు గలిగిరి. వీరిలో పెద్దవాడైన పంచనదబ్రహ్మము ముక్కోపి, అసూయాపరుడు. తండ్రి ఎన్ని ప్రయత్నములు జేసినను

చదువులో శ్రద్ధ చూపకుండెను. రెండవవాడైన రామనాథ బ్రహ్మమును గూర్చి, అంతగా తెలియదు. మూడవవాడైన త్యాగబ్రహ్మమే మన కథానాయకుడైన భక్త త్యాగరాజు.

త్యాగరాజు బాల్యమున తిరువారూరి వీధిబడిలో చదివెను. కుటుంబ పోషణకు, వలయు సౌకర్యములుండుట వలన వీరి కాపురము "తిరువయ్యారుకు" మార్చినందున త్యాగరాజు తంజావూరు రాజులు నెలకొల్పిన పాఠశాలలో చేరి చదువునం దుత్తీర్ణుడయ్యెను. ఇక్కడనే త్యాగరాజు సంస్కృతికి చాలా అనుకూల మేర్పడెను. తిరువయ్యారు నకు "పంచనదక్షేత్ర" మను పేరు గూడా కలదు. తిరువయ్యారు కావేరి, కొల్లడము, కుడుమురుట్టి, వెణ్ణారు, వెట్టారు అను పంచ నదులు కలిసినట్టి పుణ్యభూమి. అప్పర్, సుందర్, సంబంధర్‌ల తేవారములు, పురాణేతిహాసములలో కీర్తింపబడి తిరువయ్యారు గొప్ప క్షేత్రముగా పేరు గాంచెను.

రామబ్రహ్మముగారు త్యాగరాజును తిరువయ్యారు సంస్కృత పాఠశాలలో ప్రవేశపెట్టెను. ఆ పాఠశాలలో నాలుగు సంవత్సరముల కాలము త్యాగరాజు వేదవేదాంగములు, రామాయణ భాగవతాది పురాణములు పఠించెను. రామాయణ మాతనికి ముఖ్యమాయెను. త్యాగరాజు తల్లి శాంతాదేవి ఆతనికి భద్రాచల రామదాసు కీర్తనలు, అష్టపదులు నేర్పి, పాడించి ఆతని కంఠమాధుర్యమునకు మెచ్చుకొని నీవు గొప్పగాయకుడ వయ్యెదవని దీవించెను. తండ్రి రామబ్రహ్మము గ్రామములోనికి బోయినపుడు, శ్రీరామ విగ్రహమునకు పూజలు చేయునప్పుడు త్యాగరాజు గొంతెత్తి గానము చేయుచుండెడివాడు. క్రమక్రమముగా త్యాగరాజు గానమాధుర్యమునకు తండ్రి గూడా ఆశ్చర్యపడి మిక్కిలి సంతసించుచుండెడివాడు. ఒకొక్కప్పుడు త్యాగరాజు ఆశువుగా వ్రాసిన కీర్తనలను తండ్రి విద్వాంసులకు చూపగా, వారు ఆ కీర్తనలోని, అర్థము,భావము సంస్కృతికి మెచ్చు

కొనుచుండిరి. కుమారుని గొప్పతనము తండ్రి పూర్తిగా గ్రహించి తంజావూరు గాయకశిఖామణి, సంగీతకళానిధి బిరుదాంకితులైన శొంఠి వెంకటరమణయ్యగారి వద్దకు తీసుకొనిపోయి, వీడు మీ కుమారుని వంటివాడు, వీనికి సంగీతము నేర్పి, ప్రతిభావంతునిగా జేయు భారము మీదే యని అప్పగించెను.

గురువుగారి మాతామహుడు వీణ కాళహస్తయ్యగారు సేకరించిన సంగీతగ్రంథములు నామూలముగా పఠించుట, కృష్ణానందులు తన కుపదేశించిన శ్రీరామషడక్షరీ మంత్రమును రోజుకు ఇరువదిఐదు వేలసార్లు జపించుట, తాను నేర్చి రచించిన కీర్తనలు గురువుగారిచే దిద్దించుకొనుట, గురువుగారి సంగీతము వినుట మొదలగునవి త్యాగరాజు దినచర్యలు. త్యాగరాజునకు గల అనేక సందేహములు సంగీత విద్వాంసులు గాని, మరెవ్వరుగాని తీర్చలేకపోయిరి. కృష్ణానందుల వారు మాత్రము "నారద" మంత్ర ముపదేశించి, ఆ మంత్ర ముపాసించిన సకలసందేహములు తీరునని చెప్పెను. అటులనే ఆ మంత్రము పఠించి నారదుని అర్చించగా "స్వరార్ణవ" మనే ఉద్గ్రంథము లభించెను. గురువుగారు త్యాగరాజుయొక్క గొప్పతనమునకు మెచ్చి, నీవు ఇంటియందు శ్రీరామనామార్చన చేసి తరింపుని సెలవిచ్చెను.

త్యాగయ్యగారి తండ్రి రామబ్రహ్మం గారు ముగ్గురు కుమారులకును వివాహములు జేసిరి. త్యాగరాజు మొదటిభార్య పార్వతి. వివాహమైన ఐదు సంవత్సరములకే ఆమె పరమపదించెను. ఆమె ఇష్టప్రకారము త్యాగరాజు ఆమెచెల్లెలు కమలాంబను వివాహము జేసుకొనెను. ఈమె భర్త చిత్తమెరిగి నడుచుకొనే ఉత్తమురాలు. ఈమెకు ఒక కుమార్తె జనించెను. ఆమె పేరు సీతాలక్ష్మి. ఆమెకు యుక్త వయస్సు రాగానే కుప్పుస్వామయ్య అను వారికిచ్చి వివాహము జేసెను. సీతాలక్ష్మికి త్యాగరాజు అనే కుమారుడు కలిగెను. ఈ త్యాగరాజు గూడా ఫిడేలు వాద్యమునందు నిపుణుడై గురువమ్మాళ్ అను

నామెను వివాహమాడెను. కాని, ముప్పది సంవత్సరముల వయస్సు నాటికే ఇతడు వ్యాధిగ్రస్తుడై మరణించెను.

త్యాగరాజు తన ముప్పది ఎనిమిది సంవత్సరముల వయస్సు నాటికి రామతారకజపము 96 కోట్లు జపించెను. ఆఖరు దినమున తన ఇంటితలుపును ఎవరో తట్టినట్లయ్యెను. ఆయన తలుపులు తీయగా శ్రీరాముడు, లక్ష్మణునితో కలిసి విశ్వామిత్ర యాగ సంరక్షణార్థము పోవు వేషముతో క్షణకాలము ప్రత్యక్షమై అంతర్ధానమయ్యెనట. ఆ సుందరదృశ్యము వెంటనే అదృశ్య మైనందులకు చింతించి "ఏల నీ దయరాదు" అనే కీర్తన పాడినారట! తమ్ముని రామపిచ్చికి అన్నగారిష్టపడక, తుదకు వేరుగానుండి నీ యిష్టమువచ్చినట్లు పాడుకొనుము అని త్యాగరాజును వేర్పాటు చేసెను. అప్పుడు త్యాగరాజు ఆస్తిలో మిగత భాగము కోరక, తన తండ్రిగారు యిచ్చిన రామ పంచాయతనమును మాత్రమే తన భాగముగా తీసుకొని "సీతా, లక్ష్మణ, భరత, శత్రుఘ్న, హనుమత్సమేత శ్రీరామ పంచాయతనమునే" అనురణాంతము అర్చించెను. త్యాగరాజు సగుణోపాసననే జేసెను.

త్యాగయ్య తెల్లవారక మునుపే లేచి, మేలుకొలుపులు పాడి, కావేరీ నదిలో స్నానము జేసి, శ్రీరాముని పూలతో పూజలు జేసి, భక్తితో కీర్తనలు పాడి, 12 గంటల నివేదన తరువాత భుజించి, విశ్రాంతి తీసుకొని, మధ్యాహ్నము శిష్యులకు సంగీత పాఠములు చెప్పు చుండెడి వాడు. ఏకాదశినాడు ఉపవాసము జేసి, ద్వాదశినాడు తులసీతీర్థము గ్రహించిన పిమ్మటనే పారణము జేసెడివాడు. బిక్షాటనము జేసి, దానితో లభించిన సామగ్రితోనే కుటుంబపోషణము, అతిథిపూజ, శిష్యులకు భోజనము జరుపుచుండెడి వాడు. ఆయన పాడిన కీర్తనలలో రామదాసువలె దాస్యభక్తియే ప్రతిబింబించునుగాని క్షేత్రయ్యవలె మధురభావము కనపడదు. భక్తిశూన్యమైన సంగీతమునకు ఇష్టపడెడు వాడు గాడు. ఈయన రామదాసు, పురందరదాసు,

జయదేవునివంటి మహానుభావుల కీర్తనలను గూడా తన్మయత్వముతో పాడెడి వారు. వీరు తన్మయత్వముతో పాడునప్పుడు శిష్యులు వెంటనే తాటాకుల మీాద గంటములతో వ్రాసెడివారు.

తంజావూరును పాలించు తుళజాజి - శరభోజి మహారాజు లిరువురు గొప్ప కళాపోషకులు. వీరు పెక్కుమంది కళాకారులను పోషించుచుండెడి వారు. శరభోజిమహారాజ ఆస్థానములో కొన్ని వందలకు మించిన సంగీతవిద్వాంసు లుండెడి వారట. ఈ గాయకు లందరికి శొంఠి వెంకటసుబ్బయ్యగారు నాయకమణి. వీరు శ్రీకృష్ణ లీలాతరంగములు రచించిన నారాయణతీర్థుల శిష్యపరంపరలోనివారు. ఈయన కుమారుడే తిరువయ్యారులో నివసించుచుండిన వేంకట రమణయ్యగారు. ఒకనాడు త్యాగరాజు ఆనంద పారవశ్యములో మైమరచి యుండు సమయమున నీ వొక్కకీర్తన పాడుమని అడుగగా "దొరకునా ఇటువంటి సేవ" అని పాడగనే "దొరకునా ఇటువంటి శిష్యుడు" అని గురువుగారు పాడిరట. వేంకటరమణయ్యగారు తన తండ్రిగారికి త్యాగయ్య పాట వినిపించ వలెనని, తంజావూరుకు పిలుచుకొని పోయెను. వేంకటసుబ్బయ్యగారు పాడవలసినదిగా ఆనతీయగనే త్యాగరాజు జగన్మోహనముగా పాడెను. శరభోజి మహారాజు వీరి గానకళాపాండిత్యమును, గానకౌశలము తన ఆస్థాన పండితులద్వారా తెలుసుకొని తన ఆస్థానమునకు బిలువ నంపెను. కాని వచ్చిన వారితో త్యాగరాజు నేను నరహరిని గురించి పాడుదును గాని నరులను గురించి పాడననియు, ఎంత ధనమిచ్చినను నాకు వలదనియు "నిధి చాలా సుఖమా! రాముని సన్నిధి సేవ సుఖమా! నిజముగ బలుకు మనసా!" అన్న కీర్తన బాడి వచ్చిన వారిని బంపెను. శరభోజి కుతంత్రములు పన్ని యెవ్విధముగనైన త్యాగ రాజును లొంగదీసుకొని రావలయునని ప్రయత్నించెను గాని, భాగవతాపచారము వల్ల తనకు శూలనొప్పి వచ్చెను. చివరకు తన

తప్పును తెలుసుకొని త్యాగరాజుకు సాష్టాంగపడునంత వరకు ఆ నొప్పి తగ్గలేదు. రాజు ప్రచ్ఛన్నుడై ఎన్నియో మారులు త్యాగరాజు గానము విని ఎంతయో సంతసించెను.

ధన కనకములకు నాస పడక ఉంఛవృత్తి వల్లనే జీవితము గడిపిన మహానుభావుడు. ఇతరులను చులకన సేయని పరమ సౌమ్యుడు త్యాగరాజు. తిరువాన్కూరు సంస్థానములోని "గోవింద మారార్" అను గొప్ప రామభక్తుడు, గొప్ప సంగీత విద్వాంసుడు. ఆయన త్యాగరాజు కీర్తి ప్రతిష్ఠలు, భక్తితత్త్వము విని చూచుటకై తిరువయ్యారునకు వచ్చెను. త్యాగరాజు ధ్యానసమాధి నుండి కన్నులు తెరచి, వారిని చూచి, వారి విషయమై తెలుసుకొని చాల సంతోషించెను. తరువాత త్యాగయ్యగారి కోరికపై గోవిందమారార్ కొన్ని గంటల వరకు గొప్పగ పాడెను. అప్పుడు త్యాగయ్య వారికిగల సంగీతపాండిత్యమునకు మెచ్చి "ఎందరో మహానుభావులు అందరికి నా వందనములు" అని పాడిరట.

త్యాగరాజు వయస్సు అప్పటికి 79 సంవత్సరములు. త్యాగరాజు మహారాజు కృపను గూడా తృణీకరించి. రామ విగ్రహ పూజలోనే కాలము గడుపుట అన్నగారు సహింపక రామ విగ్రహములను కావేరిలో పడవైచెను. తరువాత త్యాగరాజు, "హరి! నే నెందు వెదకుదురా" అనుచు మిక్కిలి దుఃఖముతో నుండగ శ్రీరాముడు తనకు కలలో చెప్పిన రీతిగ కావేరిలో వాటిని పట్టుకొని "రార మాయింటి దాకా" అని పాడి తీసుకొని వెళ్లెనట.

ఇప్పటికిని తంజావూరులో ఆ విగ్రహములు గలవు. తరువాత త్యాగరాజు తీర్థయాత్రలకై బయలుదేరి పెక్కు క్షేత్రములు దర్శించి స్వాములను సేవించి పెక్కుమంది సంగీత విద్వాంసుల ఆదరణమునకు పాత్రుడయ్యెను. వారు చివరకు తిరువయ్యారుకు చేరిరి.

ఈయన ఎక్కువగా సంపాదించు కొనివచ్చెనని బంధువు లీయన చుట్టూ చేరిరి. బంధువు లందరికి త్యాగయ్య ప్రసాదములు యిచ్చి, "శ్రీరామ కృపయే సిరుల కన్నిటికి సిరి" అని సెలవిచ్చిరి. 1845లో ఆయన ధర్మపత్ని కమలాంబ మరణించెను. తరువాత త్యాగరాజు సన్యసించి, తన మరణము నాలుగురోజులలో సమీపించె నని శిష్యులకు చెప్పి భగవంతునిలో నైక్య మాయెను.

వీరు తెనుగులో రచించి పాడినకీర్తనలు నేటికిని ఎంతో ప్రాశస్త్యము వహించినవి. భాషా భేదములు లేక సమస్త ప్రాంతముల వారు ఈ కీర్తనలు నేర్చుకొని త్యాగరాజును ఆరాధ్య దైవముగా భావించి సేవించు చున్నారు.

## 5. భక్త తులసీదాసు :

అక్బరుచక్రవర్తి భారతదేశమును ఉత్తర ప్రాంతముల పాలించు కాలమున హస్తినాపురమున ఆత్మారాము డను బ్రాహ్మణుడు ఉండెను. ఆ బ్రాహ్మణుని భార్యపేరు "హుల్సీదేవి". సరయూపారణ బ్రాహ్మణ శాఖ యనియు, కన్యాకుబ్జ బ్రాహ్మణశాఖ యనియు చెప్పుదురు. షుమారు 1532 లో ఆ దంపతుల కొక బాలుడుదయించెను. అతడు దుష్టగ్రహ వీక్షణ జాతకుడై జన్మించె నను కారణమున నాతనిని అరణ్యమున విసర్జించిరి. అరణ్యములలో పర్యటించు చున్న "నరహరిదాసు"అను సాధుపుంగవునకు ఆ బాలుడు లభించెను. ఆ సాధువు బాలుని ప్రేమాతిశయముతో పెంచి పెద్దవానినిగా జేసి తులసీదాసని నామమిడి తారక మంత్రోపదేశము జేసి బాల్యముననే అతనిని ఆధ్యాత్మికభావనమున ప్రవేశ పెట్టెను.

కొంతకాలమునకు, వివాహ వాంఛ గలిగి, "రత్నావళి" అను నామెను వివాహమాడెను. ప్రథమమున మాతాదేవిని వివాహము జేసుకొనగా అతడు విరాగియై యున్నందున చింతించి ఆమె గంగా

ప్రవాహమున ఆత్మహత్య జేసుకొన్నట్లు కొంతమంది చెప్పుచున్నారు. తులసీదాసు-రత్నావళి అన్యోన్యప్రేమ గలిగి, ఒక్క క్షణమైనను భార్యను వీడ లేకుండెను. అధికమగు మమకార, వ్యామోహములతో నుండెను. తులసీదాసు గృహమున లేని సమయమున, రత్నావళి జననీజనకులు ఆమెను సమ్మతింపజేసి పుట్టినింటికి దీసుకొని పోయిరి.

తులసీదాసు గృహమున కేతెంచు సమయమున, రత్నావళి లేకుండుట గాంచి, ఒంటరిగా నుండలేక ఆమెను త్వరగా కలియ వలెనన్న వాంఛతో, రాత్రికాలమైనను ఘోరవర్షములో గూడా, నదులు, గట్టులను గమనించక కామాతురుడై ఎట్టకేలకు భార్యను చేరెను. ఈ పరిస్థితులలో, రత్నావళి భర్త అజ్ఞానమునకు చింతించి విరక్తి వచనములు బోధించి, తన మీాద ఉంచిన మనస్సును, శ్రీరామ చంద్రునిపై నుంచమని హితోపదేశము చేయగా అదియే అతనికి మహో పదేశమై, హృదయ పరివర్తన గలిగి శ్రీరామచంద్ర ప్రభువు యొక్క సాక్షాత్కారమునకు దృష్టి మరల్చెను. తనముందున్న భార్యను అపర దేవతవలె గ్రహించి, తనను తరింపజేయ వచ్చిన గురువరేణ్యునిగా భావించి రత్నావళికి సాష్టాంగ దండప్రణామము లాచరించి, సన్యాసి అయి రామేశ్వరము వరకు యాత్ర గావించి కాశీనగరమున తపోనిష్ఠ యందుండెను. తన 42వ ఏట రామాయణ కథారచనము గావింప వలెనని వాంఛ గలిగి ప్రజాసమూహమునకు అర్థమగు హిందీభాషలో పద్యరూపముగ నారంభించెను. నృత్యగానముల కనుకూలముగ నతడు రామాయణము నిర్మించుటచే దానిని పఠించ వలయునని ఆసక్తి గలిగి దేశదేశములలో ప్రచారము గాబడి, నిత్యపారాయణ శాస్త్రమై ఉపనిషత్, గీతాశాస్త్రములకుగూడా మించినదగుటచే తులసీ దాసు కీర్తి దిగంతములకు వ్యాపించెను.

అక్బరు చక్రవర్తి, మంత్రులు రాజా తోడరమల్, మాన్‌సింగ్ తులసీదాసుకు శిష్యులైరి. అక్బరు చక్రవర్తిగూడా, వీరిని ఆహ్వానించి

సత్కరించెను. కృష్ణభక్తి గలిగిన మీరాబాయి గూడా, తులసీదాసు సలహాప్రకారం సంఘమును, గృహమును వీడి విరాగిణియై బృందా వనమును జేరిన మహావ్యక్తిగా పరిగణింపబడెను. తులసీదాసు గ్రంథములో 'వైష్ణవసంప్రదాయ భావములు' పెక్కుండుటవలన వారి గ్రంథములు పారాయణ పూజాస్థానము నలంకరించియుండెను. వీరు నిరాడంబరులై శిష్యవర్గమును జేర్చుకొనక మఠాదిసంస్థలు నెలకొల్పక ఏకాంతవాసము చేయుచు శ్రీరామచంద్ర పాదపద్మధ్యాన నిమగ్నులై అధికారవాంఛలేక వృద్ధాప్యము గలుగువరకు, అనగా 91 సంవత్సర ములు గడపి తన జీవితము చాలించిన మహాకవి, మహాభక్తుడు.

## 6. పరమహంస–స్వామి రామతీర్థ

పంజాబు రాష్ట్రములోగల గుజరను వాలా (గుజరన్వాలా) జిల్లాలో మురోలివాలాయను గ్రామమున సుమారు 1873న భక్తశిఖా మణియు హిందీ రామాయణామృతవృష్టిని గురిపించిన తులసీదాసు వంశమున స్వామిరామతీర్థ జన్మించెను. తల్లి గతించినంతనే తన అన్నయగు గోసైను గురుదాసు పోషణలో పెరిగి పెద్దవాడయ్యెను. చిన్నతనముననే రామాయణ, భాగవత, భారతగాథలను, అతిశ్రద్ధతో వినుచు తన ఇరువదవ ఏటనే ఎం. ఏ. పరీక్షయందు గణితశాస్త్ర పారంగతు డాయెను. ప్రిన్సిపాల్ "బెల్లుదొర" కలెక్టరుపరీక్ష చదువు మని ప్రోత్సహించినను, ఇష్టపడక గణితశాస్త్రమును, ఇతరులకు బోధించు చుండెను. 1899వ సంవత్సరమున నిత డరణ్యములకు తపస్సు జేసుకొనుటకు బోయి, మరుసటి సంవత్సరముననే ప్రపంచ బంధము లన్నింటిని తెంచుకొని సన్యసించెను.

ఇతనికి వివాహమెప్పుడైనది, ఎంతకాల మాతడు గృహస్థజీవిత మనుభవించెనో వివరము తెలియదు. మొత్తముమీద అతని భార్య ఎల్లప్పుడూ ఇతనికి సపర్యలు చేయుచు, శిష్యురాలై అతని ఆధ్యా త్మికాభివృద్ధి కెంతయో తోడ్పడి, తన ధర్మములు నెరవేర్చుచు, సన్యా

సినియై జీవితము సఫలముజేసికొనెను. 27 సంవత్సరముల వయస్సు ననే సన్యసించి అటుతర్వాత ఆరు సంవత్సరములు మాత్రమే జీవించి 1906వ సంవత్సరమున దేహము త్యజించెను.

పరమాత్మయే తా ననెడు భావ మెవరికి కలుగునో అట్టివానికే ప్రపంచమంతయు శరీరమువలె సేవ చేయునను సిద్ధాంతమున కతడు రాగలిగెను. మనుష్యులు చొరరాని ప్రదేశములం దతడు ఒంటరిగా నిశీథమంతయు సంచరించు చుండెడివాడు. మంచుకొండలు, విరిగి మీదపడుచుండ, కాలూనుటకు వీలులేని పర్వతశిఖరముల కత డవ లీలగా నెగబ్రాకి కైలాసము, బ్రహ్మకపాలము, మానస సరోవరము, మొదలగు స్థలములందు తిరుగు చుండెడివాడు.

ఇతడు వేదాంతులలో వేదాంతి. పండితులలో పండితుడు. కవులలో కవిసార్వభౌముడు. ఇతడు పరమపదించువరకు, రేయుం బవలు, విసుగు విరామము లేకుండా, ప్రాచ్య-పాశ్చాత్య వేదాంత ములను. సంపూర్ణముగ చదివెను. శంకర, కపిల, కణాద, గౌతమ, పతంజలి, జైమిని, వ్యాస, కృష్ణ, కెంటు, హెజెలు, గెటే, షిష్టి, స్పినోజా, కోమ్టి, స్పెన్సరు, డార్విన్, హెలెట్ టెండాలు, హాక్లే, జోర్డన్, జేమ్సుల వేదాంత గ్రంథముల నవగతము జేసుకొనెను. పర్షియన్, హిందీ, ఉరుదు, సంస్కృతభాష లితనికి కరతలామలక ములు. ఇతడు అమెరికాలో సంచారము చేసిన రెండు సంవత్సరము లలోను వందలకొలది ఉపన్యాసము లిచ్చి, అమెరికా సాహిత్యమును పూర్తి జేసెను.

ప్రెసిడెంటు రూజువెల్టు గూడా, వీరిని అభినందించడానికి స్వయముగా వచ్చెను. ఆదిశంకరులవలె వీరు, అతిస్వల్పవయస్సులో భౌతికకాయమును చాలించినను, దేశ విదేశపర్యటనలు జరిపి, అమూల్య, ఆధ్యాత్మిక, సందేశము లిచ్చి భారతీయ విజ్ఞానము వెద జల్లిన మహనీయమూర్తి, ధన్యజీవి.

# దేవాలయములు-తత్త్వవేత్తలు

## రెండవ భాగము

## 11. మతములు - మతభేదములు

మానవాభ్యుదయమునకు మానవ పరమావధికి మార్గము చూపుటకు మతము అత్యవసరము. మతము జీవునకు-దేవునకు మధ్య గల సంబంధ బాంధవ్యములను సూచించును. మత మనేది నిజానికి మనిషిలోని మానవతను ప్రేరేపించి మంచిమార్గమును చూపడానికి ఒక మార్గము. నలుగురూ చేరి హాయిగా ఆనందముగా సమైక్యంగా సహజీవనము గడిపేందుకు అదొకదారి. అనాదినుండియు భారత దేశములో భారతీయులు అనుసరించుచున్న మతమునకు సనాతన మని పేరు. ఈ మతము వేదములనుండి వెలువడినందున వేదమత మని చెప్పిరి. ఈ మతమునకు కర్త ఎవరో నేటికిని అంతుపట్టె విషయము గానందున ఈ పవిత్రమత సనాతనకర్త వేదకర్త యనియే నిర్ణయించిరి. వేదకర్త భగవంతుడే యగుటచే ఆ మతకర్త భగవంతు డనియే స్థిరము జేసికొనిరి.

లోకములో సమస్త మతములు పవిత్రములే, దివ్యములే. అన్ని మతగ్రంథములునూ ఒక్క విషయమే చెప్పినను, మార్గములు వేరు వేరుగా నిరూపించుటచే పలుమార్గములు ఏర్పడినవి. కాని ఇతర మతములకు దైవదూత లనబడే కర్తలు కనుపించు చున్నారు. ఏసు క్రీస్తు, బుద్ధుడు, మహమ్మద్ మొదలగువారు బోధించిన మతములు వారిపేర్లతో పిలువబడుచుండెను. ఎప్పుడో ఆరంభమైన మతము కాలక్రమేణ వివిధ సిద్ధాంతాలతో, అనేక విశ్వాసాలతో ప్రజలలో

ఆచరణస్థాయికి చేరినది. ఆటవికదశ నుండి క్రమ క్రమముగా నాగరికతను సంతరించుకొనిన మానవ సమాజము జీవన ధర్మమునకు ప్రతీకగా మారినది.

మానవునిలోని స్వార్థం దుశ్చింతన వివిధ విధానములలో నమ్మకాలు ఇవన్నీ గుమిగూడి నందున మానవులలో వేర్పాటుకు కారణ భూతమైనది. మార్గము లనేకము లున్నను గమ్యం ఒక్కటే యని మతప్రవక్త లందరు ముక్తకంఠంతో బోధించి ఇతర మతములను ద్వేషించ నవసరము లేదని చెప్పియుండిరి.

భారతదేశములో తత్త్వశాస్త్రం, అనాదినుండియు మంచి అభివృద్ధిలో నున్నట్లు స్పష్టముగా దెలియు చున్నది. బౌద్ధ జైనమతములు మంచివ్యాప్తిలోనికి రాక పూర్వమే క్రీ. పూ. నుండి ఉపనిషత్తులనేవి మన తత్త్వశాస్త్రమునకు మూలాధారములని చరిత్రకారులు దెలిపియుండిరి. పాశ్చాత్యదేశాలలో కన్న పూర్వమే చైనాదేశములోను, మన దేశములోను రకరకాల తాత్త్వికదృష్టులు, సిద్ధాంతములు ఆచరణలో నున్నవి. ఒకప్పుడు ఈజిప్టు, ఇరాక్ మొదలైన దేశములు తాత్త్వికంగా అభివృద్ధి చెంది నప్పటికిని ఒక్క పాశ్చాత్యదేశముల చరిత్రలేగాక ప్రాచ్యదేశతత్త్వశాస్త్ర చరిత్రలను అమలులోనికి తీసుకొన్నప్పుడే అది సంపూర్ణ తత్త్వశాస్త్రం అవుతుంది. మానవునికి ఈ ప్రపంచం అంతా ఒక్కటే అనే సంపూర్ణ దృష్టి ఏర్పడడానికి తోడ్పడును. భారతీయ విజ్ఞానధనులు తెలిపిన కొన్ని భావములు పురాతన గ్రీసుదేశము నందు బెంపొందిన కొన్ని సిద్ధాంతములకు పోలికలు గలవు.

సర్ విలియం జోన్సు వ్రాసిన విధముగ—

1. న్యాయ సిద్ధాంతము = పెరిపాటెటిక్ సిద్ధాంతమును బోలును.
2. వైశేషిక సిద్ధాంతము = అయోనిక్ సిద్ధాంతము.
3. రెండుమీమాంస సిద్ధాంతములలో రెండవదగు గౌతమ సిద్ధాంతము = అరిస్టోటల్ తత్త్వమునకు సరిపోవును.

4. కణాదుని సిద్ధాంతము = థేల్సు సిద్ధాంతమును బోలును.
5. జైమిని సిద్ధాంతము = సోక్రెటిస్ సిద్ధాంతము ”
6. వ్యాసుని సిద్ధాంతము = ప్లేటో సిద్ధాంతము ”
7. కపిలుడు = పైథాగరస్ సిద్ధాంతము ”
8. పతంజలి = జినోలు సిద్ధాంతము ”

మతమనగా మానవుడు సక్రమముగా ఆలోచించి మంచి మార్గమును ప్రబోధించెడి అభిప్రాయమే. మతము నొక్కొక్క కాలములో నొక్కొక్క మహానుభావుడు జన్మించి ప్రజలను సన్మార్గవర్తులుగా జేసి మంచిగా ప్రవర్తించుటకు ఆ యా కాలపరిస్థితులను బట్టి ప్రబోధనలు చేసి వారు చేయవలసిన ముఖ్యమైన పనులు నిర్వర్తించి గతించిరి. ఆ యా కాలములలో వారు భగవత్సేవ - మతసేవలేగాక - మానవ సేవకూడా పరమకర్తవ్యమని భావించి మానవులు పురోగమించుటకు తమ జీవితమంతయు కృషిజేసి ధన్యులైరి.

ఆకాశమునుండి వర్షము పడునప్పుడు స్వచ్ఛమై నిర్మలమైన జలము భూమిమీద పడును. కాని ఆ నీరు సముద్రములోను, నదులలోను, భూమి మీదను, తదితరప్రాంతములలో పడునప్పుడు అక్కడ గల పరిస్థితులను బట్టి ఆ యా రుచులు రంగులు మొదలగునవి కలుగుచుండును. అటులనే ప్రపంచమునగల మతసాపకులు మతాచార్యులు ఆ యా దేశకాల పరిస్థితి ప్రభావములను బట్టి ఆ యా ప్రజల మనోభావములు గ్రహించి సరియైన మార్గములో నుంచుటకు వారికి సరిపోవు పద్ధతులలో మంచిబోధనలు చేయుచుందురు. అంత మాత్రముచేత ఒకరికన్న మరియొకరు గొప్ప యనియు, ఇతర మతముల కన్న తన మతమే గొప్పదని భావించుట అజ్ఞానముతో గూడుకొన్న అహంకారము గలదై యుండును. ఈ భావముల వల్ల మేలుకన్న కీడే ఎక్కువ జరుగును.

ప్రపంచములో బహుకాలము నుండి నేటివరకు పలుప్రాంత ములలో పలువురు మతప్రవక్తలు జన్మించి వారు ప్రజలకు ఏ యే కాలములో ఏమి చేసినారో? ఏమని ప్రబోధించినారో? మొదలైన విషయములు తెలుసుకొనుట ప్రధానమైన విషయము. అనాది నుండియు భారతదేశములో వ్యాప్తమై ఆచరింపబడుచున్న వేద మతము ఎంతవరకు వ్యాపించి ప్రాముఖ్యము గల్గియున్నదో? ఈ భారతదేశము ఎంతవరకు వ్యాపించి యీ పేరుతో పిలువబడు చున్నదో? చరిత్రాంశములను బట్టి చూడ భారతదేశ వైశాల్యము బహుళముగా వ్యాపించి యున్నట్లు దెలియు చున్నది. ఆ కాలములో బౌద్ధశాస్త్రములు గ్రీకు భాషలో గాంధార ప్రజలు మాట్లాడే అరబిక్ భాషలో వ్రాసినట్లు చరిత్రల వలన దెలియు చున్నది.

పూర్వము నుండియు భారతదేశములో దైవ, మత, సమస్తాది విషయములకు వేదములలో తెలుపబడిన విషయములే ప్రమాణములై ముఖ్యములై, ఆచరణయోగ్యములై, అతిపవిత్రములై, అత్యంత శ్లాఘ నీయములై, ప్రపంచ విషయవిజ్ఞానము, ఆముష్మిక విషయ విజ్ఞాన మును బోధించునట్టివై యున్నవని హిందువుల ప్రగాఢ విశ్వాసము.

## వేదములు

"వేదయతీతి వేదః" తెలియజేయునది గాన వేదమని చెప్పబడి నది. "విదన్తి యతో ధర్మాధర్మావితి వేదః" అనగా దీని సహాయమువలన ధర్మాధర్మములు తెలియజేయబడును గాన వేదమని చెప్పిరి. "అనంతా వై వేదాః" వేదముల సంఖ్య అనంతమని చెప్పబడెను. వేదములు దైవదత్తములు, స్వయంప్రభవములు, స్వతః ప్రమాణములు, సర్వ ధర్మములకు మూలములు. యజ్ఞములు, దానములు, తపములు మొదలగు క్రియలకు ప్రతిపాదకములై, అనాదులు, అపౌరుషేయ ములై, నిత్యములై సమస్త ధర్మములను ప్రబోధించుచున్నవి. ప్రత్యక్ష

అనుమాన ప్రమాణములలో వేటిచేతగాని తెలియబడని మహత్తర విషయములను విశదపరచుచున్నవి. యజ్ఞస్వరూపుడగు పరమాత్మను గురించియు, శుభకరమైన కర్మలను గురించియు విశదముగా తెలియ పరచు చున్నవి. దైవదత్తములైనను, దివ్యజ్ఞానము కలిగిన ఋషి దత్తములైనను వేదములు జ్ఞానపుంజములు. వేదములలోని సర్వము గురు శిష్య పరంపరగా వచ్చినది. వేదచరిత్ర యెట్లున్నను హిందూ దేశమునకు వానిని దెచ్చినవారు ఆర్యులనెడి విషయము స్పష్టమని చరిత్రలు దెలుపుచున్నవి.

వేదములు లిపియందు గాక గురు శిష్య పరంపరగా ప్రచారము జరుపబడుచున్నవి. అనంతరూపములు, అనంతకల్యాణములు, అనంత విభూతులు గల శ్రీమన్నారాయణుని అనేక నామములతో గుర్తించు చున్నవి.

ద్వాపరయుగమున సత్యవతీ పరాశరుల పుత్రుడైన వ్యాసమహా ముని ఆ వేదముల నన్నిటిని చేర్చి నాలుగు వేదములుగా విభజించెను. 1. ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము 4. అథర్వణ వేదములే గాక ఆ వేదములను సంహిత-బ్రాహ్మణములు-ఆరణ్యకములుగా విడదీసెను. ఈ పనులన్నియు వ్యాసు డొక్కడే చేసినాడనియు, వ్యాసపీఠ మధిష్ఠించిన పలువురు చేసినారనియు అనేక విధములుగా చెప్పుచున్నారు.

వ్యాసుడు తన ముఖ్యశిష్యులైన 1. పైలఋషికి ఋగ్వేదము, 2. వైశంపాయనునకు యజుర్వేదము, 3. జైమినికి సామవేదము, 4. సుమంతునకు అథర్వణవేదము నుపదేశించెను. వీరు క్రమముగా తమ శిష్యులద్వారా అధ్యయనము చేయించి వేదశాస్త్రములను ఉన్నత స్థితికి గొనివచ్చుటకు కృషి చేసిరి.

## వేదవిభజన

1. ఋగ్వేదము: ఋక్ అనగా పరమాత్మను స్తుతించు మంత్రము. ఇది అతి పురాతనమై-ఇందు అగ్ని, ఇంద్రుడు, అశ్వనీ దేవతలను పేర్లతో స్తుతింపబడుచూ, మండలరూపములో నుండును.

2. యజుర్వేదము: యజుర్వేద మనగా యాగము, బలి, దానము, మొదలగునవి చేయునప్పుడు, పురోహితుడు చెప్పునట్టి మంత్రములు. ఈ వేదములో అమావాస్య, పౌర్ణమినాడు చేయవలసిన యాగములను, పితృకర్మలను చేయువిధానములు చెప్పబడినవి. పర మేశ్వరుడు ప్రజాపతి, నారాయణుడు, బృహస్పతి, ఇంద్రుడు, వరు ణుడు, అశ్వని, మొదలగు వారిని గురించి స్తోత్ర భాగములు గలవు. ఇందులో కృష్ణ యజుర్వేదము, శుక్లయజుర్వేద మని రెండు విధ ములుగా నున్నవి. ఇవి సంహిత, పరాయతం, బ్రాహ్మణములు, ఆరణ్యకములు అను విభాగములు గలిగి యుండును.

3. సామవేదము: సామవేదమనగా గానరూపమైన గీతములు గలది. ఇందు పరమేశ్వరుడు, అగ్ని, ఇంద్రుడు, మొదలగువారు స్తుతిం పబడి యున్నారు. ఈ సామవేదము భక్తి ప్రధానమై యున్నది. ఇది పర్వరూపములతో నుండును.

4. అథర్వణవేదము: శాంతిక పౌష్టిక-చరకాది మంత్ర తంత్ర, ప్రయోగ విధులు కలవు. ఇందు ముఖ్యముగ శత్రునాశనము మొదలగు విషయములు చెప్పబడియున్నవి. ఇవి కాండల రూపములో నుండును. పైన చెప్పబడిన నాలుగు వేదములయందలి ముఖ్యాంశము లను వివరించుటకు, ఉపనిషత్తులు (వేదాంతములు) మరియు వేదాం తములకు అంగములైన షట్శాస్త్రములు, వేదముల కనుబంధములగు ఉపవేదములు గలవు.

మహర్షులలో కొందరు సర్వమానవ శ్రేయోభిలాషులై కర్మకు సంబంధించిన వేదముల యందలి మంత్రములను వ్యాఖ్యలుగాను, కల్పసూత్రములుగాను రచించిరి. వేదోక్త కర్మల నాచరించి సార్థక జన్ములగుటకు కల్పసూత్రములను 18గ విభజించిరి. ప్రతివారు, తమ మతశాఖాధర్మముల కనుగుణముగ ఈ కల్పసూత్రములను వ్రాసి యుండిరి. కల్పసూత్రములు వేదమునందలి యజ్ఞ, యాగాది కర్మల నొనరించు విధానములు పరిపూర్ణముగా దెలుపుచున్నవి. మానవులు తమ జన్మ జన్మాంతర దోషములను నివారించుకొని జన్మరాహిత్య సిద్ధినిబొందుటకు వేదములలోని మంత్రములు ముఖ్యమని తెలుపబడి ఉన్నది. ఉపనిషత్తులు, కల్పసూత్రములు, స్మృతులు, పురాణేతిహాసము లన్నియు, ధర్మాధర్మవివరములను కార్యాకార్యవిచక్షతను నిరూపించి, వారి వారి స్వధర్మముల యందాసక్తి గలిగించి ఉత్తమజీవనములు జరుపుకొను విధానములను విశదీకరించుచున్నవి. వేదము శ్రీమన్నారాయణుని జ్ఞానరూపమనియు, వేదపురుషుడు గరుత్మంతుని రూపమనియు ఋష్యాదులు దెలిపియుండిరి.

## శ్రుతులు

"శ్రూయతే ఇతి శ్రుతిః" వినబడుట వలన అనగా భగవంతుని యందుండియే వినబడినందున శ్రుతి యనబడెను. మరియు శ్రోత్రేంద్రియములచే శబ్దరూపముగ దెలియబడుటను బట్టి "శ్రుతిః" అందురు.

వేదములను ఆదియందు భగవంతుడు బ్రహ్మ కుపదేశించెననియు, బ్రహ్మదేవుడు ఋషుల కుపదేశించెననియు, ఋషులు తమ శిష్యులకుపదేశింప గురుశిష్యపరంగా అభ్యసించుచుండిరి. ముఖ్యముగా విశ్వామిత్రుడు, భరద్వాజ, వసిష్ఠ, అగస్త్య, కశ్యప, అంగిరస, జమదగ్ని, పరాశర, గౌతమ, నారద, కణ్వ మొదలగు మహర్షులు కర్త

లని చెప్పుచున్నారు. ఈ వేదములన్నియు, ఏకకాలమునకు చెందిన వనియే ప్రాచీనుల విశ్వాసము. వేదకాలము నిర్ణయించు చర్య వ్యర్థ మని చెప్పవచ్చును. మహర్షులు, తాము ద్రష్టలమని చెప్పకొనిరి. వారు సమాధ్యవస్థలో చూచి వినిన వేదములని మన మంగీకరించిన యెడల, వారు చూడక, వినక పూర్వమెంత కాలమునుండి వేద ములు అశ్రుతములై యున్నవో నిర్ణయించుట కాధారములు లేవు. సృష్ట్యారంభమున తత్పూర్వమున వేదము లున్నవో లేవో నిర్ణయించు టకు వలయు, ఆనాటి గుర్తులను, పరీక్షించు శక్తి గల పరిశోధకు లెవ్వరును బుట్టియుండ లేదు. అందుచే మనువ్యాసాదులు, చెప్పిన రీతిగ వేదము లపౌరుషేయము లనియు, అనాద్యంతము లనియు, పాశ్చాత్యులు నమ్మలేకున్నను, మనము దృఢముగ విశ్వసించుట చాల ముఖ్యము.

## స్మృతి

స్మృతియనగా స్మరణ. చెవులతో విన్న అనుభవజ్ఞులు, ప్రక టించినదే స్మృతియన బడును. ఈ స్మృతులెన్నియో, మహర్ష్యాదుల ద్వారా ప్రకటింపబడి యున్నవి. వేదముల తరువాత స్మృతులు ప్రాముఖ్యమునకు వచ్చెను. స్మృతులు పవిత్రశక్తిసంపన్నులైన, అను భవజ్ఞులైన ఋషులచే రచింపబడియుండెను. వేదముల కున్నంతటి ప్రాముఖ్యము, ప్రామాణికత స్మృతులకు లేదనే చెప్పవచ్చును. ఇతర మతముల వారికి, వారి మహాపురుషులు తెలిపిన శాస్త్రములకు వలెనే భారతీయ స్మృతులు గూడా, మహాపురుషులచే చెప్పబడియుండెను. స్మృతులు కాలక్రమమున మారుచూ వచ్చినవి. స్మృతులు యుగపరి ణామములను బట్టి, ఆ యా యుగములకు ప్రామాణికములై యుండ వలెనని చెప్పియుండెను అనేక విధములైన క్రొత్త సందర్భములలో మానవులలో కలుగుచుండిన ఆచారముల మార్పువల్ల వాటిని దెలు

పుచు స్మృతులు గూడా మారుచుండుట అవసరమైనట్లు దెలియు చున్నది. స్మృతులు అనేకమంది వ్రాసియుండిరి. మనుస్మృతి, పరాశర, వసిష్ఠ స్మృతులు మొదలైనవి.

> శ్రుతిర్విభిన్నాః స్మృతయశ్చ భిన్నాః
> నైకో మునిర్యస్య మతం ప్రమాణమ్,
> ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం
> మహాజనో యేన గతస్స పంథాః.

శ్రుతులు వేరు. స్మృతులు మరొక తీరు. పోనీ యే ముని మతమైనా ప్రమాణముగా ననుసరించుదా మనిన వారి సంఖ్య అనంతము. ఎవరి మార్గము వారిదే; అగమ్యము గాన మహాజనుడు (శ్రేష్ఠుడు) పోయిన మార్గమే అనుసరణీయ మని కొందరు తెలిపియుండిరి. "మహర్షీణాం మతయశ్చ భిన్నాః" మహర్షుల మతములు అభిప్రాయములు గూడా భిన్నముగా నున్నట్లు దెలియుచున్నది.

చరిత్రలను బట్టి పరిశీలించిన మహర్ష్యాదుల జన్మలలో గల విచిత్రసంఘటనలు ఆశ్చర్యజనకములుగా నుండినను మనకు కావలసినవి వారి జన్మవృత్తాంతములుగాక వారు మనకు ప్రసాదించిన ఆధ్యాత్మిక, సాంఘిక, మత విషయములు నాటినుండి నేటివరకు పవిత్రములై ఆచరణయోగ్యములై ఉపయోగపడుచున్న వనుటలో ఏ మాత్రము అతిశయోక్తి లేదు. వారు శ్రమతో జ్ఞానశక్తిచే ఆర్జించిన విజ్ఞానమును వారి రచనలు భవిష్యత్తరముల వారికి ఉపయోగపడేవిగా నున్నవనుటలో అతిశయోక్తి లేదు. వారి ప్రబోధములు ఎప్పటికిని అమూల్యములే.

## ఉపనిషత్తులు

ఉప = సమీపమునకు, ని = తీసుకొని వెళ్లి, సత్ = చేర్చునవి అని అర్థము.

గురుసమీపమున నుండి ఆధ్యాత్మిక విద్య పొందబడినదనియు మేలు కలదనియు హితము తెలియజేయునది యనియు భావము. ఉపనిషత్తులకు వేదాంతములని పేరు గూడా గలదు. ముఖ్యముగ ఉపనిషత్తులకు సమీప సాధనము అని పేరు గలిగెను. ఉపనిషత్తులలో అనేక విభాగములు గలవు.

## పురాణములు

వేదములకన్న పూర్వమునుండియే యుండియున్నట్లు దెలియుచున్నది.

పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణా స్మృతమ్,
అనంతరం తు వక్త్రేభ్యో వేదాస్తస్య వినిర్గతాః.

అని మత్స్యపురాణములో చెప్పినట్లు బ్రహ్మదేవుడు పురాణములు చెప్పిన యనంతరమే వేదమును చెప్పినట్లు దెలియుచున్నది. "పురాణం పంచలక్షణమ్" అందురు. కలియుగమున పురాణమును పదునెనిమిదిగ విభజించి, వేదవ్యాసమహర్షి రచించి క్లిష్టమైన తత్త్వశాస్త్రభావములను పురాణములుగా ప్రజాసామాన్యమునకు సులభముగా నందించి సఫలత నొందినాడు.

పురాణములలో చరిత్ర సంబంధములైనవి, సృష్టిక్రమ సంబంధమైనవి, తత్త్వ సంబంధములైనవి మొదలగు విషయములు ప్రతివారికిని సులువుగా స్పష్టమగునట్లు తెలిపెడి గ్రంథములు. వేదములలోని విషయములు సామాన్యమానవులకు అర్థమయ్యేటట్లు రచింపబడినవి. మహావిద్వాంసులకు సహితము వేదములలోని విషయములు అంతుబట్టక యుండెను. పురాణములు ఆ కాలపుజనసామాన్యముచే వ్రాయబడుచుండు సామాన్యభాషలో వ్రాయబడియున్నందున సర్వులకు తెలుసుకొనుటకు ఉపకరించినవి. భారతీయులు వేదములు దైవదత్తములని భావించి వాటినే పవిత్రమైన ఆధారముగా భావించి

అవి తెలిసిన రీతిగ అనుసరించు చుండుటను బట్టి మనది వేదమత మనియు గూడా చెప్పియుండిరి. ప్రారంభమునుండి హిందువు లందరిలో ఒకే ధర్మము నందాసక్తి లేకుండుటను, యుగసమన్య, ఆ సమయములోని పరిస్థితులు, శీతోష్ణాది పరివర్తన ద్వారా చేయబడిన కార్య విశేషములు, ఆహారము, నడవడిక, ఆచార విచారము ముఖ్య కారణములుగ గనపడుచున్నవి. ఈ కారణములన్నియు నిరాధారము లైనవి కావు. ధర్మశాస్త్రానుసారమే యీ కార్యములు చేయబడినవి. వాతావరణానుకూలతను బట్టి ఎవరైనా ఏపనినైనను ఏదో కాలమున జేసిన యెడల నత డా కార్యము నదే సమయములో ఎల్లప్పుడూ చేయుచుండవలయు నని తాత్పర్యము గాదు. భారతభూమిలో మత మెన్నడు నొకే సిద్ధాంతమును బట్టుకొని యూగులాడు పిడివాదము గాదు. వ్యాప్తి జెందుచున్న తత్త్వవిచారణ ననుసరించి నూతనభావ ముల నెల్లప్పుడు తనలో చేర్చుకొను సహేతుక సమన్వయ విధానమే భారతీయ తత్త్వము.

కాలక్రమమున హిందూ దేశములో గతములో వేదములు పురాణములు మొదలగు వానిలో దెల్పిన అమూల్యములై ఆచరణ యోగ్యములైన విషయములు విస్మరించి సంకుచిత ఛాందస దృష్టితో తెలిపిన విషయములు ప్రమాణము లని తలచి ఆచరించుటయే హిందూ మతైక్యతకు గొడ్డలిపెట్టుగా నుండుటలో ఏ మాత్రము అతి శయోక్తి లేదు. ఒక్క వేదమతమే ఈ నేలపై పురాతన కాలము నుండియు సమాదరింపబడుచు వచ్చినను ప్రజలసముద్ధరణకు వేద మార్గమే రాచబాటగా భావింపబడినను కాలక్రమమున మానవుల భావప్రభావసరళిలో వచ్చిన వికృతవైఖరుల ఫలముగనే ఆత్మస్థైర్యము తగ్గి మనోనిగ్రహము లోపించి భిన్న భిన్న దృక్పథములలో సంచ రించెడి స్థితిగలిగినది. భిన్న భిన్న దృక్పథములు గలవారి ఇష్టము లే భిన్నవిభిన్న మతములుగ వర్ధిల్లినవి.

కాలము గడచిన కొలది ఉపాసనలు, క్రతువులు, యజ్ఞములు పూజలు, మొదలైనవి ప్రబలినవి. వీని వలన బ్రాహ్మణుల ఆధిక్యము హెచ్చెను. ఉపనిషత్తులనాటి మతము జనసామాన్యమునకు ఆచరించుటకు వీలుగాకపోయిన సమయములో అందరికి సులభమైన రీతిగ ఆచరించుటకు నూతన మతము అవసర మయ్యెను.

## గౌతమబుద్ధుడు

ఈ పరిస్థితులలో క్రీ. పూ. 6వ శతాబ్దమున సుమారు రెండు వేల సంవత్సరములకు పైగా కపిలవస్తు వను నగరమును పాలించు శాక్యరాజైన శుద్ధోదనునికి-మాయాదేవికి బుద్ధుడు జన్మించెను. ఇతడు జన్మించగనే జ్యోతిష్కులు జాతకములు పరీక్షించి, ఈయన లోకము నంతయు పాలించు మహారాజైనను కావచ్చు లేక లోకమంతయు నుతించు మతాచార్యుడైనను కావచ్చునని చెప్పిరి. బుద్ధుడు జన్మించిన ఏడవదినముననే తల్లి మాయాదేవి మరణించెను.

మాయాదేవి గతించినతరువాత రాజుగారి రెండవ భార్యయైన గౌతమి బుద్ధుని కాపాడు చుండెను. బుద్ధునకు "సర్వార్థసిద్ధి"యని నామకరణము జేసిరి. ఇతడు చిన్నతనమునుండియు కష్టపడుచున్న వారిని, రోగులను, వృద్ధులను, శవములను, పెద్దజంతువులు చిన్న జంతువులను చంపి తినునప్పుడును, చిన్నచేపలు పెద్దచేపల కాహార మగుటను మొదలగు విచారపరిస్థితులను చూచినప్పుడు మనోవేదన అధికమై, యేమియు తోచక, వీటి నివారణోపాయములకు వలయు పద్ధతులకై విచారింప జొచ్చెను. రాజు ఎటులైనను లౌకికవ్యవహార ములపై వీని మనస్సు మళ్లించుటకు తన బావమరదియైన సుప్రబుద్ధుని కుమార్తె యశోధరతో వివాహము గావించెను. బుద్ధునికి అప్పటికి 16 సంవత్సరముల వయస్సుండెను. రాజుగారు ఇతని మనస్సును మరలించుటకు అనేకములైన ఇహసౌఖ్యవిధానము లెన్ని చేసినను బుద్ధుడు నగరమున జరుగుచున్న అన్యాయములు, మోస

ములు, ప్రేత బంధువుల రోదనములు, శ్మశానములో చితిపై నుంచిన శవమునకు కొరవిపెట్టుట, ఆ శవము భస్మమై పోవుట మొదలగు దుఃఖకరములగు వాటిని జూచి మిగుల వగచెను. బుద్ధుడు - యశోధరలకు రాహులు డను కుమారుడు జన్మించెను.

కొంత కాలమునకు బుద్ధుడు ప్రపంచములో జరుగుచున్న వంతలు చూచి సహించలేక పత్నీ పుత్రాదులు, బంధువులు మొదలగు వారి వలన సంసారసాగరోత్తరణము గానేరదు. యజ్ఞయాగాదుల చేతను గాదు. బహుదేవతోపాసనము వలనగాదు అని చింతించి, తన 29వ యేట అరణ్యమునకు బోయి కందమూల భక్షణములచే కొన్ని దినములు, ధర్మాత్ములిచ్చు భిక్షాన్నముచే కొన్నాళ్ళు ఆకలిబాధలను నివారించుకొనుచు ఎండ, గాలి, వాన అను నే విచారములేక తదేక మనస్కుండై ధ్యానము చేయుచుండెను. యోగులతో సహవాసము చేసెను. ఎవరెన్ని ఉపదేశములు చేసినను విని, మనస్సులో నుండెడి సందేహములు తీర్చగలిగిన మహానుభావు డొక్కడును కనబడలేదని చింతించెను.

కొంతకాలమునకు మగధదేశమున, గయ సమీప స్థలమున బోధి (రావి) వృక్షము క్రింద పద్మాసనస్థుడై, నిమీలిలోచనుండై, తూర్పుముఖముగ నిశ్చలచిత్తుడై కూర్చుండి, బహుకాలము తపస్సు చేసి, జ్ఞానోదయమును బొందెను. ఇతడు చాలమందికి జ్ఞానమార్గము నుపదేశించుచు, తన శిష్యులతో కలిసి కపిలవస్తు నగరము ప్రవేశించెను. తండ్రియైన శుద్ధోదనుడు బుద్ధుని చూచి మిగుల దుఃఖించి, అతని మనసు మార్చుటకు ఎన్నియో చెప్పెను. చివరకు తండ్రిని, భార్యను, పుత్రుని తన సమీపమున కూర్చుండ బెట్టుకొని సమస్త ప్రజల నుద్దేశించి తన బోధనలను తెలిపి, వారిని గూడ యోగులుగ జేసి, అనేక వేల శిష్యులతో దేశములో పలుప్రాంతములకు బోయి, తన బోధనలు విరివిగా ప్రచారము చేసెను.

## బౌద్ధమత సిద్ధాంతములు

1. హిందూ మత కర్మ-బహుజన్మ సిద్ధాంతము నంగీకరించి జన్మరాహిత్యమే మోక్ష మనెను.

2. వర్ణభేదములతో నవసరము లేక ప్రతివాడు మోక్షమున కర్హుడు.

3. యజ్ఞయాగములు నిరర్థకములు.

4. అహింసా పరమో ధర్మః.

5. నిష్కామకర్మ-త్రికరణశుద్ధి మోక్షమునకు మార్గములు.

6. అష్టాంగమార్గము నవలంబించుట అతి ముఖ్యము.

7. ప్రకృతి యను స్వభావశక్తి వలన సమస్తజీవరాసు లుదయించి, లయ మొందుచుండును.

8. సూర్య-చంద్ర-నక్షత్రము లాదిగా గలవన్నియు ప్రకృతి యొక్క అవిర్భావములై యున్నవి. పృథివ్యాది భూతములన్నియు దానియొక్క అధీనము.

9. శీతోష్ణములు-నదీప్రవాహములు-జననమరణములు, వీట న్నిటిని నెవ్వరిచేతను అడ్డగించుట కానేరదు.

10. నీతి మొదలగు సుగుణములతో గూడినవాడై యుండె నేని ఉత్తమజన్మమును బొందుచు తుదకు శాశ్వతమైన నిర్వాణమును బొందును. ఇట్టి ముక్తిని బడయుటయే విధి యనెను.

పై బోధనలు హిందూమతమునకు విరుద్ధములైనవి గావు. బౌద్ధమతమును వేరు మతమని పిలుచుటకన్న హిందూమత భాగ మనుటలో అనౌచిత్యము లేదు. హిందూమత సంఘములోని అప్పటి దురాచారములు, ఈర్ష్యావైషమ్యములు, మత్సరములు, కులభేదములు రూపుమాపుటకు సర్వాదరణీయములైన సత్యములనే బుద్ధుడు, తన అనమాన అపురూప సేవా, త్యాగ, విరక్తులవల్ల నూతనోత్తేజ ఉత్సా

హములతో బోధించి ప్రజాసామాన్యమును ఆకర్షింపగలిగెను. అహింసా సిద్ధాంతముపై వైదికధర్మమునకే క్రొత్తపునాదులు వేసి, ఆస్తిక మత ధర్మబీజములను వ్యాప్తికి దెచ్చిన మహనీయుడు బుద్ధభగవానుడు. అహింసావ్రతమే బౌద్ధమతమునకు ప్రాణము. మానవసేవయే ఈ మతమునకు పరమ ముఖ్యధర్మము. మనకు కనపడని దైవభావముల స్థాయినుండి మనకు ప్రత్యక్షముగా గోచరించెడి మానవ దుఃఖ పరంపరల వైపుకు సంఘదృష్టిని మరల్చుటకై బౌద్ధము గొప్పకృషి చేసెను. భగవంతుడు చెడుకార్యములు చేయువారికి ఫలమునీయ జాలడనియు, సత్కర్మలను మాత్రమే చేయుడనియు ప్రజలకు బుద్ధుడు బోధించెను.

1. జీవహింస చేయరాదనియు, 2. సత్యమునే పలుకవలయుననియు బుద్ధుని ముఖ్యసిద్ధాంతము.

బుద్ధుని తదనంతరము, ఆ మతములో కొందరి అనుచితప్రవర్తనమువల్ల ఆ మతము క్షీణింపజొచ్చెను. కొందరు స్వార్థపరులు సంకుచితభావములు గలిగి, బౌద్ధమతము వేదవిరుద్ధమనియు, నాస్తిక మతమనియు ప్రచారము చేసి, ఆ మతమును నాశన మొనర్చుటకు ప్రయత్నించిరి.

బుద్ధుడు నెలకొల్పిన యీ మతమును అశోకునివంటి చక్రవర్తులు తలదాల్చి, ఆ మతాభివృద్ధికై విశేషప్రచారము చేసి, ఆ మత వ్యాప్తికి ఎంతగానో పాటుపడిరి. నేటికిని ఈ మతము టిబెట్, చైనా, జపాన్, బర్మా దేశములలో ఎక్కువభాగము అనుసరింపబడుచున్నది.

## బౌద్ధమతములోని అష్టాంగ మార్గములు

1. సమ్యగ్ దృష్టిః పవిత్రమైనదృష్టి - ఇది చాలాప్రధానమైనది. మంచిచూపు ఉంటేనే మనోవాక్కాయ కర్మలలోని మాలిన్యము నశించును.

2. సమ్యక్సంకల్పం: (సత్ సంకల్పం) మంచి దృష్టినిగలిగిన తరువాత, మానసిక సంస్కారం ఏర్పడి, మంచి సంకల్పం కలుగుతుంది. మానవునకు సత్ సంకల్పం చాలా ముఖ్యము.

3. సమ్యగ్వాక్కు: మంచి సంకల్పం ఉన్నప్పుడు, దానిని ప్రకటించుకొనుటకు మాట గూడా పవిత్రమైనదిగ నుండవలెను. సమ్యగ్వాక్కు అలవర్చు కొన్నవాడు, అసత్యం పలుకడు. పరులను నిందించడు. మృదువుగా మాటలాడే వానిని అందరు గౌరవించెదరు.

4. సమ్యక్ కర్మ: త్రికరణాలు మనోవాక్కాయములు ఉత్తమములైనప్పుడు చేసే కర్మ గూడా ఉత్తమముగా నుండును. జీవ హింస, చౌర్యము మున్నగు చెడ్డపనులమీదకు బుద్ధిపోదు.

5. సమ్యగ్ జీవనము: తనకు ఇతరులకు హాని కలిగించేది కూడదు. అ వృత్తి మేలైనదిగా నుండవలెను.

6. సమ్యగ్వ్యాయామము: చెడ్డసంకల్పాలను, మనస్సులో చేరనీయకుండా మనస్సును మంచి ఆలోచనలో ప్రవేశపెట్టడం. దీనినే సమ్యగ్వ్యాపారం అని గూడా అందురు.

7. సమ్యక్స్మృతి: శరీరం అపవిత్ర పదార్థములతో నిండిన దనే విషయం మరువక వాటి అనర్థాలు గుర్తించుటయే సమ్యక్స్మృతి.

8. సమ్యక్సమాధి: పై ఏడు మార్గముల వల్ల మానవునికి వైరాగ్యం గలిగి దాని మూలమున నిర్వాణాన్ని అంటే ముక్తిని బొందే అవస్థయే సమ్యక్సమాధి. దీని వల్ల మానవునికి పునర్జన్మ లేకుండా పోతుంది.

## జైనమతము

బౌద్ధమతము కంటె, జైనమతము ముందుగనే స్థాపింపబడిన దని, కొందరు చెప్పుచున్నారు. ఈ మతస్థాపకుడు వర్ధమాన మహా

వీరుడు. తండ్రి సిద్ధార్థుడు, తల్లి త్రిశల. వైశాలిలో కుండగ్రామమున జన్మించెను. యశోద అను కన్యను వివాహము జేసుకొనెను. ఇతడు తన 30వ ఏటనే సంసారమును వదిలి, పన్నెండు సంవత్సరములు దేశాటనము జేసి అరిషడ్వర్గములను జయించి, "జిన-మహావీర" అను బిరుదులు బొంది ముప్పదిరెండు సంవత్సరములు జైనమతమును బోధించి 72వ ఏట పరమ పదమును బొందెను.

## జైనమత సిద్ధాంతములు (బోధనలు)

1. లోకము అనాదినుండి యుండినదనియు, ఎప్పుడు నాశనము బొందదనియు, ఈ లోకము దేవునిచే సృజింపబడలేదనియు, స్వతస్సిద్ధముగానున్నదనియు వీరి విశ్వాసము

2. యజ్ఞయాగాదులను వీరు నమ్మరు.

3. మోక్షము-మానవునికి పరమావధి యని వీరి నమ్మకము.

4. జన్మరాహిత్యమే-మోక్షమనియు, మోక్షమునకు సమస్త ప్రజలు అర్హులనియు వీరి ముఖ్య సిద్ధాంతము.

5. త్రిరత్నములైన 1. విశ్వాసము-జ్ఞానము-ఆచరణములు అతిముఖ్యములని వీరి నమ్మకము.

బౌద్ధమతమువలె, జైనమతము దేశదేశాంతర వ్యాప్తము కాలేదు. మనదేశములో మగధ, గుజరాత్, మాళవ, రాజపుత్రస్థానము దక్షిణ ఇండియాలో కొంతభాగము, మాత్రమే వ్యాపించియుండెను. రాజాదరణము లేకపోవుటచే ఈ మతము వ్యాప్తి చెందలేదు. కొంత కాలమునకు ఈ మతము 1. శ్వేతాంబరులు, 2. దిగంబరులు అను శాఖలుగ చీలెను. దీనికితోడు ఇతరమతముల పోటీ కలిగెను. నేటికిని ఆరావళి పర్వత ప్రాంతమున "అబూ" శిఖరప్రాంతమున జైనమతము విలసిల్లుచున్నది. జైనమతమునందు హిందూమతాశయములు ఇమిడియున్నను, కొన్నిటియందు భేదము గలదు.

## అద్వైత తత్త్వము

నిర్గుణ నిర్వికార నిర్విశేష పరబ్రహ్మమందే లక్ష్యముంచి సమస్తము మరచి కుశాగ్రబుద్ధితో సాధించి దాని యందే లగ్నమయి లయించి భేదతత్త్వము లేక బ్రహ్మపదార్థముతో ఏకాకృతిగా నుండుట. ఈ తత్త్వము కేవలము ఊహాతీతమై అగోచరమై యుండి జీవుల స్థూలదృష్టికి అతిదూరమై యుండుట, మానవులకు సహజముగ దోచుచున్న వివిధ ప్రవృత్తులకు అందనివాడై హృదయములో రూప ప్రేమకు అధీనుడుగా నుండుట వలన ఆ బ్రహ్మమును లక్ష్యము నందుంచుకొని సాధన చేయుటకు సామాన్య మానవులకు అసాధ్యముగా నుండెను.

అద్వైతము వేదములలో ననాదియై శాస్త్రేతిహాసపురాణాదులలో అనేక విధములుగ చెప్పబడి వ్యాసముఖమున సూత్రీకరింపబడి యుండెను. శ్రీగౌడపాదుల కృషిచే విశాలముగా విస్తరించి శ్రీశంకర భగవత్పాదుని ప్రజ్ఞావైభవముచే నలుమూలలా వ్యాప్తి నొందింపబడెను. ఈ తత్త్వము సర్వాకర్షణీయమై అనేకవిజ్ఞులవల్ల ప్రఖ్యాతము గావింపబడెను. అందుచే అద్వైతఖండము ప్రథమమున శంకర పూర్వాద్వైతము, ద్వితీయమున శంకరాద్వైతము, తృతీయమున శంకరానంతరాద్వైతమను మూడు విధములుగా ప్రస్తావింపబడి యుండెను.

## శంకరపూర్వాద్వైతము

అద్వైతమునకు మూలమగు ఋగ్వేదముతో ప్రారంభించి ఉపనిషత్పురాణేతిహాస స్మృతులయందు వివరముగా చెప్పబడి శంకరుని పరమగురువర్యుడైన శ్రీగౌడపాదాచార్యుని మాండూక్యోపనిషత్ సమీక్షతో ముగియునట్లు తెలియు చున్నవి. అద్వైతవాదమున గౌడపాదునిస్థానము అద్వితీయముగ నుండెను. గౌడపాదుని

జీవిత విశేషములు బాగుగా తెలియక పోవుటచే కాలనిర్ణయము కష్టతరముగా నున్నది. వ్యాసుని కుమారుడు శుకునినామానంతరము గౌడపాదుని నామ ముచ్చరింపబడి యున్నది.

దీనిని బట్టి వ్యాసకాలము కలియుగమునకు పూర్వమగుటచే అతని కుమారుడు శుకుని శిష్యుడే గౌడపాదుడైనచో అతడు అతి ప్రాచీనుడై క్రీ.పూ. 3102 సంవత్సరములవరకు వెళ్లవలసి యుండును. అట్లుగానిచో గౌడపాదుని గురువు శుకుడు వ్యాసపుత్రుడు గాక మరియొకరై యుండవచ్చునని తలంప వచ్చును. గౌడపాదుని గురించి అనేక విధములుగ అనేక సందేహములు వెలిబుచ్చి యుండిరి. కొంతమంది వ్యక్తినామం గాక ప్రదేశ నామమనియు అనేకమంది అనేక విధములుగా చెప్పుచున్నారు.

## శంకరాచార్యులు

బౌద్ధజైనమతముల తరువాత ఆ మతములోని స్వార్థపరులు అనుసరించుచున్న అనుచిత ప్రవర్తనలవల్ల నా మతములు క్షీణింప జొచ్చెను. హిందూమతములో నానాటికి ప్రబలుచున్న దుష్టశక్తులు విజృంభించు చున్నందున మతసంరక్షకులు గాని సరియైన మార్గము చూపువారు గాని లేక పోయిరి. రాజకీయ దండయాత్రల వలన ప్రజలలో నైకమత్యము లేక నొకరి నొకరు దూషించుకొను చుండిరి. భగవద్భక్తి తగ్గి ప్రజలలో శాంతి లోపించెను. ప్రజలలో బలులు జీవ హింసలు అధికము కాజొచ్చెను. మానవతయే నశించెనని చెప్ప వచ్చును. ముతాతత్త్వములు ప్రబలి అనేక వాదములు సిద్ధాంతములు ప్రచారములోనుండి ప్రతిమానవుని స్వార్థమున కుపయోగపడు చుండెను. ఒకప్పుడు మనదేశములోనే గాక ప్రపంచములోని ఇతర దేశములలో ప్రఖ్యాతిగాంచిన బౌద్ధమతము స్వార్థపరుల చేతిలోబడి భోగలాలసతకు దారితీసి రకరకాల అవినీతులకు స్థావరమై యుండెను. నిరీశ్వరవాదము, సోమరితనము మితిమీరెను. వేదములే తమకు

ప్రమాణ గ్రంథములని చెప్పుచునే భైరవులు, శాక్తేయులు, గాణా పత్యులు అనేకులు తమ సంకుచిత సిద్ధాంతములను మూర్ఖపుపట్టు దలలతో ప్రచారము చేయు చుండిరి. వేదములలోని మంత్రములకు అపార్థములు కల్పించి వాటి ఆధారములతో తమ తమ విశ్వాసాలను ప్రచారము చేయు చుండిరి. వేదముల పేరుమీదుగ వీరు నడిపెడి తంతులు జుగుప్సగను అమితభయంకరముగ నుండెను. వీరు సలిపెడి వాగ్యుద్ధములతో నొకరి నొకరు హింసించుకొను చుండిరి. ప్రజలు నిస్పృహులై, నిర్వీర్యులై మనశ్శాంతి కొరకు పరస్పరస్నేహానికి ఎదురు చూచుచుండిరి.

సుమారు 8, 9 శతాబ్దములలో కేరళ ప్రాంతమున "కాలడి" యను గ్రామము నందు, "శివగురువు-ఆర్యాంబలకు" సాక్షాత్ శంకరుని అవతారమైన శ్రీశంకరాచార్యులు జన్మించిరి. దేనికోసమైతే ప్రజలు ఆరాటపడ జొచ్చిరో ఆ యవసరాన్ని తీర్చే సిద్ధాంతాన్ని సృష్టించడానికి కృషిజేసి కృతకృత్యులైనారు. వేదాంతాన్ని అన్ని శాఖల వారికి ఆధారంగా నుండగలిగినంత విశాలపరచి మేధావు లందరిలో ఆలోచనకు స్థాన మేర్పరచినారు.

శంకరాచార్యులు తన మూడవయేటనే లౌకిక వ్యవహారములు నేర్చుకొనెను. మూడవ యేటనే తండ్రి శివగురువు పుత్రునికి ఉప నయనము జేసి పరలోకమున కేగిరి. తల్లి ఆర్యాంబ కొంతకాలానికి కుమారునికి వివాహము చేయవలయునని సంకల్పించి ప్రయత్నిం చెను. అప్పుడు గొప్పపండితులు జ్యోతిష్కులు నీ కుమారుడు లోకా చార్యులై వెలయగలరు గాని సంసారబంధము నందు తగుల్కొనరని చెప్పగనే తల్లి ఆర్యాంబ చింతించెను.

శంకరాచార్యులు సన్యసింపదలచి తల్లి యనుమతి కోరగా ఆమె తన అనమ్మతిని తెలిపెను. ఒకనా డుదయమున తల్లితో నదికి బోయి స్నానమాచరించు సమయములో తాను మొసలినోట చిక్కు

కొన్నా ననియు చావడమునకు సిద్ధముగానున్న యీ సమయము లోనైనా సన్యసించుటకు అనుమతించుమని శంకరుడు ప్రార్థింపగ అట్లే సన్యసించి బ్రతుకుమని తల్లి దీవించెను. తరువాత శంకరులు విధ్యుక్త ధర్మము ప్రకారము సన్యసించిరి. శంకరాచార్యుల గురువు "గోవిందుడు". గోవిందుల వారి గురువు "గౌడపాదు"ల వారు. హిందూమతమునకు తత్త్వత్రయము అతిప్రధానాంశము. ఈ తత్త్వ త్రయ భేదములను గురించియే హిందూమతాచార్యులే గాక ఇతర మతాచార్యులు గూడ తమ తమ అభిప్రాయములు భిన్నముగా వెలిపుచ్చి యుండిరి. తత్త్వత్రయమనగా 1. చిత్తు, 2. అచిత్తు, 3. ఈశ్వరుడు.

1. చిత్తు = చేతనుడు - జీవుడు, 2. అచిత్తు = ప్రకృతి - జడము అచేతనము, 3. ఈశ్వరుడు = జగత్కారణుడు, మాయాతీతుడు, పర బ్రహ్మ, పరతత్త్వము, భగవంతుడు.

శంకరాచార్యులు బోధించి ప్రచారము జేసిన మతమునకే అద్వైత మనిపేరు ఈ అద్వైతమతాభివృద్ధికి మూలపురుషుడు శంకరా చార్యులు. ప్రపంచములో కనుపించే ఈ విభిన్న రూపాలన్నీ ఒకే అనాది పదార్థము నుండి ఉద్భవిస్తున్నాయని ఈ తత్త్వశాస్త్ర ముఖ్యో ద్దేశ్యము. ఏకమైన ఈ అనాది పదార్థమే "ఆత్మ" అని చెప్పిరి. అదే నిత్యమైనది, మిగిలినవి అసత్యము లని ఈ తత్త్వసారాంశము. పర మాత్మ-జీవాత్మ వేరు గాదనియు, పరమాత్మే జీవాత్మ యనియు, "అహం బ్రహ్మాస్మి" అను దానిని బోధించెను. ఈశ్వరుడు మాయా వృతుడై, జీవుడని భ్రాంతి గలిగియుండుటయేగాని జీవుడనే ప్రత్యేక తత్త్వము లేదు. ఈ తత్త్వసిద్ధాంతము మనదేశములో బహుళప్రచా రములోనికి వచ్చిన సిద్ధాంతములలో చాల ముఖ్యమై, దీని తరువాత వచ్చిన సిద్ధాంతముల మీద దీని ప్రభావము విశేషముగా కనపడు చున్నది. వీరి సిద్ధాంతములో మాయావాదం ఒకటి. మాయ అంటే

లేదవి యర్థం. చాలామంది మేధావులు సహితము, వీరు తెలిపిన మాయావాదాన్ని బాగుగ అర్థం చేసుకొన లేదని, మరికొంతమంది తత్త్వవేత్తలు తెలిపియుండిరి. అజ్ఞానం వల్ల ఏకత్వమున్నచోట భిన్నత్వాన్ని కల్పించుకోవడాన్ని మాయ అని శంకరాచార్యులు దెలిపి యుండిరి. కాని ఈ ప్రపంచం లేదు, ఏమియు లేదని, ఆయన భావము గాదని స్పష్టముగ చెప్పవచ్చును.

ఈ ప్రపంచమే లేకపోతే జీవకోటి లేదు. జీవకోటి లేకపోతే తానూ లేదు. తాను లేకపోతే తన భావాలు లేవు. ఆయన తను లేనట్లుగా భావించలేదు. గౌడపాదుడు మాయ అనే మాటకు "ఆత్మకు-ప్రపంచానికి" ఉన్న సంబంధము అనిర్వచనీయమని చెప్ప టానికి ఉద్దేశించి వాడి యుండిరి. శంకరులవారు, ఈ ఉద్దేశ్యమునకు అత్యంత ప్రాముఖ్యము నిచ్చిరి.

శంకరులు భారతదేశం నలుమూలల తిరిగి తన భావాలను, బలముగాను, విశేషముగాను ప్రచారముజేసి ప్రత్యర్థులను జయించి, వెళ్లిన ప్రదేశములలో జయస్తంభములు ప్రతిష్ఠించిరి. తన భావాలను విశ్వసించి ప్రవర్తించుటలోనే, మానవాళికి భవితవ్యం వున్నదని ఘంటాపథముగా చెప్పిరి. లేని మానవులకోసరము, లేని ప్రపంచము కోసరము ఈ పనులు చెయ్యలేదు. మనకు కంటికి కనబడేదే నిజ మనుకొని అది తప్ప మరియొకటి లేదని భావించి, ఈ ప్రపంచాన్ని అనేక ముక్కల క్రింద, అనేక వైరుధ్యాల క్రింద భావిస్తున్న వారి దృష్టిని నిరసించి, ఉన్నది ఒక్కటియే యనియు, ఆ దృష్టిని అలవరచు కొనుటయే విముక్తి యని చెప్పిరి.

శంకరాచార్యులు బౌద్ధమతము యొక్క యథార్థస్వరూపము, దాని ప్రాముఖ్యము తెలుసుకొని క్షుణ్ణంగా పరిశీలించిన ప్రముఖులు. ఆయన కొన్ని బౌద్ధసూత్రాల పట్ల అసహనం చూపితే చూపవచ్చును గాని, బుద్ధభగవానుని ఉపదేశముల పట్ల కాదని నిరాఘాటముగా

చెప్ప వచ్చును. బౌద్ధమతము ప్రోత్సహించిన స్వతంత్రాలోచనను సమర్థిస్తూ గతాన్ని ఆధారంగా తీసుకొని తన సిద్ధాంతాన్ని బౌద్ధ మందలి వ్యక్తిప్రాముఖ్యమునకును, అద్వైతమునందలి ఈశ్వరవాదము నకును సముచిత సమన్వయమును గూర్చిన మేధావి. అంత మాత్ర మున శంకరులు గతాన్ని విస్మరించలేదు. గతానికి దానుడు కాలేదు. కొంతమంది గతంలో జరిగిన దానితోనే ముడిపెట్టుకొని దూరదృష్టి లేని ఛాందస వేదాంతులు ఆయనను ప్రచ్ఛన్న బౌద్ధులనియు, ఆయన బోధించిన మతము ముసుగు కప్పిన బౌద్ధమతమనియు చెప్పిరి. ఒక విధముగ బౌద్ధమతమును పునఃప్రతిష్ఠ జేసినారనియే చెప్ప వచ్చును. శంకరాచార్యులు వేదములలోని కర్మకాండకు ప్రాముఖ్య మిచ్చిన మండనమిశ్రుని తీవ్రముగ వ్యతిరేకించి, జ్ఞాన మార్గమునకు ప్రాముఖ్యము నిచ్చెను. కర్మకాండ మూఢభక్తి, కృత్రి మానుష్ఠానానికి దారితీసి, మానవాళిని పెడదారి పట్టిస్తుందని వారి విశ్వాసము. మోక్ష మనగా ప్రపంచములో లేని దానిని గాని, ఈ ప్రపంచానికి విడిగా ఉన్నదానిని గాని పొందుట గాదు. క్రొత్తగా వచ్చినది గాని, యొక క్రొత్తప్రదేశాన్ని చేరుకొనుట గాని ఇందులో నేమియు లేదు. శాశ్వతసత్యాన్ని తెలుసుకోవడమే మోక్షము.

మలినాన్ని వదలించుకొన్న బంగారము వలె మేఘాలు లేని రాత్రియందు ప్రకాశించెడి నక్షత్రములవలె అవిద్య పీడగనే ఆత్మ వెలుగు ననియు మోక్షమెక్కడో గాదు ఇక్కడే, ఈ ప్రపంచములోనే యున్నదని శంకరుల అభిప్రాయము. ఈ ప్రపంచానికి విడిగా నుండి ఈ అనుభవానికి వ్యతిరేకంగా ఉండే స్వర్గాన్ని శంకరులు చూపించ లేదు. శంకరులు చూపిన స్వర్గము ఎల్లప్పుడూ ఇక్కడనే వుంది. శంకరులు పరమాత్మ నిర్గుణాకారమని చెప్పియుండ లేదనుటకు, వారు ఒకానొక అపత్సమయమున లక్ష్మీనృసింహస్తోత్రమును జేసిరి. వీరు జ్ఞానమార్గమునకే గాక భక్తిమార్గమునకును ప్రాముఖ్య మిచ్చిరి. భక్తిని గురించి—

.... .... తథా పశుపతేః పాదారవిందద్వయం,
చేతోవృత్తిరుపేత్య తిష్ఠతి సదా సా భక్తిరిత్యుచ్యతే.
మోక్షసాధనసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ.
యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్.
భజ గోవిందం భజ గోవిందం గోవిందం భజ మూఢమతే.

అని ప్రబోధించెను.

శంకరాచార్యులు అత్యంత ప్రతిభాశాలురు. ఇంతటి ప్రతిభాశాలురు ప్రపంచములో చాల అరుదుగ జన్మించెదరు. శంకరుల మేధాసంపత్తి, తార్కికప్రతిభ అమోఘమైనది. అనన్యమైన తన శక్తిని మానవులకు విశాలదృష్టిని కలిగించటానికై ధారపోసిన తత్త్వశాస్త్రవేత్త. మానవులందరిలో నుండే ఆత్మ ఒక్కటియేయని తలచిన విశాలహృదయుడు.

ఒకానొక సమయమున కాశీ విశ్వనాథస్వామి చండాల వేషము ధరించి శంకరాచార్యుల వారి సమీపమునకు రాగా, శ్రీ ఆచార్యుల వారి శిష్యులు వానిని దూరముగా తరిమిరి. అతడు ఆత్మవిషయమై సమభావము వహింపవలయునని సర్వులలో నుండే ఆత్మ ఒక్కటియే యని చెప్పగా, శంకరులు అమితానందమును బొంది, సంతోషించి వానిని ప్రశంసించి మనీషాపంచకము అను గ్రంథమును వ్రాసిరి.

"చండాలోఽస్తు స తు ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ"

చండాలుడుగాని, బ్రాహ్మణుడు గాని, జ్ఞానియైనవాడు, వినయసంపన్నుడు నాకు గురు వగుదురని సెలవిచ్చిరి.

వీరు బాల్యముననే దీక్ష బూని, ప్రజ్ఞావంతమైన ప్రతిభచే భారతదేశము నలుమూలలు పెక్కు పర్యాయములు పర్యటించి వేదములు దైవదత్తము లనియు, ప్రమాణము లనియు నిరూపించి భారతీయ తత్త్వమును ప్రబోధించిరి.

శంకరాచార్యులు బాలామృతములో-

అయం నిజః పరో వేతి గణనా లఘుచేతసామ్,
ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ్.

నేనే సరియైనవాడను, లోకులు ఎవరో యనియు, ఇతరులు చాలా తక్కువవారనియు చెప్పేవారు నీచమనస్కులని భావము. కాని, ఉదారభావములు గలవానికి ప్రపంచమే కుటుంబమని భావము.

## ఆదిశంకరుని శిష్యులు

1. పద్మపాదాచార్యులు, 2 హస్తామలకాచార్యులు, 3. తోటకాచార్యులు, 4. సురేశ్వరులు (మండనమిశ్రుడు).

## శంకరాచార్యులు స్థాపించిన పీఠములు

1. దక్షిణమున శృంగేరిపీఠము: అచట శక్తిస్వరూపిణిగ శారదాదేవి అను పేరుతో సరస్వతిని ప్రతిష్ఠించి, తన శిష్యుడైన పృథ్వీధరులను అక్కడ మఠాధిపతులుగా నియమించిరి.

2. ఉత్తరమున బదరీ నారాయణములో జ్యోతిర్మఠాన్ని స్థాపించి, తోటకాచార్యులను (ఆనందగిరిని) అధిపతులు గావించెను.

3. పశ్చిమమున ద్వారకామఠమును స్థాపించి హస్తామలకాచార్యుని దానికి అధిపతులుగా ఏర్పాటు చేసిరి.

4. తూర్పున మహోదధితీరములో పూరీ గోవర్ధనమఠాన్ని స్థాపించి దానికి పద్మపాదాచార్యులు గారిని నియుక్తుని చేసిరి.

5. కాశిలో సుమేరు లేక పాదుకాపీఠములను స్థాపించిరి.

6. కంచిలో కామకోటిపీఠాన్ని తామే అధిష్ఠించి, దానిని తక్కిన పీఠాలకు కేంద్రపీఠంగా విరాజిల్ల జేసిరి. కావుననే అది సర్వజ్ఞ పీఠముగా ప్రసిద్ధి వహించెను. కైలాసమునుండి తెచ్చిన ఐదు లింగా

లలో భోగలింగాన్ని శృంగేరిలో ప్రతిష్ఠించెను. చిదంబరములో మోక్షలింగాన్ని, నేపాలములో వరలింగాన్ని, కేదారములో ముక్తి లింగాన్ని ప్రతిష్ఠించి, యోగలింగాన్ని కేంద్రపీఠమైన కంచిలో ఉంచి తామే నిత్యం త్రికాలార్చన చేసియుండిరి.

వీరు షణ్మతముల నుద్ధరించి షణ్మతోద్ధారకుడని పేరు వడసెను.

అలింగక, మచక్రాంక, మజటాస్థ్యసురామిషమ్,
అరక్తక, మనుచ్ఛిష్టం షడస్మాభిరనుష్ఠితమ్.

వైష్ణవము, శైవము, శాక్తేయము, సౌరము, గాణాపత్యము, కాపాలికము అను నీ యారుమతముల నంగీకరించుచు, కొన్ని నియమము లేర్పరచిరి. చక్రాంకనములేని వైష్ణవము, లింగధారణములేని శైవము, జటాస్థిమాలా కపాల ధారణములేని కాపాలికము, సురామిషములు లేని శాక్తేయము, అంగుష్ఠరక్తాభిషేకము లేని సౌరము, ఉచ్ఛిష్టము లేని గాణాపత్యము మాచే అంగీకరింపబడినవని శంకరభగవత్పాదుల వాక్యము. వీరు షణ్మతముల నంగీరించి, ఉద్ధరించి అద్వైతసిద్ధాంతమునకు అమోఘకృషి జేసి జగద్గురువుగ ఖ్యాతి గాంచినారు.

ఉపనిషత్తులకు, భగవద్గీతకు, బ్రహ్మసూత్రములకు అద్వైతపరముగ భాష్యములు వ్రాసి, సాటిలేని తర్కపాండిత్యముతో బౌద్ధమతమును ఖండించి, స్వల్పవయస్సుననే 32 సంవత్సరములకే భౌతిక శరీరమును విడిచిరి. శంకరుని అనంతరము వారు బోధించిన అద్వైత భావములలోని అఖండత్వము ప్రజల కొక విధముగ నంతుపట్టక దిగ్భ్రమ కలిగించెను. అందువలననే ప్రతివారిని ఉత్తేజపరచలేక పోయినది.

### శంకరానంతరాద్వైతము

అపార భయభక్తులు గురువుగారి యందు శిష్యులకున్నను, శిష్యుడు గురువునకు ఎల్లప్పుడు ప్రతిరూపము గాదనియు మన దేశ సంప్రదాయముగ గోచరించుచున్నది.

ఈ సత్యము ననుసరించియే పద్మపాద సురేశ్వర వాచస్పతి చిత్సుఖ, అప్పయ్య మొదలగు ప్రజ్ఞావంతులైన శిష్యగణము స్వతస్సిద్ధముగ నూతన విషయములు గమనించి, అనేక విషయములు వివరించియుండిరి. కొన్ని సమయములో అపార విమర్శనా కౌశలమున అద్భుత సిద్ధాంతములను నిర్మించి వీరు గురుదేవుని ప్రతిరూపులుగారని నిరూపింప, అప్పయ్యదీక్షితుని "సిద్ధాంతలేశ సంగ్రహ" పఠనము చాలునని ఆచార్య సూర్యనారాయణశాస్త్రిగారు సూచించిరి. నిస్సందేహముగ నా రచయితలు వేదాంతసూత్రముల శంకరభాష్యము ననుసరించి బద్ధులైయుండియు, వివిధ సమస్యల వివరించు సమయములలో అత్యంత విభిన్నత్వమును, స్వతస్సిద్ధత్వమును ప్రకటించియుండిరనియు దెలియుచున్నది. మండనమిశ్రుడు కూడ, తన భావములను పొందుపరచి ఒక పుస్తకమును వ్రాసి, ప్రచారమునకు దీసుకొని వచ్చెను. విద్యారణ్యుడు గూడ అతిప్రతిభావంతుడై అద్వైతమున కొన్ని గ్రంథములను వ్రాసి వ్యాప్తికి గొనివచ్చెను.

#### వాచస్పతిమిశ్ర

అసాధారణ ప్రజ్ఞావంతుడు. క్రీ. శ. 898వ సంవత్సరకాలము వాడని తెలియుచున్నది.

#### సాధు నిశ్చలదాసు

"విచారసాగర" మను ఉత్కృష్టగ్రంథమును రచించి, శాశ్వత కీర్తి గాంచెను. వీరు పంజాబు రాష్ట్రములో 1792 లేక 1793 సంవ

త్సరములో జన్మించినట్లు తెలియుచున్నది. అద్వైత విచారసాగర మున నొక యద్భుతమూర్తి యని పేరు గాంచెను.

## కంచికామకోటిపీఠ జగద్గురు దివ్యచరిత్ర

ఆదిశంకరులు పూర్వము కంచి కామకోటి పీఠాధిపతులుగా నున్నప్పుడు సురేశ్వరాచార్యుల వారికి తీవ్రమైన అనారోగ్య మేర్పడగా శ్రీశంకరులు దేవవైద్యుల (అశ్వనీదేవతలు) చేత వైద్యము చేయించగా ఇంద్రునకు విశేషమైన కోపము వచ్చి తన వజ్రాయుధమును అశ్వనీ దేవతలపై ప్రయోగించెను. కాని శంకరుల ప్రభావము వల్ల అది ముందుకు పోలేకపోయెను. ఇంద్రుడు శంకరుని ప్రభావము తెలుసు కొని తన పేరు ఆ పీఠానికి బిరుదుగ సమర్పించుకొనెను. శ్రీశంకరులు సరస్వతీదేవిని జయించినందుకు చిహ్నంగా ఇంద్ర + సరస్వతి పదాలు కలిసిన "ఇంద్రసరస్వతి" అనే సన్యాసనామము శ్రీకామ కోటిపీఠాధిపతులకు అనాదినుండియు వచ్చుచున్నది.

## శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీచరణులు

వీరి శిష్యులు జయేంద్ర సరస్వతీ చరణులు. శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమచ్చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారు స్వస్తిశ్రీ జయసంవత్సర వైశాఖ బహుళ పాడ్యమి ఆదివారం అనూ రాధా నక్షత్రం సింహలగ్నములో (20-5-1894) జన్మించిరి. శ్రీ మహాలక్ష్మీ సుబ్రహ్మణ్యశాస్త్రి అను పుణ్యదంపతులకు వీరు రెండవ సంతానం. పూర్వాశ్రమనామము స్వామినాథన్. వీరి పూర్వాశ్రమ కుటుంబము మైసూరు మండలంలో కన్నడభాషగాగల్గి ఋగ్వేద శాఖకు చెందిన హులూసైల్ కర్ణాటక స్మార్త బ్రాహ్మణ శాఖకు చెంది యుండినది. వీరు హరిత సగోత్రులు. వీరు 13-2-1907 లో పీఠాధి పత్యము వహించిరి. వీరు కావేరికి ఉత్తరతీరాన తిరుచినాపల్లి జిల్లాలోని మహేంద్రమంగళములో ఏకాంతవాసానికి వెళ్లిరి. ఇచ్చట విశేష

తపస్సు నిర్వహించుచు శైవ వైష్ణవభక్త వాఙ్మయము, జ్యోతిషము, ఖగోళశాస్త్రము, గణితము, చతుష్షష్టికళలలో గల విశేషాలే గాక సంగీతము, తదితరశాస్త్రవిషయాలను గూడ చదివిరి. ఇచ్చట ఉండగనే అనేక శాసన విశేషాలను పరిశీలించు చుండెడివారు.

వీరు 22 సంవత్సరాల వయస్సు వచ్చేసరికి అనేక రాష్ట్రి భాషలతో పాటు ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలను గూడ నేర్చిరి. వీ రెప్పుడును సంతకము చేయరు. శ్రీకారముద్ర నుపయోగించెదరు. వీరు శరన్నవరాత్ర మహోత్సవములలో కుంకుమార్చన, లక్ష్మీదీపా రాధన, లక్షబ్రాహ్మణ సమారాధన మున్నగు విశేషములు 1916 లో జరిపినారు. వీరు ఉత్సవముల సమయములలో పూర్తి ఉపవాసముండి ఆచమన తీర్థము తప్ప మరేమియు స్వీకరించరు. శ్రీవారెక్కడ నున్న అక్కడ మహిమ ప్రత్యక్షమగును. వారిని దర్శించు భక్తులు ఐహిక వాంఛల్ని, ఆముష్మిక ఫలాలను ప్రసాదించమని ప్రార్థించెదరు. వ్యాధులు నివారణ చేయుడని ఆపదలలో నున్నవారు సాగిలబడి మొక్కెదరు. శ్రీవారు అందరిని అనుగ్రహించెదరు. వీరిని నిత్యము దర్శించుకొని భక్తులు ఎన్నో గాథలు చెప్పుకొని మరల మరల ఎప్పుడు దర్శనముచేసుకుందామా అని యువ్విళ్లూరు చుండెదరు.

శ్రీవారు ధర్మమూర్తులు. వారికి అధీతిబోధాచరణ ప్రచారాలు చాలా సులభసాధ్యములుగా నుండును. వారున్న చోట కృతయుగ ధర్మము ప్రత్యక్షమౌతుంది. రైలు, కారు, బండి వాహనముల మీద ప్రయాణము చేయరు. పల్లకిమాత్రము నామమాత్రముగ నుండును. నదిస్నానము, తటాకస్నానము చేయుదురు. నిత్యము బ్రాహ్మ ముహూర్తముననే మఠములో జరుగవలసిన సమస్తమైన పనులు, దేవతార్చనము, పంచాంగశ్రవణము, శాస్త్రచర్చలు, భక్తకోటి దర్శనములు మొదలగు కార్యములు నిర్విఘ్నముగా జరుగుచుండును. రాత్రి ఒంటిగంటువరకు ఎన్నో ముఖ్యకార్యములలో నిమగ్నులై అప్పుడుపై శాఠీ పరచుకొని నేలమీదనో బల్లమీదనో పడుకొనెదరు.

భిక్షాస్వీకారములో ఎన్నో కఠోర నియమములు పాటించెదరు. ఏకభుక్తముతోబాటు పులుసు, ఉప్పు, కారము, విసర్జించెదరు. కొద్దిగ పచ్చిపాలను త్రాగెదరు. కొంతకాలము బిల్వదళము కొంతకాలము వేపఇగుళ్లను స్వీకరించే వారు. తరువాత మూడు గుప్పెళ్ల అన్నము మాత్రము గ్రహించెదరు. అప్పుడప్పుడు కొన్నిరోజులు మౌనవ్రతము పాటించెదరు. శాస్త్రచర్చలలో పాల్గొనుట వీరికి చాలా అభిమానము. వీరు మొదటినుండియు ఖద్దర్ శాటీలనే వాడు చుండెదరు. 1917 లేక 1927 లో గాంధిజీ శ్రీ వారితో ఏకాంత సంభాషణ జేసి వెళ్లిరి. దేశ బంధు చిత్తరంజనదాసు, పురుషోత్తమదాసు టాండన్, సత్యమూర్తి, జమునలాల్ బజాజు, రంగస్వామి అయ్యంగారు, రాజగోపాలాచారి, సర్ తేజాబహదూర్ సప్రూ, ఆచార్య కోడి రామమూర్తి, వినోబాభావే, ఎ. ఎస్. రామన్ మున్నగు ప్రముఖులు వారిని దర్శించి, అనేక విషయములు చర్చించి వెళ్లియుండిరి. దేశీయులేగాక, విదేశీయ ప్రముఖులు సహితము వచ్చి వారికి గల సందేహములు తీర్చుకొని నేటికిని వెళ్లుచుందురు. నలుబది సంవత్సరములకు పూర్వము "పాల్ బ్రంటన్" అనే ప్రముఖుడు చెంగల్పట్టులో వారిని కలుసుకొని దర్శించి తాను బొందిన విశేషానుభవములను "ఏ సెర్చ్ ఇన్ సీక్రెట్ ఇండియా" అనే గ్రంథములో వ్రాసుకొనెను. విదేశీయ భక్తులతో జరిగిన శ్రీవారిసంభాషణలను మదరాసు విశ్వవిద్యాలయ ములో సంస్కృతాచార్యులు డా॥ వి. రాఘవన్ "ది జగద్గురు" అనే పేరుతో సంగ్రహించి ఆంగ్లములో గ్రంథమును ప్రచురించిరి. శ్రీవారు సంపూర్ణయాత్ర జేయుచు భక్తులకు సమస్తోపదేశములు జేయుచు వారు మతప్రచారము విరివిగ గావించిరి.

మహమ్మదీయ భక్తులు గూడ వీరిని దర్శించి భక్త్యాంజలిని ఘటించిరి. ఆపత్సమయములలో క్షామాలకు గురియైన ప్రదేశములలో అన్నదానము చేయుచుండెడివారు. కాశిలో కాశీమహారాజు, పండిత

మదనమోహనమాలవ్య మున్నగుప్రముఖులు వీరిని గొప్పగ సేవించిరి. వీరు ముఖ్యముగ శివ, విష్ణు, గణపతి, సూర్య, దేవి అనే పంచదైవములను పూజిస్తూ ఉండే గృహము, నిత్యము పవిత్రముగా నుండునని సెలవిచ్చిరి. వరశుల్కము, కన్యాశుల్కము రెండును శాస్త్రములలో నిషేధింపబడినవని నొక్కి చెప్పిరి.

"అమృతం హరి" అను పేరుగల పత్రికలో, శైవ, వైష్ణవ భేదమైన సనాతన వైదికధర్మోద్ధరణ, కార్యక్రమవిశేషాలను, ఎక్కువగా ప్రస్తుతించుచు విశిష్టాద్వైత పరమైన వ్యాసములు గూడ ప్రచురింపబడుచుండెడివి.

శ్రీవారు వివిధాంశములపై జేసిన ధర్మోపన్యాసాలు "జగద్గురు బోధనలు" అనే పేరుతో ఆంధ్రప్రభలో వారము-వారము ప్రచురింపబడినవి. వీరు బుద్ధుడు-శంకర-రామానుజ-మధ్వ-వివేకానందాదుల తరువాత దేశవ్యాప్తంగా అనేక పర్యాయములు పర్యటించి సమస్త జనులకు వేదతత్త్వ ప్రభావము, భారతీయ సంస్కృతి-హిందూ మతప్రభావము విరివిగా ప్రచారము గావించిన మహనీయ వ్యక్తి; అపరశంకరులని ఖ్యాతి గాంచిన వారు. దేశములో ఇతర శంకరపీఠముల అధిపతులు, వీరుగావించిన ప్రయత్నముల మాదిరిగ ప్రచారము చేసి యుండలేదు. నేటికిని వీరి యందు సమస్త మతముల వారికి భక్తి గౌరవము లుంచి, ఏ సందేహములు తమకు గలిగినను వీరి వల్ల దీర్చుకొనుచుండిరి. ప్రస్తుతము తంజావూరుజిల్లా-మన్నారుగుడిప్రాంతములో మహదేవయ్యర్ గారి పుత్రుడు "జయేంద్రసరస్వతీ చరణులు" పీఠ మధిష్ఠించి సమస్త కార్యములు నిర్వర్తించుచుండిరి.

## వైష్ణవమతము

వైష్ణవమున విష్ణుపదము తరువాత నారాయణ పదము చాలా ప్రాముఖ్యము వహించియున్నది. సర్వదైవములలో విష్ణువే పరమ

దైవమనియు, సృష్టి-స్థితి-లయముల కాధారభూతుడై జగన్నాటక సూత్రధారియై జగన్నాథుడై, సమస్త యజ్ఞ యాగాది కర్మలకు కర్తయై, ఆర్తత్రాణపరాయణుడై శిష్టరక్షణ, దుష్టశిక్షణ తన అవతార ముల ద్వారా నిర్వర్తించుచు ఆర్తులై జిజ్ఞాసులై కొలిచిన వారిని రక్షించి మోక్షమిచ్చుచున్నాడని చెప్పు మతమిది.

ఆ నారాయణుడే పరమదైవమనియు, విష్ణువే మూలపురుషు డనియు, సర్వవ్యాపకు డనియు వైష్ణవుల పరిపూర్ణ విశ్వాసము. నారా యణుడే పరబ్రహ్మ, నారాయణుడే జ్ఞానం, నారాయణుడే సర్వజ్యోతి, ప్రపంచమే నారాయణ స్వరూపమనియు, వేదములయందు సమస్త శాస్త్రములయందు, పురాణాదులయందు, ఆదిమధ్యాంతములసర్వత్రా ఆ విష్ణువే కీర్తింప బడుచున్నాడని వీరు విశ్వసిస్తూ నిరూపించెదరు.

నిరాకారమున సాకారము, నిర్గుణమునందు సగుణము గలిగిన పరమరహస్యమును శోధించి సాధించి అనుభవించి, బోధించుట అత్యంతావశ్యకమైన తరుణములో సాకారమగు పరమాత్మను, ఆ యా సిద్ధాంతముల ననుసరించి శివ-విష్ణు-శక్త్యాది రూపములు పొంది ఆ పరమేశ్వరుని యందు సర్వవ్యాపకత్వ, సర్వాంతర్యామిత్వా లనే చూపించి, దానికి ప్రాధాన్య మిచ్చినదే వైష్ణవసిద్ధాంతము.

ఆ సగుణాకారదైవమునకు, దానిలో గోచరించు కొన్ని లక్షణ ములకు ప్రాముఖ్యము నిచ్చి అందుకు తగినట్లుగా నామకరణము గావించి ఆ దైవమునకు ఆ పేరే ఆ సిద్ధాంతమునే అన్వయింపజేయుట ఈ మతప్రధానోద్దేశ్యము. ఈ సిద్ధాంతము వేదమూలమై, సమస్త ఉప నిషత్తులయం దంతర్గతమై, పురాణేతిహాసములలో వ్యాప్తమై, సువిశా లమై పరమాత్మ నుండి వివిధరూపములతో, తన అనంతతత్త్వమును నిరూపించి, సర్వమానవుల హృదయములలో ప్రవేశించి శ్రీవారి యందు గల మనోవృత్తులను ఆకర్షించి తన భక్తుల గావించి అనేక విధానములుగా విరాజిల్లినది.

ఆళ్వారులు ప్రబోధించిన అర్చామూర్తి యొక్క ప్రాశస్త్యము భక్తిప్రబోధములు అనాదినుండియు ప్రఖ్యాతి వహించిన విశిష్టాద్వైత మత విశిష్టతను వ్యాప్తిలోనికి దెచ్చుటలో ఆళ్వారుల తరువాత శ్రీవైష్ణవాచార్యుల జన్మలతోను, వారికిగల మేధాశక్తి విజృంభణము తోడ్పాటుతో వైష్ణవము మరింత వ్యాప్తి జెందెను.

## శ్రీమన్నాథమునులు

శ్రీవైష్ణవాచార్యులలో ప్రథముడును, రామానుజీయ మతమునకు మూలపురుషుడు.

వీరు క్రీ.శ. 823 శోభకృతు సంవత్సర జ్యేష్ఠమాస, అనూరాధా నక్షత్రమున, కావేరితీరమున వీరనారాయణ పురమున ఈశ్వరభట్టు అను మహావిద్వాంసునకు కుమారుడై జన్మించెను. వంగి పురుత్తునంబి తన కుమార్తె అయిన అరవిందప్పావైయాళ్ అను నామెను శ్రీమన్నాథమునుల కిచ్చి వివాహము చేసినాడు. వీరి కాలము నుండియే, ద్రవిడవేదమునకు ప్రాముఖ్యము గలిగి, సంస్కృత వేదముతో సమాన ప్రతిపత్తిని సంప్రాప్తింప జేసి, వైష్ణవాలయములలో, ప్రత్యేకోత్సవ కాలములలో ద్రవిడ వేదపఠనమునకు, ప్రోత్సాహము కలిగెను. వీరు గావించిన మార్పునకు వైష్ణవులకు "ఉభయ వేదాంతు"లను నొక నూతన బిరుదపద్ధతి వైష్ణవమున రూపొందెను. తిరుపతిలో నుండు స్వామియైన శ్రీ శ్రీనివాసమూర్తియే శ్రీమన్నాథమునులుగా జన్మించిరని యొక గాథ చెప్పుదురు. శ్రీవైష్ణవాచార్యులందరును వీరిని పవిత్ర గురువుగా భావించి వారి గురుపరంపరలో, "నాథయామున మధ్యమామ్" అని ప్రార్థించెదరు

ఆళ్వారులు పన్నిద్దరును ప్రబోధించిన భక్తిగీతములను "పాశురములు" (నాలుగు వేల సంఖ్య) శ్రీమన్నాథమునులు విశేషపరిశ్రమతో సేకరించి, ఆ సముదాయమును * "నాలాయిర" దివ్యప్రబంధ మను

పేర ప్రకాశింపజేసిరి. చతుర్వేదములలోని సారమంతయు ఆళ్వారులచే రచింపబడిన పాశురములలో ఇమిడి యున్నందున నా దివ్యప్రబంధము ద్రావిడవేద మనెడి అన్వర్థనామముతో విఖ్యాతి గాంచి యున్నది. శ్రీమన్నాథమునులు-అరవిందప్పావైయాళ్ అను దంపతులకు పుత్త్రుడు గలడు. వారి పేరు ఈశ్వరముని.

## యామునాచార్యులు [ఆళవందారు]

శ్రీమన్నాథముని పుత్త్రుడైన ఈశ్వరముని కుమారుడే యామునాచార్యులు. వీరికి 'ఆళవందా'రని మరియొక పేరు గలదు. వీరు క్రీ. శ. 976 ధాతసంవత్సర కర్కాటకమాస పౌర్ణమి, ఉత్తరాషాఢా నక్షత్రము శుక్రవారమునాడు జన్మించిరి. (కొందరు అనూరాధా నక్షత్రమని చెప్పుచున్నారు) వీరి మేధాసంపత్తి అద్వితీయము, అమోఘము. శ్రీమన్నాథముని ప్రియశిష్యుడైన శ్రీరామమిశ్రుడు ఆళవందారునకు గురువై అష్టాక్షరీమంత్ర ముపదేశము గావించెను. వీరు సమస్త వేదములు-శాస్త్రములు గీతార్థములు చక్కగా చదువుకొని, పూజ్యులైన ఆళ్వారుల భక్తిమార్గముల ననుసరించి వేదహితమైన ప్రాచీన విశిష్టాద్వైతముయొక్క విశిష్టతను తమశిష్యులకు బోధించిరి. వీరి అవతార ప్రభావము శ్రీరంగమున చాలా గొప్పగా నుండెను. వీ రనేక శాస్త్రములను ద్రావిడమున రచించిరి. వీరి ముఖ్యశిష్యులే శ్రీరామానుజాచార్యుల వారికి గురువులైన పంచ నంబులు. వీరు చాలా ప్రఖ్యాతి వహించియుండిరి. వీరు వ్రాసిన ముఖ్య గ్రంథములలో 1. స్తోత్రరత్నము, 2. సిద్ధిత్రయము, 3. మాయావాదఖండనము అనునవి. వైష్ణవాచార్యులలో అఖండ కీర్తిప్రతిష్ఠలు వహించిన వారిలో అత్యంత ముఖ్యులు ఆళవందారు. ఆళవందారు శ్రీరామానుజుని ఔన్నత్యము, ప్రతిభ విని వైష్ణవపీఠమునకు రామానుజుని అధిపతిగా నియోగించెను.

## తిరువరంగత్తముదవార్లు

వీరు రామానుజుని తిరునామమును పొందుపరచి 108 పాశురములతో దివ్యప్రబంధమును వ్రాసిరి. దీనికి "ప్రపన్నగాయత్రి" అను ప్రసిద్ధనామము వచ్చి ప్రపన్నులందరు విధిగా పఠించవలయు ననెడి నియమమేర్పడెను. వీరు ముఖ్యముగా 'రామానుజనూరన్దాది' అను స్తోత్రము గూడ ప్రత్యేకశైలిలో రచించిరి.

## శ్రీవైష్ణవపంచాచార్యులు

శ్రీ రామానుజ, మధ్వ, నింబార్క, వల్లభ, చైతన్యులు ప్రబోధించిన తత్త్వములే పంచతత్త్వములని చెప్పినను, పద్మపురాణము రామానుజ, మధ్వ, నింబార్క, విష్ణుస్వామి నలుగురినే ప్రస్తావించి, లక్ష్మి, బ్రహ్మ, రుద్ర, సనక సంప్రదాయ వైష్ణవములు మాత్రమే ముఖ్యములని చెప్పియుండెను. పై నాలుగింటిలో వల్లభుని ప్రస్తావన గోచరించకుండుటచే వల్లభుడు ఆ యాచార్య చతుష్టయమున రుద్ర సంప్రదాయము ననుసరించి, చాలావరకు విష్ణుస్వామిని అనుసరించి యుండుటచే అత్యంతప్రతిభ గడించెను. విష్ణుస్వామి "రాధా-కృష్ణుల" నధిష్ఠాన దైవముగ నుంచి, జ్ఞానదేవునకు జ్యేష్ఠ సమకాలికుడుగ నుండెనని ఘుర్యేపండితుడు తెలిపియుండెను.

వైష్ణవపంచాచార్యులలో జగత్ప్రసిద్ధి గాంచి, అనాదినుండియు వైఖానస-పాంచరాత్ర-ఆళ్వారాదులచే ఆచరింపబడుచున్న విశిష్టాద్వైతమును బహుళ వ్యాప్తిలోనికి గొనివచ్చి వైష్ణవములో నున్న సరళాభిప్రాయములను జనులందరికి సుబోధకము గావించిన శ్రీమచ్ఛేషాంశ సంభూతుడైన శ్రీమద్రామానుజాచార్యులవారి జీవితచరిత్రను తెలుసుకొనుట చాలా ముఖ్యము. వీరు కేవలము మతప్రచారమే గాక, భక్తిప్రబోధనలు, అర్చావతార విశిష్టత సమస్తప్రజలకు విశదముగా, సరళముగా బోధించిన మహనీయులు.

శ్రీ రామానుజాచార్యులకు ముందు శ్రీశంకరునిచే ప్రచారము గావింపబడి విశేషవ్యాప్తిలో నున్న అద్వైతములో గూడ, కొన్ని బల హీనతలు ప్రబలి శంకరుని శిష్యుల చేతులలో వికారరూపములు ధరించి, అనేక అపార్థాలకు లోనై అహంకారమునకు దారి తీసెను. ఈ ప్రపంచం అనిత్యం-'అహం బ్రహ్మాస్మి' అనే భావములే అపార్థా లకు మూలకారణ మయ్యేను. మానవులకు మనస్సులలో చెలరేగే సంఘర్షణలను, బాధలను ఉపశమింప జేసి, చిత్తశాంతిని కలుగజేసే పరిస్థితులు లేకుండెను. శంకరుని ప్రధాన సూత్రమైన అఖండత్వం, ఏ విధముగ తోడ్పడలేదు. ఈ అఖండ నిర్గుణబ్రహ్మతత్త్వాన్ని ప్రజలు అర్థము చేసుకొనలేక, బాధలు పడుచున్నసమయములో వీరిని ఓదార్చి తృప్తిపరిచే శక్తి ఒకటి కావలసిన తరుణములో రామా నుజాచార్యు లవతరించి, ఆ పనిని నిర్వర్తించియుండిరి. వీరు ముఖ్య ముగా అఖండశక్తి ఉన్నది-అది సత్యము-నిత్యమనియు, కాని జీవాత్మ గూడా కలదని వీరి ముఖ్య ప్రబోధము.

శంకరాచార్యుల వారి తరువాత అనగా సుమారు 11 వ శతాబ్దమున రామానుజాచార్యులవా రవతరించిరి. వీరు జన్మించు నప్పటికి హిందూ రాజులలో ననైక్యత స్వార్థపరత్వము మిక్కుటమై ఒకరిపై నొకరు యుద్ధములు ప్రకటించు కొనుచు వైషమ్యములు పెంచుకొన్నవారై ప్రజాశ్రేయస్సును పట్టించు కొనక ఎవరి యిష్టము వచ్చినట్లు వారు వ్యవహరింప సాగిరి. వీరికి గల సంకుచితాభి ప్రాయములు ద్వేషభావముల వలన ప్రజలలో అనైక్యత, సర్వసమత్వ భావము కలిగి యుండవలయు ననెడి ఉదారతత్త్వము నశించెను. వర్ణాశ్రమ ధర్మము లన్నియు నహంకార మమకారములతో గూడినవై యుండెను. అవకాశము దొరకినప్పుడు అల్పసంఖ్యాకవర్గముల వారిని జన బాహుళ్యం గల మతముల వారు హింసించుచు దుష్కార్యములు చేయుచు హీనముగ జూడసాగిరి. హిందూమతమునకు తగిన రక్షణ లేక ఛిన్నాభిన్నమై పోయెను. ఈ యదను చూచుకొని హిందూ

రాజుల నోడించి హిందూ మతమును, హిందూ దేవాలయములను నాశన మొనర్ప మహమ్మదీయులు ఉద్యుక్తులైరి. హిందువులను బలవంతముగా తమ మతములోనికి మార్చదొడగిరి. హిందూమతము నందలి హీనజాతుల వారిని, సాంఘికముగను, ఆర్థికముగను దైన్యావస్థ యందున్న వారిని బలవంతులైన హిందువులచేతనే ఈసడింప జేయుచుండిరి. ఈ విధమైనవారు త్వరితగతిని మహమ్మదీయులచే నాకర్షింపబడి మహమ్మదీయులుగ మారుచుండిరి. ఈ దుర్భరావస్థ నెదుర్కొని హిందువులలో మతవిశ్వాసము జనింపజేసి ధర్మోద్ధరణ గావించుట సంఘీభావమునకు నన్యైకమత్యమునకు గొడ్డలిపెట్టుగా నున్న వివిధ కుల మనస్తత్త్వములలో పరిణామమును కలుగజేయుట రామానుజాచార్యుల ప్రథమకర్తవ్య మాయెను.

## రామానుజాచార్యుల జీవిత చరిత్ర

తిరుమలలో యామునాచార్యులవారి శిష్యుడైన తిరుమలనంబి యను బ్రాహ్మణునకు ఇరువురు చెల్లెండ్రు గలరు. వీరిలో పెద్దయామె కాంతిమతి, భూమిపిరాటి. రెండవయామె ద్యుతిమతి(పెరియపిరాట్టి). తిరుమలనంబి ఉభయులకు యుక్తవయస్సు రాగానే కాంతిమతిని శ్రీ పెరుంబూదూరు నివాసియగు కేశవసోమయాజి గారికిని, రెండవ యామెను మధురమంగలనివాసి యగు కమలనయనభట్టరుగారి కిచ్చి వివాహములు చేసెను. కేశవసోమయాజి హరిత సగోత్రుడు, ఆపస్తంబ సూత్రుడు, యజుశ్శాఖాధ్యాయి. చాలాకాలము వరకు కేశవసోమయాజి గారికి పిల్లలు గలుగ నందున భార్యతో కలసి తిరువళ్లిక్కేణికి వచ్చి అచ్చటగల పార్థసారథిస్వామివారిని భక్తితో సేవించెను. స్వామివారి అనుగ్రహమున కాంతిమతి గర్భవతియై సుమారు 1017 వసంవత్సరమున ఒక శుభదినమున (కలియుగము సుమారు 4118 లేక 4119 పింగళనామ సంవత్సర చైత్ర శుక్ల పంచమీ

ఆర్ద్రానక్షత్రము కర్కాటక లగ్నమందు మగశిశువును గనెను. ఇతడే శ్రీరామానుజులు. తండ్రియైన కేశవసోమయాజి పిల్లవానికి సమస్త విద్యలు నేర్పి పిన్నవయస్సుననే ఉపనయనము చేసి యుక్తవయస్సు రాగానే తంజమాంబ యను కన్యతో వివాహము జరిపించెను. కొంత కాలమునకు కేశవసోమయాజి పరలోకగతు డాయెను.

తండ్రి గతించినంతనే రామానుజులు సకుటుంబముగ బయలు దేరి కాంచీపురమునకు బోయి సకలవేదాంతశాస్త్రములు చదివిన గొప్ప పండితోత్తముడు, అద్వైతియైన యాదవప్రకాశుల వారి నాశ్రయించి సకల శాస్త్రములు నభ్యసింప దొడగెను. వేదముల యందలి నే యంశము మీాద నైనను భేదాభిప్రాయములు గలిగి నప్పుడు గురువు గారి యందు భక్తిగౌరవము లున్నను గ్రుడ్డిగా ననుసరింపక నిర్భయముగ తనకు న్యాయమని తోచిన రీతిని వాదింప దొడగెను. ఒకానొక సమయమున శ్రుతివాక్యమునకు అను చితమైన అర్థము గురువుగారు చెప్పెను. రామానుజులు ఖేదపడి గురువుగారితో భక్తి వినయ పూర్వకముగ తమవంటివారు వేదముల కిట్లు విపరీతార్థములు చెప్పవచ్చునా యని బదులు చెప్పి ఆ శ్రుతి వాక్యమునకు సరియైన అర్థము వివరముగా చెప్పెను. ఇట్లు పెక్కు పర్యాయములు వా రుభయులకు అనేక విషయములలో భేదాభి ప్రాయములు గలిగెను. రామానుజుల ప్రతిభను యాదవప్రకాశులు సహించలేక మత్సరము వహించి శిష్యులతో కాశికి పోవుటకు ప్రయత్నించెను. రామానుజుని పినతల్లికుమారుడైన గోవిందభట్టరు గూడా యాదవప్రకాశులవద్ద విద్య నభ్యసించుచుండెను. యాదవ ప్రకాశులు రామానుజుని చంప ప్రయత్నించెను. ఈ విషయము ముందుగనే తెలిసిన గోవిందభట్టర్ అన్నయైన రామానుజునితో తప్పించుకొని పోవలసినదిగా సలహా చెప్పెను. ఒకనాటి అర్ధరాత్రి సమయమున రామానుజుడు తప్పించుకొని, కాంచీపురమున నుండు

వరదరాజస్వామిని కాపాడ వలసినదిగా ప్రార్థించెను. స్వామివారి అనుగ్రహముతో కాంచీపురమునకుబోయి జరిగినసంగతి తల్లికిచెప్పెను. ఆమె మిగుల దుఃఖించి క్షేమముగ కుమారుడు తిరిగి వచ్చినందులకు సంతసించెను.

కాంచీపురమునందు గల "తిరుక్కచ్చినంబి" యను పరమ భాగవతోత్తముని నాశ్రయించి తనకు జరిగిన యావద్విషయములు చెప్పి తన్ను శిష్యునిగా స్వీకరించ వలసినదిగా ప్రాధేయపడి వారి యొద్దనే తనకు గల సకల సందేహములు తీర్చుకొనుచుండెను. యాదవప్రకాశులు కాశి నుండి తిరిగి వచ్చి సకల విషయములు పరిపూర్ణముగా తెలుసుకొని రామానుజునితో విరోధము పనికిరాదని గుర్తించి రామానుజుని తన యొద్దకు పిలిపించుకొని సకల విద్యలు బోధించెను.

శ్రీరంగమున వేదవేదాంతవిశారదుడు పంచసంస్కార సంపన్నుడు, సచ్ఛీలుడు, వైష్ణవసిద్ధాంతములయందు నమ్మకము గలిగిన వాడు నగు యామునాచార్యులను (ఆళవందారు) బ్రాహ్మణపండితుడు గలడు. అతడు తనశిష్యులద్వారా రామానుజునిచరిత్ర, ప్రతిభ తెలుసుకొని విశిష్టాద్వైతమతము వైష్ణవాభిప్రాయములు అభివృద్ధి గావించుటకు రామానుజులు తప్ప మరెవ్వరు సమర్థులు గారని భావించెను. కాంచీపురము నందున్న రామానుజుడు గూడా యామునాచార్యుల వారి గొప్పతనము, వారికి గల పాండిత్యము తెలుసుకొని వారిని దర్శింపవలయునని తలచెను.

యామునాచార్యులు గూడా, తాను చరమావస్థయందున్నందున, రామానుజుని చూడవలయు ననెడి ఉత్సాహముతో తన ముఖ్య శిష్యుడైన పెరియనంబిని(మహాపూర్ణుడు) కాంచీపురమునకు పంపెను. మార్గమధ్యములో పెరియనంబి-రామానుజులు కలుసుకొని, ఒకరి

అభిప్రాయములు, మరియొకరు తెలుసుకొని, ఉభయులు శ్రీరంగము చేరునప్పటికి యామునాచార్యులు పరమపదమును బొందిరి. బ్రతికి యుండగనే యామునాచార్యుల వారిని దర్శించలేనందులకు రామానుజులు మిగుల దుఃఖించి, యామునాచార్యులవారి దేహమును పాదాది కేశపర్యంతము, వీక్షించి వారి కుడిచేతి మూడువ్రేళ్లు ముడుచుకొని పోవుటకు కారణ మడిగెను. ఎవ్వరివలన కారణము తెలియక, భక్తితో రామానుజుడు వారి దేహమునకు ప్రదక్షిణము చేసి, దానికి కారణ మేమని భగవంతుని ప్రార్థించెను.

1. లోకమునందలి భక్తులు పరమపదము సులభముగ బొందునట్లు భక్తి జ్ఞాన వైరాగ్యములు అభివృద్ధిపరచి వారిని సదాచార సంపన్నుల గావించి మోక్షపదవి సులభముగ నందగలుగు నట్లు చేయుట.

2. వైష్ణవమతమును దీక్షతో వ్యాప్తము గావించు వాడెవడైనా యుండునా ?

3. లోకోజ్జీవనార్థమై పురాణములు రచించిన వ్యాస-పరాశర మునిసత్తముల తిరునామములు సదాచారసంపన్నులైన వైష్ణవాచార్యుల కిద్దరికి పెట్టుట అను ఈ మూడు అభిమతములు తీరనందుననే మూడు వ్రేళ్లు ముడుచుకొనెనని గ్రహించి రామానుజులు పై మూడు అభిప్రాయములు ఫలింపజేసెదనని ప్రతిజ్ఞ చేసిన వెంటనే, యామునాచార్యుల వారి మూడువ్రేళ్ళు సరిగా వచ్చుట జూచి అందరు ఆశ్చర్యపడిరి.

అప్పుడు మిగిలిన వారు మీరే మార్గము చూప వలయునని శ్రీరామానుజుని ప్రార్థించిరి. రామానుజుడు కాంచీపురమునకు వచ్చి తిరుకచ్చినంబికి శ్రీరంగమున జరిగిన యావద్విషయములు చెప్పి, వారి యాజ్ఞను దీసుకొని పై మూడు అభిప్రాయములు ఫలింపజేసెను. రామానుజుని దృష్టిలో శంకరులవిధానం శూన్యంలోనికి తీసుకొని పోతుందని భావన.

రామానుజుని దృష్టిలో జీవాత్మ వాస్తవికమైనది, ప్రత్యేకత కలిగినది, నిత్యమైనది, తెలివితేటలు, ఆత్మజ్ఞానం కలిగిఉంటుందని వీరు చెప్పిరి. ఇది అనేక జన్మ లెత్తుతుంది. ఈ ప్రపంచము నుండి అనేక పర్యాయములు నిష్క్రమిస్తుంది. ఆత్మలకు మాత్రం విచ్ఛిత్తి లేదనియు గత జీవితఫలితాల నుంచి తప్పించుకొన లేవనియు, నూతన సృష్టి ప్రారంభమైనప్పుడు మరల ప్రపంచములోనికి వస్తాయనియు వారి అభిప్రాయములు చెప్పియుండిరి. ఆత్మలకు స్వతంత్రశక్తి యున్నప్పటికి, భగవంతుని సహాయమున్నప్పుడే అది లభిస్తుంది. జీవాత్మకు స్వతంత్రశక్తిని వీరు పూర్తిగా అంగీకరించిరి. సృష్టినిగురించి రామానుజులు లీల అని చెప్పిరి.

రామానుజునకు ముందుకాలములో విశిష్టాద్వైతమత మవలంబించి దాని ననుసరించుచున్న ఆదివైష్ణవులైన వైఖానస-పాంచరాత్రులు అర్చామూర్తియైన భగవంతుని అర్చనా విధులతోనే కాలము గడపిరి. తరువాత కాలములో ఆళ్వారులు అర్చామూర్తియొక్క ప్రభావమును తమిళపాశురముల వల్ల, దేశములో పలుప్రాంతములలో ప్రచారము జేసి భక్తితత్త్వమును పెంపొందించిరి. తదుపరి వైష్ణవాచార్యులలో ప్రసిద్ధులైన మహనీయులు శ్రీమన్నాథమునులు, యామునాచార్యులు మొదలగువారు ఆ మతమును, సిద్ధాంతమును ఆచరించుచు అనుసరించుచుండిరే గాని ప్రజలలో వ్యాప్తి జేసి యుండలేదు.

రామానుజాచార్యులు, విశిష్టాద్వైతతత్త్వమును విశాలభావములు గలిగిన వైష్ణవసిద్ధాంతమును, బహుళ ప్రచారము జేసిన మహనీయ వ్యక్తి. హిందూతత్త్వవేత్తలందరిలో, వీరి జీవితం అనేక రూపములలో వ్యక్తమై ఏ మతాచార్యులు నెదుర్కొనని క్లిష్టపరిస్థితుల నెదుర్కొని, తాను కేవలము నమ్మిన మతప్రచారమునకేగాక, హిందూ మత సంఘుఐక్యతకు, వర్ణకులమతభేదములతో నిమిత్తము లేకుండ జాతిపురోభివృద్ధికి కృషి జేసిన మహనీయమూర్తి. వీరు కులమునకు

ప్రాతినిధ్య మీయక సమస్త వర్ణముల వారికి కేవలము భక్తితోనే మోక్షమార్గము చూపిన విశాలహృదయులు. హిందూమతములో, ప్రాతినిధ్యములేక, నిరాశతో నుండి అన్యమతములవైపున కాకర్షింప బడుచున్నవారు, రామానుజుని బోధనలలోగల విశాలభావములు గ్రహించి, తిరిగి హిందూమతములోనికి జేరుచుండిరి. వీరు బ్రాహ్మణులై గూడా ఆ రోజులలో కులమునకు ప్రాముఖ్యము, ప్రాతినిధ్య మివ్వక, శూద్రులను హరిజనులను, సహితము తన గురువులుగా భావించి సంఘసేవకు అవిరళకృషి జేసిన మహనీయవ్యక్తి. ఎక్కడ ఆచరణయోగ్యములైన ఏ మంచివిషయములున్నను, ఏ భేదభావము లేకుండా సహృదయముతో స్వీకరించి ఆచరించిన మార్గదర్శకుడు.

1. త్రిదండ సన్యాసమునం దభిలాష గలవాడై ఆదివైష్ణవ సంప్రదాయమైన వైఖానస పద్ధతిని (విఖనసఋషి చెప్పినట్లు) సన్యాసమును స్వీకరించిరి.

2. అర్చామూర్తియైన శ్రీమన్నారాయణుని అర్చించుటకు పాంచరాత్ర సిద్ధాంత మనుష్ఠించెను.

3. భక్తి తత్త్వమును భక్తిప్రచారమును చేయుచు భగవద్దివ్యాయుధాంశసంభూతులు వివిధ కులములలో జన్మించియు ప్రాపంచిక విషయములను బట్టించుకొనక అర్చామూర్తి యొక్క వైభవమును తమ ప్రబంధముల ద్వారా భక్తి మార్గములో ప్రచారము జేసిన ఆళ్వారుల ననుసరించిరి.

4. శూద్రకులస్థుడైన తనగురువు "తిరుక్కచ్చినంబి" భుజించిన తరువాత పవిత్రహృదయముతో శేషాన్నమును భుజింప గోరెను.

5. తిరుక్కచ్చినంబి పాదము లాశ్రయించి, శరణుజొచ్చి, తనకుగల సమస్త సందేహములను నివృత్తి జేసుకొనెను. 1. జగత్కారణమగు పరబ్రహ్మను నేనే. 2. జీవాత్మ పరమాత్మ ఒక్కటి గాదు.

పరమాత్మ జ్ఞానానందస్వరూపుడు, వేదవేద్యుడు, పరమపురుషుడు. అనేక కర్మఫలములను అనుభవించు చుండిన జీవాత్మ పరమాత్మ ఒక్కటిగాదనియు, కావున జీవాత్మ పరమాత్మ వేరనియు, 3. భక్తులకు అవసాన సమయమున నిస్సంశయముగా మోక్షము లభించును అనెడి విషయములు తెలుసుకొనెను.

6. తన గురువైన తిరుకచ్చినంబి భార్యకు తన భార్యకు బావివద్ద నీళ్ల విషయమై తగాదా వచ్చెను. శూద్రకులమునకు చెంది నను పవిత్రముగా భావించిన తన గురువుగారి భార్యను తన భార్య దుర్భాషలాడి తగవులాడిన విషయము తెలుసుకొని తన భార్యవల్ల జరిగిన అపచారమునకు గురువు గారిని మన్నింపుమని వేడుకొనిన విశాలహృదయుడు.

7. రామానుజులభార్య తాను చెప్పినట్లు వినక తాను అన్నము పెట్టుమని పంపిన బ్రాహ్మణులకు అన్నము పెట్టక తగవులాడి పంపెను. తాను ఆచరించి ఇతరులకు ప్రబోధించుచున్న పద్ధతులు తన ఇంటనే ఆచరింపబడక పోవుటకు చింతించి భార్యను పుట్టినింటికి బంపి సన్యసించెను.

8. రామానుజునకు తిరుమంత్రము, తిరుమంత్రార్థవిశేషము లుపదేశించిన "తిరుక్కోటియూర్‌నంబి" ఆజ్ఞ నుల్లంఘించి తిరుక్కోటియూర్ నందుగల లక్ష్మీ నృసింహదేవాలయము గాలిగోపుర మెక్కి బ్రహ్మోత్సవసమయములో సమస్త జనులకు కులమత భేదము లను పాటింపక విష్ణు మంత్రమును బహిరంగముగ చెప్పి వారి మోక్షమార్గమును చూపించెను. గురునాజ్ఞ నుల్లంఘించిన నేరమునక తానే నరకమునకు బోయెదనని గురువు గారికి విన్నవించు కొ సమస్త జనులు మోక్షము బొందుటయే తన ముఖ్యోద్దేశ్యమని చెప్పి మహానుభావుడు రామానుజులు.

ప్రాతినిధ్య మీయక సమస్త వర్ణముల వారికి కేవలము భక్తితోనే మోక్షమార్గము చూపిన విశాలహృదయులు. హిందూమతములో, ప్రాతినిధ్యములేక, నిరాశతో నుండి అన్యమతముల వైపున కాకర్షింపబడుచున్నవారు, రామానుజుని బోధనలలోగల విశాలభావములు గ్రహించి, తిరిగి హిందూమతములోనికి జేరుచుండిరి. వీరు బ్రాహ్మణులై గూడా ఆ రోజులలో కులమునకు ప్రాముఖ్యము, ప్రాతినిధ్యమివ్వక, శూద్రులను హరిజనులను, సహితము తన గురువులుగా భావించి సంఘసేవకు అవిరళకృషి జేసిన మహనీయవ్యక్తి. ఎక్కడ ఆచరణయోగ్యములైన ఏ మంచివిషయములున్నను, ఏ భేదభావము లేకుండా సహృదయముతో స్వీకరించి ఆచరించిన మార్గదర్శకుడు.

1. త్రిదండ సన్యాసమునం దభిలాష గలవాడై ఆదివైష్ణవ సంప్రదాయమైన వైఖానస పద్ధతిని (విఖనసఋషి చెప్పినట్లు) సన్యాసమును స్వీకరించిరి.

2. అర్చామూర్తియైన శ్రీమన్నారాయణుని అర్చించుటకు పాంచరాత్ర సిద్ధాంత మనుష్ఠించెను.

3. భక్తితత్త్వమును భక్తిప్రచారమును చేయుచు భగవద్దివ్యాయుధాంశసంభూతులు వివిధ కులములలో జన్మించియు ప్రాపంచిక విషయములను బట్టించు కొనక అర్చామూర్తి యొక్క వైభవమును తమ ప్రబంధముల ద్వారా భక్తి మార్గములో ప్రచారము జేసిన ఆళ్వారుల ననుసరించిరి.

4. శూద్రకులస్థుడైన తనగురువు "తిరుక్కచ్చినంబి" భుజించిన తరువాత పవిత్రహృదయముతో శేషాన్నమును భుజింప గోరెను.

5. తిరుక్కచ్చినంబి పాదము లాశ్రయించి, శరణుజొచ్చి, తనకుగల సమస్త సందేహములను నివృత్తి జేసుకొనెను. 1. జగత్కారణమగు పరబ్రహ్మను నేనే. 2. జీవాత్మ పరమాత్మ ఒక్కటి గాదు.

పరమాత్మ జ్ఞానానందస్వరూపుడు, వేదవేద్యుడు, పరమపురుషుడు. అనేక కర్మఫలములను అనుభవించు చుండిన జీవాత్మ పరమాత్మ ఒక్కటిగాదనియు, కావున జీవాత్మ పరమాత్మ వేరనియు, 3. భక్తులకు అవసాన సమయమున నిస్సంశయముగా మోక్షము లభించును అనెడి విషయములు తెలుసు కొనెను.

6. తన గురువైన తిరుకచ్చినంబి భార్యకు తన భార్యకు బావివద్ద నీళ్ల విషయమై తగాదా వచ్చెను. శూద్రకులమునకు చెంది నను పవిత్రముగా భావించిన తన గురువుగారి భార్యను తన భార్య దుర్భాషలాడి తగవులాడిన విషయము తెలుసుకొని తన భార్యవల్ల జరిగిన అపచారమునకు గురువు గారిని మన్నింపుమని వేడుకొనిన విశాలహృదయుడు.

7. రామానుజులభార్య తాను చెప్పినట్లు వినక తాను అన్నము పెట్టుమని పంపిన బ్రాహ్మణులకు అన్నము పెట్టక తగవులాడి పంపెను. తాను ఆచరించి ఇతరులకు ప్రబోధించుచున్న పద్ధతులు తన ఇంటనే ఆచరింపబడక పోవుటకు చింతించి భార్యను పుట్టినింటికి బంపి సన్యసించెను.

8. రామానుజునకు తిరుమంత్రము, తిరుమంత్రార్థవిశేషము లుపదేశించిన "తిరుకోట్టియూర్ నంబి" ఆజ్ఞ నుల్లంఘించి తిరు కోట్టియూర్ నందుగల లక్ష్మీ నృసింహదేవాలయము గాలిగోపుర మెక్కి బ్రహ్మోత్సవసమయములో సమస్త జనులకు కులమత భేదము లను పాటింపక విష్ణు మంత్రమును బహిరంగముగ చెప్పి వారి మోక్షమార్గమును చూపించెను. గురునాజ్ఞ నుల్లంఘించిన నేరమునకు తానే నరకమునకు బోయెదనని గురువు గారికి విన్నవించు కొ సమస్త జనులు మోక్షము బొందుటయే తన ముఖ్యోద్దేశ్యమని చెప్పి మహానుభావుడు రామానుజులు.

9. శ్రీమన్నారాయణ లేక తిరునారాయణపురము (మేలుకోట) నందుగల తిరునారాయణస్వామి (సెల్వపిళ్ల - సంపత్ కుమారుడు) తిరునాళ్ల సమయములో మూడుదినములు పంచములు బలిపీఠము వరకు బోయి స్వామివారిని సమీపించి సేవించి తైలము, బియ్యము సమర్పించ వచ్చుననియు, పంచములకు దేవాలయప్రవేశము అనుమతించెను.

10. మారనేర్ నంబి పంచమ కులస్థుడైనను పరమ భాగవతోత్తముడు. వీరికి రాచపుండు లేచి తన గురువైన పెరియనంబి సపర్యలు చేయుట గమనించి భగవంతునికి కులముతో నిమిత్తము లేదనియు, భక్తి, శీలము ప్రధానమని యెంచి మారనేర్ నంబిని ఆదర్శగురువుగా భావించిన సద్గుణ సంపన్నుడు.

## రామానుజాచార్యులవారి గురువులు

1. తిరుక్కచ్చినంబి: (కాంచీపూర్ణుడు) వీరు రామానుజాచార్యునికి గల సకలసందేహములు వరదరాజస్వామి అనుగ్రహమున తీర్చి మార్గదర్శకుడైన ముఖ్యగురువు.

2. తిరుమలనంబి: (శ్రీశైలపూర్ణుడు) వీరు రామానుజాచార్యుల వారికి మేనమామ. వీరివద్ద విశిష్టాద్వైత మతానుసారముగ శ్రీమద్రామాయణార్థముల నెరిగిరి.

3. పెరియనంబి: (మహాపూర్ణుడు) రామానుజునికి పంచ సంస్కారములు జేసి సకల శాస్త్రము లుపదేశించిన గురువు.

4. తిరుక్కోటియూర్ నంబి: (గోష్ఠిపూర్ణుడు) వీరు రామానుజులకు తిరుమంత్రార్థము లుపదేశించి విశేషార్థములు దెలిపిరి.

5. **మారనేర్ నంబి:** భక్తికి, శీలమునకు కులముతో నిమిత్తము లేదని నిరూపించిన ఆదర్శమూర్తి. ధనుర్దాసుడను మల్లునకు కులమును

జూడక భక్తితత్త్వమును ప్రబోధించి అతనిని ఎల్లప్పుడూ భగవత్సేవ యందే లగ్నమగునట్లు మార్చిరి.

వీరు ముఖ్యముగా భక్తిమార్గములలో దాస్యభక్తి యం దభి ప్రాయము గలవారై "త్వద్భృత్యభృత్య-పరిచారకభృత్యభృత్య-భృత్యస్య భృత్య" అను దాస్యవిధానము భక్తిమార్గములో అతి ముఖ్యమైనదిగ భావించి కులశేఖర ఆళ్వారు చెప్పిన విధానమే అతిముఖ్యమైనదనియు బోధించెను.

రామానుజులు అనుసరించుమని బోధించి తాను అనుసరించిన భక్తిమార్గమున కొక విశిష్టత గలదు.

భక్తిమార్గములు మూడు విధములుగా నున్నట్లు తెలియు చున్నది.

1. మామూలుభక్తి: ప్రార్థనలు, పూజలు, విగ్రహారాధన మొదలైనవి. ఇవి ఆత్మయొక్క ప్రమాణానికి సహాయపడగలవే గాని విముక్తిని సంపాదించి పెట్టలేదు.

2. ముఖ్యభక్తి: విముక్తికి మనము మూలపదార్థమును సేవింపవలయును; మరియొక దాని మీద ధ్యాన ముంచగూడదు. నిశ్చలమైన మనస్సుతో భగవంతుని ధ్యానించుట.

3. ప్రపత్తిమార్గము: ఈ మార్గము సమస్త భాగవతులు సమర్థించిరి. తనను తాను భగవంతునికి త్రికరణశుద్ధిగ అర్పించు కోవటము దీనికి ప్రధానసూత్రమై యున్నది. ఈ మార్గమే పండిత పామరులకు సర్వత్రా వర్తించే మార్గం. ఆళ్వారులు ఈ మార్గానికి అత్యంత ప్రాముఖ్యము నిచ్చి ప్రచారము చేసిరి. "సర్వధర్మాన్ పరిత్యజ్య" అనునది విముక్తికి సాధనం. ఇది ఒక్కటే మార్గం. త్రికరణశుద్ధిగ తనను అర్పించుకొన్నజీవిని భగవంతుడు రక్షించక ఏమి చేయగలడు? ఆ బాధ్యత ఇక మీదట భగవంతునిదే నని వీరి పరిపూర్ణ విశ్వాసము.

పుట్టుకచేతనే తాము ఇతరుల కంటె అధికులమనియు సనాతనాచారానుష్ఠాన పరులైనను, భక్తి పరవశులైనను తమ కంటె నీచులనియు, హీనులనియు తలంచుట అహంకారముతో గూడిన పనియనియు, భక్తియోగమున ముక్తులై శ్రీమన్నారాయణుని సాన్నిధ్యము బొందుటకు స్త్రీలు, పురుషులు సమానార్హులే యనియు, భగవంతుని ప్రార్థించి వారి ప్రసాదములు గైకొనుటకు కులము, మతము, స్త్రీలు, పురుషులు అనే భేదములు ప్రతిబంధకములు కాజాలవనియు నిరూపించెను. వర్ణాశ్రమధర్మములన్నియు సమానప్రతిపత్తి గలవనియు ధర్మదేవతకు ఈ అంగము లన్నియు అత్యంతావశ్యకములనియు పరస్పర సహనభావము, సమానభావము కలిగియుండవలెనని బోధించెను.

రామానుజాచార్యులవారు మహానుభావులు, భక్తాగ్రగణ్యులు, విశాలహృదయులు, సజ్జనులు. ఆయన విశిష్టాద్వైత మతాభివృద్ధికి గావించిన యత్నములు అసామాన్యములు. వారికృషి నిరుపమానము. వారియందు మానవాతీతమైన పెక్కులక్షణములు గలవు. వారు వైష్ణవమతమునకు అమూల్యసేవ జేసి ప్రతివారికిని మోక్షమార్గమును జూపిన మహనీయులు. వీరు పంచములను సైతము తమ శిష్యులుగా స్వీకరించి భగవంతుని కందరు సమానులే యనియు, మానవసేవయే గొప్పదనియు బోధించి శీలమే ప్రధానము గాని కులము ప్రధానము గాదని నిరూపించిరి. కనుకనే ప్రతివారు రామానుజాచార్యులను శ్రీమచ్ఛేషాంశ సంభూతులుగా భావించి వారి స్వరూప విగ్రహములను భగవత్సన్నిధి యందు ప్రతిష్ఠించి సర్వవేళల పూజించుచున్నారు.

ఇరువదవశతాబ్దమున మహాత్మాగాంధి ప్రబోధించిన అస్పృశ్యతానివారణ హరిజనోద్ధరణ, మానవసేవ, సర్వమానవ సౌభ్రాత్రము మొదలైన విప్లవాత్మక కార్యక్రమములను, తొమ్మిదవ శతాబ్దమునకు

పూర్వమే శ్రీరామానుజులవారు నిర్వర్తించి నూట ఇరువదిసంవత్సర ములు పైగా జీవించి తమ జన్మను ధన్యము గావించుకొనిరి.

శ్రీరామానుజాచార్యుల వారిని గురించి ఒక మహనీయుడు ఈ క్రింది విధముగా దెలిపియుండిరి_

Ramanuja has combined in himself the profundity of a thinker, the humanity of a saint, the heart of Buddha, the head of Sankara and a very great religious, spiritual fervour. Any mention of Ramanuja without Sankara and vice-versa will be incomplete.

రామానుజుని తదనంతరము, వీరి వైష్ణవములో కాలాంతర మున సంస్కృత-ద్రవిడ భేదములచే వైష్ణవులలో విభేదము లేర్పడి "వడగలై", "తెంగలై" అను శాఖలుగ చీలిపోయిరి. శఠకోపాది ఆళ్వారులును, రామానుజాది వైష్ణవాచార్యులును వైష్ణవమును అజేయ మొనరించినను వైష్ణవశాఖలకు, పీఠములకు ఒకవిధమైన కళంకము ఏర్పడుట శోచనీయము. వడగలైశాఖకు వేదాంతదేశికులని ప్రఖ్యాతి గాంచిన వేంకటనాథుడును, తెంగలైశాఖకు పిళ్ళలోకాచార్య, మణ వాళమహాములు నాయకులుగ నుండిరి. వీ రుభయులు సమ కాలికులు. పిళ్ళలోకాచార్య, మణవాళమహామునులు ద్రావిడవేదమే అతిప్రధానమని చెప్పి, రామానుజీయవైష్ణవ, విశిష్టాద్వైతముల కొక ప్రత్యేకతను రూపొందించి "తత్త్వత్రయము" "అర్థపంచకము" మొద లగు గ్రంథములు వ్రాసిరి. అవి ఆ సంప్రదాయ వైష్ణవులకు అతి ప్రధానములై వైష్ణవబాహుళ్యమునకు తోడ్పడెను. వీరికి భక్తికంటే ప్రపత్తి చాలా ముఖ్యము.

"వడగలై తెగవారు" —

**రామానుజదయాపాత్రం జ్ఞానవైరాగ్యభూషణమ్,**
**శ్రీవేంకటేశఘంటాంశం వన్దే వేదాన్తదేశికమ్.**

వీరు రామానుజదయాపాత్రం అని తనియను పఠించుట, పాదములేకుండా, బొట్టుపెట్టుట, వితంతువులకు కేశములుతీయుట, ఏకాదశి తిథియందు శ్రాద్ధములు పెట్టుట మొదలగు నియమములు కలిగి సంస్కృతవేదమునకే ముందు అత్యంత ప్రాముఖ్య మిచ్చి, ఆ తరువాతనే ద్రవిడ ప్రబంధములను పఠించెదరు.

"తెంగలైతెగవారు"—

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్,
యతీన్ద్రప్రవణం వన్దే రమ్యజామాతరం మునిమ్.

అను తనియను పఠించుట, పాదముతో బొట్టుపెట్టుట, వితంతువుకు కేశము లుంచుట, ఏకాదశితిథియందు శ్రాద్ధము నిలుపుట మొదలగు సంప్రదాయములు గలవారు.

195౨ డిసెంబరు 12 ఆంధ్ర దినపత్రికలో "వేంకటాధ్వరి విశ్వగుణాదర్శము-శ్రీమద్రామానుజులు-శ్రీవైష్ణవు" లనెడి వ్యాసములలో శ్రీవైష్ణవులు తమ శిష్యులలో ఎంత గొప్పవారైనను, తమశాఖకు చెందని స్వమతస్థులతోనైనను పంక్తి భోజనముల నంగీకరించెడివారు గారనియు, సాక్షాత్ బ్రహ్మముఖోద్గతములై, సమస్త పురుషార్థములకు సాధనములైన వేదము లుండగా ద్రావిడ ప్రబంధములకే ప్రాధాన్యమిచ్చెడి వారనియు, తెంగలైతెగలవారు జరిపెడి గోష్ఠులలో విద్వాంసులకు సహితము సముచిత స్థాన మీయరనియు, కొందరు శివుని జటాజూటము నుండి వచ్చినదను కారణమున గంగానదిలో స్నానము సైతము చేయరనియు, సముద్రస్నానమును గూడ పరిహరింతు రనియు, ననేక విషయములు స్పష్టముగా వ్రాయబడి యుండెను. ఆళ్వారులు, రామానుజున కంటె పూర్వము నుండి దివ్యస్థలములై విరాజిల్లుచున్న దేవాలయము లనేకము లున్నప్పటికిని, వీరు ఆళ్వారుల ప్రతిష్ఠలేని, ద్రవిడప్రబంధములు పఠింపబడని దేవా

లయములు దివ్యస్థలములు గావనియు, చక్రాంకనము చేయించు కొనని అర్చకుల చేతి తీర్థప్రసాదములను గూడ స్వీకరించ గూడ దనియు భావించెదరు. అనాదినుండి వచ్చుచున్న సంప్రదాయము కాకపోయినను వీరు పై అభిప్రాయములు దెలుపుట వలన ప్రజలలో భేదభావము లేర్పరచి యుండిరి.

రామానుజాచార్యుల వారి కాలములో వారివద్ద స్వయముగా వైష్ణవము తీసుకొనిన వైష్ణవులకు, తరువాతి కాలములో వైష్ణవపీఠాధి పతుల వద్ద వైష్ణవము తీసుకొనిన వైష్ణవులకు, తరువాత వైష్ణవ గురు వులవద్ద వైష్ణవము తీసుకొనిన వైష్ణవులకు, నెటువంటి సంబంధబాంధ వ్యములు గాని, పంక్తిభోజనములు గాని కనీస మొకరి చేతినీరు మరి యొకరు త్రాగుట కంగీకరించెడి పద్ధతులు పూర్తిగాలోపించి ఒకరికన్న మరియొకరు గొప్ప యనెడి భావము ప్రతి తెగవారిలోను ప్రబలినది.

ఈ ఉభయశాఖలు, పుండ్రమును ధరించుటలోను, శ్రాద్ధము పెట్టుటలోను, వితంతువులకు కేశములు తీయించుటలోను, పవిత్ర మైన దేవాలయములలో స్వామివారికి బొట్టుపెట్టుటలోను, తీర్థప్రసా దములు స్వీకరించుటలోను వేదపఠనములోను మొదలగు విషయ ములలో తీవ్రవైషమ్యములు అభిప్రాయ భేదములు గలిగి ప్రవర్తించి ప్రజలలో గూడ రెండువర్ణములుగా విభజించి వైష్ణవాభిప్రాయము లకు కళంకము ఏర్పరచి, విశిష్టాద్వైత మతవ్యాప్తి నిరోధకులుగా, అడ్డుగోడలుగా నిలిచి అప్రతిష్ఠ తెచ్చిరి. ఈ సంక్షోభము శ్రీమద్రా మానుజుని యనంతరము రెండు శతాబ్దముల నాటికి ఏర్పడినది. పై ఉభయశాఖీయులు అహోబిలము-వానమామలై పీఠములకు అధిపతు లుగా నుండిరి. శ్రీవైష్ణవసంప్రదాయస్థులు, విశిష్టాద్వైతమతమును ప్రథమమున శ్రీమన్నారాయణుడు జగజ్జననియైన శ్రీమహాలక్ష్మికిని, శ్రీదేవి భగవత్పార్షదుడైన విష్వక్సేనునికి, ఆయన శఠగోపస్వామికిని,

వీరు శ్రీనాథమునికి, ఈయన పుండరీకాక్షునకు, వీరు శ్రీరామమిశ్రునకు, శ్రీరామమిశ్రులు యామునాచార్యులవారికి, ఈయన మహాపూర్ణులకు బోధించినట్లు వీరి గ్రంథములవల్ల తెలియుచున్నది.

వీరి గురుపరంపరలో "నాథయామునమధ్యమామ్" అని చెప్పుకొనుచున్నారు. ఈ వచనమును బట్టి నాథముని తరువాతనే ఈ వైష్ణవసంప్రదాయ మున్నట్లు తెలియచున్నది. వారికి ముందు కాలములో గూడ ఈ సంప్రదాయవైష్ణవ ముండియుండిన యెడల నాథమునుల ముందుకాలపు మహాపురుషులను వారి గురుపరంపరలో చేర్చుకొనవలసి యున్నట్లున్నది. వీరిలో కొంతమంది పండితులు ఈ క్రింది విధముగా చెప్పియుండిరి-

లక్ష్మీనాథసమారంభాం శ్రీపరాంకుశమధ్యమామ్.
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్.

దీనిని బట్టి శ్రీవైష్ణవసంప్రదాయ వైష్ణవాచార్యులే ఏది ప్రమాణమో తెలియజేయుట ముఖ్యము.

ద్రవిడప్రబంధములే జీవనాధారముగా గొనియున్న ద్రవిడ సంప్రదాయ వైష్ణవులు కొందరు కేవలము స్వప్నసిద్ధాంత రచనలైన ద్రవిడప్రబంధములే వేదములకంటె మిన్నయని భావించుట అవివేకముగానున్నది. సంస్కృతవేదములు అధ్యయనము చేయుటకు సమర్థతలేని వారికి మాత్రమే ద్రవిడప్రబంధములు అధ్యయనము చేయవచ్చునని తెలియుచున్నది. పై విషయమును గురించి కొందరు ప్రముఖ రామానుజీయ వైష్ణవపండితులే తమ అభిప్రాయములను ఈ క్రింది విధముగా దెలియపరచిరి-

1. విద్యారణ్యపంచానన, విద్యావాచస్పతి, కళానిధి, శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యుల వారు తమ స్వీయరచన యగు "అనందనందనసంవాద" మందు సంస్కృత వేదమే ప్రధానమని వక్కాణించియుండిరి.

2. కావ్యరత్న - వేదాంతరత్న - వేదాంతతీర్థ, వేదాంతవాచస్పతి- శ్రీమాన్ కందాడై శేషాచార్యుల వారు తమ రచనలలో పై భావములు వ్యక్తముజేసి యుండిరి.

3. కవిత్రయ మిత్ర-కవికళానిధి శ్రీమాన్ గొట్టుముక్కల రమా కాంతాచార్యులవారు, వారి ఉపన్యాసగ్రంథములలో ద్రవిడ ప్రబంధములను ఉపేక్షించిరి.

రామానుజుల తరువాత మణవాళమహామునుల వరకు ద్రవిడ ప్రబంధములు విశేషప్రచారములో లేవని వీరు స్థిరీకరించిరి. మణవాళ మహామునులు కాలము నుంచి ద్రవిడప్రబంధములు విశేష వ్యాప్తిలో నికి వచ్చి బహుళ ప్రచారమైనట్లు తెలియుచున్నది. ఏది ఎట్లున్నను శ్రీరామానుజీయ వైష్ణవములో ఎన్ని భేదాభిప్రాయము లున్నను, చాలకాలము నుండి, నేటివరకు విశిష్టాద్వైతమత ప్రచారము, వైష్ణ వములోగల అమూల్యభావములు, భక్తిమార్గములు, ఈ శాఖీయులు ప్రజలలో విరివిగా వ్యాప్తిచేయుచు వైష్ణవ విశిష్టతను కాపాడుచున్నా రనుటలో నతిశయోక్తి లేదు. వైఖానసులుగాని, పాంచరాత్రులు గాని తాము చేయు దేవాలయ నిత్యవిధులనే చేయుచు, కాలము గడపు చుండిరి. రామానుజీయులు తమలో గల భేదములు విస్మరించి వైష్ణవమత ప్రచారము ఐకమత్యభావముతో ప్రచారము జేసిన, వైష్ణవము మరింత అభివృద్ధియై సర్వజనులు వాటిలోగల సరళ స్వభావములు తెలుసుకొనుటకు వీలగును. ఈ పరిస్థితులు తిరిగి ఏర్పడినప్పుడు వైష్ణవము మరియొక వెలుగు వెలుగునని చాలమంది అభిప్రాయము.

## ద్వైతమతము - మధ్వాచార్యులు

ఏ తత్త్వశాస్త్రమయినా గతచరిత్రలోనున్న కొన్ని లక్షణాలను దీసుకొని మరికొన్ని లక్షణాలను త్రోసిపుచ్చి తాను ప్రబోధించే

నూతన మార్గమును ప్రబోధించును. ద్వైతతత్త్వవేత్త మధ్వాచార్యులు శంకరుల వారి అద్వైతాన్ని నిరసించి, రామానుజులవారి విశిష్టాద్వైతము నుంచి కొన్ని లక్షణములు స్వీకరించి తాము బోధించిన ద్వైతానికి పుష్టినిచ్చి ప్రచారము గావించిరి.

మధ్వాచార్య నిర్మితమై ప్రబోధింపబడిన ద్వైతము గూడా, వైష్ణవమున భాగముగా నుండి ఒప్పుచున్నందున, రామానుజీయము నుండి, దానిని ప్రత్యేకించుటకై శ్రీవైష్ణవమునకు మారుగా "సద్వైష్ణవము" అని చెప్పుకొనెను. వీరి ముఖ్యప్రబోధము, హరియే మూల సత్యము, అమలమైన సుఖానుభూతికి భక్తియే ముఖ్యసాధనము, అఖిలవేదములకు హరియే ముఖ్యుడు అని.

1199వ సంవత్సరమున (విళంబి సంవత్సర ఆశ్వయుజ శుద్ధ దశమి) భారతదేశములో దక్షిణకర్ణాటక రాష్ట్రమున ఉడిపికి ఆరు మైళ్ల దూరమున గల "బెల్లె" అను గ్రామమున, "మధ్యగేహ-వేదవతి" అను బీదబ్రాహ్మణ దంపతులకు ఉడిపిలో మధ్వాచార్యులు జన్మించిరి. ఈ దంపతులకు ప్రథమమున ఇద్దరు కుమారులు గలిగి బాల్యదశలోనే ఇరువురు మరణించిరి. మధ్వాచార్యుల అసలు పేరు వాసుదేవుడు.

వాసుదేవుడు మొదటి నుండియు శరిరపుష్టి గలిగి పాఠశాల విద్యకంటె క్రీడావినోదములమీద ఎక్కువ శ్రద్ధ చూపుచుండెడివాడు. దానికితోడు, వీరు నివసించే ప్రాంతముగూడా ప్రకృతి సౌంద ర్యంతో నుండెడిది. చదువుకంటె ఆటల్లో, పాటల్లో, వ్యాయామములో కుస్తీలలో ఎక్కువ అభిలాష చూపుచుండెడివాడు. వీరు ఆధ్యాత్మిక ప్రచారముతో బాటు శారీరక ప్రదర్శనాలకు గూడ దిగుచుండెడి వారు. వీరు పాఠశాల విద్యను లెక్కచేయక పోయినను వంశపారం పర్యముగ వచ్చుచున్న వేదవేదాంగముల నభ్యసించుట మానక శ్రద్ధతో నేర్చుకొను చుండెడివారు. వీరికి 8వ ఏటనే ఉపనయనము

జరిగెను. వీరు ఇరువది అయిదు సంవత్సరములకే అచ్యుతప్రేక్షకాచార్యుల వారివద్ద సన్యాసాశ్రమము దీసుకొని "పూర్ణప్రజ్ఞ" అనే బిరుదును బొందిరి.

ఆనందతీర్థ భగవత్పాదాచార్యులవారు అను పేరు సన్యాసాశ్రమ స్వీకార సమయమున స్థిరీకరింపబడినది. వీరి గురువు అద్వైతవాదియైన అచ్యుతప్రేక్షకులు. మధ్వాచార్యులకు వీరు అద్వైతము బోధించినను, మధ్వాచార్యులకు కలిగిన అనుమాన భయములవల్ల అద్వైతము నందు అసంతృప్తి పెరిగి గురుశిష్యుల మధ్య వాగ్వాదములు హెచ్చు కా జొచ్చెను. వీరికి అద్వైతమునందు గలిగిన అనుమానాలకు ఆ తత్త్వములోని కొన్ని బలహీనతలు గూడా తోడు కా జొచ్చినవి. శంకరుని తదనంతరము వారి శిష్యులలో ఈ తత్త్వం వికార రూపములు ధరించి, ఈ ప్రపంచం అనిత్యం, "అహం బ్రహ్మాస్మి" అనే భావములు అనేక అపార్థములకు తావిచ్చి అహంకారమునకు దారి తీసినవి.

శంకరాచార్యులు సృష్టించిన అద్వైతతత్త్వాన్ని రామానుజులు కొంతవరకు సడలిస్తూ పరిపూర్ణ భావాన్ని అంగీకరిస్తూనే కొంత భేదభావాన్ని ప్రవేశపెట్టిరి. ఈ భేదభావాన్ని మధ్వాచార్యులు నమ్మి ప్రచారము చేసిరి. అద్వైత-విశిష్టాద్వైత తత్త్వముల లోని కొన్నింటితో పూర్తిగా ఏకీభవించక, అద్వైతసిద్ధాంతమును పూర్తిగా ఖండించెను. రామానుజాచార్యులు వేదములలో ప్రతిపాదింపబడిన సగుణబ్రహ్మాను విష్ణువును ప్రధాన నామముగ గ్రహించి, సాధకుని కేంద్రస్థానముగా నొనరించి వైష్ణవము నుద్ధరించి సర్వజనులకు సహాయముజేసినట్లు తెలుసుకొంటిమి. కాని రామానుజుని సిద్ధాంతమున అద్వైతభాగము నుండి జీవుడు - జగత్తు-విష్ణువున కంశములుగా నెల కొల్పబడి, అతనికి స్థూల-సూక్ష్మదేహములతో సంబంధము పరిగణింపబడియుండెను. రామానుజుని అద్వైతసిద్ధాంత ఖండనము కొంత మందిని సంతృప్తి పరుపజాలక పోయెనని కొంద రభిప్రాయపడిరి.

సాధకులకు చేయూత నిచ్చే దయామయుడైన భగవంతు డొక డుండి, భక్తుని శాంతిమార్గమున చేర్చుటకు, అవకాశ ముండ వలయునని, అట్టి భగవాను నొకనిని ప్రతిపాదన చేయవలసిన ఆవశ్యకత కలదని మధ్వాచార్యుల వా రవతరించి ఆ పనిని నిర్వర్తించిరి. అతని సిద్ధాంతములలో విభిన్నత్వము సత్యము, సర్వప్రమాణము అని బోధించెను. ప్రపంచ మిథ్యాత్వము ప్రతిపాదించు వాక్యములు ఉపనిషత్తులలో కొన్ని కనిపించినచో, జగత్సత్యములని నిరూపించు అసంఖ్యాకవాక్యములు అందు గోచరించుచున్న వని మధ్వాచార్యులు వాదించిరి.

శంకరుని కాలమున ఎక్కువగా జనించిన బౌద్ధవిరుద్ధ భావములు అర్థము గాకుండుటయు, అంతుబట్టని అద్వైతసిద్ధాంతము నందలి అసంతృప్తియున్నా, రామానుజుని విశిష్టాద్వైతమునందు కొన్ని లోపములు, వారిలోగల అనైక్యతవల్ల వితర్క వాదము అభివృద్ధి యగుట మధ్వాచార్య స్వకీయసిద్ధాంతమునకు మిగుల తోడ్పడినవి. మధ్వాచార్యులకు-రామానుజాచార్యులకు కొన్ని పోలికలున్నను, శంకరాచార్యులవారి భావములను, పూర్తిగ వ్యతిరేకించి, పంచభేదముల నంగీకరించిరి. వీరు ద్వైతసిద్ధాంతమును విశదీకరిస్తూ 37 గ్రంథములు రచించినారు.

## పంచభేదములు

1. భగవంతునికి=జీవాత్మకు నున్న భేదము.
2. భగవంతునికి=పదార్థానికి నున్న భేదము.
3. జీవాత్మకు=పదార్థానికి నున్న భేదము.
4. జీవాత్మకు=జీవాత్మకు నున్న భేదము.
5. పదార్థములో-ఒకభాగానికి-మరియొక భాగానికి నున్న భేదము.

ఈ యన్నింటికి గల భేదములను అంగీకరించుటయే గాక, శాశ్వతమైనవని గూడ చెప్పెను. ద్వైతులు ఈ భేదా లన్నింటిని నంగీకరించిరి. వారికి ఈ భౌతిక ప్రపంచము వాస్తవమైనదే గాక, శాశ్వతమైనదని విశ్వసించెను.

మధ్వాచార్యులు అనుష్ఠించి, ప్రచారము జేసినది గూడా వైష్ణవమే. వీరు చెప్పుకొనే "సద్వైష్ణవంలో" విష్ణువే ఆదిశక్తి. ఈ ప్రపంచానికి అధిపతి ఆయనయేయని ఈ తత్త్వవేత్త ముఖోద్దేశ్యము. అయితే ఆత్మ-ప్రపంచం రెండున్నూ భగవంతుని మీాద ఆధారపడి యుండును. ఆ పరమాత్మను తెలుసుకొనుట అగోచరము. సర్వ స్వతంత్రుడు-నిత్యుడు అయిన భగవంతుని కేంద్రముగాపెట్టి మిగిలిన భేదాలన్ని గూడా సత్యమైనవి-నిత్యమైన వని చెప్పిరి. భగవంతుడు జ్ఞానాన్ని నైతికవిలువలు పొంది ఉన్నాడనియు, ఆయన అర్ధాంగి "లక్ష్మి" యనియు, ఇద్దరు వాస్తవికమైన వారే యని చెప్పిరి. "బ్రహ్మ సృష్టికర్త", "వాయువు సంధానకర్త" యని నిర్వచించిరి. "భగవంతుడు-ఆత్మ-ప్రపంచము" అనేవి అనాదినుండియు నున్నవే యనియు శాశ్వతముగా నుండుననియు, ఇవి మూడు వాస్తవికములే అయినప్పటికి, ఆత్మ-ప్రపంచం భగవంతునిమీాద ఆధారపడియుండు నని ఈ తత్త్వవేత్త ప్రధానోద్దేశ్యము.

సృష్టి-స్థితి-లయ జ్ఞానాలకు విష్ణువు మూలాధారుడనియు, హరియే బ్రహ్మము-గురువు-తండ్రి, సర్వము హరియే యని వీరి విశ్వాసము. ఆ హరియే సర్వమునకు శరణ్యమనియు బోధించి, ఆ హరికి కల్యాణ-గుణ-సముచ్చయమును, పూర్ణముగ నన్వయించి, నారాయణుడే అనంత అద్భుత కల్యాణగుణగణ పరిపూర్ణుడని బోధించి, అతడే సృష్టికర్త యని వివరించి, భక్తిలో ఉన్మత్తుడై, భక్తితత్త్వము నకు అపరిమిత ప్రాముఖ్యమిచ్చెను. విష్ణుపాదలబ్ధియే మోక్షము. దానికి నిర్మలమైన భక్తియే సాధనమని ప్రబోధనలు గావించి, ముముక్షువు

లకు మార్గదర్శకుడై ఉపదేశకుడై, శంకరాద్వైతమునకు ప్రత్యర్థిగా నిలబడి ప్రఖ్యాతి వహించెను. అద్వైత విశిష్టాద్వైతమత ప్రచారములు దేశములో బహుళవ్యాప్తముగా జరిగినట్లు ద్వైతమత ప్రచారము విరివిగా జరుగలేదు.

వీరి బోధనలు

1. నిష్కామముగా నైతికవిలువలను అనుష్ఠించాలి.
2. నైతిక బాధ్యతలను నెరవేర్చాలి.
3. నైతికజీవితం జ్ఞానపరిశోధనకు సహాయపడుతుంది.
4. నైతికజీవితానికి ధ్యానం ఉపకరిస్తుంది.
5. ధ్యానంవల్ల ఆత్మ భగవంతుని స్పృహను పొందగలుగుతుంది.
6. అలా పొందగలిగినప్పుడే శృంఖలాలు విడివడి ముక్తి సిద్ధిస్తుంది.
7. అన్ని బాధలనుండి విముక్తిని బొందుటయే మోక్షం. అదియే పరిపూర్ణత.

వీరు దక్షిణ, ఉత్తర ప్రాంతములు పర్యటించి అద్వైత ప్రాభవా న్నెదుర్కొని తమ మతమును బోధించిరి. వీరు వ్రాసిన వ్యాఖ్యలు - భాష్యములు - గ్రంథములు ద్వైతమతాన్ని సమర్థిస్తూ వ్రాసినవే. వీరు 79వ ఏట పరమపదించినట్లు తెలియుచున్నది.

శంకర-రామానుజ-మధ్వ మతాచార్యులు ఆచార్యత్రయ మని పిలువబడిరి. వీరియందు గాని, వీరి సిద్ధాంతముల యందు గాని స్థూలదృష్టికి భేదము కనబడినను, సూక్ష్మదృష్టికి విరోధభేదములు లేవు. పై ముగ్గురును వేదములే ప్రమాణములని నిరూపించి, వేద

ముల ననుసరించిరే గాని, వేదములకు భిన్నముగ ప్రవర్తింపలేదు. వేదసమ్మతములయిన మతములు గావుననే నేటికిని చిరస్థాయిగానుండి అనేకులచే ఆచరింపబడుచున్నవి. వీరి ద్వైతమునందు "ప్రకృతి-పురుషుడు" రెండే తత్త్వములు. పురుషుడు పరమాత్మ. ప్రకృతి రెండు విధములు. పరాప్రకృతి-అపరాప్రకృతి. పరాప్రకృతి అనగా జీవాత్మల సమూహము. అపరాప్రకృతి యనగా అచేతన వస్తుసముదాయము. ఈ విధముగ చేతనాచేతనాత్మకమైన ప్రకృతి ఒక తత్త్వము. వీనిని నియమించు ఈశ్వరుడు మరియొక తత్త్వము. ఈ రెండు ప్రధానమగుటచే ద్వైత మనబడినది.

ద్వైత మనగా భేదము. అద్వైత మనగా అభేదము. అద్వైతమున జీవాత్మ-పరమాత్మలకు అభేదము చెప్పబడుచున్నది. జీవాత్మ పరమాత్మలకు భేదము ప్రతిపాదింపబడుటచే ఈ మతమునకు ద్వైత మని ప్రసిద్ధి గలిగినది. ద్వైతమునకు శ్రీహంసరూపియైన నారాయణ మూర్తిని ఆదిగురువుగా నిశ్చయించినారు. ఈ మతము నూతనముగా స్థాపింపబడ్డినది గాదు. మతములు అనాదికాలసిద్ధములు. "అనాది కాలతః సిద్ధాః సమయా హి ప్రవాహతః" అను వచనము ప్రమాణము. విష్ణువుయొక్క సర్వోత్తమత్త్వము, జీవబ్రహ్మాదులకు గల పారమార్థిక భేదములు మొదలగు తత్త్వములు మధ్వాచార్యులు విశదముగా తెలియపరచిరి. మధ్వాచార్యులవారి సమకాలికులు మరియు శిష్యులగు శ్రీత్రివిక్రమపండితార్యులచే "వాయుస్తుతి" అను స్తోత్ర గ్రంథము నందును, "మధ్వవిజయ" మను 16 సర్గలు గల మహాకావ్యమునందును ద్వైతసిద్ధాంతము చక్కగా నిరూపింపబడియున్నది.

## ద్వైతమతసారాంశము

1. బ్రాహ్మణాది వర్ణములు - బ్రహ్మచర్యాశ్రమములు మొదలైన జగత్తు అంతయు సత్యమైనది. మిథ్య గాదు.

2. శ్రీహరి సర్వోత్తముడు-వాయుభగవానుడు జీవోత్తముడు.

3. శ్రీమహావిష్ణువే పరబ్రహ్మ. అతడు సర్వజ్ఞత, జగత్కర్తృత్వము మొదలగు సమస్తగుణములచే పరిపూర్ణుడు.

4. పరబ్రహ్మ (విష్ణువు)-జీవునికటె భిన్నుడు.

5. ఈ జ్ఞానమే మోక్షమునకు సాధనము.

# 12. ప్రముఖులైన తత్త్వవేత్తలు

## విష్ణుస్వామి

రుద్రసంప్రదాయ ప్రథమాచార్యుడైన విష్ణుస్వామి రాధా కృష్ణుల నధిష్ఠానదైవముగ నుంచుకొని తన శాఖకు సంబంధించిన వైష్ణవమునకు ప్రథమాచార్యుడై, సంస్థాపకుడై జ్ఞానదేవునకు సమ కాలికుడుగా నుండెనని ఘుర్యేపండితుడు తెలిపియుండెను. ఇతడు సన్యాసియై, సన్యాసులకు రుద్రసంప్రదాయము నెలకొల్పుట అతని భావమైనట్లు తెలియుచున్నది. రుద్రసంప్రదాయము అతిప్రాచీనము. విష్ణుస్వామి దక్షిణాపథమున పాండ్యదేశ ప్రభువుయొక్క ఆస్థాన పండితుడైన దేవేశ్వరుని కుమారుడని తెలియుచున్నది. 13వ శతాబ్ద మునకు చెందినవాడని ఆర్. జి. భండార్కర్ పండితుని అభిప్రాయము. మహారాష్ట్రమున అధిక ప్రఖ్యాతులైన జ్ఞానదేవులు, నామదేవులు విష్ణుస్వామికి శిష్యులనియు, వల్లభుని తండ్రి విష్ణుస్వామి వంశమునకు చెందినవాడనియు కొందరు దెలిపియుండిరి. తన సిద్ధాంత ప్రచారా ర్థము విష్ణుస్వామి "సర్వజ్ఞసూక్తము" అను నామము నిర్మించెనట. విష్ణుస్వామిని గురించి జీవితవిశేషములు గాని, ఇతర ఆధారములుగాని ఎవ్వియు గానరాకున్నవి. క్రీ. శ. 5వ శతాబ్దము వాడని మరికొందరు చెప్పుచున్నారు. ఎవరెన్ని చెప్పినను భండార్కర్ గారి అభిప్రాయమే ఖాయమని కొంద రనుచుండిరి. విష్ణుస్వామి అతి ప్రతిభావంతుడు, విద్వాంసుడు, తపోనిష్ఠాగరిష్ఠుడై ఆత్మానుభూతి పొందిన మహాను భావుడు. అద్వితీయ బ్రహ్మము సాకారమనియు, ఉపాసనావిధాన మున శ్రీకృష్ణుడే ప్రధానమనియు ఇతని ముఖ్యోద్దేశ్యము.

# నింబార్కాచార్యులు (నింబాదిత్యుడు)

నింబాదిత్యుడు సనకసంప్రదాయ వైష్ణవపద్ధతి ననుసరించెను. నింబార్కుడు శంకర-రామానుజ-మధ్వాది ఆచార్యులు భగవంతుని గురించి తెలిపిన అభిప్రాయములు సమన్వయించి అన్నియు సత్యములే యని నిరూపించెను.

నింబార్కుడు బళ్లారిజిల్లా, ముంజీపట్టణవాసి యనియు, అదియే నింబగ్రామ మనియు, తరువాత వారు బృందావనమున కేతెంచిరని కొందరు, బృందావనమున యమునాతీరమున జన్మించెనని కొందరు, ఆంధ్రదేశమున కడపజిల్లాలో జమ్మలమడక తాలూకా మంగపట్టణమున జన్మించెనని కొందరు చెప్పుదురు. సరస్వతీజగన్నాథులు ఇతని పితామహులు. వైష్ణవవంశమున గల బ్రాహ్మణ కుటుంబములో నింబార్కు డవతరించెను. అతడు ఆజన్మ నైష్ఠికబ్రహ్మచర్య వ్రతస్థుడు. సుమారు 13వ శతాబ్దమునకు చెందినవాడని శ్రీ రాధాకృష్ణపండితుని భావము. 1162వ సంవత్సరమున నింబార్కుడు మరణించినట్లు భండార్కర్ పండితుని నిర్ణయము. ఇతడే నింబార్క, నింబాదిత్య, నిత్యానంద, హరిప్రియ, నియమానంద నామములతో పిలువబడెను.

నారదుడు నింబార్కునకు గురువైనట్లు అతని సూత్రభాష్యముల వల్ల తెలియుచున్నది. నారదుడు నింబార్కుని కాలములో నుండెనా యని పాఠకులు సందేహించ నక్కర లేదు. నారదునిపై తనకు గల అపార భక్తివిశ్వాసములచే నింబాదిత్యుడు స్వీయ గురుదేవునిగా భావించి స్తుతించినట్లు తెలియుచున్నది. నారదమునీంద్రుని వ్యక్తిత్వము, వారి బోధనలు ఎక్కువగ నింబార్కు నాకర్షించెను.

రామానుజ - మాధ్వ - వైష్ణవములకంటె నింబార్కవైష్ణవము ఉత్తరదేశములో బహుళ వ్యాప్తినొంది, అసంఖ్యాకమైన భక్తఅనుచర కోటిని సంపాదించియున్నది. రామానుజ-మధ్వాచార్యు లిరువురు వారి రచనలలో తాత్త్వక మొనర్చిన భక్తిభావములు హెచ్చుగా

నుండెను. నింబార్కాచార్యులు శ్రీకృష్ణతత్త్వమును సంపూర్ణము గావింప రాధికను ప్రవేశపెట్టి ఆ మూర్తి ద్వయముతో భక్తుడు కూడ ఆటలు పాటలు పాడుచు, తన్మయత్వమునందు నవకాశ మొనర్చి ముముక్షువుల కెంతయు నుపకారము చేసెను.

శ్రీకృష్ణ పాదారవిందములకంటె అన్యశరణ్యము లేదు. బ్రహ్మ శివాదులచే నర్చింపబడుటయే నిదర్శనము. శ్రీకృష్ణపరమాత్మ భక్తుల కోర్కెల ననుసరించి, సుగమధ్యానమునకై శరీరధారణ గావించెనని నింబార్కుని గాఢవిశ్వాసము. వైష్ణవ మతస్థాపనకార్యమున రాధను శ్రీకృష్ణుని సతిగా నిరూపించి, లక్ష్మీవిష్ణువుల స్థానమున రాధాకృష్ణుల నెలకొల్పుట గొప్ప విశేషము. ఈ సాంప్రదాయక సాధుపుంగవులు ఒకరినొకరు అభినందించు కొన్నపుడు "రాధేశ్యామ్" అని ఉచ్చరించెదరు. వారు చేయు నామసంకీర్తనము గూడ "రాధేశ్యామ్" అను నామమున ప్రార్థింతురు. భారతావనిలో విరాజిల్లు సంప్రదాయములలో అత్యధిక ప్రభావమును, జనాదరణమును పొంది, నేటికిని దేశ వ్యాప్తిబొందిన ఈ "రాధాకృష్ణ" సంప్రదాయ విధానమునకు నింబార్కాచార్యులు ప్రముఖవ్యక్తి యని అభినందింపబడిరి.

భక్త జయదేవునిపై నింబార్క ప్రభావము ఎంతగనో చూపెను. ఈ రాధాకృష్ణ భక్తిసంప్రదాయము వల్లభాచార్యులు, గౌరాంగ, మీరాది భక్తాగ్రేసరుల హృదయమున జొచ్చి విశాలవ్యాప్తమై, అసంఖ్యాక భక్తహృదయముల నాకర్షించి విశేషవ్యాప్తి చేసి నిర్వహించిన మహావ్యక్తి.

ఇతడు భక్తిమార్గములోను, సూత్రభాష్యమునకు రామానుజుని ఆదర్శముగా తీసుకొనెను. ఉత్తరదేశమున బహుళవ్యాప్తిలో నున్న ఈ సంప్రదాయస్థులు నేపాళము, వంగరాష్ట్రములలో బహుళముగా నుండిరి. వీరి ముఖ్యకేంద్రము రాజస్థానలో పరశురామపురిలో నున్నది. బృందావనక్షేత్రము గూడా వీరి ముఖ్యకేంద్రము.

ఈ సంప్రదాయము వారు దాస - శరణ అను శబ్దములు నామాంతమున గలిగి, ముఖమున శ్వేత ఊర్ధ్వ పుండ్ర రేఖాద్వయము, వానిమధ్య నొక నల్లని చుక్కయు గలిగి, కంఠమున తులసిమాల ధరింతురు. అవి రాధాకృష్ణ సంజ్ఞారూపమని వీరి విశ్వాసము. సుమారు 9వ శతాబ్దమున భట్టభాస్కరాచార్యుడు ఆ సిద్ధాంతమును స్వీకరించి వేదాంతసూత్రములకు భాష్యము వ్రాసెను. నింబాచార్యులు మనో హృదయములకు జ్ఞానకర్మలకు, ద్వైతాద్వైతములకు సర్వ సమరస సమన్వయము గావించి, ఇతర మతములతో సమన్వయించి భక్తుల సంశయములను బారదోలి విశాలహృదయమున పరమాత్మను శ్రీకృష్ణునిగ భావించి భక్తి తత్త్వమును సులువుగా బోధించిన మహనీయ వ్యక్తి.

## శుద్ధాద్వైతమతము - వల్లభాచార్యులు

ఆంధ్రదేశమున గోదావరీ తీరమున ఆకివీడు సమీపమున కాకరవాడ యను గ్రామమున వెలనాటిశాఖీయ బ్రాహ్మణులైన లక్ష్మణభట్టు-ఇల్లమ్మ అను దంపతులు గలరు. లక్ష్మణభట్టు అనేక యజ్ఞములు చేసెను. కడపటి యజ్ఞము పరిసమాప్తియగు సమయమున 'మీ గృహమందు సాక్షాత్ నారాయణమూర్తి యవతరింప బోవుచున్నా'రని యొక వాక్కు వినబడెను. లక్ష్మణభట్టు మిగుల సంతసించెను.

లక్ష్మణభట్టు భార్యాసమేతుడై తీర్థయాత్రలకు బయలుదేరవలె ననెడి కోరికతో కాశీ, గయా, ప్రయాగాది క్షేత్రములుదర్శించి మహా క్షేత్రమైన వారణాసి యందు నివసించి తరించవలె ననెడి సంకల్పముతో స్థిరనివాస మేర్పరచు కొనెను. కాశిలో అనేకమంది బ్రాహ్మణులకు సంతర్పణ జేసెను. ఒకనాటి రాత్రి రాధాసహిత శ్రీకృష్ణ పరమాత్మ స్వప్నమున కనపడి, మీరు కాశినుండి చంపారణ్య క్షేత్ర

మునకు వచ్చినప్పుడు నా యవతారము లభించునని చెప్పి, ఉత్తరీయము - తులసిమాల తాంబూలము నొసంగి, ఆ వస్త్రమును శిశువునకు కప్పి - తులసిమాలను కంఠమునకు ధరింపజేసి, తాంబూలమును ఉగ్గు పెట్టవలసినదిగా చెప్పెను. కొంతకాలమునకు హిందూ, మహమ్మదీయ స్పర్ధల వలన ఢిల్లీపాదుషా కాశీనగరముపై దండయాత్ర జరుపుటచే ప్రజలు నలుదిక్కులకు పలాయనము చేసిరి. లక్ష్మణభట్టు గూడ తిరిగి దక్షిణదేశమునకు బయలుదేరి మధ్యప్రదేశమున గల రాయపురమండల చంపారణ్య ప్రాంతముల కేతెంచెను.

లక్ష్మణభట్టు భార్య ఇల్లమ్మ గర్భవతియైనందున ప్రసవవేదన చూపట్టెను. తోడి ప్రయాణికులతో సాయంకాలమునకు ముందున్న చౌడానగరము చేరదలచుకొన్నను, అవకాశము లేకుండుటచే అరణ్యమునందే ఇల్లమ్మ పరమేశ్వరానుగ్రహమున సుఖప్రసవము గాంచెను. ఏడవ మాసములో పుట్టిన మగశిశువు చలనము లేకుండుటచే భార్యాభర్తలు వగచి, ఆ శిశువు మరణించెనని తలచి, అరటియాకు నందుంచి జమ్మిచెట్టు తొర్రలో దాచి, మరునటి దినమున ప్రయాణము జేసి చౌడానగరము చేరిరి. కొన్ని దినముల తరువాత కాశిలో జరిగిన అలజడి తగ్గిపోయి ప్రజాజీవనము బాగుగా జరుగు చున్నదని వార్తలు వచ్చినందున లక్ష్మణభట్టు కుటుంబము మరి కొంతమంది మరల కాశికి ప్రయాణము గట్టిరి. తిరుగు ప్రయాణములో తమచే గుప్తముగా నుంచబడిన శిశువు ఏమయ్యెనో దెలుసుకొనవలయు ననెడి కుతూహలముతో అచ్చటికి బోయి చూచిరి.

జమ్మిచెట్టు క్రింద నొక మగశిశువు ప్రకాశవంతుడై సర్వలక్షణోపేతుడై ఆటలాడు కొనుచుండుట చూచి, ఆ శిశువు తన శిశువుగనే భావించి ఇల్లమ్మ బిడ్డ నెత్తుకొనెను. లక్ష్మణభట్టు స్వామివారు కలలో చెప్పినరీతిగ శిశువునకు వస్త్రము గప్పి తులసిమాలను కంఠమున ధరింపజేసి తాంబూలమును ఉగ్గు పెట్టిరి. ఆ బిడ్డకు జాతకర్మ,

నామకరణము మొదలైనవి గావించుకొని కాశికి బోయిరి. 1478 వ సంవత్సరమున జన్మించినట్లు చెప్పుచున్నారు. ఇతనికి వల్లభుడు అని పేరు పెట్టిరి. వల్లభుని జననకాలము నిర్ధారణ చేయలేకున్నను రాధాకృష్ణ మహాశయుడు 1401వ సంవత్సరమని వ్రాసియుండిరి. లక్ష్మణభట్టు తిరిగి కాశీపుర నివాస మేర్పరచుకొని తన పిల్లవానికి ఆరవయేటనే అక్షరాభ్యాసము జేసి నారాయణభట్టు అనే విద్వాంసుని వద్దకు బంపెను. కొంతమంది మధ్వానందస్వాముల వారి వద్దకు విద్య నేర్చుకొనుటకు బంపినట్లు వ్రాసియుండిరి. ఆచార్యులు తన అమానుష మేధాశక్తిచే చతుర్వేదములను, షట్శాస్త్రములను, అష్టాదశపురాణములను, వేదవేదాంగములను, అధ్యయనము జేసి నాటి సర్వశాస్త్రములను పఠించెను. తన పదియవ సంవత్సరముననే అపార విద్యావైభవము నార్జించుట అసాధారణము, అమానుషము నయిన ప్రజ్ఞయుండుట వలన, అనుచరులు ఇతనిని అగ్నిదేవుని యవతారముగ విశ్వసించి అర్చింపసాగిరి. వీరు ఏ యే ఆచార్యులవద్ద ఏ యే విద్యలుగలవో వాటి నెల్ల చదివి మధ్వసంప్రదాయ గ్రంథములు పూర్తిగ పఠించిరి. వల్లభుడు జాతివిచక్షణను పాటించువాడు కాడు. లక్ష్మణభట్టు యింటి సమీపమున "ధాడి" యను హీనకులస్థుడును, పంచమజాతివాడైన సగుణదాసుడనువాడు, సద్గుణములు గలిగి నిత్యము వల్లభుని దర్శనము జేసుకొని ప్రసాదములు తీసుకొని పోవుచుండిరి. వల్లభుడు వానియొక్క కులము నెంచక వానికి గల మంచిగుణములను మెచ్చుకొని, వాని యింటికి బోవుచుండిరి. తక్కువజాతివారి యింటికి వెళ్లవద్దని తండ్రి యెంత వారించినను—

'స్త్రియో వైశ్యా స్తథా శూద్రా, స్తేఽపి యాంతి పరాం గతిమ్'

అని యున్నదిగదా యని తండ్రితో చెప్పి కులప్రసక్తియందు విశాల భావము చూపెను.

తన పదకొండవ యేటనే పితృవియోగము సంభవించినందున తల్లిని దక్షిణదేశమున గల స్వస్థానమునకు బంపి వల్లభుడు తన సిద్ధాంత ప్రచారమునకు దేశపర్యటనకు బయలుదేరెను. చిన్నతనమునందే కాశిలో జరిగిన విద్వన్మండలిలో పాల్గొని తన ప్రత్యర్థుల నిరుత్తరులుగ జేయుచు, ఇతరులచే గూడ సభాగౌరవమునొందు చుండెను. ఎన్ని సిద్ధాంతములు చదివినను మధ్వయతీంద్ర శాస్త్రములను, ప్రత్యేకముగ విచారించి, విష్ణుస్వామి భావములను అధికతర శ్రద్ధతో పఠించి, తన సిద్ధాంతమునకు అనుకూలముగ స్వీకరించి, ప్రత్యేకముగ "శుద్ధాద్వైతమని" పేరుపెట్టెను. ఒక విధముగ విశిష్టాద్వైత సిద్ధాంతములను సమర్థించుచు, అద్వైత మాయావాదమును ఖండించు చుండెడివాడు.

తన పన్నెండవ సంవత్సరమున ఉజ్జయినీ నగరము చేరి, అక్కడ అనేకులను శుద్ధాద్వైతవాదులుగ జేసుకొని దక్షిణదేశమునకు బయలుదేరి వివిధ సిద్ధాంతములను గ్రహించుచు, వల్లభుడు తన మాతామహుడు నివసించు విద్యానగరమును చేరెను. వివిధమతపండితులుగల విద్యానగర సంస్థానాధిపతియైన శ్రీకృష్ణదేవరాయలు వల్లభుని రాకనెరింగి సభను ఏర్పాటు చేయగా వల్లభుడు తన అసాధారణ ప్రజ్ఞచే వివిధసిద్ధాంతములను ఖండించి శంకర మాయా వాదమును సునాయాసముగా ఖండించుట జూచి, కృష్ణదేవరాయలు మహానందముతో వల్లభుని అనేక విధములుగ సన్మానించి గౌరవించెను. అప్పటికి వల్లభుని వయస్సు 14 సంవత్సరములు.

విద్యానగర వైష్ణవసంఘము శ్రీవల్లభుని తమ వైష్ణవపీఠమునకు ఆచార్యులుగా ఎన్నుకొని "ఆచార్య" యని పిలిచిరి. మరల వల్లభుడు ఉత్తరదేశమున గోకులవ్రజప్రాంతములు, మధుర, చూనార్ మొదలగు ప్రదేశములలో ప్రచారము సాగించి మహారాష్ట్ర-రాజస్థానములయందు శుద్ధాద్వైతమును నెలకొలిపి కాశీనగరము చేరెను.

మరల దిగ్విజయ యాత్రకై హిమవన్నగ ప్రాంతములు, హరిద్వార, హృషీకేశ, కేదార, బదరికాశ్రమములు దర్శించి బృందావన క్షేత్రము చేరి నివాసము ఏర్పరచు కొనెను. ఈ ద్వితీయ యాత్రాసందర్శనమున పండరివిఠలనాథుని దర్శించు సమయములో వివాహవాంఛ గలిగి తన 23వ సంవత్సరమున బ్రాహ్మణ కుటుంబమునకు చెందిన మధురమంగళుని కుమార్తెయైన లక్ష్మి యను కన్యను వివాహము జేసుకొనెను. అమెకు గోపీనాథుడు- విఠలనాథు లను నిరువురు కుమారులు గలిగిరి.

తృతీయ పర్యాయము మరల వల్లభుడు యాత్రకై బయలు దేరి చివరకు ప్రయాగ క్షేత్రమున యమునానదీ తటమున "అడైలు" గ్రామమున స్థిరనివాస మేర్పరచుకొని తన సిద్ధాంతములను బోధించు చుండెను. వల్లభాచార్యులకు సంబంధించిన పీఠములు 84 గలవు. వల్లభుని మరణానంతరము పీఠాధిపత్యమునకై వారి కుమారు లిరువురు కయ్యములాడు కొనగా అక్కడి ప్రభువు విచారించి జ్యేష్ఠుడగు గోపీ నాథునకు పీఠాధిపత్య మొసంగెను. కాని గోపీనాథుడు అకాలమృత్యువు వాతబడుటచే ద్వితీయుడైన విఠలనాథుడు పీఠ మలంకరించెను. ఇరు వురు గూడ మహాప్రజ్ఞావిశేషములు గల విద్వాంసులు. విఠలనాథుడు మరణించిన తరువాత ఇతని ఏడుగురు పుత్రులలో నాలుగవ కుమారు డైన గోకులనాథుడు "మహారాజు" అను బిరుదము గడించి "గోస్వామి" అను నామముతో దేశవ్యాప్త కీర్తి గాంచెను. వల్లభా చార్యుడు విస్తార విద్యాపారంగతుడు మాత్రమే గాక, అకుంఠితవాద చాతుర్యశీలుడు, బహుళ గ్రంథకర్త. తన చరమజీవితము వారణాసి యందు గడుపబూనుకొని గృహస్థాశ్రమము విసర్జించి, తురీయాశ్ర మము స్వీకరించి పూర్ణానందస్వామియై నలుబదిదినములు తపోనిష్ఠలో నుండి తన 52వ ఏట 1531 లో సిద్ధి బొందెను. ప్రపంచమునందలి యోగ్యవస్తువు లన్నియు అనుభవించుటకు గలిగినవే యని ఈ మత

స్థుల యభిప్రాయము. వీరు శ్రీకృష్ణపరమాత్మనే నమ్మి, విశ్వసించి అత్యంత భక్తితో ప్రార్థించి దేహేంద్రియ, ప్రాణాంతఃకరణములను, ధర్మము, దార, సుత, గృహ, ధన, ఆత్మలను "సర్వము భగవంతుడైన శ్రీకృష్ణుని కర్పించితిని, ఓ కృష్ణా! నేను నీ దాసుడను, నీ వాడను" అని ప్రార్థించి తన సన్నిధానమునకు గొనిపోవలసినదిగా ప్రార్థించిన మహాభక్తులు. వీరు బోధించి ప్రచారము జేసినదే వల్లభమతము. ఈ మతము పూర్తిగా వైష్ణవ సిద్ధాంతమునే బోధించు చున్నది.

## మధ్వ ద్వైతమతము – శ్రీకృష్ణ చైతన్యుడు

1486వ సంవత్సరమున వంగదేశమున నవద్వీపమున జగన్నాథ మిశ్రులు శచీదేవి అను బ్రాహ్మణ దంపతులకు చైతన్యాచార్యులు జన్మించిరి. జగన్నాథమిశ్రునికి ఎనిమిదిమంది ఆడపిల్లలు జన్మించిరి. అందరును మృతులైరి. ఇతనికి విశ్వంభరుడని నామకరణము జేసిరి. ఈ శిశువు గౌరవర్ణము గలిగి యుండుటచే "గౌరాంగు" డనియు వేపచెట్టుక్రింద (నింబవృక్షము) జన్మించుటచే "నిమాయి" యనియు పిలువబడుచుండెను.

బాలునకు పంచవర్షములు నిండిన తోడనే తండ్రి జగన్నాథ మిశ్రుడు సుముహూర్తమున అక్షరాభ్యాసము గావించెను. ఇతని గురువు రఘునాథ శిరోమణి బాల్యముననే సంస్కృత విద్వాంసు డని కీర్తి గడించి భక్తి గీతములు నామసంకీర్తనలు చేయుచు పారవశ్యమును బొందుచుండెడి వాడు. ఎంత పాండిత్యము సంపాదించినను భగవచ్చింతన మాత్రము మానెడివాడు గాడు. ఇతడు ముఖ్యముగ న్యాయ వ్యాకరణ శాస్త్రములలో అఖండ పాండిత్యము సంపాదించి మెప్పు బడసెను.

నవద్వీపమున విద్యాభ్యాసము పూర్తి అయిన పిదప ఒక సంస్కృత పాఠశాలను నెలకొల్పి శిష్యులకు విద్యను బోధించుచున్న

కాలములో ఓటమి నెరుగని కేశవమిశ్రుడనే పండితుని గౌరాంగు డెదుర్కొని పరాభూతుని గావించెను. అప్పటికి గౌరాంగునికి 16 సంవత్సరముల వయస్సు మాత్రమే. ఇతని సోదరుడు విశ్వరూపుడు. సర్వము పరిత్యజించి సన్యసించి దేశాంతరములకు బోవుటయు, తండ్రి జగన్నాథుడు లోకాంతర గతుడగుటయు, మాతృమూర్తి శచీదేవి పోషణభారము తనపై బడుటచే, గౌరాంగుడు పాఠశాలను స్థాపించ వలసి వచ్చెను. ఇతని పాండిత్యప్రకర్షచే విద్యార్థిసంఘము లన్నియు ఇతని వద్దకు చేరెను.

నవద్వీపపండితులు మాత్రము ఇతని ప్రజ్ఞా విశేషకీర్తి ప్రతిష్ఠలు జూచి ఓర్వలేక అసూయతో నుండిరి. వివాహము చేయదలచి లక్ష్మీదేవి యను కన్యతో సుముహూర్తమున గౌరాంగునికి వివాహము గావించిరి. ఆ సాధ్వి అకాలమృత్యువువాత బడెను. తిరిగి తల్లి నవద్వీప పురి వాసి నూతనమిశ్రుని కుమార్తె విష్ణుప్రియ యను కన్య నిచ్చి గౌరాంగునికి ద్వితీయ వివాహము చేసెను.

కొంతకాలమునకు తండ్రియైన జగన్నాథునికి పిండప్రదానము గావింప గయా క్షేత్రమునకు పోగా మధ్వమతమునకు చెందిన మాధవేంద్ర పురిస్వామి యొక్క ముఖ్యశిష్యుడు ఈశ్వరపురిస్వామి సందర్శనప్రాప్తి గలిగెను. గౌరాంగ-ఈశ్వరపురిస్వామి-ఈ ఉభయులకు సన్నిహితత్వము బాగుగా ఏర్పడెను. ఈశ్వరపురి గౌరాంగుని భక్తి శ్రద్ధలకు విద్యాసాధనలకు సంతోషించి మంత్రోపదేశము జేసెను. అప్పటి నుండి గౌరాంగుని దృష్టి మారి ప్రాపంచిక వ్యవహారములపై హేయ భావము లేర్పడి, శ్రీకృష్ణపాదారవిందముల యందాసక్తిగల వాడై భక్తితో గొలుచుచు జీవితమే వ్యర్థమని భావించెను. తిరిగి నవ ద్వీపమునకు వచ్చినను గౌరాంగుని దృష్టి మారలేదు. వైరాగ్యమధి కము కాగా పాఠశాల గాని, తల్లిగాని, భార్య గాని అతని మనస్సును ఏ విధమైన మార్పు చేయ లేక పోయిరి.

అతని కన్నుల నుండి అశ్రువులు ప్రవహించగ, ఎక్కడో చూచుచు, చిత్తమం దేదో దిరుగుచుండ అతని పనులు అతనే నిర్వహించుకొనలేని స్థితికి వచ్చెను. శ్రీకృష్ణసంకీర్తనము గావించుచు మైమరచుచుండును. ఈ పరిస్థితులలో రాత్రి-పగలు అనిలేక బాహ్యము మరచి అనేక సిద్ధులు లభింపగా అనేక మహత్కార్యములు చేయుచుండెను. సుప్రసిద్ధులైన కొంతమంది అనుచరులై వీరి ప్రబోధములకు ప్రాముఖ్య మిచ్చిరి. సన్యసించుటకు తల్లి, భార్యయొక్క అనుమతి లభింపకున్నను, చివరకు వారి యాజ్ఞ గూడా దీసుకొనెను. 1509వ సంవత్సరమున తనకు ఇరువది నాలుగు సంవత్సరముల వయస్సులో గౌరాంగుడు గృహవిధుల విసర్జించి రాత్రియందు గంగానదిని దాటి కాత్యాయన నగరమున గల కేశవభారతీస్వామివారి ఆశ్రమము చేరి, సన్న్యాసమిప్పించుటకు వారు పూర్ణాధికారము గలవారని నిర్ణయించెను. కేశవభారతి గౌరాంగునికి సన్యాసమిచ్చి, శ్రీకృష్ణచైతన్యు డని బిరుదు నొసంగెను. చివరకు జగన్నాథక్షేత్రమున నుండ తీర్మానించుకొనెను.

జగన్నాథములో (పూరి) స్థిరనివాస మేర్పరచు కొన్నను దక్షిణయాత్రచేయ సంకల్పించి, గోదావరి ఒడ్డునగల కొవ్వూరు, మంగళగిరి, తిరుపతి, కంచి, రామేశ్వరము, సేతుబంధన, అనంతశయన, శ్రీరంగక్షేత్రములు దర్శించి, మహారాష్ట్రమున గల పూనా, బరోడా, పండరిక్షేత్రము మొదలగునవి రెండు సంవత్సరములలో పూర్తిసెచేను. మరల జగన్నాథ క్షేత్రముననే కాలము వెళ్లబుచ్చుచుండెను. ఈ విధముగ భక్తిపారవశ్యమున క్రీ.శ. 1౫౩౩న తన 47వ సంవత్సరమున నొక రాత్రి సముద్రతీరమునకు బోయి అంతర్ధానమాయెను. ఆ పవిత్రమైన శరీరము, ఎవ్వరికి లభింపలేదు. శ్రీకృష్ణచైతన్యుని అనుచరకోటిలో "సనాతనగోస్వామి", "రూపగోస్వామి" జీవగోస్వామి, విశ్వనాథ చక్రవర్తి, బలదేవ విద్యాభూషణుడు అతిముఖ్యులు. వంగీయ వైష్ణవ సిద్ధాంతమునకు వీరే ఆచార్యులు.

వీరు భక్తిమార్గములో "ఆర్తభక్తినే ఉపాసించి, భక్తులచే నుపాసింప జేసిరి. వీరికి శ్రీకృష్ణపరమాత్మయే ఆరాధ్య దైవము. ఆ కీర్తనలు, భావయుక్తములై భగవంతునికి భక్తుడు తన బాధలనో, ఆనందమునో వ్యక్తము గావించునట్లుండును.

## చైతన్య బోధనలు

1. కర్మమార్గము నందు నమ్మకములేక భక్తి మార్గమును బోధించెను. 2. యజ్ఞయాగ, హోమాదుల వలన మోక్షము లభించుట అబద్ధమని తలచిరి. 3. కర్మమార్గమును త్యజించి భక్తిమార్గమును ప్రజలమనస్సునందు ప్రతిష్ఠింప జేసెను. 4. ముక్తిని బొందుటకు, మోసములేని విశ్వాసము, ఎడతెగని భక్తి ముఖ్యమని ప్రజలకు వివరించి బోధించెను.

వీరు ఆచరించు ఆచరణములో 108 తులసి మణిమాలను ధరించి ముఖమునకు తెల్లని గోపీచందనపు గీతలను బెట్టుకొని విష్ణునామము జపింతురు. వీరికి భాగవతము-భగవద్గీత ముఖ్యపారాయణ గ్రంథములు.

## శిక్కుమతము

హిందూదేశములో మహమ్మదీయ పరిపాలకుల స్వమతాభిమానము, పరమత అసహనమువలన హిందూమతము క్షీణించుటయే గాక బాగా దెబ్బతినెను. మతకలహములుమాని మతమును పెంపొందించుటకు, హిందూ మహమ్మదీయ సఖ్యము నెలకొల్పుట ఆవశ్యకమయ్యెను. 15వ శతాబ్దమున "నానక్" అను మహనీయుడు లాహోరు జిల్లాలో క్షత్రియకులమున జన్మించెను. వారు హిందూ మహమ్మదీయ సఖ్యతకు ప్రయత్నించి కొంతవరకు సఫలీకృతు డాయెను. "నానక్" శిక్కుమతము స్థాపించెను. వీరు దేవుడు ఒక్కడే యనియు, అన్ని

మతముల పరమావధి, సారాంశము ఒక్కటియే యనియు బోధించిరి. వీరు హిందూ మహమ్మదీయ ప్రభావమునకులోనై హిందూసాధువుల వ్రాతలను-సూఫీ గురువుల బోధనలను గ్రహించి గేయములను గానము చేయుచు శిష్యులను సేకరించుచు, ఉత్తరఇండియా యంత టను పర్యటించిరి. "శిక్కు" అనగా శిష్యుడు అని అర్థము. శిక్కులు మొదట సాత్త్వికముగనే యుండి శాంతినే అభిలషించిరి. మొగలాయి పాదుషాలైన ఔరంగజేబు, మత అసహన విధానముల వల్ల, వారు స్వజాతి మతసంరక్షణార్థము సాహసికులై దౌర్జన్యము నవలంబించి మొగలాయి రాజ్యవినాశనమునకు కారకులైరి.

గురుగోవిందసింగ్ నానక్ శిష్యులలో మొదటి గురువు. వీరి తరువాత తొమ్మిదిమంది గురువులు విలసిల్లిరి. శిక్కుల నాల్గవ గురువు రామదాసు. ఇతడు అక్బరునకు, శిక్కుమతము బోధించెను. అమృత సరమును సంపాదించి దానిని శిక్కుల కేంద్రముగా నొనర్చెను. అయిదవ గురువైన "అర్జునుడు" ఆదిగ్రంథ్‌ను సమకూర్చెను. జహంగీరుచే ప్రాణమును గోల్పోయెను. ఆరవగురువైన "హరగోవిం దుడు" శిక్కులకు సైనికశిక్ష నిచ్చెను. తొమ్మిదవ గురువైన "తేజబహ దూరు" ఇస్లామ్ మతమునందు చేర నిచ్ఛగించనందున ఔరంగజేబు చంపించెను.

శిక్కులకు తొమ్మిదవ గురువైన తేజబహదూర్ యొక్క కుమా రుడు "గురుగోవిందసింగ్" వీరికి పదియవగురువుగా నుండిరి. వీరే చివరి గురువు. ఇతడు శిక్కులను సైనిక బృందములుగా జేర్చి, బాకులను ఎల్లప్పుడూ ధరించునట్లు, సోదరభావము వహించునట్లు, మత్తు పదార్థములు నిషేధించునట్లు శాసించెను. "ఖాల్సా" అను శిక్కుసంఘము నేర్పరచెను. మహమ్మదీయ క్రూరత్వములకు ప్రతీ కారము చేయుట తమ విధియని శిక్కులకు బోధించెను. ఇతని కాల ములో మహమ్మదీయులు-శిక్కులను ఎక్కువగా బాధించిరి. చివరకు

గురుగోవిందుని కుటుంబమును ఛిత్రవధపాలు చేసిరి. ఇతడు శిక్కులకు "సింగ్" సింహము అను బిరుదు నొసంగెను. చివరకు శత్రువులచే 1708లో హతు డాయెను. ఈ విధముగా గురుగోవిందుడు శిక్కులను సాహస యుద్ధవీరులుగా నొనర్చెను.

## శిక్కుమత బోధనలు

ఇందు 1. దేవుడు ఒక్కడే యనియు, 2. దేవుని జాతి-కుల-మతభేదములు లేక సహృదయముతో పూజించిన మోక్షము లభించు ననియు, 3. క్రతు-కర్మ-జీవితపారిశుధ్యము ముఖ్యమనియు, 4. కర్మ సిద్ధాంత మంగీకరించి, 5. గురుభక్తి చాలా ముఖ్యమని చెప్పబడెను. గురునానక్ శిష్యులు, గురువుల గేయములను బోధనలను సమకూర్చి "గ్రంథ్ సాహెబ్" అను పవిత్రగ్రంథమును ఏర్పాటు చేసిరి. ఇది పంజాబీభాషలో వ్రాయబడియుండెను. నానక్ శిక్కుల మతస్థాపకుడే గాక ప్రథమగురువుగ నుండెను.

## శ్రీరామకృష్ణ పరమహంస

శ్రీరామకృష్ణ జన్మించిన కాలములో హిందూమతములో గలిగిన అసహనము వలన, అనైక్యతవలన దేశములో అశాంతిగా నుండెను. 19 వ శతాబ్దములో బ్రిటిష్‌వారి పరిపాలనవల్ల పాశ్చాత్య నాగరికతా సక్తులైన ప్రజలు క్రైస్తవమతమును స్వీకరించు చుండిరి. ఆ కాలమున వంగదేశమందలి కామారిపుష్కరము అను గ్రామమున 1836 వ సంవత్సరము ఫిబ్రవరి 18 వ తేదిన శ్రీరామకృష్ణు డొక దైవభక్తి గలిగిన పేదబ్రాహ్మణ కుటుంబములో కుదీరామ ఛటోపాధ్యాయ-చంద్రమణీ దేవి అను పుణ్యదంపతులకు జన్మించెను. శ్రీరామకృష్ణునకు తల్లిదండ్రులు పెట్టిన పేరు గదాధరుడు. సన్న్యాస దీక్షా సమయమున గదాధరునకు అతని గురువరేణ్యుడగు శ్రీతోతాపురి రామకృష్ణనామము బెట్టి

యుండవచ్చునని గ్రంథములవల్ల దెలియుచున్నది. తన అయిదవ యేటనే ఆశ్చర్యకరమైన తెలివి తేటలను, జ్ఞాపకశక్తిని ప్రదర్శించి, అనేక గ్రంథములను కంఠస్థ మొనరించెను.

బడిలో చదువు చున్నప్పుడు బాల్యముననే ఒక్కొక్కప్పుడు భౌతికకాయమును మరచి గాఢ తపస్సునందు నిమగ్నుడగుచుండెను. బాల్యములో పాఠశాలా విద్యావిధాన మాతని నాకర్షింప లేదు. రామ కృష్ణాది పురాణ పురుషుల ధ్యానము, సంకీర్తనలు, మట్టితో విగ్రహ నిర్మాణము మొదలగు వాటియందు ఉత్సాహముగా నుండి భారత భాగవతాది గ్రంథములలో నుండెడి విషయములు గ్రహించెడివాడు.

ఆత్మజ్ఞానదాయకమగు విద్యయే ముఖ్యమని చెప్పుచు పెద్దలు వలదనినను తన యంతరాత్మ ధర్మ మని తెల్పిన విషయముల నాచ రించును. ఉపనయన కాలములో "దనియను" కమ్మరి యిల్లాలు వద్ద ప్రథమభిక్షగైకొనెను. భగవద్భక్తియే యాతనికి ప్రధానాశయమై యుండెను. పెద్దవాడైన తరువాత అప్పుడప్పుడు మతావేశముచే స్మృతితప్పి ప్రవర్తించుచుండెను. సంసార పరిస్థితులవల్ల రామకృష్ణుడు పూజారిగా కలకత్తాచేరి అచ్చట దక్షిణేశ్వరములోని కాళికాలయములో ప్రధానార్చకుడుగా నిర్వహించు చుండిన నిత్యపూజా విధానములు, అతనిని భక్తిమార్గములో నుంచుటకు ముఖ్యకారణ మాయెను. గాఢధ్యానమున దివ్య సంకీర్తనములు పాడుచు గంటల కొలది కాలము గడుపుచు రాత్రులయందు సమీపము నందు గల చిట్టడవి లోనికి ఒంటరిగా బోయి ధ్యానించుచు జందెమును గూడ విసర్జించి భగవద్ధ్యానములోనే కాలము గడపుచుండెను. రామకృష్ణుడు తల్లి కృపకై పరితపించుచు ఆమె కటాక్షమునకై ఎన్నిబాధలనైనను ఓర్చి చివరకు దేవీసాక్షాత్కారము లభింపజేసుకొనెను. ఇతని పరిస్థితులు గమనించిన తల్లితండ్రులు ఇతనికి వివాహము జేసిన మారగల డను నమ్మకముతో సమీపగ్రామమునందుగల చంద్రముఖోపాధ్యాయుని

కుమార్తె యగు శారదామణిదేవి యను అయిదు సంవత్సరముల బాలిక నిచ్చి వివాహము జేసిరి. వివాహముజేసినను అతనిలో ఏ మాత్రము మార్పురాక పోగా ఏ సాధన మవలంబించినను అతిశీఘ్రముగా సిద్ధి బొందుచుండెను. ఈమెను శ్రీరామకృష్ణశిష్యులు తల్లిగా భావించిరి. శ్రీరామకృష్ణుని ప్రథమ గురువు విశేష విద్యావంతురాలు "భైరవీ బ్రాహ్మణి" యను యోగినీ మణి. ఈమె తాంత్రికసాధనలో అఖండ ప్రజ్ఞగల మహనీయురాలు. ఆమెవద్ద సకలశాక్తేయ తంత్రమునందు గల ప్రధానసాధనలన్నింటిని జయప్రదముగ నభ్యసించెను. 1864లో తనకు సన్న్యాసదీక్ష నిచ్చిన యతివరేణ్యుడగు తోతాపురి వద్ద నిర్గుణ నిరాకార బ్రహ్మధ్యానమున అఖండ బ్రహ్మసాక్షాత్కారమును బడసెను. 1866 వ సంవత్సరములో "సూఫీ" సంప్రదాయమునకు చెందిన గోవిందుడను ఫకీరువద్ద మహమ్మదీయ సాధన లన్నింటిని నభ్యసించెను. 1872 వ సంవత్సరమున తన భార్యను సాక్షాత్ పరమేశ్వరీ స్వరూపముగ నారాధించెను.

ఆమె గూడ శ్రీరామకృష్ణుని సామాన్య సన్న్యాసుల వలె భావింపక సాక్షాత్ పరమేశ్వరు డనియే భావించి సేవింపసాగెను. రాను రాను వివిధ సంప్రదాయములకు చెందిన సాధకులు, సన్న్యాసులు అతనిని దర్శించుకొను చుండిరి. పండితులు సహితము వారి వచనామృతమును ఆస్వాదించి ముగ్ధులగు చుండిరి. ప్రతి స్త్రీ స్వరూపము జగన్మాత స్వరూపముగా గనపడు చుండెను. ధనమును తుచ్ఛముగా జూచు చుండెను. వీరి జీవితములో పెక్కు ఆశ్చర్యకర మైన వింతలు గానవచ్చు చుండెను.

ఒక పర్యాయము రామకృష్ణుడు కాన్పూరునకు ప్రయాణమై వెళ్లుచు సరిగా శ్మశాన మధ్యభాగములో గుండా పోవుచుండెను. ఆ సమయములో పెద్దవర్షములో అతడు చిక్కుకొనెను. అతనికి ఆనందతన్మయస్థితిలోరాత్రియో, పగలో, ఎండయో, వానయోగూడ

తెలియక రామా, కృష్ణా, శివా, కాళీ, హనుమాన్ అంటూ బిగ్గరగా వివిధనామములతో ఆ భగవంతుని పిలువగా అన్ని నామములు ఒకే దైవమునకు చెందినవని స్ఫురణకు వచ్చెను. అనేక నామములతో పిలువబడే భగవంతుడు ఒకే దైవమని గుర్తించెను.

ఒక పర్యాయము దక్షిణేశ్వరములో కాళీ కార్యాలయమునకు వచ్చి తన నెలజీతము తీసుకొన వలసినదని చెప్పగనే రామకృష్ణుడు ఎంతో ఆవేదన చెంది తల్లిని పూజించుటకు జీతము తీసుకొనుటయా యని వెళ్లుటకు నిరాకరించెను. కాళీ ఆలయమునకు అనుబంధముగా నున్న శ్రీకృష్ణ ఆలయములో దొంగలుపడి శ్రీకృష్ణవిగ్రహము మీద గల నగలన్నియు దోచుకొని పోయినప్పుడు అక్కడగల మథురా నాథుడు మిగుల కోపముతో పధ్నాలుగు లోకములు రక్షించుకొను వానిగా నిన్ను మేము ఆరాధించుచుండగా నీ శరీరముపైగల నగలను నీవు రక్షించు కొనలేవా? అని కృష్ణుని నిందించెను.

రామకృష్ణుడు దైవదూషణను సహించ లేక శ్రీకృష్ణునికి లక్ష్మియే సతిగా నుండగా ఈ బంగారము రత్నములు అతనికి మట్టితో సమానమనియు అసలు బంగారమంటే మట్టితో సమానము గదా యని మందలించెను. దానితో మథురానాథుడు పశ్చాత్తాపము జెంది, రామకృష్ణుని ద్వారా జ్ఞానోదయమును బొందెను.

రామకృష్ణుడు గీతలో చెప్పబడిన విధముగ అర్జునునికి-కృష్ణునికి మధ్యగల నిజమైన స్నేహమును బాగుగా గుర్తించెను. శ్రీకృష్ణుడు పురుషోత్తము డయితే, అర్జునుడు నరోత్తముడు. వా రుభయుల స్నేహము పరమాత్మ, ఆత్మ స్నేహం అని భావించెను. కృష్ణుడు అవతార పురుషుడైతే, అర్జునుడు ఆనందస్వరూపుడు. నిరుపమానమైన కృష్ణార్జునుల మధ్యనున్న స్నేహము రామకృష్ణపరమహంస నెంత గనో ఆకర్షించెను. భగవద్గీత భాగవతగ్రంథముల నుండి సాధకుడు

నవవిధ భక్తిమార్గము లనెడి వివిధదశల నే విధముగా అనుభవ పూర్వకముగా గ్రహించ గలడో రామకృష్ణుడు తెలుసు కొనెను. గోపికలు అనుభవించిన విరహమును తాను అనుభవించి ఆ మధుర భక్తి యొక్క అనుభూతి పొందవలయు నని రామకృష్ణుడు నిశ్చయించు కొనెను. రామాయణము చదివి హనుమంతుని దాస్యభక్తికి ముగ్ధుడై ఆ అనుభవమును బొందవలయునని నిశ్చయించెను. అద్వైతము మనస్సునకును మాటలకును అతీతయోగ మనియు సమాధిలో ననుభవించవలసినదే యనియు విశిష్టాద్వైతము వలననే సచ్చిదానంద వస్తువును దాని బాహ్యారూపమును కనుగొన వచ్చుననియు దెలిపి యుండిరి. బ్రహ్మసాక్షాత్కారమును బొందుటకు 1. జ్ఞానయోగము, 2. కర్మయోగము, 3. భక్తియోగము, 4. రాజయోగము చాల ముఖ్యము లనియు, అన్నిటిని గాని కొన్నిటిని గాని లేక ఏ ఒక్కదాని ద్వారా గాని భగవంతుని బొంద వచ్చుననియు చెప్పిరి.

రామకృష్ణుడు వ్రాసి గాని ఉపన్యసించి గాని యెరుగడు. వీరి శిష్యులు వీరి సంభాషణలను (బోధనలు) జాగరూకతతో కొన్నింటిని వ్రాసి భద్రపరచిరి. శ్రీరామకృష్ణపరమహంస ప్రత్యేకముగ నే మతమును గాని, ఏ సంప్రదాయమును గాని, ఏ సిద్ధాంతమును గాని ప్రకటించి యుండలేదు. వివిధ మతములచే భగవంతుడు అల్లా, బుద్ధుడు, శివుడు, విష్ణువు, బ్రహ్మము మొదలగు నామములచే సూచింపబడినను, సాకార, నిరాకారము, సగుణ నిర్గుణ మదియే యని బోధించెను. జ్ఞానమార్గముచే నిర్గుణాకార తత్త్వమును, భక్తి మార్గముచే సగుణాకార తత్త్వమును దెలుసుకొన వచ్చును. భగవన్నామస్మరణ సంకీర్తనము మొదలగు సులభోపాయములతో గూడిన నారదప్రోక్తమైన భక్తిమార్గ మొక్కటియే ఈ కలికాలమున తరణోపాయమని శ్రీగురుదేవులు సర్వులకు బోధించెను.

ఈయన ముఖ్యశిష్యులలో నరేంద్రుడు (వివేకానందుడు) అత్యంత ముఖ్యుడు. భగవద్గీతలో నున్న అన్ని శ్లోకముల కంటె రామకృష్ణుని హృదయము ఆకట్టు కొన్న శ్లోకము – మోక్షసన్న్యాస యోగములోని 65 శ్లోకము–

మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే.

ఈ శ్లోకం ఆత్మనివేదం అంటే శరణాగతిని బోధిస్తుంది. "నీవు నాతో ఏక మగుము. నా కొరకు త్యాగము చేయుము. నా ముందు మోకరిల్లుము. ఆ విధముగ నాతో ఐక్యత పొందిన పిదప నీవు తప్పక నన్ను చేరుదువు." దీనినిబట్టి ఆత్మనివేదన మనే శరణాగత తత్త్వము వ్యక్తిని సంపూర్ణముగ భగవత్పాదముల కంకితమగునట్లు చేయు ననెడి పరిపూర్ణ విశ్వాసము గలవాడై తన జీవితము గడపెను. శ్రీరామ కృష్ణుడు దైవస్వరూపములమధ్య భేదములను పాటింపక సత్యాన్వేషణ ప్రయత్నములో నిశ్చలమైన భక్తి విశ్వాసములతో సఫలీకృతు డగు వరకు ప్రయత్నించెను.

ఆధ్యాత్మిక సాధనసోపానముల నారోహించుచు యజ్ఞోపవీతము విడనాడి కులభేదములను పాటింపక సర్వమతములను సమాన దృష్టితో చూచి, ఆదరించి విశాలహృదయుడై సమస్త జాతులవారిచే అత్యుత్తమ మహనీయవ్యక్తిగా పరిగణింపబడెను. ప్రపంచములో ఇంతటి అత్యున్నత భావములుగల వ్యక్తులు జన్మించుట చాల అరుదుగా నుండును.

1855 వ సంవత్సరములో కంఠములో వ్రణము (కేన్సరు) వ్యాధితో బాధపడుచున్నప్పుడు గూడా తన బాధానివారణకై కాళీ మాతను ప్రార్థించకపోవటము, చికిత్స చేయించుకొనుటకు సమ్మతించక పోవటము వివేకానందుడు గూడ నిరాశచెందుట చూచి–ఈ విధముగా

బాధపడుట అమ్మసంకల్పమే, అయితే నేను ఈ బాధను నివారించమని ఏల అడుగను? అని సమాధానము చెప్పెను. ఈ శరీర మేమైన నేమి? ఒక్కనికి సాయమొనర్ప గలిగినచో వేయి పర్యాయములు కుక్కనై పుట్టుటకు సంసిద్ధుడనని చెప్పెను. 1866 వ సంవత్సరము అగష్టు 16 వ తేదీన రామకృష్ణపరమహంస బ్రహ్మైక్యము నొందెను.

## శ్రీరామకృష్ణుని పవిత్రబోధనలు

1. ప్రకృతి-పురుషులకలయికయే ఈ జగత్తునకు మూలమని తెలుసుకొనుట అత్యంత ముఖ్యమనియు, పురుషుడు ఈ ప్రకృతి వ్యాపారముల కన్నింటికిని కేవలము సాక్షీభూతుడే ఐనను పురుషుడు లెనిదే ప్రకృతి గూడ స్వయముగా ఏ కార్యము చేయజాలదు.

2. ఆత్మసాక్షాత్కారమే మానవుని పరమావధి.

3. ఆత్మానంద ప్రపూర్ణమగు హృదయమున వాదోపవాదములకు తావులేదు.

4. జ్ఞానోదయ మయిన వెంటనే సంశయాంధకారము పటాపంచ లగును.

5. భగవంతుడు సాకారుడు-నిరాకారుడని అభిప్రాయపడెను.

6. భగవంతుడు సత్-చిత్-ఆనందస్వరూపుడు.

7. నేను-నాది అనునవి అజ్ఞానం-అహంకార భావములతో గూడిన సూచనలు.

8. ప్రపంచములో నివసించుచు, సంసారము భరించుచు, నిర్మలమైన మనస్సుతో దేవుని ప్రార్థించుట చాలా ముఖ్యము.

9. నిజమైన నమ్మకముతోను, ప్రేమతోను, ప్రయత్నించిన దేవుని చూడగలవు. దేవుని ఏ రూపములో నైనా, ఏ విధముగనైనను ఇష్టము వచ్చినట్లుగ ప్రార్థింప వచ్చును.

10. ప్రతివారు కోరికలను ఇష్టానిష్టములను, వ్యామోహము లను దైవానికి అప్పగిస్తే అతడే సరియైన త్రోవలో నడిపించి సుఖ శాంతులను ప్రసాదిస్తాడనియు, రకరకాల కోరికల వెంట, క్షణికము లైన సుఖముల వెంట పరుగెత్తక అన్నియు దైవానికే వదలి పెట్టి ఏమి జరిగినా దైవసంకల్పముగనే భావింప వలయును. ఈ విధము లైన సులభోపాయములను సమస్త జనులకు చక్కగా బోధించెను. అంబరీషుని, భీష్ముని ఇతరులను ఆదర్శముగా బెట్టుకొనెను. పండితులు మహాద్భుతతత్త్వములను ఉత్కృష్ట ధర్మములను, వెల్లడించినను వారి వచనము లెంతటి ప్రతిభావంతములయ్యు ఆధ్యాత్మిక విషయములో అతడు సామాన్య మానవునికంటె నధికుడు కాజాలడు. వారు ఎంత చెప్పినను స్వానుభవము లేని వాక్యములలో అజ్ఞానాంధకారమే గన పడును అందువలన వారి వచనములు మనకు ప్రమాణములుకా జాలవు. కాని శ్రీరామకృష్ణుడు అఖండ మేధాసంపదను నిరుపమాన కళాదృష్టిని కలిగియుండుటయే గాక దేవుని ముఖాముఖి సందర్శించి సంభాషించి యుండుటచే, వారి వాక్యములు అఖండప్రమాణ భూత ములై వేదవాక్యములై యున్నవి. అందువలననే గాంధిమహాత్ముడు రామకృష్ణుని గురించి "సజీవాకృతిని దాల్చిన దివ్యతత్త్వ మనియు, అతని వాక్యము లోక పండితమాత్రుని వాక్యములు గావనియు, స్వానుభవ నిదర్శనము లనియు, అవి చదువుచున్నప్పుడు చిత్త సంస్కారము గలుగు చుండుననియు చెప్పెను. ఈశ్వరచంద్ర విద్యా సాగర్ వంటి వారిని తన బోధనలచే ముగ్ధులను గావించెను.

వారి భక్తబృందమే శ్రీరామకృష్ణుని సందేశములు దేశదేశాం తరముల వ్యాప్తమొనర్చెను. నేటికి వారి పేరగల రామకృష్ణమిషన్ సేవాసంఘము అనేక కష్టసమయములలో ప్రజాసేవలుచేయుచు పేరు ప్రతిష్ఠలు గలిగియున్నది.

## స్వామి వివేకానంద

కలకత్తాలోని సిమ్లాయను పేటయందు కాయస్థక్షత్రియ కుటుంబములో విశ్వనాథుడు-భువనేశ్వరి యను దంపతులకు 12-1-1863 లో వివేకానందుడు జన్మించెను. ఈ వంశమునకు దత్త వంశమని పేరు. వివేకానందుని పితామహుడు దుర్గాచరణదత్తుడు. వీరి పూర్వులు అనేక శతాబ్దములనుండి సిరిసంపదలతో తులదూగుచు దాతృత్వమునకే గాక పాండిత్యమునకు శక్తిసామర్థ్యములకు ప్రఖ్యాతి బడసియుండిరి. దుర్గాచరణదత్తుడు పారసీక-సంస్కృతభాషలలో గొప్ప పాండిత్యము గలిగి న్యాయశాస్త్ర పారంగతుడయ్యెను. విశ్వనాథుడు గూడ తండ్రివలెనే సంస్కృత పారసీక-ఆంగ్ల భాషలలోను న్యాయశాస్త్రములోను గొప్ప పాండిత్యము సంపాదించెను. వివేకానందుని అసలు పేరు నరేంద్రుడు. భువనేశ్వరి తన కుమారుడైన నరేంద్రునికి, చిన్నతనము నుండియు తాను చదివిన రామాయణ భారత, భాగవతాది గ్రంథములలోని విషయములు చెప్పుచుండెడిది.

చిన్నతనము నుండియు నరేంద్రునికి బైరాగి వచ్చి విశ్వనాథుని యింటి ముందు నిల్చొని- "నారాయణ-హరి నారాయణ హరి భవతి భిక్షాం దేహి" యని పలికినంతనే నరేంద్రుడు తనపై నున్న రుమాలు తీసి బైరాగి కిచ్చెను. తన తల్లి వద్దనే రామాయణ భారతకథలు వినుటచే బాల్యముననే భక్తి బీజములు హృదయమున నాటుకొనెను. సీతారాముల విగ్రహములను పూలతో పూజించుచు గదిలో ఒంటరిగా కూర్చొని తదేకధ్యానముతో భగవంతుని ప్రార్థించుచుండెడివాడు. పెండ్లియే అనేక బాధలకు మూల మని తెలిసిన దేవు డెందుకు పెండ్లి యాడవలయునని తలచి సీతారాముల విగ్రహముల నావల బారవైచి, శివుని వైరాగ్య మాతని నాకర్షింప శివుని ప్రతిష్ఠించెను. రాను రాను భక్తి మీఱి, పద్మాసనమున గూర్చుండి ధ్యానించుచుండెడి వాడు. అతడు కండ్లు మూసుకొనినంతనే భ్రూ

మధ్యమున నొక దివ్యజ్యోతి వివిధ కాంతులతో ప్రత్యక్షమగు చుండె డిది. నరేంద్రు డేకసంధాగ్రాహి. చదువులలోనే గాక ఆటలలో గూడా నరేంద్రుడు తోడి బాలురకు నాయకుడు. ఒకానొక సమయమున పూజామందిరపు మెట్లు మీది నుండి కాలుజారి క్రిందబడెను. అప్పుడు రాతి దెబ్బతగిలి గాయమయ్యెను. కుడికంటిపై భాగమున ఆ మచ్చ జన్మాంతమువర కుండెను. తన ఏడవ ఏటనే 1870 లో ఈశ్వరచంద్ర విద్యాసాగరపాఠశాలలో ప్రవేశించెను. విద్యార్థిదశలో గూడ నిర్భ యముగ గురువుగారి నెదిరించి వారి తప్పులు వారు తెలుసుకొనే టట్లు చేసెడివాడు. తల్లి తండ్రుల యాజ్ఞచొప్పున అసత్యములు చెప్పెడువాడు కాడు. వ్యాయామమండలి స్థాపించి కుస్తీలు, సాము మొదలైనవి నేర్చుకొనెను. వంటలు చేయుటలో గూడ ప్రావీణ్యము సంపాదించెను. కళాశాలావిద్యలో గూడ తోటి విద్యార్థు లందరి కన్న మిన్నగా నుండి, విద్యార్థులలో నగ్రగణ్యు డాయెను. మొదటి పంక్తిని చివర పంక్తిని చదివినంతనే పుటల యందలి తాత్పర్య మంతయు స్పష్ట మగుచుండెడిది. మొత్తము మీద ఎన్ని చదివినను యేదియో అసంతృప్తి, యేదియో భరింపరాని మానసిక పరివర్తనము గలుగ నారంభించెను.

పట్టపరీక్షా దినమున నరేంద్రుడు పుస్తకములో నేమున్నది? భగవత్సాన్నిధ్యమునకు పాండిత్య మెందుల కని ఆలోచింపసాగెను. తోడి విద్యార్థులు ఎంత చెప్పినను ఏదో ఆలోచింపసాగెను. దక్షిణే శ్వరములో ఎల్లప్పుడు జపమో! తపమో! చేసుకొనుచుండు రామ కృష్ణుడను ముదుసలి సన్న్యాసిని చూచినప్పటినుండి నరేంద్రుడు ఈ విధముగా మారినట్లు తలచి స్నేహితులు నరేంద్రునికి ఎన్నియో సల హాలు చెప్పిచూచిరి. కాని రామకృష్ణునియందు నరేంద్రునికి మనస్సు పూర్తిగా లగ్నమాయెను. గానములో గూడా ప్రావీణ్యము సంపాదిం చిన నరేంద్రునకు రాను రాను దైవచింతన, భగవంతుని గురించి

పాటలు పాడుకొనుటయే ముఖ్యకర్తవ్య మాయెను. నరేంద్రుని గాన మాధుర్యమే శ్రీరామకృష్ణుని యెంతగనో ఆకర్షించెను. తండ్రి వివాహము చేసుకొనుమని ఎన్ని ప్రయత్నములు చేసినను, నరేంద్రుడు ముక్తికాంతను వరించినట్లు చెప్పుచుండెను. కొంతకాలమునకు బ్రహ్మ సమాజములో చేరెను. భగవంతుని సందర్శనైక వాంఛగలిగి దేవేంద్ర నాథఠాగూరును దర్శించి భగవంతుని చూచితిరా? యని యడిగెను. కాని సమాధానము రాలేదు. సమస్త వేదములు, సమస్త శాస్త్రములు, సమస్త విద్యలు భగవంతుని చూపజాలనిచో అవి యన్నియు నిష్ప్రయోజనములని భావించెను. భగవంతుని జూచి తీరవలయు ననుటయే యాతని పరమ సంకల్పముగా నుండెను. ఈ సంకల్పము నెరవేర్చుకొనుటలో మనశ్శాంతి లేకుండెను. భగవంతు డెచట నున్నాడు? వానిని జూచు టెట్లు? చూపగలవా డెవ్వడు? ఇదియే యాతని హృదయ పరితాపము.

ఒకనాడు భక్తుడగు సురేంద్రనాథమిత్రుని యింటికి రామకృష్ణుడు వేంచేసియుండెను. ఆ సమయమున నరేంద్రుని సంకీర్తనమునకు ఆనందపరవశుడై దక్షిణేశ్వరమునకు రమ్మని శ్రీరామకృష్ణుడు నరేంద్రుని ఆహ్వానించెను. అచ్చటికి బోయిన నరేంద్రుడు శ్రీరామకృష్ణుని ప్రశ్నింప మొదలుపెట్టెను. నరేంద్ర-రామకృష్ణుల సమావేశమువలన నవీన-ప్రాచీనాదర్శములు అద్భుతరీతిని సమన్వయించు నట్టి అవకాశము గలిగెను. నరేంద్రుడు శ్రీరామకృష్ణుని సందర్శించి వారి పాదారవిందముల నాశ్రయించెను. నరేంద్రుడు కీర్తనలు పాడుచుండ రామకృష్ణు డాకస్మికముగాలేచి, నరేంద్రుని చేతులుపట్టుకొని ఏకాంతప్రదేశమునకు గొనిపోయెను. నరేంద్రుడు ఏమైన ఉపదేశించు నేమో యని తలచెను. రామకృష్ణుడు ఆనందపారవశ్యమున ఆనంద బాష్ప బిందువులు నేత్రములనుండి జాలువాఱ నరేంద్రు నుద్దేశించి, ఇంతవరకు ఎందులకు నిర్దాక్షిణ్యము వహించితివి? నీ కోసము

చాలకాలము వేచియుంటిని. తుచ్ఛప్రసంగములు విని, చెవులు చిల్లులుపడుచున్నవని చెప్పెను. శ్రీరామకృష్ణుడు నరేంద్రునితో నీవు నరుడవు, సనాతనఋషివి. మానవకోటి బాధలు బాపుటకై యవత రించిన నారాయణుడ వని పలికెను. చాలకాలము వరకు నరేంద్రుడు కనపడకుండుటచే రామకృష్ణుడు చాల విచారించెను. నరేంద్రునకు కూడ రామకృష్ణుని చేష్టలు బోధపడలేదు. వారు ఒకరి నొకరు అర్థము చేసుకొనుటకు ఎంతగనో ప్రయత్నించిరి. శ్రీరామకృష్ణుడు తన దివ్యదృష్టిచేతనే నరేంద్రుని జన్మవృత్తాంత మంతయు తెలుసు కొనెను. సత్యాన్వేషణకై మానసిక యాతనలు ఎన్నో నరేంద్రు డను భవించెను. నరేంద్రుని చూడనిదే రామకృష్ణునకు మనశ్శాంతి లేకుం డెను. శ్రీరామకృష్ణు డప్రయత్నముగ కొన్ని సమయములలో నరేంద్రనామమే జపించుచుండెను. అతనికొరకే పరితపించుచుండెను.

శ్రీరామకృష్ణుని ప్రేమతత్త్వము నరేంద్రునికి అర్థము గాకుం డెను. పరిపూర్ణముగా పరీక్షించిననే గాని రామకృష్ణు డెవ్వరిని శిష్యు లుగా నంగీకరించువాడు గాడు. ఎన్నో కఠినపరీక్షలలో నెగ్గిన తరు వాతనే నరేంద్రుడు శ్రీరామకృష్ణునికి శిష్యుడు కా గలిగెను రామ కృష్ణుని ఆంతర్యము, వారికిగల శక్తిసామర్థ్యములు అమోఘం. ఆధ్యా త్మిక చింతనలు వారి నిశ్చలభక్తిని అనేక విధములుగా పరీక్షించి, వారితో అనేక విషయములలో తీవ్రముగా తర్కించి, వారి కృపకు అత్యంతపాత్రుడై, అత్యంత ప్రశంసనీయు డాయెను. శ్రీ రామకృష్ణుని శిష్యులందరిలోను వివేకానందుడు చాల మేధావి, ప్రజ్ఞావిశేషములు గలవాడు. రామకృష్ణ-వివేకానందుల గురుశిష్య పద్ధతి శ్రీకృష్ణ పర మాత్మ-అర్జునులతో పోల్చవచ్చుననెడి విషయము అతిశయోక్తి గాదు. ముమ్మాటికి సత్యము.

అహంకార నిర్మూలమున కనుకూలింపని విద్య, ఆత్మ సందర్శ నమునకు తోడ్పడని జ్ఞానము నిష్ప్రయోజన మనియు, ఎప్పు డహం

కారరహితుడో, ఎవ్వ డాత్మజ్ఞానియో, వాడే విద్వాంసుడని గ్రహించి రామకృష్ణున కేమి పాండిత్యము లేకున్నను వాని నాశ్రయించెను.

కళాశాలలో తత్త్వశాస్త్రము అభిమాన శాస్త్రముగా స్వీకరించి పాశ్చాత్య తత్త్వవేత్తలు వ్రాసిన అనేక గ్రంథములు చదివి, అపార పాండిత్యము సంపాదించి, వారలనుగూడ నరికట్ట సమర్థుడయ్యెను. కవిత్వము గూడ బ్రహ్మాండముగా చెప్పెడివాడు. వీరికి ముఖ్యముగా గానము-ధ్యానము-గ్రంథపఠనము మానసమును ముఖ్యముగా నాకర్షించియుండెను. తండ్రి మరణానంతరము గొప్ప దారిద్ర్యముతో బాధపడవలసి వచ్చెను. అప్పుడు న్యాయకళాశాలలో చదువుచుండెను. నిరాహారియై, నానాకష్టములు పడి, కళాశాలకు పోవలసి వచ్చుచుండెను. కొంతకాలము విద్యాసాగరుని పాఠశాలలో ఉపాధ్యాయవృత్తి జేసెను. ఎన్ని కష్టములు వచ్చినను, ఈశ్వరారాధన మానలేదు. తరువాత రామకృష్ణుని సాన్నిధ్యముననే యుండెను. రామకృష్ణుడు తన నిర్యాణానికి ముందు, తాను సంపాదించిన సర్వస్వము నరేంద్రునికి ధారపోసెను.

రామకృష్ణుని తదనంతరము కాషాయాంబరములు దాల్చి బారా (వరాహ) నగరమున కేగి, ఒక చిన్నయిల్లు అద్దెకు తీసుకొని అచ్చట పూజాసంకీర్తనము లొనర్చుచుండిరి. శ్రీరామకృష్ణసేవాశ్రమములకు బారానగరమే బీజము. మరల కొంతకాలమునకు దక్షిణేశ్వర సమీపమున నున్న "ఆలంబజారు"నకు మార్చబడి 1897వ సంవత్సరము వరకుండెను. తరువాత "బేలూరు"లో శ్రీరామకృష్ణ మఠము స్థాపింపబడెను. నేటికిని బేలూరుమఠము ప్రఖ్యాతివహించియున్నది. అమెరికాఖండమున కేగుటకు ముందే "వివేకానందు"డని నామము ధరించెను. కాశీ, హరిద్వారము, ఆగ్రా మొదలగు ప్రదేశములు సంచరించి, కొంతమంది పండితులతో వాదించి, దిగ్విజయము బొందెను. బదరికాశ్రమము, ప్రయాగ మొదలగు క్షేత్రములను దర్శించెను.

దక్షిణ భారతదేశములో కన్యాకుమారి వరకుగల సకల క్షేత్రములు-పట్టణములు దర్శించెను.

1893 మే 31వ తేదిన వివేకానందస్వామి, అఖిలప్రపంచమహా సభలలో పాల్గొనుటకై బొంబాయినగరము నుండి, "పెనిన్సుల" అను ఓడపై, అమెరికాకు బయలు దేరెను. దారిలో చైనా యందలి "హాంకాంగ్", జపాను దేశమందలి "టోకియో, యోకహామా" మున్నగు పట్టణములు దర్శించి కొలది రోజులకే గమ్యస్థానమైన చికాగో మహానగరము చేరెను. అక్కడ పాల్గొనదలచినవారు ప్రముఖ సంస్థలచే పంపబడినవారు మాత్రమే ప్రతినిధులుగా పరిగణింపబడిరి. ఆ సమయమున వివేకానందునకు మనస్స్మిమితము లేకయుండెను. ధనము లేకుండ, అమెరికాలో కాలముగడుపుట బహుదుర్లభము గదా!

భగవత్కృప వల్ల చెన్నపురిలో ఒక మహనీయుడు స్వామి యొక్క ప్రతిభను గూర్చి అమెరికాలోగల తన పరిచయస్థులకు జాబు వ్రాసెను. అక్కడ వారు స్వామిని గలుసుకొని విశేషముగ నాదరించిరి. తక్కువ వ్యయము గల బోస్టన్‌నగరమునకు తన నివాసమును మార్చుకొనెను. ఒక మహాతల్లి స్వామిని జూచి మహదానంద మంది ఆమె ఇంటిలోనే వసతి గల్పించెను. వివేకానందస్వామి అమెరికాలోని చెఱసాలను గురించి 'ప్రవర్తన సంస్కరణశాల'యని చెప్పుదురు అని చెప్పెను. వాటిని గురించి స్వామి ఎంతగనో మెచ్చుకొనెను. హార్వర్డు విశ్వవిద్యాలయమందలి రైట్ అను పండితుడు సభాధ్యక్షునకు స్వామీజీ గొప్పతనము, వారి ప్రతిభను గురించి వ్రాసెను. దానివల్ల స్వామికి సభలో పాల్గొనుటకు అవకాశమేర్పడెను. చికాగోలో దారి తప్పి తిండిలేక నానా అగచాట్లుపడి ఎవ్వరూ ఆశ్రయమివ్వని సమయములో దైవకృపవల్ల "జార్జిహేల్‌సతి" యను నామె స్వామి వారికి ఆశ్రయ మిచ్చి సమస్త సదుపాయములు గల్పించి మహాసభకు స్వయముగా దోడ్కొనిపోయెను.

1893వ సంవత్సరములో చికాగోనగరమున జరిగిన మతమహాసభ ప్రపంచచరిత్రలోనే మహాసంఘటన. వివేకానందుని నామము జగద్విఖ్యాత మొనర్చినది. ఈ మహాసభలో మా మత మొక్కటియే మోక్షదాయకమని చెప్పిన, స్వమతాహంకార పూరితులను కళ్ళు తెరిపించి, క్రైస్తవ మతమునకు మించిన మతములు కలవని పాశ్చాత్య లోకమునకు దారిచూపిన దీ మహాసభయే. ఆ మహాసభలో తలపాగను ధరించి, వివేకానందస్వామి బ్రాహ్మ-బౌద్ధ-మహమ్మదీయ ప్రతినిధుల మధ్య కూర్చుండెను. సభాధ్యక్షుని కోరికపై పెక్కుమంది ఉపన్యసించిన తరువాత స్వామివారు ఉపన్యాసమిచ్చుటకై సిద్ధపడెను. అప్పుడు సరస్వతీదేవిని ప్రార్థించి అమెరికా సోదర సోదరీ మణులారా!'అని సంబోధించగనే కరతాళధ్వనులు మిన్నుముట్టెను. వివిధ ప్రదేశములలో బుట్టిన నదులు సముద్రమున సంగమించినట్లే, వివిధ భావములతో మనుజు లవలంబించు వివిధారాధన మార్గములు వక్రములై గన్పట్టిననూ, అవక్రములై గన్పట్టిననూ, సర్వేశ్వరా, నిన్నే ప్రాపింపజేయుచున్నవి" అని పలికి సభ్యులను సమ్మోహితులుగా నొనర్చెను. ఆ సభా వేదికపై ఇతర మతప్రబోధకులు ప్రత్యేకమత సంప్రదాయములను గురించి మాత్రమే చెప్పిరి. వివేకానందస్వామివా రొక్కరే సర్వ మత గమ్యప్రాయమగు గొప్పతనమును గురించి బోధించిన మహనీయుడు. సభాధ్యక్షుడు స్వామివారి ఉపన్యాసము విని వివేకానంద స్వామివంటి మహావక్తలు లేరనుట నిస్సంశయ మని చెప్పి వక్తలలో నాతడే అగ్రగణ్యుడని నిరాఘాటముగా చెప్పెను.

అనేకమంది స్వామివారి ఉపన్యాసము విని ముగ్ధులై వారు చెప్పిన ప్రతివాక్యము, ఆత్రముతో నాలకించెడివారు. వారు అనేక సభలలో "పూజ్యత-పవిత్రత-త్యాగము ఏ మతమునకు సంబంధించిన ప్రత్యేకహక్కులు గావనియు, ఎవ్వరైనను తమ మత మొక్కటియే సుస్థిరముగా నిలిచి ఇతర మతము లన్నియు, నశించవలయు నని

భావించుట మందబుద్ధుల యవివేకమే కాగలదని చెప్పి "కలహము గాదు-సహకారము", "అన్యమతధ్వంసము గాదు-తదాశయగ్రహణము", శత్రుత్వముగాదు-శాంతియు, సహజీవనమని సమస్త మతముల వారికి బోధించెను. ఈ బోధనలతో చికాగో నగరములోనే గాక ప్రతిప్రాంతమున స్వామి నిలువెత్తు పటములతో నలంకరింపబడెను. కోటీశ్వరులలో పెక్కుమంది స్వామివారి నాహ్వానించి సత్కరించినన్ను, ఆయన అక్కడ గల స్వర్గతుల్య వైభవములను జూచి భారతదేశములో గల దరిద్రనారాయణులను గురించి చింతించుచుండెవారు.

సంకుచిత క్రైస్తవ మతాధికారులను తాను అమెరికాలో నుండియు గూడ తీవ్రముగా ఖండించుచుండెడి వాడు. తరువాత అనేక క్రైస్తవాచార్యులు స్వామివారికి మిత్రులుగా మారి శిష్యులైరి. అమెరికాలో పలుచోట్ల ఉపన్యసించి ప్రజల మన్ననలను బొందెను. తిరుగు ప్రయాణములో పారిస్ పట్టణములో కొన్ని దినములుండెను. అక్కడివారు స్వామివారిని మిక్కిలిగా అభినందించి గౌరవించిరి. తరువాత లండన్ నగరమునకు వెళ్లెను. లండన్‌లో అనేకులు మిత్రులై స్వాగత మొసగి ఆతిథ్య మిచ్చి హిందూయోగి వచ్చెనని బహుధా ప్రశంసించిరి. ప్యారిస్, లండన్ పట్టణములలోను, ఇతర ప్రదేశముల లోను తన ప్రసంగము నిచ్చి, పాశ్చాత్యుల గౌరవమన్ననలను బడసి మాతృభూమియైన భారతదేశమునకు రాదలచి, సింహళము చేరి, అక్కడ ప్రజలచే అఖండస్వాగత సత్కారములు బడసి ప్రజలకు తన దివ్యసందేశము నిచ్చి పాంబన్ పట్టణము చేరెను. తరువాత రామనాథనగరమునకు పోదలచి మధుర, తిరుచినాపల్లి, కుంభకోణము, మున్నగు పట్టణములలో నఖండగౌరవమును బొంది చెన్నగరమున తొమ్మిది దినము లుండిరి. ప్రజలు భక్తిగౌరవములతో పూజించి అనేక విధములుగా సత్కరించి ఆదరించిరి. తన జన్మభూమియైన వంగదేశమునకు బోవ సంకల్పించెను. దర్భాంగ్ మహారాజుగారి అధ్యక్ష

తన స్వాగతసంఘము ఏర్పడెను. వారు స్వామిని కలకత్తా పట్టణమునకు దోడ్కొని పోయిరి. వివేకానందుని నవీన భారతదేశ ప్రవక్తయని గుర్తింప సాగిరి. శ్రీరామకృష్ణుని జన్మదినోత్సవమున దక్షిణేశ్వరమున కరుదెంచి జనులు తన్ననుసరింప, కాళీదేవాలయమునకేగి, యభివందన మొనర్చి పాశ్చాత్య శిష్య సమేతుడై, గురుదేవుడు తప మొనరించిన పుణ్యస్థలము, వారు నివసించునట్టి స్థలమును దర్శించెను. వివేకానందుని పెక్కుమంది గొప్పవారు మహారాజులు దర్శించి, వారి సందేశములు విని, వారివల్ల సందేహములు నివృత్తి జేసుకొని వారిని అనుసరించిరి. స్వామివారు నా దేశమున నొక కుక్కయైనను పస్తుపడియున్న దాని కాహారమిడి రక్షించుటయే నా పరమధర్మము. ఇదియే నా మతము. తద్భిన్నమంతయు నధర్మము, కృత్రిమధర్మమని చెప్పెను.

ఒకానొక సమయమున నొక మిత్రుడు వివేకానందునితో ప్రణవాధికారము శూద్రులకు లేదు గదా! మీరు విదేశీయులకు మంత్రోపదేశ మెట్లు గావించినారు? వారు మ్లేచ్ఛులు గదా? శూద్రులైనా గారే? యని అడుగగా 'నా శిష్యులందరూ బ్రాహ్మణులే, బ్రాహ్మణులకు తప్ప ఇతరు లెవ్వరికిని ప్రణవాధికారము లేదనుమాట నిజమేయని నేను పూర్తిగా యంగీకరింతు'నని చెప్పి, బ్రాహ్మణకులము వేరు, బ్రాహ్మణ గుణములు వేరనియు, హిందూదేశమున బ్రాహ్మణత్వము కులమును బట్టి నిర్ణయింపబడుననియు, పాశ్చాత్యదేశములయందు బ్రాహ్మణగుణములను బట్టి బ్రాహ్మణత్వము నిర్ణయింపబడుననియు చెప్పెను. మూడు గుణములు సత్త్వము, రజస్సు, తమస్సు, ఎట్లు గలవో అట్లే బ్రాహ్మణత్వ, క్షత్రియత్వ, శూద్రత్వములు నిర్ణయించు గుణములు గలవు.

బ్రాహ్మణత్వ, క్షత్రియత్వ గుణములు నశించి పోవుచున్నవి గాని పాశ్చాత్యు లిప్పుడు క్షత్రియత్వమును సాధించినారు. అందుండి

ఇంక పైకి పోయినచో వారికి బ్రాహ్మణత్వము సిద్ధించును. ఇప్పటికే బ్రాహ్మణత్వమును సాధించినవారు పెక్కుమంది కలరు. బ్రాహ్మణత్వము, క్షత్రియత్వము, వైశ్యత్వము, శూద్రత్వము కల్పించు గుణములు సహజములై ప్రతి మనుష్యునందును, హెచ్చు తక్కువలుగా నిలచి యుండును. జీవితమునకై ఒకని కొలువు కొలుచు నప్పుడు శూద్రుడు లాభము ఆర్జించుకొనుటకై యేదో యొక వ్యవహారమునందు ప్రసక్తుడైయున్నప్పుడు అతడు వైశ్యుడు. ధర్మ నిర్వహణార్థమై దుష్టులతో పోరాడు నప్పుడు అతనిలో క్షత్రియగుణము వ్యక్తమగును. భగవద్ధ్యాన నిమగ్నుడై యున్నప్పుడును భగవంతుని గురించి ఇతరులతో ప్రసంగించునప్పుడు అతడు బ్రాహ్మణుడు. స్వభావ కారణమున మానవుడు ఒక కులమునుండి మరియొక కులమునకు మారుట సాధ్యము కానిచో విశ్వామిత్రుడు బ్రాహ్మణు డెట్లయ్యెను? పరశురాముడు క్షత్రియు డెట్లయ్యెను? మనదేశమున గూడా బ్రాహ్మణులు కలరు గాని వారు ప్రజాకంటకులై అత్యాచారములచే దేశమును వినాశదశకు దెచ్చుచున్నారు. అందుచే వారిలో గల స్వాభావిక శక్తి క్రమక్రమముగా అదృశ్యమై పోవుచున్నది. గురువు, శిష్యునకు మంత్రోపదేశము జేయును గాని ఆ కార్యము వ్యాపార రూపము దాల్చినది.

రామకృష్ణుని మరణానంతరము వారి శిష్యులందరిని జేర్చి రామకృష్ణ పరమహంస యొక్క సిద్ధాంతములను బోధనలను బోధించుటకై వారిని నలుప్రక్కలకు బంపెను.

1898లో వివేకానందుడు శ్రీరామకృష్ణ మఠమును స్థాపించెను. దేశోద్ధరణ కొరకు మానవకల్యాణము కొరకు అనేక సంఘములు స్థాపించెను. వివేకానందుని సంకల్పబలముచే "రామకృష్ణ మిషన్"

ప్రారంభించిరి. ఈ మిషన్‌వారు నేటికిని కేవలము బోధనలు, తత్త్వ ప్రచారము సలుపుటయే గాక "మానవసేవయే మాధవసేవ" యనెడు పరమలక్ష్యము పెట్టుకొని దేశములోని ఏ ప్రాంత మందైనను, ఏ విధమైన ఆపదలు, విపత్తులు సంభవించినను ఎంతటి కష్టము లైనను ఎదుర్కొని వర్ణ వర్గ వివక్షతలు లేక మానవసేవా కార్యములలో పాల్గొని నిస్స్వార్థసేవ చేయుచుండుట జగద్విఖ్యాతమైన విషయము. ఈ మిషన్ మన దేశమునందే గాక, విదేశముల యందు గూడ ప్రజాసేవ చేయుచు ప్రఖ్యాతి వహించి యున్నది. ఆపదల సమయములలో తిండి, గుడ్డ, గృహ నిర్మాణములు మొదలగు ప్రజాకార్యములు వీరి నిర్వహణ క్రింద పంపిణీ చేయుచుందురు. ఇండియాలో అనేక మిషనులున్నను, ఈ రామకృష్ణ మిషనుకుగల ప్రత్యేకత నేటికిని కొట్టవచ్చినట్లుగా కనపడుచు ప్రశంసలు పొందుచున్నది. శంకర, రామానుజ, మధ్వ మొదలగు మతాచార్యులు గతించిన చాలకాలమునకు హిందూమతరక్షణకో యన్నట్లు జన్మించిన మహనీయ పురుషడని ఇతనిని నిస్సంశయముగ చెప్పవచ్చును. ఆధునిక యుగపురుషులలో ఆధ్యాత్మికముగ వివేకానందుని కన్న గొప్పవాడు లేడనుట సత్యదూరము గాని అతిశయోక్తిగాని గాదు. వివేకానందుని వలననే రామకృష్ణుని గొప్పతనము వెలుగులోనికి వచ్చెను. వారుభయుల సంబంధము అనిర్వచనీయము. వివేకానందస్వామి బహుజన ప్రతినిధియై దేశదేశములు వెడలి భారతీయతత్త్వమును వెదజల్లి నిజమైన జగద్గురువుగా పేరు ప్రఖ్యాతులు పడసిన మహనీయమూర్తి.

1902వ సంవత్సరము జూలైనెల 4వ తేదీన దినచర్యనంతయు సక్రమముగా నెరవేర్చుకొని శాశ్వత సుఖనిద్ర జెందెను. తరువాత వారి భౌతికకాయమునకు నిర్ణీతప్రకారముగ అంత్య సంస్కారములు గావింపబడెను.

## శ్రీ అరవిందయోగి

గంగామతల్లిచే పూతమైన వంగదేశమున గంగాతీరమున కలకత్తాకు 13 మైళ్ళ దూరమునగల కొన్నగర్ గ్రామమున గల "కృష్ణధన్‌ఘోష్ - స్వర్ణలతాదేవి" యను దంపతులకు నలుగురు పుత్రులు నొక పుత్రికయు గలిగిరి. వీరి తృతీయపుత్రుడే అరవిందుల వారు. వీరు 15-8-1872వ సంవత్సరమున జన్మించిరి. ఆధునిక వంగదేశనిర్మాతలలో నొకరైన శ్రీరాజనారాయణ బోసు అరవిందుల వారికి మాతామహులు. వీరు వంగ, పర్షియన్, సంస్కృత, ఆంగ్లే యాది భాషలలో గొప్ప పండితులు. ఈ మహామహుని ప్రథమ పుత్రికయే స్వర్ణలతాదేవి. అరవిందులవారి తండ్రియైన కృష్ణధన్‌ఘోష్ వైద్యవిద్యనభ్యసించి చిన్నఉద్యోగములో ప్రవేశించి ఐ. యం. యస్. పరీక్షయం దుత్తీర్ణుడై పాశ్చాత్య నాగరికత గలిగి యుండియు, అనారోగ్యముతో తాండవమాడుచుండిన ఖుల్నా అను పట్టణమును ఆరోగ్యప్రదేశముగా పరివర్తనమందించి ఎక్కువ కీర్తిప్రతిష్ఠలు సంపాదించిరి. భారతదేశమున, ముఖ్యముగ వంగదేశమున 19వ శతాబ్దములో వేదకాలపు ఆధ్యాత్మిక వికాస మంతరించి పూర్వపు ధర్మశాస్త్రములను సరిగా సమన్వయించువారు లేక యుండిరి. సనాతన ధర్మ శాస్త్రములకే భిన్నముగా గల మూఢాచారములు, అర్థశూన్యములై, ఆడంబరపు తంత్రకలాపములు బాహ్యాట్టహాసములు మొదలైనవే మతసారమని నిరంకుశముగా నధికారము చలాయించి, గురువులు మతోద్ధారకులు మరొకవంక పాశ్చాత్య నాగరికత యన్న, సభ్యత యన్న జోహారు లొసంగి వెనుక ముందు జూడక వేషభాషలయం దేమి, నిత్య ఆచారములయం దేమి ఆమూలాగ్రముగ దొరల ననుసరించుటయే గౌరవమని భావించి మన మత భాష వేషసంప్రదాయములను నిరసించుటయేగాక విరోధభావము గలిగి ప్రచ్ఛన్న క్రైస్తవులనదగు నవనాగరకుల కాలముగ నుండెను.

అరవిందుని తండ్రియైన కృష్ణధన్‌ఘోష్ కుమారుని సామాన్య పాఠశాలయందు గాక డార్జిలింగు నందు గల "సైంట్‌పాల్" స్కూల్ నందు విద్యాభ్యాసము చేయించి, అంతటితో తృప్తిపడక తన ముగ్గురు పుత్రులను కుమార్తెను ఇంగ్లండునకు దీసుకొని పోయి మాంచస్టర్ నందు గల "డూట్" అను దొరగారి వద్ద అరవిందులను మాత్రము విడిచి తిరిగి వంగదేశమున కేతెంచెను. ఇంగ్లాండులో అరవిందులు ఐదు సంవత్సరములు విద్యాభ్యాసము చేసి ఫ్రెంచిభాష నభ్యసించి, ఉపాధ్యాయుల మన్నలను బడసి 1890లో ఉత్తమతరగతిలో ఐ.సి.ఎస్ పరీక్షప్యాసయి ప్రొబేషనరీ రెండు సంవత్సరముల కాలములో విద్యార్థి వేతనము గూడా బడసెను. కేంబ్రిడ్జియందలి కింగ్సు కళాశాలలో పాశ్చాత్య భాషలయం దుత్తములుగా నుత్తీర్ణులై ట్రైపాస్ పట్టమును బొందియుండిరి. గుఱ్ఱపుస్వారి పరీక్షకు హాజరు కాక ఐ.సి.యస్‌ను త్రోసిపుచ్చిరి. బాల్యము నుండియు దేవారాధన, ఈశ్వరసేవయు, వీరి యాదర్శములు. వీరి నిరుపమాన మేధాసంపత్తిచే ఇంచుమించు పాశ్చాత్యభాష లన్నిటియందు అపార పాండిత్యము గడించిరి. పాశ్చాత్య వాఙ్మయమున వారు పరిశీలించని సాహిత్యము గాని, తత్త్వముగాని లేదు. ఒక పర్యాయము అలీపూర్ బాంబుకేసునందు ఘోరనేరము క్రింద బందీకృతులైరి. బరోడా మహారాజుగారు వీరి అమోఘమైన తెలివితేటలు, ప్రజ్ఞావిశేషములు కీర్తిప్రతిష్ఠలు తెలుసుకుని తనతో విదేశములకు దీసుకొని పోయెను. తరువాత కొంతకాలమునకు స్వదేశమునకు వచ్చి రెవిన్యూశాఖలో ఉద్యోగ మొనర్చి వంగ, సంస్కృత, గుజరాతి, మరాటీ, హిందీభాషల నభ్యసించి ప్రాచీన వాఙ్మయమునందు పాండిత్యము సంపాదించెను.

కొంతకాలమునకు మృణాళినీ దేవిని వివాహమాడి గృహస్థాశ్రమము స్వీకరించిరి. బరోడాయందే ఆధ్యాత్మికంగా, రాజకీయంగా వారియందు నూతన పరివర్తనము కలిగినది. వీరికి యోగా

భ్యాసము లొనర్చు సాధువుల పరిచయ మిచ్చుటనే కలిగినది. ప్రథమమున నర్మదానదీతీరము నందుండిన "చందోటి" ఆశ్రమములో యోగి బ్రహ్మానందస్వామి వారిని దర్శించిరి. వీరు రాజకీయరంగములలో గూడా ప్రవేశించి అనేక విధములుగ దేశసేవచేసి యు, చివరకు ఆధ్యాత్మిక చింతన, యోగాభ్యాసములయం దభీష్టము గలవారై 1910 ఏప్రియల్ 4వ తేదిన ఫ్రెంచి ఇండియాకు ముఖ్యపట్టణమైన పుదుచ్చేరి చేరిరి. అరవిందులు రాజకీయరంగమునుండి విడివడి పుదుచ్చేరిలో యోగాభ్యాస మొనరించుచుండినను, ప్రభుత్వము వారు వారిని విడిచి పెట్టక రాజద్రోహ మొనర్చినట్లు, పారిపోయినట్లు భావించి నిర్బంధించి తరువాత వదలిపెట్టిరి.

వీరు ముఖ్యముగా మత, రాజకీయ, సాంఘిక, సారస్వతాది కళావిశేషము లన్నింటిని ఆధ్యాత్మికదృష్టిలో సమన్వయ మొనరించి, వాటి అన్యోన్యసంబంధమును, పరమార్థమును వెల్లడించి యున్నారు. వీరు ఆంగ్లభాషయందు ద్వేషము వహింపక భాషా ప్రపంచమునం దగ్రపీఠము నధిష్ఠించి పాశ్చాత్యలోకమునకు యోగాభ్యాసవిధానములను, వేదకాలపు సిద్ధాంతములను, తత్త్వసూత్రములను, పరమధర్మములను, భాగవతజీవనరహస్యములను సహేతుకముగ సప్రమాణముగ సర్వతోముఖముగ వెల్లడించి, ప్రాచ్య, పాశ్చాత్య-సభ్యతాసంకలనము గావించి ప్రపంచకల్యాణ మొనర్చుటయే వారి ముఖ్యోద్దేశ్యమైనట్లు తెలియుచున్నది. వీరు రాజకీయరంగమును పూర్తిగ పరిత్యజించి ఆధాత్మిక ప్రపంచముననే సమస్తశక్తులు వినియోగించి, విహరించిన మహనీయమూర్తి. కొంతకాలము గడచిన తరువాత సంవత్సరమునకు మూడుపర్యాయములు (ఫిబ్రవరి 21, అగస్టు 12, నవంబరు 24) మాత్రమే తన శిష్యులకు దర్శనమిచ్చి, ఏకాంతవాసము గడపినట్లు తెలియుచున్నది.

అరవిందాశ్రమములోని శిష్యు లందరు పూర్తిగ రాజకీయోద్య మములనుండి విరమించిన వారే. ఈ ఆశ్రమము వారి అధీనములోనే యుండి, వారి యాజ్ఞానుసారముగా నిర్వహింపబడు చుండెను. ఇది యొక మతసంస్థ గాదు. సర్వమతములవారు, కుల, మత, పాండిత్య భేదము లేక అందరు ఆశ్రమ ప్రవేశమునకు అర్హులే.

అరవిందులు ముఖ్యముగ వైదికయుగ మందలి కర్మయోగ ప్రభావము, దర్శనము నందలి జ్ఞానయోగ, మాహాత్మ్య, భక్తియోగ ప్రపత్తియు, సమాశ్రయమును బొందియుండెను. ప్రాచ్యజన్మ సంస్కారము, పాశ్చాత్య విద్యాసంస్కారము వీరి హృదయమున విశిష్ట స్థానమును బొందియుండెను. వంగదేశ విభజనకాలమందు, అర విందులు చూపిన దేశభక్తి, పత్రికానిర్వహణ సామర్థ్యము, స్వదేశదీక్ష, కార్యదీక్ష, స్వధర్మప్రచారము, నిర్బంధానుభవము, ఉద్యోగము, విజ్ఞా నోపార్జనము మొదలగు జీవితాంశములు వీరి ముఖ్య సాధనములు. ఇవి యోగులను, విద్యావంతులను ధీమంతులను నాకర్షించుచున్నవి. వీరి ప్రబోధనలవలన దేశీయులే గాక, విదేశీయులు సహితము మన దేశమునకు వచ్చి, వీరిని దర్శించుకొని, వీరు తెలిపిన బోధనలలోని విలువలను హిందూ మతతత్త్వములో గల ఆధ్యాత్మిక విలువలను గ్రహించి శ్లాఘించి యుండిరి.

వీరి ఆశ్రమములో మాంసాద్యాహారములు నిషిద్ధములు. చింత పండు బదులు నిమ్మకాయ లుపయోగింతురు. పండ్లు, పాలు, పెరుగు రొట్టె, వరియన్నము, పప్పులు, కూరలు ముఖ్యాహారములు.

## శ్రీరమణమహర్షి

ద్రావిడదేశమున మధురానగరము దాటిన తరువాత 'తిరుచ్చుళి' యను గ్రామము గలదు. తిరుచ్చుళి దివ్యక్షేత్రము. దీని చెంతనే పాపహారి' లేక 'కౌండినా' నది గలదు. తిరుచ్చుళి యన 'ఓంకార'

మని యర్థము. ఆ క్షేత్రమున శివుడు భూమినాథ రూపమున వెలసి యుండెను. ఈ గ్రామమున పరాశరగోత్రులు, ద్రావిడ బ్రాహ్మణశాఖలో నొకటి యగు బృహచ్చరణ శాఖకు చెందిన "సుందరమయ్యర్" అను న్యాయవాదు లొక రుండిరి. వీరి భార్య "యలగమ్మాళ్". వీరికి ముగ్గురు కుమారులు గలిగిరి. వీరిలో రెండవవాని పేరు వేంకటరామన్. వీరే రమణమహర్షిగా ఖ్యాతి గడించిరి. వీరు నిరతాన్నదాతలు. వీరి పూర్వులలో నొకరింటికి ఒకనా డొక సన్న్యాసి వచ్చి అన్నము పెట్టవలసిన దని యడుగగా, అన్నము పెట్టకపోగా, వారు చూపిన నిరాదరణకు కష్టపడి, తరమున కొక్కరు నా వలెనే సన్న్యాసులై భిక్షాన్నజీవులై యుందురు గాక యని శపించెను. అప్పటి నుండియు ఈ కుటుంబము వారిలో తరమున కొకరు సన్న్యాసాశ్రమస్వీకారము చేయుచున్నారు. అటులనే సుందరమయ్యర్ తాతలలో నొకరు, వీరి అన్నయుగూడ సన్న్యాసాశ్రమము స్వీకరించియుండిరి.

శ్రీరమణులు క్రీ. శ. 1879 సంవత్సరం డిసెంబరు 30వ తేదిన జన్మించియుండిరి. చిన్నతనము నుండియు చదువులో చాలా చురుకుగా నుండిరి. సూక్ష్మగ్రాహియై చెప్పినదే తడవుగ గురువుకు పాఠములు ఒప్పచెప్పుచుండెను. చాలా మితభాషి. చదువులలోనే గాక కుస్తీలు, ముష్టియుద్ధములు, దండెములు మొదలగు వ్యాయామక్రీడల యందు గూడ ప్రావీణ్యము గలిగి యుండెను. 1892లో తండ్రి చనిపోయెను. మధురలో వీరి పినతండ్రి (సుబ్బయ్యరు) గారి యింట చదువుచుండెను. వీరి బంధువులలో నొక వృద్ధుడు వీనిని ప్రేమతో రమణా యనెడివారు. తరువాత గణపతి మునీంద్రులు, వీరి శిష్యులై ఈ నూతననామమును స్థిరీకరించిరి. అప్పటినుండి "శ్రీరమణమహర్షి" యని వ్యవహరింపబడుచుండిరి.

ఒకనాడు తిరుచ్చుళి గ్రామనివాసి అరుణాచలము నుండి వచ్చుచు, మధురలో రమణుని కలిసి అరుణాచల (తిరువణ్ణామలై)

మహాత్త్వమును చెప్పెను. వెంటనే రమణునికి హృదయమున తెలియని అనుభూతి గలిగి భక్తి మిక్కుటము మాయెను. కొంతకాలము ఏకాంతముగ నుండి ఎవరితోను ఎక్కువగ మాటలాడక, ఆటలాడక దేవాలయములకు బోవుచుండెను. మధురలో ప్రసిద్ధమైన మీనాక్షీసుందరేశ్వరుల సన్నిధికి పోయి, ఏకాగ్రదీక్షతో ఈశ్వరుని తన్ను భక్తునిగా నొనర్పు మనియు, నాయనారులకు వలె తనకును, అనన్యశరణమగు పూర్తిభక్తి నిమ్మని వేడుకొనుచుండెడివాడు. అన్నయు, పినతండ్రియు ఇతని పద్ధతులు నిరసించి, ప్రాతికూల్యము చూపుచుండిరి. అప్పుడు రమణునికి అంతరంగమున విరక్తి, భగవచ్చరణారవిందములపై అనురక్తియు, పరస్పర వైరుధ్యముగ గోచరించుచుండెను.

1893 ఆగష్టు శనివారము ఇంగ్లీషు వ్యాకరణము చదువనందున ఉపాధ్యాయుడు ముమ్మారు వ్రాయుమని చెప్పినందున రమణుడు వ్రాయుచునే పద్మాసనమున కూర్చుండి, ధ్యానమున కుపక్రమించెను. తమ్ముని చేష్టలకు అన్నగారైన నాగస్వామి కోపించి పరుషవాక్యములతో రమణుని నిందించెను. అన్నగారి తిరస్కారమే శ్రీరమణునిలో గొప్ప మార్పు తెచ్చినది. సంవత్సరము గడచిన తరువాత రమణుడు అరుణాచలేశ్వరుడే జనకుడు, పరమపిత, సర్వశక్తియుతుడు, సర్వజ్ఞుడు అని తలచెను. అన్నగారు తన స్కూలుజీతము కట్టుమని అయిదు రూపాయలు రమణుని కివ్వగా, తాను స్కూలుకు వెళ్లుచున్నానని చెప్పి అరుణాచలమునకు చెప్పకుండా పోయెను. రైలులో ప్రయాణము చేయునప్పుడు గూడా ఎటూ చూడక, ఇతర ధ్యాసలేక, కళ్లు మూసుకొని స్వామియందు భక్తిలో లీనమైయుండెడివాడు. ఆకలిదప్పులు మరచిపోయెను. దారిలో "అరియని-నల్లూరు" గ్రామములో దిగి, అక్కడగల స్వామిని దర్శించ దేవాలయములోనికి బోయెను. ఎవరి నడిగినను ప్రసాదము లభించలేదు. మనసు కరిగిన వాద్యగాండ్రలో నొకరు ప్రసాద మిచ్చిరి.

ఆ తరువాత పోవుటకు ద్రవ్యము లేక చెవులకునున్న యంటు జోళ్ళు తాకట్టుపెట్టి నాలుగు రూపాయలు తీసుకొని, కృష్ణాష్టమి రోజున నొక బ్రాహ్మణుని యింట భుజించి, అరుణాచలమునకు ప్రయాణమై పోయెను. అరుణాచలేశ్వరుని తనివితీర సేవించెను. తరువాత భక్తితో గలిగిన విరక్తిచే తనవెంబడి తీసుకొని వచ్చిన ఆహారమును, ఖర్చులకు పోగా మిగిలిన సొమ్మును అవతల విసరివైచెను. కౌపీనము ధరించెను. జందెమును పరిత్యజించెను. తాను జగజ్జనని పుత్రుడని తలచి అహంకారము, మమకారము వలదని మంగలివద్దకు బోయి క్షురకర్మ నెరవేర్చుకొనెను. తరువాత మౌనవ్రతము పాటించి, సర్వస్వము అరుణాచలేశ్వరుడని నమ్మియుండెను. తపస్సు చేసుకొనుటకై వేయికాళ్ల మంటపము మధ్యలోనున్న అరుగు నాశ్రయించెను. ఎవరైనా ఆహారము నిచ్చిన తీసుకొనుచూ, మౌనముగా కన్నులు మూసుకొని తపస్సు చేసుకొనుచుండెను. కొంతమంది కొంటెబాలురు పరిహాస మొనర్చుచు, చిల్లపెంకులు మొదలగునవి విసరివేయుచుండిరి. తన పూజకు, ప్రార్థనకు అభ్యంతరము కలుగు చున్నందున అతడు పాతాళలింగము ప్రవేశించెను. అక్కడ క్రిమి, కీటకాదులు వీరిని కుట్టుచున్నందున నెత్తురు, చీము కారుచుండెను. కాని వారు లక్ష్య పెట్టక తాము తపస్సు చేసుకొనుచునే యుండిరి. వీరి స్థితి జూచి జాలితో తమయింటికి రమ్మని ఆహ్వానించినను, ఏమియు పట్టించుకొనకయుండిరి. రాను రాను ఇతని యుగ్రతపమును ఏ కొద్దిమంది కొంటెపిల్లలో తప్ప పలువురు వచ్చి మెచ్చుకొనుచుండిరి.

ఆ ప్రాంతములోనే ఒకప్పుడు శేషాద్రిస్వామివారిని గూడా ఈ విధముగనే చూచిరి. శేషాద్రిస్వామివారు కూడా ఇతని తపశ్శక్తికి మెచ్చి, అప్పుడప్పుడు వచ్చి చూచి పోవుచుండిరి. ఇక్కడ రమణుల వారి పరిస్థితి తెలుసుకొని పళనిస్వామి యను వారు ధ్యానమున నుండిన రమణుల వారిని "గోపుర సుబ్రహ్మణ్యస్వామి" వారి దేవా

లయమున పిడిచిరి. వీరికి అప్పుడు క్రిమి కీటకములు కుట్టుటచే పుండ్లనుండి నెత్తురు, చీము కారుచుండెను. వీరిని "బ్రాహ్మణస్వామి" యని గూడా వ్యవహరించుచుండిరి.

తరువాత ఆలయమునందు గల నందనవనమను తోటలోనికి ధ్యానార్థమై చేరిరి. ఒక్కొక్క సమయములో వీరికి కౌపీన ముండెడిది గాదు. వీరు ధ్యానమునకై వాహనమంటపము మొదలగు పలు ప్రదేశములు మారిరి. "ఉద్దండనాయరు" అను శైవభక్తుడు వీరికి అపరిమిత భక్తిశ్రద్ధలతో సేవలు చేయుచు, వీరిని వీడక ప్రథమ పరిచారకు డయ్యెను. కొంటెపిల్లలు కొందరు స్వామి మీద మూత్రవిసర్జన చేసినను స్వామి గమనింపకయే శాంతచిత్తులై యుండిరి. 'గురుమూర్త మున' స్వామి తపశ్చర్యకై ప్రవేశించెను. ఇచట వారికి ఏ ఆటంకము లేకుండా నిర్విఘ్నముగా తపశ్చర్య సాగిపోవు చుండెను. శరీరము ధూళిమయమై. కేశములు జడలుకట్టి దీర్ఘములైయుండెను. ఈ ప్రాంత మున చీమల బాధ యధికమైనను, వీరు పట్టించుకొనక యుండిరి. జనులకు ఈ కఠోరతపస్సు చూచినది మొదలు స్వామియెడ భక్తిగౌరవములు ఎక్కువయ్యెను. అందరికిని శరీరమునకు కావలసినది సేవయే ముఖ్యమని బోధించెను. మొదటి నుండియు "తంబిరామ్" అను భక్తుడు నివేదించిన ప్రసాదమే దినమున కొకపర్యాయము సేవించెను. చాలకాలమునకు స్వామివారు తమిళుడని, అసలు పేరు వేంకటరామన్ అని తెలుసుకో గలిగిరి.

కొంతకాలము వరకు వేంకటరామన్ యింటికి రాకపోవటము అన్న నాగస్వామి, పినతండ్రి సుబ్బయ్యర్ మానామధురలో నున్న అలగమ్మ వద్దకు వెళ్ళి చెప్పిరి. చాలా చోట్ల వెదకిరి కాని రమణుని వృత్తాంతము తెలియ లేదు. కొంతకాలమునకు సుబ్బయ్యర్ మరణించెను. తిరుచ్చుళి నుండి యువకుడొకడు వచ్చి మధురలో నున్న వేంకటరామన్ తల్లికి, అన్నకు వేంకటరామన్ వృత్తాంత మంతయు

చెప్పిరి. వేంకటరామన్‌ను తీసుకొని వచ్చుటకు ఎన్నో విధముల ప్రయత్నించి విఫలులైరి. తరువాత స్వామి "అరుణగిరినాథర్" (ఆచార్యప్రతిష్ఠిత లింగము) గుడికి పోవుచూ పరిచారకులను తన వెంట నుండ సమ్మతింపక పూర్తిగ ఏకాంతమున నుండిరి. స్వామి అరుణాచల సమీపమున "పవలక్కుద్రు" అను తిప్పయందు గల ఈశ్వర దేవాలయములో తపస్సు సాగించెను. తల్లియు అన్నయు వచ్చి యింటికి రమ్మనమని వేడుకొనిరి; కాని లాభము లేకపోయెను.

తల్లి ఎంత దుఃఖించినను స్వామి మౌనముగనే యుండెను. మరల పవలక్కుద్రు వదలి అరుణాచలమునకు వచ్చిరి. అరుణగిరి యందు గల గుహాలన్నింటిలో విరూపాక్షగుహ ముఖ్యమై యుండెను. 1922వ సంవత్సరమున రమణాశ్రమము నెలకొలిపే వరకు విరూపాక్ష గుహ యందే రమణుడు నివసించి తపస్సు చేసుకొను చుండెను. ఈ గుహయందు పాములు, తేళ్లు, మండ్రగబ్బలు, ఉడుతలు, మర్కటము లున్నను వాటికి హాని కలిగించే ఏ ప్రయత్నము చేయ నివ్వ లేదు. అవి కుట్టినను స్వామివారికి విషమెక్కుట లేదు. ఒక పెద్దత్రాచుపాము నిత్యము స్వామివారి చెంతకు వచ్చి వారిని ఏమియు చేయక వారిని స్థిరదృష్టితో చూచి పోవు చుండెడిది. మర్కటములతో స్వామివారు నిత్యము కొంత కాలక్షేపము చేయు చుండెడివారు. సమస్త జంతువులు రమణమహర్షి ఆశ్రమమున ఎవరికి హానిచేయక వాటి పనులు అవి చూచుకొని శాంతముగా పోవు చుండెడివి. అనేకమంది పండితులు తత్త్వవేత్తలు వీరి యాశ్రమమునకు వచ్చి సందేహములు తీర్చుకొను చుండిరి. 1903 లో విరూపాక్ష గుహయందు స్వామివా రుండగా ఆంధ్రదేశమునుండి విద్వాంసుడైన గణపతి మునీంద్రులు స్వామిని దర్శించి తపస్స్వభావము చెప్పవలసినదిగా కోరి, వారి వలన సర్వము గ్రహించిరి. గణపతులవారు దగ్గరుండుటచే రమణులవారు సంస్కృతమున దెనుగున రచనాశక్తియు గలిగించుకొనిరి. వీరి

భోజనము కాగానే, శిష్యులు స్వామివారు వ్రాసిన గ్రంథములను, పఠించెదరు. ఆశ్రమమున స్త్రీలు రాత్రులయం దుండరాదని నియమము గలదు.

ఒకనాడు స్వామియు, వాసుదేవ శాస్త్రియు నూనె, సికాయ తేసుకొని స్నానార్థము విరూపాక్ష గుహనుండి పచ్చయ్యమ్మన్ కోవెలకు బయలు దేరిరి. తలయంటు స్నానము, నడక, పదిగంటల ఎండ వలన స్వామి తిరుగు ప్రయాణములో అలసిపోయి నందున స్వామివారికి కొండ ఎక్కుటకు, చాల కష్టముగా నుండెను. కొంత సేపటికి నీరసించినందున ప్రకృతిదృశ్యము అదృశ్యమై వెంటనే నడచుట మానివైచి, మరల నడచెను. కొంతసేపటికి హృదయ చలన మాగిపోయి, దేహము చల్లనైపోయెను. వాసుదేవశాస్త్రి, రమణులు మరణించెనని ఏడ్చెను. తరువాత స్వామి పద్మాసనాసీనుడై యుండెను. మరల మామూలు స్థితికి వచ్చినను చెమటలు క్రమ్మి, రక్తప్రసారము, నిశ్వాసము తగ్గినది. తరువాత దేహత్యాగము జేసెను.

## శ్రీ బ్రహ్మంగారు

వీరి చరిత్ర సంపూర్ణముగా లభించుట లేదని చాలా మంది తెలియ జేయుచుండిరి. వీరి జన్మస్థలం కందిమల్లయ్యపాలెం. ఇక్కడనే వీరి స్వగృహము, వీరి జీవసమాధి గలదు. వీరి జననము కలియుగము సుమారు 4786 సంవత్సరములకు పైగా, వికృతి సంవత్సర చైత్ర శుద్ధ విదియ, సోమవారమని కాలజ్ఞాన గ్రంథమును బట్టి తెలియుచున్నది. 240 సంవత్సరముల పైవారని తెలియుచున్నది. కర్నూలు జిల్లాలోగల "జుఱ్ఱు" అను నది ప్రక్కన బనగానపల్లె యను పురము గలదు. ఆ పురమున ప్రఖ్యాతి గాంచిన గరిమరెడ్డి వారి వంశము లోనే పేరుగన్న వేంకటరెడ్డి, వారి భార్య అచ్చమాంబ యను వారుండిరి. వీరు ధనసంపత్తి, గోసంపత్తియే గాక శాంతము, సత్యము, కరుణ గలిగి యుండిరి. గ్రామములోని ప్రతివారు తమకు

గల కష్టములు, తమ మధ్యలో అప్పుడప్పుడు సంభవించుచుండిన తగాదాలు అచ్చమ్మగారితో చెప్పి, పరిష్కారము చేయించుకొనుచు, తమకు గల చిక్కులు తీర్చుకొనుచుండెడి వారు. ఒకనాడు ఆమె తన ప్రాతఃకాలపు పనులు పూర్తి చేసుకొని సూర్యనమస్కారములు చేయుచుండెను. ఆ సమయమున వీరప్పయ్య (బ్రహ్మంగారు) ఆమెను సమీపించి, తన తండ్రి మల్లన్నగారనియు, విశ్వకర్మ కుల మనియు, పోతులూరనియు చెప్పి ఆమెవద్ద కొంతకాలముండదలచితి నని చెప్పెను. ఆమె ఆ బాలుడు చెప్పిన విషయములు విని, ఆశ్చర్య పడి ఊరకనే యుండమని చెప్పినను, నా బాలుడు వినక గోరక్షణపని చేయుటకు ఆమెను ఒప్పించి, అక్కడనే యుండెను. వీరప్పయ్య ప్రతి నిత్యము గోవులను గాచుటకు పొలమునకు బోయి, మిగతా పిల్లల వలె గోవులవద్ద నుండక తాను మాత్రము గోవులను వదలి, ఎవ్వరికి తెలియకుండా, ఏకాంత స్థలమునకు బోయి యొక గుహలో భగవ ద్ధ్యాన నిమగ్నుడై యుండి సాయంకాల సమయమున, గోవులను సుర క్షితముగా, తప్పిపోకుండా తోలుకొని వచ్చుచుండెను. ఈ విషయము మిగతా గోవులను గాచే పిల్లలకు తెలియక అచ్చమాంబతో, వీరాచా ర్యుడు గోవులను సరిగా కాయక, ఎక్కడికో పోవుచున్నాడని కొండె ములు చెప్పసాగిరి. ఒకరోజున అచ్చమాంబ భర్త వెంకటురెడ్డి నిజము తెలుసుకొనుటకు పొలమునకు బోయిరి. వీరప్ప గోవులు ఎటూ పోక బాగుగా మేయుట గమనించిరి. మిగతావారు వారినిజూచి వీరప్పయ్య ఎక్కడికో పోయినాడనియు. పోతూ ఆవులచుట్టు నొక గీతగీచి పోవు ననియు చెప్పిరి. వారు చెప్పినప్రకారం ఆ వృద్ధదంపతులు, వీరప్పయ్య వెళ్లిన దిక్కునకు బోయి, ఒక భయంకరమైన కొండ గుహలో, వీర ప్పయ్య యోగసమాధిలో నుండుటయు, వారి సమీపమున పెద్ద సర్పము పడగ విప్పి యాడుచున్నట్లు చూచి, తత్తరపడసాగిరి. వీర ప్పయ్య మనస్సు పరాయత్తమై యుండుటచే, నిది యంతయు, గమ

నించలేక పోయెను. ఆ వృద్ధదంపతులు, ఇంటికి వచ్చి వీరప్పయ్య సామాన్యుడు గాడని తలచి ఆశ్చర్యపడసాగిరి. వీరప్పయ్య మామూలుగా పశువులను దోలుకొని ఇంటికి వచ్చెను. వెంటనే అచ్చమాంబ దంపతు లిరువురు వీరప్పయ్యకు నమస్కరించి పాదపూజచేసి, మాకెట్టి ఐశ్వర్యము వద్దనియు, ముక్తి దక్క ఇంకనేమియు నక్కర లేదనియు విన్నవించుకొని మోక్షమునకు మార్గము చూపుమని ప్రార్థించిరి. వీరప్పయ్య వారిని కరుణించి, జ్ఞానోపదేశ మొనరించుచుండెను.

వీరి కీర్తి ప్రతిష్ఠలు విని, చుట్టు ప్రక్కల గ్రామముల నుండి అనేకులు వచ్చి పెక్కు విషయములు, వీరితో ప్రసంగించు చుండిరి. వీరికి ఎవరైనను ధనము నిచ్చినను, ధనము వలన దుఃఖమే గాని బంగారము అవసరనియు బోధించెను.

ఒక పర్యాయము వృద్ధ దంపతులు, తమ నిండు చూలాలగు అవుకు కోడెదూడ గలుగునా? పెయ్యదూడ గలుగునా? యని వీరప్పయ్యను అడిగిరి. వీరప్పయ్య కొన్ని గుర్తులు చెప్పి ఆ గుర్తులు గల కోడెదూడ గలుగునని చెప్పిరి. అప్పుడు భార్యతో వీరప్పయ్య చెప్పినది ఎంతవరకు నిజమో తెలుసుకొనవలయునని సందేహము గలిగి, కొట్టమునకు బోయి, అవుకు మత్తుమందు యిచ్చి పొట్ట కోసి చూడగా, వీరప్పయ్య చెప్పిన గుర్తులు గలిగిన కోడెదూడను చూచెను. కాని అవు ప్రాణములు వదలెను. తరువాత రెడ్డి తాను గావించిన తెలివితక్కువ మూర్ఖపు పనికి దుఃఖించి భార్యతో జరిగిన విషయము చెప్పెను. జరిగిన సంగతి వీరయ్యప్ప తెలుసుకొని రెడ్డి చేసిన పనికి విచారించి కటికపని చేసినందులకు, తురకవో దూదేకువాడవో అయి జన్మింతువని చెప్పెను. తరువాత వీరయ్యప్ప అవును చూచి, కోసిన చోట నిమురగా అవు జీవించెను. ఆ వృద్ధ దంపతులు, చాల దుఃఖముతో క్షమింపుమని వేడగా వీరయ్యప్ప కర్మ అనుభవించక తప్పదని చెప్పి, సత్కర్మలు జరుపుకొనుచూ కాలము గడుపుమని సలహా యిచ్చి యంతర్హితు డయ్యెను.

కందిమల్లయపాలెములోనే వీరయ్యప్ప ఉండ తలచి నాగన్న గారి కుమార్తెయు, మహాజ్ఞానవంతురాలైన గోవిందమ్మను వివాహ మాడెను. ఒక పర్యాయము గోవిందమ్మ తండ్రి నాగన్న అల్లుని యింటికి వచ్చి, వీ రనుభవించు చుండిన బీదరికమునకు చింతించి బలవంతముమీద భోజనమునకు కూర్చుండెను. గర్వియైన నాగన్న వీ రేమి పెట్టగలరని ధీమాతో పలికెను. గోవిందమ్మ షడ్రసోపేత ముగా, సమస్త పిండివంటలతో తండ్రికి భోజనము పెట్టగా, తండ్రి వారికి గల మహత్తునకు ఆశ్చర్యపడి సిగ్గుపడెను. మరియొక పర్యా యము, గ్రామదేవత జాతరలో వీరయ్యప్ప యివ్వవలసిన చందా యివ్వలేదని గ్రామపెద్దలు కబురు పంపగా వీరయ్యప్ప చుట్ట చుట్టు కొనుచు, గ్రామదేవతను నాకు నిప్పును తెచ్చి యిత్తువా యని యడుగగా గ్రామదేవత తెచ్చి యిచ్చెను. గ్రామపెద్దలు అది చూచి ఆశ్చర్యపడి వారి పాదములకు మ్రొక్కిరి. ఒకానొక సమయమున పాముచే కరవబడి మృతుడైన పిల్లవానిని బ్రతికించెను.

## సిద్దయ్య

వీరి స్వగ్రామము కందిమల్లయపాలెమునకు 6 క్రోసుల దూర మున ముడుమాల యను గ్రామము. దూదేకుల కులమున పీరు సాహెబు - ఆదం బీబీలకు సిద్దయ్య జన్మించెను. చిన్నతనము నుండి తల్లి తండ్రుల యాజ్ఞ మీరక దైవ, మాతృ, పితృభక్తి గలిగి యుండెను. యుక్తవయస్సురాగానే వివాహము చేసిరి. పెద్దవాడైన కొద్ది దైవభక్తి జ్ఞానవైరాగ్యములు, సత్యజ్ఞానములు, భూతదయ, పరమాత్మను చూడవలయు ననెడి విచారము గల్గి, ఏ పని చేయు చున్నను సర్వావస్థలయందు పరమాత్మను చూడవలయుననే ఉద్దే శ్యముతో నుండెను. ఈ చింతలో వీనబ్రహ్మమును దర్శించిన వారే నీకు గల సమస్త సందేహములు తీర్చి, జ్ఞానదృష్టి నొసంగగలరని సిద్దయ్య స్వప్నము గాంచెను. తరువాత స్వప్నవృత్తాంత మంతయు

తల్లితండ్రులకు చెప్పి, వారి యాజ్ఞను దీసుకొని కందిమల్లయ పాలెమునకు బోయి వీరగురువును సమీపించి, సాష్టాంగ నమస్కారము బెట్టి, తన వృత్తాంతమంతయు సవిస్తరముగ చెప్పి, తనను కృతార్థుని చేయవలసినదిగా వేడుకొనెను. సిద్దయ్య తత్త్వము పూర్తిగా తెలుసుకొని, వీరగురువు వానికి గల సమస్త సందేహములు తీర్చి, వేదాంతవిద్యను నేర్పుచుండెను. సిద్దయ్య మహమ్మదీయ మతము వీడినందుకు తండ్రి కష్టపడి మహమ్మదీయునిగా మార్చుటకు ఎంతయో ప్రయత్నించెను గాని ఫలించలేదు. ఒక పర్యాయము వీరబ్రహ్మము సిద్దయ్య బ్రాహ్మణాగ్రహారము గుండా ప్రయాణము చేయుచుండగ, వారు వేదములు వినరాదని బ్రాహ్మణులు తలచి, వీనిని మ్లేచ్ఛుడనియు దూషించి వీరబ్రహ్మమునకు ఏమియు తెలియదని దూషణవాక్యములతో దూషించిరి. వెంటనే ఆ గ్రామము అగ్నికి ఆహుతి అగుచుండెను. అప్పుడు బ్రాహ్మణులు వీరిని దూషించి నందున, అగ్నిప్రమాదము సంభవించినదని తెలుసుకొని వారిని క్షమింపుడని ప్రాధేయపడి వారి వలన జ్ఞానోపదేశమును పొందిరి.

అహంకార పూరితులైన వీరబ్రహ్మంగారి శిష్యులు సిద్దయ్యను తురకవాడని నీచముగా జూచుచు, దూషించుచుండిరి. అది గమనించి వీరబ్రహ్మంగారు దాహ మగుచున్న దని కల్లును త్రాగిరి. శిష్యులు గురువే కల్లు త్రాగగా తమ కేమియు ఫరవాలేదని వారును పూర్తిగా త్రాగిరి. సిద్దయ్య తన కేమియు పట్టన ట్లూరకుండెను. మరియొక చోట తగరము కరిగించుచున్న ప్రదేశములో దాహశాంతి కొరకు కరుగుచున్న తగరము త్రాగెను. శిష్యులను గూడా త్రాగుడని చెప్పెను. వారు నాలుక కాలిపోవునను భయముతో త్రాగుట కిష్ట పడకుండిరి. వీరబ్రహ్మముగారు సిద్దయ్యను బిలిచి త్రాగుమనెను. గురునాజ్ఞ పవిత్రమైనదని గ్రహించి అతడు గటగట త్రాగెను. మిగతా శిష్యులు వాని మహిమ తెలుసుకొని క్షమింపుమని వేడుకొనిరి. ఇట్లు

గురుశిష్యులు అనేకులకు గలిగిన సమస్తధర్మ సందేహములు తీర్చి తృప్తి పరచ గలిగిరి. బ్రహ్మంగారికి (వీరాచార్యులు) 1. గోవిందస్వామి, 2. ఓంకారస్వామి, 3. శివరామయ్య, 4. గిరిరాజయ్య, 5. పోతులూరయ్య అను కుమారులు, వీరనారాయణమ్మ అను కుమార్తెయు గలరు. జ్యేష్ఠపుత్రుడైన గోవిందస్వామి, వీరి భార్య మహాలక్ష్మమ్మ గార్లకు శంకరమ్మ, కాళమ్మ, ఈశ్వరమ్మ అను మువ్వురు ఆడపిల్లలు గలరు. గోవిందస్వామి పుత్రికలలో ఈశ్వరమ్మ సులభముగా విద్య నేర్చుకొని బ్రహ్మవిద్యలో తాతగారి మాదిరయ్యెను. ఈశ్వరమ్మ బహుజ్ఞానియై కేవలము ఈశ్వరియే యని స్తుతింప బడెను.

బ్రహ్మంగారు భౌతిక పరీక్షల కందని బ్రహ్మవిద్యను సామాన్య జనులకు అర్థమయ్యేరీతిగ జాతి మత భేదములను పాటింపక పరతత్త్వ విచారణ భావములను తన ప్రబోధనలచే విరివిగా ప్రచారము చేసెను. వీరు, భార్యాపుత్రులు సంసారము నందుండియే తామరాకును బోలి తాపత్రయముల కందక, అరిషడ్వర్గములను జయించిన రాజయోగి. ఇట్టి మహనీయునికి బైరాగి గోసాయి వేషములు, పెద్దగడ్డము, మీసములు, తలనిండా జటలు, గంజాయి త్రాగుటకై వినియోగించే చిమటా యనబడు కారును, పులితోలు ఆసనంబును, మెడలో రుద్రాక్షతావళంబులు కలిగిన విగ్రహము లుండుట చాలా విచారకరమైన విషయము. మనస్సుచే ఇంద్రియముల నిరోధించి, యనాసక్తబుద్ధితో కర్మేంద్రియములచే కర్మల నాచరించు వాడే యోగ్యుడని వీరి విశ్వాసము, సిద్ధాంతము. సిద్దయ్యను కించపరచ వలయునని బ్రహ్మంగారి శిష్యులు కుత్రుపన్ని బ్రహ్మంగారు సమాధికి బోవుసమయమున పూలు తెచ్చుటకై గోవిందమ్మగారితో చెప్పి, ఒప్పించి బహుదూర ప్రాంతమైన బనగానపల్లెకు సిద్దయ్యను పంపిరి. వారు నానాకష్టముల నెదుర్కొని పూలు తెచ్చుటకై బోయిరి. బ్రహ్మంగారు జీవసమాధియగుటకు సిద్ధముగా నుండిరి. అనేకులు చూచుటకు వచ్చి యుండిరి. వీరగురుండు ప్రాతః

కాలోచితకృత్యములు నిర్వర్తించుకొని దారా పుత్రులకు, శిష్యులకు ధర్మోపదేశములు చేసి శాంతచిత్తులను గావించి భక్తులు హారతులిచ్చుచుండ సమాధిని సమీపించి సిద్దయ్యను చూడనందుకు మనసునందే తలచి సమాధికి ముమ్మారు ప్రదక్షిణములు చేసి, మెట్టుమీద నిలచి దిగి మధ్య అమర్చబడిన పీఠముపై పద్మాసనమున కూర్చుండి "ఓం" అను ప్రణవనామంబు పలుకుచుండ పైమూతబండను మూయుడని చెప్పెను. సిద్దయ్య గురువును చూడనందులకు మిగుల దుఃఖించి హా! తండ్రీ! యని గట్టిగా ఏడ్వసాగెను కొంతకాలము వరకు బ్రహ్మంగారి సమాధివద్దనే నిశ్చేష్టుడై, స్పృహ లేక అనేక దినము లుండెను. సమాధియైన వీరబ్రహ్మంగారు ప్రత్యక్షమై సిద్దయ్యను లేపి నీవు కొంతకాలము ఈ భూమి యందుండి ప్రజలకు సద్బోధ లొనరించి పిదప కీర్తిశేషుడవై నన్ను చేరగలవని రహస్యముగ చెప్పి సిద్దయ్య ఆత్మకు శాంతిని కలుగ జేసెను.

## వేమనయోగి

వేమన జీవితచరిత్రవిషయమై తగిన ప్రమాణములు లేక పోవుటచే సత్యము బయటపడుట చాల కష్టముగా నున్నది. వేమన కొండవీటి పైడిపాలకొండిది రెడ్డివంశము వాడు. కనుగొళ్ల గోత్రమై యుండెను. రాజైన తనయన్నతో కలహించి తల్లితో నల్లచెరువుకు వచ్చెను. అక్కడ సేద్యము చేసికొనుచు సుఖముగ నుండగా త్రోవలోనతనిపై పిడుగుబడి నిర్జీవుడాయెను. తరువాత జరుగవలసిన కార్యము జరుప నక్కడివారు ప్రయత్నించగా తల్లికి స్వప్నమునందు కనుపించి ఏడురోజులు గడచిన తరువాత ఎనిమిదవరోజున నేను జీవింతునని చెప్పెను. అట్లే ఎనిమిదవదినమున సజీవుడైన పిదప, ఎట్లు బ్రతికితి వని యక్కడి వారడిగిరి. వేమన అసలు పేరు పుల్లారెడ్డి. అప్పుడు వారితో నా పేరు పుల్లారెడ్డిగా దనియు వేమన అని చెప్పెను. వేమన సుమారైన స్థితిగతుల సంసారములో జన్మించెను.

వేమన తల్లిదండ్రులు చదువుకొన్న పండితులు కాకపోయినను కవులకు పండితులకు ఆశ్రయమిచ్చు చుండుటచే వారి సహవాసము వలన వేమన సంస్కారము గల వాడయ్యెను. వేమన తల్లిదండ్రుల యెడ భక్తిగౌరవములు గలవాడు. వేమన మంచి పండితుడై మహాత్ముడై శిష్యపరివారముతో ననేకప్రాంతములు తిరిగి యనేక మహత్త్వములను జూపెను. అప్పటి మద్రాసులోని ఇంగ్లీషుదొరలు సహితము ఇతని యద్భుతశక్తికి మెచ్చి చాల గౌరవించిరి.

వేమన ఆంధ్రులలో సాటిలేని వ్యక్తి. అతీంద్రియములైన తత్త్వములను అనుభవపూర్వకముగా తెలుసుకొని, తెలిసిన వానిని నిర్భయముగా ప్రపంచమునకు బోధించు సాహసము గలిగిన మంచి కవితాశక్తి గలవాడు. ప్రపంచవ్యవహారము లందలి సూక్ష్మదృష్టి- కవిత్వములో తిట్టుచునే నవ్వించు హాస్యకుశలత పుట్టుకతోనే వచ్చిన సహజ గుణము. చాల మంది తత్త్వవేత్తలు కేవలము గ్రంథములలో గల పాఠములు వల్లించుటయే గాని ఇతరులకు బోధించుటలో సక్రమముగా తెలుపక యేదియో చెప్పి కాలము వెళ్ల బుచ్చెదరు. తిట్టు కవిత్వము చెప్పుటలో తెలుగు జాతిలో విశేషగుణము లున్నప్పటికి అవి వారి స్వార్థమునకే ఉపయోగించిరి గాని పరమార్థము లేదు. వీరి కవిత్వములో ఆ పరమార్థము స్పష్టముగా గోచరించును.

గతములో సుప్రసిద్ధ మతస్థాపకులెవ్వరూ ఆంధ్రప్రదేశమున జన్మించి యుండ లేదు. మతస్థాపకులలో తమ మతమును ప్రజల లోనికి బోయి వ్యాప్తి జేసిన ప్రముఖులలో బుద్ధు డని తెలియు చున్నది. తరువాత వ్యక్తులలో శంకరాచార్యులు మలయాళరాష్ట్రము లోను, రామానుజాచార్యులు తమిళదేశములోను, మధ్వాచార్యులు కన్నడ రాష్ట్రములోను జన్మించి యావద్భారతదేశ సంచారము చేసి, వారి పీఠములు స్థాపించినను, ఆంధ్రదేశములోగల ప్రజల తీవ్ర తత్త్వమును బట్టి ఈ ప్రాంతములో వారి అనుచరులు మాత్రమే మత

బోధనలు చేసినట్లు తెలియుచున్నది. వేమన తనకు తోచిన తత్త్వమును నిర్భయముగా ప్రజలకందరికిని బోధించుటకై ఆంధ్రదేశము నంతయు తిరిగి అందందు మఠములు స్థాపించి తన తరువాత తన మతము నందు నమ్మికగలవారు కొందరున్నట్లు చేయగలిగిన తెలుగు వారిలో ముఖ్యుడు మొదటివాడే కావచ్చునేమో! ఇతను బోధించిన మతము అనాది హిందువులలో నుండు అద్వైతమతమే గాని కేవలము పుస్తకములనుండి పారాయణము చేయక యోగసాధనచే అందలి తత్త్వమును గ్రహించి నిస్సందేహముగా తా ననుభవించి తన జాతి వారిని గూడ తరింప చేయవలయునను ఉదారాశయముచే బోధించుటకు మొదలు పెట్టెను.

కావుననే ఇతని బోధనలో జీవమున్నది. ఇతరుల మాటలు గాక తన యనుభవమును నమ్మిన వాడగుట చేత ఇతని బోధనలందలి నిష్కపటత్వమును ఎవ్వరూ సందేహించువారు లేకపోయిరి. సందేహించుటకు శక్తిలేని వారందఱును, వారిని విశ్వసించి శిష్యులైరి. ఇతని అనుచరులలో కటూర్లపల్లె వేమన్న, ఏగంటివారు. పోతులూరి వీరబ్రహ్మము, సదానందయోగి మొదలగు వా రనేకు లిట్టి మతమునే ప్రచారమునకు తెచ్చినారు.

తెలుగువారిలో భక్తిప్రధానమగు వైష్ణవమతమును సామాన్య జనులలో తమ కీర్తనల ద్వారా వ్యాప్తికి దెచ్చిన రామదాసు, త్యాగరాజు, తాళ్లపాక అన్నమాచార్యులు, క్షేత్రయ్య, అనేకమంది భక్తులు, మతకర్తలు, మతప్రచారకు లున్నను వేమనకున్నంత వ్యాప్తి చనవు రాలేదు. పై వారిలో కొందరు అనుభవము గలవారు, మరికొందరు నమ్మకము గల వారగుటయే ముఖ్యము.

వేమన పద్యములు తేటతెల్లముగా నున్నప్పటికిన్నీ, భావములు గంభీరములై కొద్దిలో ముగింపుగల చిన్నపలుకులు గలిగి అచ్చతెనుగు పద్యపు నడక గలిగి ప్రతివారును నేర్వగలిగిన తేలికగా నుండు

పద్ధతిలో నుండెను. పోయినచోట్ల నెల్ల ప్రశ్నించిన వారికెల్ల, పద్య ములు చెప్పి ఎక్కడైనను మరచిపోయిన క్రొత్తగా నప్పుడే పదములు గూర్చి చెప్పగలిగిన బహు ప్రజ్ఞాశాలి. తా నాడు మాటలలో తన కెప్పుడును సందేహము, బిడియము సంకోచము లేక యుండుటచే సామాన్యప్రజల కితని యెడ నమ్మిక, భక్తి జనించినవి. పండితులు సహితము వీరిని పూర్తిగ తిరస్కరించలేక పోయిరి.

నిఘంటు పండితులు, వ్యాకరణ పండితులు వీరిని గురించి ఏ మనుకొన్నను ఆంధ్రదేశములో ఇతని బోధన లింకను తెలుగువారి హృదయములలో నాటియుండుటకు ఇతని పలుకులయందు గల కవితా వైశిష్ట్యము ముఖ్యకారణ మగుట నిస్సందేహము.

వీరు వ్రాసిన పద్యములు "వ్రాల కందని పద్యముల్ వేల సంఖ్య" గా చెప్పిన వాడు. వీరు చెప్పిన పద్యములన్నియు వీరు చెప్పినవో లేక తరువాత వీరి భక్తులు చేర్చినవో నిర్ధారణ చేయుటకు వీలుగాక యున్నది. "విశ్వదాభిరామ" యనియు, విశ్వతాభి, విశ్వ థాపి విశ్వతోభి యని మూడు పాఠాంతరము లున్నను విశ్వదాభిరామ యనియే నిర్ధారణ యగు చున్నది.

1. విశ్వమును=ప్రపంచమును ఇచ్చువాడు, విశ్వదుడు=భగ వంతుడు, అతనికి అభిరాముడు=ప్రీతిపాత్రుడని యొకరు 2. విశ్వము సమస్తము, ద=ఇచ్చుట చేత అభిరాముడని ఇంకొకరు 3. వేమన్న ఉంపుడుకత్తెకు "విశ్వద" యని నామకరణము చేసి దాని కభిరాము డని మరియొకరు, 4. విశ్వమును సంహరించు వాడు; విశ్వదుడు= శివుడు అతనికి ప్రియుడని మరికొందరు చెప్పుచున్నారు.

వేమన ఆ కాలపరిస్థితులను బట్టి వేశ్యా లోలుడని తెలియు చున్నది. చదువుకొన్న పెద్దలు సహితము ఈ విషయములో తన కన్న దుర్బలులైన సంగతి తెలుసు కొనెను. కొంతకాలమునకు వీరి ప్రవర్తనను జూచి చింతించి వివాహము జేసిరి. వేమనయొక్క

జీవితము (వేశ్యాలోలుడైన విషయము) ఇతరులు హేళనతో వేమన భార్యతో చెప్పినందున, ఆమె మాత్రము వేమన యందు ఎక్కువగా ప్రేమానురాగములు చూపినట్లు లేదు. ఇతను స్త్రీని కేవలము భోగ్య వస్తువుగా మాత్రమే భావించి, "పురుషులు వేరు స్త్రీలు వేరు" అని భావించెడి వారి తెగలో చేరినట్లు గనపడుచున్నది. ఆమెను చాలా కట్టుదిట్టములో నుంచినందున సహించలేక, వేమన ప్రవర్తనను చాలా తీవ్రముగా ప్రతిఘటించుచుండెడిది. వేశ్యాలోలుడైనందున డబ్బు హరించి పోయెను. ఇతని యందు భయభక్తులు చూపిన వారే ఇతనిని వదలుటయే గాక వేళాకోళము జేసియుండిరి. అప్పుడు వీరు స్వార్థభావము వదిలి పరమార్థమే ముఖ్యమని భావించి పేదల సేవయే పెరుమాళ్ల సేవ యని భావించి ఎంతగనో మారిరి. ఉద్రేక భావములు గలిగి ఎప్పుడు ఏది తోచిన ఆ రీతిగనే కవిత్వము చెప్పి నను బీదలకు తన వద్ద నుండెడి ఏ వస్తువైనా దయతో దానము చేయుచుండెడి వాడు.

ఇతనికి గురువు లంబికాశివయోగి. వారి వల్లనే జ్ఞానోపదేశ మును బొందెను. వేమన పోతులూరి వీరబ్రహ్మమునకు సమకాలికు డని తెలియుచున్నది. వేమన గొప్ప బోధకుడు, తత్త్వవేత్త, సంస్క ర్తయై అనేక బోధనలను సులువుగా బోధించిన మహానుభావుడు. వీరు సంచారము చేయుచున్నప్పుడు కడపజిల్లాలో రాజంపేట దగ్గర కోడూరులో తల్లి అచ్చమ్మయు, కుచ్చెర్లపాడు గ్రామములో భార్య ఆదిలక్ష్మమ్మయు మరణించిరి. తరువాత కటార్లపల్లెకు మరల వచ్చి వేమన సమాధిలో సజీవముగా పరుండి మూతవేయించుకొనెను.

తుంగవంశపు కేశవునికి లక్ష్మమ్మ (అచ్చమ్మ)కు వేమన యని పేరు గలవా డొక డుదయించెను. వీరు గూడా వేమన మాది రిగ తత్త్వబోధన చేసినట్లు తెలియుచున్నది. ఏ వేమన ఎవరో చరి త్రకారులకు గూడా అంతుపట్టక యున్నది.

## మహర్షి సద్గురు మలయాళస్వామి

బ్రహ్మీభూత మహర్షి సద్గురు మలయాళస్వాముల వారు 1885వ సంవత్సరములో చైత్ర శుద్ధఏకాదశి దినమున అవతరించిరి. బాల్యములో విద్యాభ్యాస మొనర్చి 18వ ఏట గృహ పరిత్యాగము జేసెను. ఆంధ్రుల అదృష్టమో యన అపర వ్యాసభగవానుడగు శ్రీస్వాములవారు పాదచారియై ఆసేతుహిమాచలము గల పుణ్యక్షేత్ర ముల దర్శించి తపస్సునకు తగిన కాశీ ప్రయాగ హిమాలయాది పుణ్య క్షేత్రములను వదలి ఆంధ్రదేశమున నందు కలియుగ వైకుంఠ మన దగు తిరుమల వేంకటరమణుని సన్నిధి చేరిరి. అందుగల గోగర్భ క్షేత్రమున పంచపాండవ గుహలోనున్న తుంబురతీర్థం, సనందన తీర్థం, కుమారధారాతీర్థం, రామకృష్ణతీర్థం మరియు వైకుంఠతీర్థముల యందు పండ్రెండు సంవత్సరములు ఘోరతప మాచరించి, బ్రహ్మ సాక్షాత్కారము నొంది జ్ఞానభాస్కరుడై, మానవుల అజ్ఞానాంధకార మును పారదోలి కర్మోపాసనల ద్వారా ప్రతివారి హృదయ క్షేత్ర మును పరిశుద్ధ మొనర్చి జ్ఞానబీజములను నాటెను. తన బోధా మృతవృష్టిచే సర్వానర్థ దుఃఖనివృత్తికి పరమానంద ప్రాప్తిరూప మోక్షఫలమును కుల, మత, స్త్రీ, పురుష వివక్షత లేక, అందరికి అందు బాటు చేయుటకై తగినట్టి పవిత్రక్షేత్రము శ్రీకాళహస్తి సమీపమున శ్రీకాశీబుగ్గతీర్థమే యని నిర్ణయించుకొనెను. అచ్చట అక్షయనామ సంవత్సర వైశాఖబహుళ సప్తమీ గురువారం (3-6-1926) శ్రీవ్యాసా శ్రమను స్థాపించిరి. తద్వారా ఆంధ్రదేశము నందు అనేక ఆధ్యా త్మికశాఖోపశాఖలను ఏర్పరచి, ఆ సందర్భమునందే యావదాంధ్రు లకు, అనుష్ఠానయుక్తమగు వేదాంతము నుద్ధరించుటకై శ్రీ సనాతన వేదాంత జ్ఞానమహాసభలను గూడా ప్రారంభించిరి. మరియు "యథార్థ భారతి" యను మాసపత్రికను గూడా స్థాపించి, మూల మూలలకు తత్త్వప్రబోధనము నందజేయుచు అట్టి దివ్యసందేశముల

ద్వారా, కరడుగట్టిన ఛాందస సిద్ధాంతములను దూరీకరించి, దారి తెన్నులు తెలియక, భౌతికభోగములే పరమార్థమను భావబంధములచే బంధింపబడియున్న అమాయకులైన స్త్రీ పురుషాదులను అజ్ఞాన నిద్ర నుండి మేల్కొలిపిరి. ఉపనిషత్సారమైన గీతాశాస్త్రమును వారి కర కమలము లందుంచి తదనుష్ఠానక్రమమును బోధించి, మోక్షమునకు సులభమార్గమును చూపగల అనేక గ్రంథములను తేలిక భాషలో రచించి అపర వ్యాసభగవానుడను నామమును సార్థక పరచుకొనిరి. బ్రహ్మవిద్యను గ్రహించుటకు గీర్వాణభాషయే ముఖ్యమైనందున, బాలబాలికలకు సంస్కృత పాఠశాలను, కన్యాగురుకులమును ప్రత్యే కముగా నేర్పరచిరి. ఈ విధముగా వ్యాసాశ్రమముఆధ్యాత్మిక సామ్రా జ్యమునకు రాజధానియై యేబదిరెండు సంవత్సరములుగా ఆంధ్ర దేశముననే గాక, పరిసర రాష్ట్ర వాసులకు గూడా అపారమైన సేవ చేయుచున్నది. ఈ మహాసంస్థ తన ఇరువదిఐదవ ఏట శ్రీసద్గురు దేవుని ఆధ్వర్యవమున రజతోత్సవము వైభవోపేతంగా జరుపుకొన్నది. 1952వ సంవత్సరములో గురుదేవులు నిర్యాణము చెందిరి. ఆశ్రమము నకు ఏబదవ ఏట అనగా 1976వ సంవత్సరములో జరిగిన స్వర్ణోత్సవ మున గురుదేవుడు లేని విచారము ఎంతయో కలదు.

వ్యాసాశ్రమము తిరుపతి కొండయందు గాక "ఏర్పేడు" నందుంచుటకు ముఖ్యకారణములు రెండు. ఆ కాలమున తిరుపతి కొండ సామాన్యజనులకు నివాసయోగ్యము గాక మలేరియా బాధ బహుళముగా నుండుటయు, శ్రీ వారు స్థాపింపదలచిన యాశ్రమమున సర్వజనులకు ప్రవేశ ముండవలయునని తలచుటయు ముఖ్య కారణ ములుగ దెలియు చున్నవి.

గురుదేవులకు సన్న్యాసాశ్రమమును స్వీకరించుటకు ఇష్ట ముండినదికాదు. అందువలననే శ్రీవారు తన 48వ సంవత్సరమువరకు బ్రహ్మచర్యాశ్రమములోనే యుండిరి. అనేకులు శ్రీవారికి పరివ్రాజకా

శ్రమ ముండవలయునని చెప్పినను, శ్రీవారు కాషాయవస్త్రమును ధరించుట మాత్రము సన్న్యాసము గాదనియు, ఆత్మసన్న్యాసమే యుండవలయుననియు అందరితో చెప్పుచుండెడివారు. అదియునుగాక ఈ కాలమున సన్న్యాసమున కర్హతలేని వారు గూడా కాషాయ వస్త్రమును ధరించి భిక్షలకై తిరుగుట వలన సన్న్యాసము యొక్క గౌరవము నశించి పోవుచున్నదనియు, కాషాయవస్త్రధారణమువలన విశేషమేమి గలుగదనియు, విశిష్టత యంతయు తమ యనుష్ఠానము నందే గలదనియు, శ్రీవారి దృఢసంకల్పము కాని 49వ ఏట శ్రీవారు సన్న్యసించుటకు కారణమేమన? కాశీ, హృషికేశ, హరిద్వారాది దివ్యస్థలములలో శ్రీవారిశిష్యులు, భక్తులు, కొందరు తురీయాశ్రమము నవలంబించి యుండిరి. వీరిలో చాలామంది విద్యావంతులుగాను, జ్ఞానవంతులు, అనుష్ఠాన నిష్ఠగలవారుగను నుండిరి. వారు కాషాయ వస్త్రధారులై యుండియు శ్రీవారి పటమును వారి యాశ్రమములో పెట్టి పూజించుచుండిరి. అది చూచి హిందూస్తానీ సన్న్యాసులు కొందరు మీ గురువుగారు తెల్లవస్త్రములు ధరించియే యున్నారు గదా! మీరు కాషాయవస్త్రధారులై యుండుటకు కారణమేమి యని అడిగిరి. ఈ విషయము వారు శ్రీవారి నడుగగా, ఆత్మజ్ఞానోపదేశ గురుదేవుడు ఒకడును, సన్న్యాసాశ్రమస్వీకార గురువు మరియొకడును నుండవచ్చునని శ్రీవారు సమాధానము చెప్పిరి. వారిని ఎట్లయినను కాషాయవస్త్రధారిగా చేయవలెనని శిష్యులు గట్టిపట్టుదలతో నుండిరి. శిష్యుల ప్రార్థనల నంగీకరించి శిష్యవాత్సల్యము కలిగి, సన్న్యాస మున కంగీకరించి అంతట యువనామ సంవత్సర మాఘశుక్ల ఏకాదశి సోమవారము 3-2-1936న సద్గురుస్వాములవారు సన్న్యాసాశ్రమము స్వీకరించిరి.

శ్రీస్వాములవారు దీర్ఘతపస్సంపన్నులైన సన్న్యాసి. విశాల భావములతో ఉత్తమాశయములతో వేదముల నిజస్వరూపమును.

తమ ఉద్దీపనశక్తితో వెలిపుచ్చి, వేదములు ఈశ్వరీయములు గాన, విశ్వమానవుల కందరికిని చెందినవి. స్త్రీ పురుషాది భేదములు లేక ఎల్లరును పఠించి, అందలి అమూల్యవిషయముల నెరింగి ఆచరింప యోగ్యులని ఎలుగెత్తి చాటిన మహానుభావుడు, ధీరుడు.

శ్రీగురుదేవుని శిష్యకోటిలో ముఖ్యులు, 1. శ్రీవిద్యాప్రకాశానందగిరిస్వాముల వారు. వీరు శ్రీకాళహస్తిలోని శుకబ్రహ్మాశ్రమ స్థాపకులు. గీతామకరందాది గ్రంథములు రచించి, గీతాయజ్ఞములు జరిపిన మహనీయులు, 2. శ్రీ విమలానందస్వాములవారు. సద్గురు స్వాములవారి యనంతరము వ్యాసాశ్రమపీఠము నధిష్ఠించిన ప్రథమ పీఠాధిపతి. 3. శ్రీ విద్యానందగిరిస్వాముల వారు ప్రస్తుత వ్యాసాశ్రమ పీఠాధిపతులు.

## మహాత్మా గాంధీ

గుజరాత్ నందు కఠియవాడులో పచారు దినుసులమ్ము వారలకు గాంధు లనిపేరు. మహాత్మాగాంధీ తాతలు కఠియవాడు నందలి కొన్ని సంస్థానములలో మంత్రులుగా నుండెడివారు. వీరి తాత ఓతా గాంధీ యను మారుపేరు గల ఉత్తమచంద్ గాంధీ. వీరు కొన్ని రాజకీయములగు కుట్రల వలన పోరుబందరు దివానుగిరి విడచి జూనాఘడ్ సంస్థానమును ప్రవేశించిరి. భార్య చనిపోగానే ఓతా గాంధీ తిరిగి వివాహము చేసికొనెను. ఓతాగాంధీకి ప్రథమకళత్రమున ఇద్దరు కుమారులు గలిగిరి. ఈ ఆరుగురు అన్నదమ్ములలో అయిదవవాడు కబాగాంధీ అను నామాంతరము గల "కరంచంద్ గాంధీ". ఆరవవాడు తులసీదాసుగాంధీ. వీరిరువురు పోరుబందరు నందు ప్రధానామాత్యులుగ నుండిరి. కబాగాంధీ (కరంచంద్ గాంధీ) మహాత్మాగారి తండ్రియై యుండెను. కరంచంద్గాంధీ రాజకోటలోను, వాంకనేరులోను దివానుగా నుండెను. కరంచంద్ గాంధీ కళత్ర

వియోగము వలన నాలుగు మారులు పెండ్లి యాడెను. కరంచందు తుది భార్యయైన పుత్తలీబాయికి ముగ్గురు మగపిల్లలు, ఒక కుమార్తె గలిగిరి. ఇందులో కడగొట్టు బిడ్డయే "మహాత్మాగాంధీ". మహాత్మా గాంధి మిక్కిలి మాతృభక్తి గలవాడు. వీరు ఇంగ్లండులో బారిస్టర్ చదివి న్యాయశాస్త్రప్రవీణు డాయెను. మహాత్మాగాంధీ 1869 వ సంవత్సరము అక్టోబరు 2 వ తేదిన జన్మించిరి.

వీరు ఎన్నో శతాబ్దముల నుండి మహమ్మదీయుల పరిపాలన లోను, తదుపరి ఆంగ్లేయుల పరిపాలనలోను దాస్య మనుభవించు చుండిన కోట్లకొలది భారతీయులను దాస్యశృంఖలముల నుండి విడి పించుటకై స్వార్థరహితముగ, నిరాడంబరముగ తాను విశ్వసించిన సత్య, అహింసా సిద్ధాంతములను తు. చ తప్పకుండ అనుసరించుచు సత్యాగ్రహము జరుపుచు, భారత స్వాతంత్ర్యార్జనకు మూలపురుషు డాయెను. దక్షిణాఫ్రికాలో కూడా జాతివిచక్షణకు నిరసన దెల్పి, నానాకష్టము లెదుర్కొని, నానాహింసలకు గురియై, కారాగార శిక్షల ననుభవించి, ప్రజాశ్రేయస్సుకు పాటుపడిన మహావ్యక్తి మహాత్ముడు. కాంగ్రెసు మహాసంస్థలో తను మామూలు సభ్యుడుగా నుండుటకు కూడ సమ్మతింపక సంస్థ సమస్త కార్యకలాపములు నడిపిన మహాదిట్ట. సమస్తజాతిని కుల, మత విచక్షణత పాటింపక ఒక్క త్రాటిమీద నడి పించి, భారతదేశమును స్వతంత్రముగా చేసిన త్యాగమూర్తి. హరి జనుల కొరకు, వెనుకబడ్డ దళితతరగతుల వారి హక్కుకొరకు, సర్వ మానవ సౌభ్రాతృత్వము కొరకు నిరంతరము ప్రజాసేవ నిరాడంబర ముగా చేసి, తన సిద్ధాంతములను విశేష ప్రచారము చేసిన మహ నీయుడు. ఈ శతాబ్దములో ఇంతటి మహనీయవ్యక్తి ప్రపంచములో మరియొకరు లేరనుట అతిశయోక్తిగాదు. కేవలము రాజకీయముల కే కట్టుబడక పై కులములవారిచే నిరాదరణగా జూడబడుచు, హీనజీవ నముల నవలంబించి యీసడింపబడుచున్న వారికై నిరంతరము కృషి

చేసి, ప్రపంచములోని సమస్త దేశముల, సమస్త జాతులవారిచే కొనియాడబడి, మార్గదర్శకుడై ఒక నరహంతకునిచే అసువులు బాసిన మహత్తర పుణ్యపురుషుడు, ధన్యజీవి.

కేవలము రాజకీయ జీవితమునకే కట్టుబడక భక్తిమార్గములో గూడా నిబంధనలను తప్పక నాచరించెడివాడు. ప్రతినిత్యము సాయంకాలమునందు నొక నిర్ణీతకాలమున తన ఆశ్రమవాసులతో రామభజన చేయుచు, భక్తిమార్గము గూడ ప్రబోధించిన ఆస్తికవాది. ప్రార్థన సమయములో "రఘుపతి రాఘవ రాజారాం", "వైష్ణవజనతో" అను కీర్తనలందు వీరికిగల మక్కువ చెప్ప నలవిగాదు.

"పరమేశ్వర సాకారపూజకు నిలయములైన భగవదాలయములు దేశసౌభ్రాతృత్వమునకు, నిజమైన జాతీయాభ్యుదయమునకు పునాదులు. సాకార పూజలపట్ల నిరసనగల దేశము నిక్కము నధఃపతనము నందును" అని గాంధీజీ వక్కాణించిన ఒక ఉపన్యాసము 18-12-45 ఆంధ్రప్రభ దినపత్రికలో ప్రచురింపబడెను. అన్నిరంగములలో అత్యంతప్రతిభ సంపాదించి, నియమబద్ధమైన జీవితము గడపిన వారిలో గాంధీ అగ్రగణ్యుడని చెప్పక తప్పదు. వీరిని జాతిపిత యని పిలుచుటలో అతిశయోక్తి ఏ మాత్రము లేదు. విదేశీయులు సైతము వీరి నియమబద్ధ జీవితమునకు ఆశ్చర్యపడిరి.

## సర్వేపల్లి రాధాకృష్ణన్

మద్రాసుకు 40 మైళ్ళ దూరమునందు గల తిరుత్తని గ్రామం వీరి జన్మస్థలం. 1888వ సంవత్సరము సెప్టెంబరు 5వ తేదీన జన్మించిరి. మద్రాసులోని క్రైస్తవ కళాశాలలో యం. ఏ., వరకు చదివి, ప్రథమతరగతిలో నుత్తీర్ణులైరి. ప్రపంచ తత్త్వవేత్తలందరిలో ఈయన పనిచేసిన రంగాలలో ఎవ్వరూ పనిచేసి యుండరు. ఉపాధ్యాయుడు-ఆచార్యుడు-పండితుడు-పరిపాలనాదక్షుడు-రాజనీతిజ్ఞుడు. అన్నిటికి

మించిన తత్త్వవేత్త. ప్రాచ్య-పాశ్చాత్యదేశాలలో భారతీయసంస్కృతికి ప్రతినిధిగా ప్రవర్తించగలిగిన మహావ్యక్తి. ఇన్ని రంగాలలో ఆయన జయప్రదముగా కృషిచేయ గలగడానికి వీరి తాత్త్వికదృష్టియే ముఖ్య కారణము.

వీరు వ్రాసిన భారతీయ తత్త్వశాస్త్రము ప్రపంచప్రఖ్యాతిగన్న గ్రంథము. వీరు రష్యాదేశములో భారతరాయబారిగా పనిచేసిన కాలములో ఆచరణలోనున్న కమ్యూనిస్టుతత్త్వాన్ని అర్థం చేసుకో గలిగిరి. ఏ విదేశ రాయబారులకు దర్శనమీయని స్టాలిన్ వీరియందు ప్రత్యేకముగా ప్రవర్తించి, వీరిని స్వయముగా పిలిపించుకొని అనేక విషయములు చర్చించుకొనిరి.

వీరు భారతదేశములో అత్యున్నతపదవియైన రాష్ట్రపతిగానెన్నుకొనబడి, పరిపాలనాదక్షులుగ గణుతికెక్కిరి. వివేకానందుని తరువాత భారతీయ ఆధ్యాత్మిక సంబంధమైన వేదాంతతత్త్వమును దేశములోనే గాక, విదేశములలో గూడ బహుళ వ్యాపకము చేసిన బహుముఖ ప్రజ్ఞాశాలి. సిసలైన భారతీయరత్నము గనుకనే "భారత రత్న" బిరుదును భారతప్రభుత్వము వారు ఇచ్చి గౌరవించుట చాల గొప్ప విషయము.

## సత్యసాయిబాబా

కొంతకాలము క్రిందట మహారాష్ట్రములో గల షిర్డీ యందు భారద్వాజగోత్రము, అపస్తంబసూత్రముగల సాయిబాబా యను మహాత్ముడు జన్మించెను. వీరు షిర్డీయందు తన దివ్యలీలలను శక్తులను భక్తులకు చూపించి భక్తిప్రబోధనలు గావించెను. వీరు తన శరీరమును త్యజించి అనంతపురం జిల్లా పుట్టపర్తి యందు ఆ భరద్వాజగోత్రము ఆపస్తంబ సూత్రమునందే శ్రీ భగవాన్ సత్యసాయిబాబా యను ప్రసిద్ధనామమున పెద్ద వెంకమరాజు ఈశ్వరాంబ యను పుణ్య దంప

తులకు 22-11-1926 జన్మించెను. వీరు బాల్యము నుండియు, పరమాద్భుతలీలలు తన సంకల్పానుగుణముగా, ప్రదర్శించుచు తన యవతారకార్యములు కొనసాగించు చుండెను.

పిన్నవయస్సుననే ఈ బాలుని మృదుమధుర వాక్కు, దివ్య కంఠస్వరము, అపారమేధాశక్తి, ప్రశాంతభావముతో గూడిన గంభీరత మొదలగు సుగుణములు గమనించిన వారెల్లరు ఈ బాలుని "ఆజన్మ బ్రహ్మజ్ఞాని" యన నారంభించిరి. బుద్ధభగవానునివలె కుంటి, గ్రుడ్డి, రోగి, మొదలగు దీనుల యెడ అపరిమితమైన జాలితో బియ్యమో, అన్నమో, గుడ్డయో ఇంటిలోనివారి కెవ్వరికి చెప్పకుండ తెచ్చి వారి కిచ్చుచుండెడి వాడు. తాను పస్తుండియైనను ఇతరులకు, ఆహారము పెట్టు చుండెడివాడు. ఆ యూరి బాలురెల్లరు ఇతనిని గురువుగా భావించి అతని యాజ్ఞలను శిరసావహించు చుండెడివారు. చిన్నతనములో చదువు కొనునప్పుడు గూడా తన దైవశక్తి తనలోనే ఇముడ్చుకొని బయటికి పొంగనీయ కుండెడివాడు. ఉపాధ్యాయులు పాఠములు చెప్పు నప్పుడు పరధ్యానముగా నుండెడి వాడు. స్కూలులోనే తన దివ్యశక్తులు చూపించు చుండెడివాడు. కోడిపందెములు, చేపలు పట్టుట, జంతువులను వేటాడుట, సినిమాలు చూచుటయందనాసక్తి చూపు చుండెడివాడు. బాల్యము నుండియు, మానవాతీత శక్తులు, అసాధారణ ప్రజ్ఞ గలిగి, తోటిబాలురకు తినుబండారములు, పెన్సిళ్ళు వగయిరా ఎవరు ఏ వస్తువులు కోరిన అవి యిచ్చు చుండెడి వాడు. ఉరవకొండ పాఠశాలలో చదువుచున్న సమయమున విజయ నగర సామ్రాజ్యముఖ్యపట్టణమగు, "హంపి" విరూపాక్ష దేవాలయ ములో శిల్పవిశేషములు చూచుచుండ స్పృహతప్పి పడిపోయెను. వారి యన్న ఎన్నియో వైద్యములు, చికిత్సలు, చేయించిరి గాని ప్రయోజనము లేకపోయెను. తరువాత సహజముగ నిద్ర నుండి మేల్కొనిన వానివలె లేచెను.

1940 మే నెల 23వ తేదిన పుటపర్తి గ్రామములో తనను దర్శింప వచ్చిన మహాజనుల నుద్దేశించి షిర్డీ సాయిబాబాను నేనే! ఆధ్యాత్మికసాధనలో పూజావిధానము ప్రతి గురువారము సల్పుడని యాదేశించెను. 1918వ సంవత్సరములో మహాసమాధి నందిన షిర్డీ సాయిబాబాగారు ధరించిన కావివస్త్రము ధరించి, గురువారము పూజా సమయమున, వేలాదిప్రజలు తన్నడిగిన ప్రశ్నలకు నుచిత సమాధానము లొసగి, వారి సంశయములు బాపు చుండెడి వాడు. తన మహిమచే ఒక్కొక్కప్పుడు కొంతమంది ఇళ్లలో, షిర్డీ సాయిబాబా పటములు, కొన్ని యిళ్లగోడలపై దశావతారములు, పూర్వపు మహర్షుల యొక్కయు భగవద్భక్తుల చిత్రపటములు చూపు చుండెడివాడు. 1940 అక్టోబరు 20వ తేదిన బడి విడువగనే ఇంటికి వచ్చి వదిన గారితో, నేను మీ వాడను గాను ఇదే వెళ్లిపోవు చున్నానని చెప్పి, పుస్తకములు పారవైచెను. అన్నగారు అడ్డగించినను, నేను మీ వాడను గాను నేను సాయిబాబా నని చెప్పి గృహము విడిచి పోవుచూ, ఏ కార్యమునకై నే నవతరించితినో ఆ కార్యము చేయ సర్వసంగ పరిత్యాగము చేసి వెడలుచున్నానని చెప్పెను. ఆ యూరిలోనే, పెద్ద మైదానములో ప్రవేశించి, యొక వృక్షచ్ఛాయలో నుండి అనేక భక్తిరసవంతమైన కీర్తనలను పాడుచు, భక్తులచే పాడించుచు, తన్మయమగునట్లు చేయుచుండెను.

"మానస భజరే గురుచరణం, దుస్తర భవ సాగర తరణం. అనన్యమనస్కులై, సద్గురు చరణములు భజింపుడు. జనన మరణ రూప సంసారార్ణవమును తరించి, బంధవిముక్తిని, నిత్యానంద ప్రాప్తినిగాంచగలరు." ఇట్లు ఉరవకొండలో తన ప్రబోధనలుగావించి, జననీజనకుల కోర్కెలపై పుట్టపర్తికి తిరిగి వచ్చి, ఆ యూరి కరణం గారింట్లోనే యెక్కువకాలము "బాబా" గడపుచుండెను.

భక్తుల ప్రార్థనల మన్నించి వారి కష్టములు, వ్యాధులు నివారించు చుండెను. సమీపమునందు గల చిత్రావతి నదిలోని ఇసుకతో విగ్రహములను, పటములను, మిఠాయీలను, పండ్లను భక్తులకొసంగి ఆశ్చర్యచకితులుగా చేయుచుండెను. భక్తులకు శివుడు, నారాయణుడు, కుమారస్వామి మొదలగు భగవన్మూర్తులను సందర్శనము చేయుచు దివ్యతేజమును చూపుచుండును. ఆధ్యాత్మిక సాధకులకు, తగిన ఉపదేశము లిచ్చుచుండెను. నవరాత్రి-శివరాత్రిపర్వదినములలో ప్రదర్శింపబడు లింగోద్భవ సమయములందు సాయిబాబా ఉత్సవములను చూచుటకు వేలకొలది భక్తజనులు వచ్చుచుందురు. భక్తజనుల వసతికై ఒక నూతన భవనమును నిర్మించి "ప్రశాంతినిలయ" మని పేరు పెట్టెను. ప్రతి మానవుని హృదయము ప్రశాంతినిలయముగ మారవలయు ననునదే సాయిబాబా ముఖ్య ఆశయము.

1947వ సంవత్సరమునుండి ప్రజానీకమునకు బాబా సద్గురువై ప్రబోధనల నందింపసాగెను. భారతదేశము నలుమూలలలో తన దివ్యసందేశము లిచ్చి సంపూర్ణ ప్రేమానందస్వరూపులై వెలయు చుండెను.

1958 ఫిబ్రవరిలో శివరాత్రి పర్వదినమున దేశదేశములకు తన సందేశము చాటు సంకల్పముతో "సనాతనసారథి" యను మాస పత్రికను స్థాపించెను. వేదాధ్యయనము, సనాతన ధర్మానుష్ఠానము, ఆగమశాస్త్రవిహితమగు దైవపూజా విధానము, నిరాడంబర జీవితము, ఉన్నతాదర్శములను, భక్తి జ్ఞాన వైరాగ్యములను, నిర్మలమైన నీతిని, ప్రజాబాహుళ్యములో విస్తరింప చేయుటయే తమ ముఖ్యోద్దేశ్యమని బాబా నొక్కి చెప్పుచుండెను. పతితలకు, పిచ్చివారలకు, వ్యాధిగ్రస్తులకు అపారకృపతో సహాయము చేయుచు, భక్త రక్షణమునకై అపారసేవ చేయుచున్న మహనీయమూర్తి.

# 13. సంఘసంస్కర్తలు

## రాజారామమోహనరాయలు

వంగదేశమున బ్రాహ్మణకుటుంబములో రమాకాంతరాయ్, తారిణీదేవి యను దంపతులకు రాజారామమోహనరాయలు 1722వ సంవత్సరము మే నెల 22వ తేదీన జన్మించెను. రాజారామమోహనుని తండ్రి రమాకాంతరామ్ సనాతనాచార సదాచార సంపన్నుడు. రామమోహనుడు బాల్యము నుండియు ఆరాధన యన్న అపారమైన భక్తి శ్రద్ధలు కలిగియున్నను, కొన్ని ఛాందసపు మూఢాచారముల నను సరించెడి వాడు గాదు. బాల్యముననే వంగ, సంస్కృత, పర్షియన్ భాషలు బాగుగా నేర్చుకొనెను. ఇతనికి గల అసాధారణమైన గ్రహణశక్తి, అద్భుతమైన జ్ఞాపకశక్తి, ఎన్నో విషయములు తెలిసికొన వలయుననే ఆసక్తి తండ్రి గమనించి పారశీకము, అరబ్బీ, ఇంకా ఇతరభాషలు చదువుకొనుటకు పాట్నాకు బంపెను. అప్పటికి అతని వయస్సు 9 సంవత్సరములు. తండ్రి ఇతనిలోగల సమస్తగుణములకు విషయములకు సంతోషించినను అభిప్రాయములలో వచ్చుచున్న మార్పులకు కలవరపడసాగెను. ఇతను కర్మకాండను ఎదుర్కొనెను. విగ్రహారాధనను తీవ్రముగా ఖండించెను. తాను నమ్మిన అభిప్రాయములలో పట్టుదల చూపుచుండెను. ప్రతి విషయములోను తనకు గల అభిప్రాయ భేదములు శ్రుతిమించి పోయెను. అటు తరువాత పాదయాత్ర చేసి టిబెట్టు వెళ్లి లామాలతో సంబంధము నేర్పరచుకొని, వారికి గల మూఢవిశ్వాసాలను పూజలను నిరసించెను. ముఖ్యముగా హిందూ మతములోని ఆరాధనా విధానములోని లోపాలను, బౌద్ధ మతములోని వక్రమైనతీరులను పూర్తిగా ద్వేషించి "ఏకేశ్వరోపాసన" "విశ్వమానవసౌభ్రాతృత్వం" అనే భావాలకు ప్రాముఖ్య మిచ్చెను. తండ్రి రమాకాంతుడు 1803 లో మరణించెను. సమస్త సంప్రదాయ

ములకు కేంద్రమైన "రంగపూర్"లో హిందువులు - ముస్లిములు - క్రైస్తవులు-జైనులతో సంబంధము లేర్పరచుకొని పెక్కు విషయములు గ్రహించెను. ఇతడు వెల్లడించు నిశ్చితాభిప్రాయములను సమర్థించే మిత్రులు ఎక్కువగా లేకపోయిరి.

రమాకాంతరాయలు తనయుడైన జగన్మోహనుని మృత దేహము చెంత ఆతని భార్య ఆలోకమంజరిని భర్త దేహముతో పాటు సహగమనము చేయుటకు బంధువులంతా సిద్ధపడి, అదియొక మహా పవిత్రమైన కార్యమైనట్లు మంత్రములు చదువుచుండ, ఆ స్త్రీ ఆర్త నాదము వినబడకుండా డప్పులు వాయించుచు, ఆ స్త్రీని భర్త దేహముతో పాటు అగ్నిలో వేయించుటకు సిద్ధపడిరి. ఆ సమయములో రాజారామమోహనరాయలు చూడలేక వదినను బ్రతికియుండగా దగ్ధం చేయుటకు వీలుగాదనియు, తన అన్న ఆత్మ శాంతముగా పోని వ్వమనియు ఆటంకపరచెను. కులభ్రష్టుడని మిగతా బ్రాహ్మణులు వీనిని అవతలకు నెట్టి, ఆమెను మంటలో పడవేసిరి. ఆ మంటల బాధల కోర్వజాలక రక్షించండని కేకలు పెట్టినను, ఆమె ఆర్తనాదం వినబడకుండా డప్పులు వాయించి వెదురుగడలతో ఆమెను అగ్నిలోనికి త్రోసిరి. సతీసహగమన దురాచార నిర్మూలనకొఱకు 1812 నుండి ప్రారంభించిన ఆందోళన, ఆయన జీవిత పరమావధి అయినది. శ్మశానాలచుట్టు తిరిగి కొంతమంది స్నేహితుల సహాయముతో, ఈ దురాచార మెంత ఘోరమైనదో, ప్రజలలో నచ్చచెప్పి మాన్పించడానికి ప్రయత్నించెను. మూర్ఖపు పండితులు విధవరాండ్రను చితికికట్టి వేసి దహనము చేయవచ్చునని చెప్పే విషయములు శాస్త్రసమ్మతం కావని రుజువు చేసి, ఆ దురాచారమును మాన్పించుటకు సంఘసంస్కర్త యెదుర్కొనవలసిన చాల కష్టముల నెదుర్కొనెను. తండ్రి గతించి నంతనే తల్లి ఇతని భావముల కిష్టపడక, తీవ్రముగా మందలించి ఇతనికి రావలసిన భాగమివ్వనందున శ్మశానస్థలములోనే యిల్లుకట్టు

కొని సకుటుంబముగా నివసించుచుండెను. భీకరమైన కులాల కట్టు బాట్లు, అలసత్వం, అవినీతి, అజ్ఞానం అనే రోగాలవల్ల సమాజములో గల తీవ్రతల నెదుర్కొనెను. అన్ని శాఖలపైన ఆయన వ్యక్తిత్వపు ముద్రపడి మత, రాజకీయ, సారస్వత, తాత్త్విక రంగాలలో సంఘ సంస్కరణలు ప్రవేశ పెట్టడానికి ఫలప్రదమైన కృషిని సల్పిన మహత్తర వ్యక్తి. శాస్త్రముల ప్రాముఖ్యము తగ్గించకుండా, వేదాలసంగ్రహ సారాంశాన్ని తేటతెల్లంగా వ్యక్తపరచేవాడు. హిందూధర్మ శాస్త్రములకు విరోధి యని, నాస్తికుడని సంకుచితాభిప్రాయములు గలిగిన పండితులు ప్రకటించినను, ఎంతో వినమ్రతతో వ్యాఖ్యానించి తన దేశస్థులే హిందూశాస్త్రాన్ని అపార్థం చేసుకొన్నారని ఘంటాపథంగా చెప్పిరి.

సమస్త మతములను గౌరవించి, పదే పదే "జీసస్‌క్రీస్తుదేవుని" ఘనతను కొనియాడుచు, అత్యున్నత మానవతావాది యని, నైతిక స్థాయిని పెంచడానికి జన్మించిన యుగపురుషుడని, మార్గదర్శి యని బోధించెను. కాని మతముల మార్పునకు ఇష్టపడేవాడు కాదు. క్రైస్తవులలో పెద్దవా రనేకులు వీరి అభిప్రాయములతో ఏకీభవించి గౌరవించిరి. క్రైస్తవులలో "యూనిటేరియన్సు" లాగ రామమోహన రాయలు ఏకేశ్వరవాది. తండ్రి-కొడుకు-పరిశుద్ధ ఆత్మ కలసినది భగవత్స్వరూప మని క్రైస్తవమత విశ్వాసము. రామమోహనుని తీవ్రమైన అభిప్రాయములతో హిందువులు-క్రైస్తవులు కొందరు ఏకీభవించలేక పోయిరి. సతీసహగమనాన్ని శాసనబద్ధంగా నిర్మూలించడంలో తీవ్రకృషి సల్పెను.

స్త్రీ సతీసహగమన పద్ధతి నిర్మూలించుట యందే గాక భర్తలను గోల్పోయిన స్త్రీల విషయంలో సంఘం, ఎంతో నీచంగాను, హీనంగాను, హేయంగాను, చూచుచుండుట గమనించి వారి పరిస్థితి గూడ నర్థం చేసుకొని, వక్రభాష్యములు చెప్పే, ఛాందస పండితుల

భావములను తీవ్రముగా ఖండించి నందులకు ఈయనను సంఘం వెలివేసి అపహాస్యం చేసియుండెను. వీరు చేసే సంస్కరణకార్యములు గవర్నమెంటు వారు గూడా, ఉదాసీనతతో చూచుచుండుటకు చింతించెను. హిందూధర్మ శాస్త్రములను ఆంగ్లములోనికి అనువదించి ప్రభుత్వమువారికి తెలియునట్లు చేసిరి. అయినను ఈ సహగమన పద్ధతి నిర్మూలనకు గవర్నర్ జనరల్ గూడా తగిన ప్రోత్సాహము నీయలేదు. 1828 జులైలో "విలియంబెంటిక్" ప్రభువు గవర్నర్ జనరల్‌గా వచ్చినప్పుడు 1829 డిసెంబరు 4వ తేదిన సతీసహగమ నాన్ని శాసనబద్ధంగా నిషేధించెను.

ఆ కాలములో చెప్పుకోదగిన ప్రభావంగల, సంఘసంస్కర్తగా మెప్పుబడసెను. స్త్రీలు జ్ఞానసంపదలోను, లోకజ్ఞానంలోను పురుషులకు ఏ మాత్రం తీసిపోరని వీరి యభిప్రాయము. ఇంగ్లండులోని ప్రీవీకౌన్సిల్ వారికి గూడా, తన వాదనను వినిపించి. వారివల్ల సన్మానింపబడెను. బ్రహ్మసమాజమును ప్రతిష్ఠాపన చేసి, ఏకేశ్వరోపాసనకు ప్రాముఖ్యత నిచ్చిరి. పత్రికా స్వాతంత్ర్యమునకు, అధిక ప్రాముఖ్యమిచ్చెను. ప్రభుత్వ దోపిడివిధానాన్ని తీవ్రముగా గర్హించెను. సముద్రయానం పట్ల, ప్రతికూలాభిప్రాయంగల రోజులలో, ఇంగ్లాండునకు బయలు దేరెను. ఐరోపా యాత్ర సలిపిన మొదటి భారతీయుడు వీరే. మొగలుపాదుషా, మొదటి రాయబారిగా, దేశము నుండి పయనమయ్యెను. హిందూసంఘములో గల ననైక్యతకు, చాలా బాధపడిరి. ఇంగ్లండులో నున్నప్పుడు కామన్సుసభ వారిచే సహగమన దురాచారాన్ని చట్టబద్ధంగా రద్దు చేయించుటకు గట్టిగా ప్రయత్నించెను. విదేశములలో నున్నప్పుడు ప్రతివారిచేత నభినందింపబడిన మహాజ్ఞాని. అరబ్-పర్షియన్-సంస్కృతము-ఆంగ్లము-హిబ్రూ, గ్రీకు నేర్చుకున్నను జ్ఞాన పిపాస తగ్గలేదు. రామమోహనుడు స్వాతంత్ర్యప్రియుడు, మానవతావాది. దేశాభిమాని, స్వదేశ,

విదేశాల వివక్షతలేని ప్రజల మనిషి. మానసమే దైవమందిరం చేసు
కొన్న భక్తాగ్రేసరుడు, రాజర్షి. స్త్రీజనాభ్యుదయమునకే గాక,
సర్వమానవాభ్యుదయానికి మూఢవిశ్వాసాలను, వైరితలలు వేసిన
పూర్వాచారాలను ఖండిస్తూ మత, సాంఘిక, ఆర్థిక, విద్యావిషయక,
సాంస్కృతికాది సమస్తరంగాలలో అరువది సంవత్సరాల జీవితములో
తూర్పున ఉదయించి, పడమట అస్తమించిన తేజోరాశి, ధన్యజీవి.

## ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు

ఇతడు వంగరాష్ట్రము నందలి, మిథునపుర జిల్లాలో గల వీర
సింహాగ్రామమున ఉత్తమ బ్రాహ్మణ వంశములో 1820వ సంవత్సరము
సెప్టెంబరునెల ఇరువదవతేదిన జన్మించెను. వీరి తాత రామజయత్కర
భూషణుడు. ఈయన భార్య దుర్గాదేవి. ఈ దంపతులకు ఠాకూర్
దాస్_కాళిదాసు అను ఇర్వురు కుమారులు గలరు. ఠాకూర్ దాస్ కుమా
రుడే ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు. ఇతడు బాల్యమున బీదరికముచే
ననేక కష్టములుపడి విద్య నేర్చుకొనెను. విద్యాసాగరుడు బాల్యము
నుండియు, న్యాయదృష్టి-నిష్కాపట్యము-స్వాతంత్ర్యాభిలాష మొద
లయిన గుణములను వారి తాతయొద్దనుండి అలవరచుకొనిరి. ఇతను
19, 20 సంవత్సరములకే స్మృతులు, ధర్మశాస్త్రములు, వేదాంతశాస్త్ర
ములు, పరిపూర్ణముగా చదివి విద్యాసాగరుడని, బిరుదు బొందెను.
విద్యాసాగరునకు పితృభక్తి, మాతృభక్తి ఎక్కువ. పూర్వాచారము
లలో దుష్ట సంప్రదాయములతో నిండి అభివృద్ధి నిరోధకములైనవి
నిర్మూలింపచేసి, శిథిలమగుచున్న వ్రాతప్రతులను ముద్రింపచేయుటలో
నెక్కువగా కృషిచేసి, పురుషులతో సమానముగా స్త్రీవిద్యను ప్రోత్స
హించెను. ప్రభుత్వము వారిచ్చు ధనసహాయముతో, పెక్కు విద్యా
లయములు స్థాపించెను. వీరు తన 34వ ఏటనే పెక్కువిద్యాసంస్థలలో
నత్యంత ప్రాముఖ్యముగల ఉద్యోగములు చేసి, విద్యాభివృద్ధికై చేసిన
కృషి నిరుపమానము.

1829వ సంవత్సరమున "విలియం బెంటింక్" ప్రభువు కాలములో శ్రీరాజారామ మోహనరాయలు సహగమన పద్ధతిని మిక్కిలి ప్రయాసపడి మాన్పించుటకు చేసిన కృషికి వీరు మిక్కిలి సంతసించిరి. అప్పటినుండి హిందూవితంతువుల పరిస్థితి సంఘములో మిక్కిలి దుర్భరముగాను, ఘోరముగా నుండినది. వారి కష్టములు వర్ణింప నలవిగాకయుండెను. ఈ బాలవితంతువుల కడగండ్లను తొలగించుటకై విద్యాసాగరుడు పడిన శ్రమ వ్రాయనలవి గాదు. విద్యాసాగరుని తల్లి తనకు సంబంధించిన దగ్గర బంధువైన బాలవితంతువు యొక్క దుఃస్థితికి వగచి, తన కుమారునితో "నీవు ఎన్నో శాస్త్రములు చదివితివి గదా? మన హిందూమతములో, వితంతువులకు పునర్వివాహము చేసెడు విషయము శాస్త్రసమ్మతమేనా" యని అడిగెను. తల్లిదండ్రుల యాజ్ఞను గైకొని స్త్రీ పునర్వివాహ ఉద్యమమునకై కంకణము కట్టుకొని శాస్త్రసమ్మతమని సంఘములో ప్రచారము చేసెను. ఎన్ని భేదాభిప్రాయములు వచ్చినను, తాను నమ్మిన సిద్ధాంతమును, వీడెడివాడు గాడు. ఈ ఉద్యమ సందర్భములో ఎన్నో కష్టముల కోర్చి, ఛాందస పండితుల నెదుర్కొని తన్ను చంపుటకు ప్రయత్నించినను, లెక్కచేయక స్త్రీ పునర్వివాహ పద్ధతిని శాస్త్రసమ్మత మని ప్రచారము చేసి, సంఘములో నూతనపద్ధతిని ప్రవేశపెట్టిన మహనీయమూర్తి. వీరు కేవలము, ఇతరులకు ప్రబోధము చేయుటయే గాక, తన కుమారుడు నారాయణచంద్రుడు వితంతువును వివాహము చేసుకొనగనే విశాలహృదయముతో సమ్మతించిన ఆదర్శమూర్తి. కేవలము విద్యావంతుడు, సంఘసంస్కర్తయే గాక రేపటి దినమున తనగతి యేమని విచారించకయే, బీదలకు దానము చేయుచుండెడివాడు. ఇతడు చేసిన దానములు, ధర్మములు వ్రాయనలవి గానివి పెక్కు గలవు. వీరిని కలియుగ దానకర్ణు డనినను అతిశయోక్తి గానేరదు.

## కందుకూరు వీరేశలింగంపంతులు

వీరు ఆంధ్రులు. రాజమహేంద్రవరములో 1848వ సంవత్సరం ఏప్రిల్‌నెల 16వ తేదీన జన్మించిరి. పూర్వము చాలమంది ఆడపిల్లలకు బాల్య వివాహములు చేయుచుండెడి వారు. ఆడపిల్లలకు విధివశాత్తు భర్తలు చనిపోగానే పునర్వివాహము చేయుట సంఘములో మహా పాపముగ పరిగణించి శాస్త్రములు గర్హించియున్నవి. ఛాందస, సంకుచిత భావములుగల పండితులు స్త్రీకి పునర్వివాహము పనికిరాదని ప్రచారము సల్పుచు ఆ బాలికల జీవితములు నిరర్థకమై, కేవలము ఇళ్లలో వెట్టిచాకిరికి మాత్రమే వారు పనికివచ్చునట్లు చేసిరి. అటువంటి బాలికలు లోలోపల బాధలు పడుచు, సంఘములో తాము హీనముగా చూడబడుచుండుటచే మిగుల దుఃఖించుచు ఎన్నో బాధలు పడుచుండిరి. వీరు సంఘములో విధవముండలని పిలువబడుచు చాల నీచముగను, హేయముగను చూడబడుటకు వీరేశలింగం పంతులుగారు మిగుల దుఃఖించి, సహించలేకపోయెను. వితంతువులకు పునర్వివాహము చేయవచ్చుననియు శాస్త్రములలోని నిజమైన విషయములు పండితులు స్వార్థపరత్వముతో చెప్పకపోవుట గర్హించదగిన విషయ మనియు, బహుళప్రచారము చేసి సంఘములోని దుష్టశక్తుల నెదుర్కొని, స్త్రీ పునర్వివాహము చేయవచ్చునని నిర్ద్వంద్వముగా చెప్పెను. బాలవితంతువుల జీవితములునాశనము చేయుట సహించరాని విషయ మనియు, మానవత్వము లోపించిన వారు మాత్రమే ఈ విషయమై ప్రచారము చేయుచున్నారనియు తెలిపి వారిని తీవ్రముగా నెదుర్కొనిన గొప్ప సంఘసంస్కర్త. వీరు చేసిన సేవ అమోఘము, చిరస్మరణీయము.

# 14. తత్త్వవేత్తలు—ఉపదేశములు

భక్తి తత్త్వవేత్తలు, మతతత్త్వవేత్తలు, గురువులు వారికి ముందు కాలములో జరిగిన మంచిని గ్రహించి, దేశ కాల పరిస్థితులను బట్టి ఎపుడు ఏమిచేసిన బాగుండునో గ్రహించి, ప్రజలను సన్మార్గవర్తులుగా చేయుటకు, భక్తిమార్గములో నుంచుటకు, తాము గ్రహించిన వాటిని సులువైన మార్గములలో కుల, మత, వర్గ భేదములు పాటింపక, సమస్త జనులకు బోధించి ప్రజలలో భక్తితత్త్వమును అభివృద్ధిపరచుటకు పవిత్రములైన మహామంత్రములను, బీజాక్షరములతో గూడిన ఉపదేశములను శ్లోక, పద్యరూపములలో స్తోత్రములను, భగవంతుని పేరుతో నామజపములు, పూజలు, క్రతువులు మొదలగు వానిని అందరికి అర్థమయ్యే రీతిలో బోధించి యుండిరి.

ఈ మహామంత్రములలో, ఓం నమో నారాయణాయ (నారాయణ అష్టాక్షరి), ఓం నమో భగవతే వాసుదేవాయ (వాసుదేవ ద్వాదశాక్షరి), ఓం నమో విష్ణవే (విష్ణుషడక్షరి), ఓం నమః శివాయ (శివ పంచాక్షరి) మొదలైన మహామంత్రములు, రామతారక మంత్రము మొదలగునవి గాక, స్తోత్రములలో శ్రీలక్ష్మీనృసింహ, శ్రీరామ, శ్రీకృష్ణ, శివ మొదలగునవియు, భగవంతునిపరంగా అనేక శతకములు, బీజాక్షరములతో గూడిన ఉపదేశములను ఉపదేశించి ఎల్లకాలముల యందు భగవంతుని ప్రార్థించి తరించ వలసినదిగా బోధించి వారు తరించి ధన్యులైరి.

ఈ మహామంత్రములు పూర్వకాలములో ప్రహ్లాద, నారద, ధ్రువ, మార్కండేయులును, ఆళ్వారులును, నాయనార్లు మొదలైన మహాభక్తులు జపించి తరించి, భవిష్యత్తరములవారు వాటిని జపించి మోక్షమును పొందవచ్చునని ఎలుగెత్తి చాటియుండిరి. ప్రస్తుత కాల

ములో గూడ మహాభక్తులైన మహానుభావులు ఈ మంత్రాలను జపించుచు మార్గదర్శకులుగా నుండిరి. పై మంత్రములను జపించుటకుగాని, స్తోత్రము చేయుటకు గాని చిత్తశుద్ధితో గూడిన భక్తియే అతి ముఖ్యమని, అనువైన మార్గమని చెప్పియుండిరి. పరమ పవిత్రమైన గంగానదిలోని జలమును సువర్ణ, రజత, తదితర మృత్పాత్రలతో త్రాగినను ఫలితము గుణము ఒక్కటియే. అదే విధముగా మహామంత్రములు జపించినను, స్తోత్రములు చదివినను నిర్మలమైన భక్తియే ముఖ్యము.

భగవంతునికి అనేక నామములున్నను, ప్రతినామము ప్రపంచ రూపములలో ఒకానొక భాగమైయున్నది. ముఖ్యముగా భగవంతుని సహస్ర నామములతో కీర్తించుట ప్రశస్తి వహించియున్నది. మనసు కుదిరి హృదయ పూర్వకముగా నోరువిప్పి, తనివితీర నామ సంకీర్తన చేసిన జన్మ తరించును. అందుకనే "విష్ణోః సర్మణం" అని భాగవత పురాణము విష్ణుస్మరణము సూచిస్తుంది.

ముఖ్యముగా సహస్రనామములోని ప్రతినామానికి అర్థం తెలియకపోయినా స్పష్టంగా ఉచ్చరింప గలిగితేనే ప్రయోజన మున్నది. స్పష్టాక్షరమైన పలుకే మంత్రమని చెప్పియుండిరి. ఆ మంత్రమునకు అధీనులే దేవతలు. స్తోత్రపాఠం చేస్తే స్తుతి అవుతుంది. ఒక్కొక్క నామాన్ని ఓంకారముతో మొదలు పెట్టి "నమః" అని ముగిస్తూ పూలతోనో, అక్షతలతోనో అర్చిస్తే అర్చన అవుతుంది. పదిమంది కలిసి సహస్రనామ హోమం చేస్తే అది యజ్ఞం అవుతుంది. ఎలా చేసినా గమ్యం ఒక్కటే. అతణ్ణి ఆరాధించేందుకు అందరూ అర్హులే గాబట్టి ఆ మూర్తిని మనస్సులో నుంచుకొని ఇతరానక్తులు లేక శ్రద్ధా భక్తులతో చదివినప్పుడే దాని ఫలితం కలుగుతుంది.

సూర్యకిరణములు మూరుమూలలకు గూడా చొచ్చుకొని ప్రసరించినట్లే సద్భక్తితో భగవంతుని ఏ రూపములో ధ్యానించినను ఆయన కరుణాకిరణములు దశదిశలా దీనులను, హీనులను, యోగులను, సాధువులను, అందరిని అనుగ్రహిస్తాయి.

బహుకాలమునుండి నేటి వరకు విష్ణుసహస్రనామము, భగవద్గీత, సుందరకాండ పారాయణములు నిత్యము జరుగుట బహుళ వ్యాప్తిలో నున్నది. అన్ని మంత్రములకన్న "శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే, శ్రీమతే నారాయణాయ నమః" అను ద్వయ మంత్రము మంత్రరత్నమని చెప్పదగి యున్నందున సమస్త జనులు విధినియమములు, వర్ణభేదములు పాటింపక ఎల్లకాలములయందును సర్వవేళలా జపించి, స్మరించవచ్చునని మహాత్ములు చెప్పియుండిరి. కులశేఖర ఆళ్వారు ముకుందమాల అను స్తోత్రములో నారాయణ శబ్దముతో గూడిన మహామంత్ర మహిమను గూర్చి ఈ క్రింది విధముగా చెప్పియుండిరి_

హే మర్త్యాః పరమం హితం శ్రుణుత వో వక్ష్యామి సంక్షేపతః
సంసారార్ణవ మాపదూర్మిబహుళం సమ్యక్ ప్రవిశ్య స్థితాః,
నానాజ్ఞానమపాస్య చేతసి నమో నారాయణాయేత్యముం
మన్త్రం సప్రణవం ప్రణామసహితం ప్రావర్తయధ్వం ముహుః.

అనేకములగు ఆపత్తరంగములలో గూడి అగాధమగు సంసార సముద్రమునందు మునిగియున్న మహాజనులారా! మీకు సంక్షేపముగ నొక గొప్ప హితము చెప్పుచున్నాను. అది యేమన మీకు గల అజ్ఞానమును పారదోలి ఓంకారము-ప్రణవముతో గూడిన "నారాయణాయ" అను మంత్రము జపించుచుండ వలయునని బోధించెను.

"ఓం" అను శబ్దము ప్రణవము. పతంజలి పరమాత్మను పిలిచేందుకు సంబోధన యని చెప్పినారు. ఓంకారము పరమాత్మకు పర్యాయపదము.

"ఓం" అని పిలిస్తే పరమాత్మ పలుకుతాడు. మూడు లోకాలకు మూలమై ప్రపంచానికి ప్రాణం అయింది ప్రణవం. ఈ శబ్దము సకల సారస్వతసారం అని మహాత్ములు చెప్పిరి. ప్రపంచమే పరమాత్మ కాబట్టి పరమాత్మ ప్రణవస్వరూపుడు.

ఓంకారము, వేదములు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, సనాతన ధర్మశాస్త్రములు, శ్రుతులు, స్మృతులు, పురాణేతిహాసములు బహుముఖముగ అనేక దేవతోపాసనములను, మానవాతీతశక్తులను, స్వర్గాది పుణ్యలోకములను గూర్చి చెప్పుచున్నవి. అన్నియు ఒకే పరతత్త్వమును ప్రసాదించుచున్నవి. అదే బ్రహ్మమని అచలమని పరమాత్మయని, భగవంతుడని చెప్ప బడుచున్నది. అనగా అందరికి అన్నిటికి సర్వేశ్వరుడైన భగవంతుడు ఒక్కడే యని సారాంశము. అట్టి భగవంతుని ఆరాధించి ఆయన స్వరూపము నొందుటకు "ఓం" అను అక్షరము చాలును. "ఓం" కారము యొక్క మహిమ మహోన్నతమైన దనియు, దాని మహౌన్నత్యము అనుభవైకవేద్య మనియు పెద్దలు చెప్పుదురు.

ఉత్తరగీతలో శ్రీకృష్ణునిచే ఉపదేశింపబడినది "ఓం" అను అక్షరమే. అది అక్షర పరబ్రహ్మము. "ఓం" కారమే సకల సృష్టి స్థితి లయములకు మూలకారణము. వేదముల యొక్క ఆదిమధ్యాంతము లందు "ఓం" కారము అనుసంధింప బడినది. ఒక్క మాటలో వివరించ వలయునన్న సర్వము "ఓం" కారమయము.

> ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మామనుస్మరన్,
> యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్.
>
> **గీత. 13-8.**

ఎవడు మరణ సమయములోనైన "ఓం" అను ఏకాక్షర ప్రణవమును నోట బలుకుచు శరీరమును విడచిపోవునో అట్టివాడు ఉత్తమోత్తమ మైన నా పరమపదము చేరుచున్నాడని శ్రీకృష్ణభగవానుడు అర్జునునికి

బోధించెను. ఏకాక్షరమైన "ఓం" కారము మహామహిమాన్వితమై తేజస్స్వరూపమై మహోన్నతస్థాన మాక్రమించినది.

అ. ఉ. మ. అను మూడు అక్షరముల కలయిక వల్ల 'ఓం' కారము ఏకాక్షర మైనది.

"అ" కారమునుండి అగ్ని, ఋగ్వేదము, భూలోకము; బ్రహ్మ జనించు చున్నారు.

"ఉ" కారమునుండి ఆకాశము, యజుర్వేదము, భువర్లోకము విష్ణువు ఉద్భవించు చున్నారు.

"మ" కారమునుండి సూర్యుడు, సామవేదము, స్వర్గలోకము, మహేశ్వరుడు పుట్టుచున్నారు.

అ, ఉ, మ వర్ణములు. పసుపు-తెలుపు-నలుపు రంగులలో రజస్సత్వ, తమో గుణములు గూడుకొనియున్నవి. ఈ మూడు వర్ణములు కలియగా జ్యోతిస్స్వరూపమైన "ఓంకారము" ఆవిర్భవించినది. ప్రణవాక్షరముతోనే సర్వాంతర్యామిని నిలిపి ధ్యానింపవలెను. త్రిమూర్త్యాత్మకమైన సృష్టి, స్థితి, లయ కారణమైన ప్రణవరహస్య మెరిగినవాడు వేదార్థములు తెలిసినవాడనియే చెప్పవలెను. ఇదియే బ్రహ్మవిద్య. మానవుడు దేశ, కాల, పాత్రలతో నిమిత్తము లేకుండ అన్ని వేళల 'ఓం' అను ప్రణవాక్షరమును జపించవచ్చును. అన్ని కోరికలు విడచి, చిత్తవృత్తిని నిరోధించి, తనలోని స్వస్వరూపమైన ఆత్మను చూచి, పరమాత్మకు తనకు ఎట్టి భేదము లేదని, తానే పరమాత్మ యని తెలిసికొని దృఢనిశ్చయముతో నుండవలెను. సప్తకోటి మహామంత్రములలో మహోత్కృష్టమైన ఓంకారము ఉపాసించు మానవుడు చరమ పురుషార్థమైన మోక్షమును సులువుగా బొందగలడని శ్రీకృష్ణపరమాత్మ నిశ్చితాభిప్రాయము. జీవునకు ఈ శరీరము వదలినను ఇంతటితోనే జన్మ సమాప్తిగాదు. అలా సమాప్తిగావడమే మోక్షము. ఆ ముక్తి పేరే సాయుజ్యము.

నమః అనగా నమస్కారము నన్ను స్వయముగా మీకు సమర్పించుకొనుచున్నాను. సర్వం మీరే అని చెప్పుటయే భక్తునిలక్ష్యము.

## నారాయణశబ్ద వివరణ

ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః,
త్రీన్‌లోకాన్ వ్యాప్య భూతాత్మా భుంక్తే విశ్వభుగవ్యయః.

అంతటు వ్యాపించినవాడు పరమాత్మ, పరవస్తువు. ఆయన నారాయణుడా, శివుడా యని సందేహము గలదు. వేదములలోను, సమస్త పురాణాదులయందును నారాయణుని నామము నారాయణాంశమును గురించి వివరముగ్గా తెలుపుచూ "నారాయణుడే" పరమపురుషుడు-పరబ్రహ్మ అయినట్లు స్పష్టముగా వివరింపబడెను. "నారాయణః" శ్రుతి వాక్యము-

యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా,
అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః.

అనునట్టి శ్రుతి ప్రమాణానుసారముగ నరు డనగా ఆత్మ యనియు, అట్టియాత్మవలన ఆకాశాది భూతములు పుట్టినవనియు, అట్టి భూతములయందు కారణరూపముతో వ్యాపించియున్నాడు గనుక ఆ భూతములు ఇతని అయనములు గనుక నారాయణు డనబడునని చెప్పియున్నది.

విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్,
విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్.
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్,
నారాయణపరో జ్యోతి రాత్మా నారాయణః పరః.
నారాయణపరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః,
నారాయణ పరో ధ్యాతా ధ్యానం నారాయణః పరః.
నారాయణ ఏవేదం సర్వం యద్భూతం యచ్చ భవ్యమ్.

అనినట్లు అనేకములైన శిరస్సులు గలిగి, జగత్తు నేత్రములుగా గలిగిన వాడై విశ్వమునకు సుఖము గలుగజేయు వాడును, సర్వవ్యాపకుడును సర్వప్రాణుల కాధారభూతుడును, శాశ్వతుడును, మంగళకరుడును, మోక్షసాధనభూతుడును, ప్రపంచాతీతుడును, ప్రపంచస్వరూపుడును, శాశ్వతుడును, విశ్వమునకు ప్రభువును, శుభకరుడును, నాశరహితుడును, అంతర్యామి స్వరూపుడునైన నారాయణుడే జ్యోతిస్స్వరూపుడు. నారాయణుడే పరబ్రహ్మ స్వరూపుడు. నారాయణుడే తత్త్వరూపుడు. నారాయణుడే ధ్యానము చేయదగినవాడు. అట్టి ధ్యానగోచరుడైన నారాయణుడే సర్వులచే సేవింపదగిన వాడని శ్రుతులు కొనియాడు చున్నవి.

అథ నిత్యో నారాయణః బ్రహ్మా నారాయణః శివశ్చ నారాయణః శక్రశ్చ నారాయణః కాలశ్చ నారాయణః దిశశ్చ నారాయణః.

సర్వమూ నారాయణుడే యని నారాయణుని అద్వితీయ తత్త్వమును స్పష్టపరచి, "నిష్కలంకో, నిరంజనో, నిర్వికల్పో, నిరఖ్యాతః, శుద్ధః దేవ ఏకో నారాయణ" యని స్పష్టపరచి యుండెను.

నమామి నారాయణ పాదపంకజం
కరోమి నారాయణపూజనం సదా,
వదామి నారాయణనామ నిర్మలం
స్మరామి నారాయణతత్త్వ మవ్యయమ్.

విష్ణుమూర్తికి సహస్రనామములే గాక, అనంతనామము లుండవచ్చును. అన్నిటికంటె ప్రధానమైనది-ప్రథమమైనది "నారాయణ" అనే నామం ఎందువలన స్మరింపవలయునో తెలిసికొంటిమి. ఆదిశంకరులవారి "భజ గోవిందం" యొక్క ప్రాముఖ్యమును, వారు ఒకానొక సమయములో లక్ష్మీనృసింహస్తోత్రము చేయుటను గమనించిన నారాయణుడే పరవస్తువనియే సూచింపబడుచున్నది.

పరమ పవిత్రమై అందరికి మేలు చేయునదియై, శుభకరమైన మహామంత్రము "ఓం నమః శివాయ" అను శివపంచాక్షరీ మహా మంత్రము. భక్తి నిష్ఠలతో, ఏకాగ్రచిత్తులై, ఎవరు నిత్యము జపించు చుందురో వారు పాపవిముక్తులై, నిస్సంశయముగా ముక్తి పొంద గలరు. ఏ మంత్రమునైనను, సద్భక్తి గలిగి, నిశ్చలమైన మనస్సుతో జపించినప్పుడే ఫలితము సిద్ధించును. మనస్సులో ఏ మూర్తినైనను సరే లగ్నము చేసుకొని, ఆ మూర్తినే తన ఇష్టదైవముగా భావించి, ఏ మంత్రము జపించినను ఫలితము సిద్ధించును.

ఒకప్పుడు జగద్గురు కంచి కామకోటి పీఠాధిపతులు, నారా యణ అష్టాక్షరీమంత్రము (ఓం నమో నారాయణాయ) ప్రాతః కాలమునందును, శివపంచాక్షరీ (ఓం నమః శివాయ) మంత్రము ప్రదోషకాలము నందును ఏ భేదము పాటింపక జపించుచు ఎల్లరూ భక్తితో ఆ పరమాత్మను ధ్యానించుట కర్తవ్యమని విశాలబుద్ధితో బోధించిరి.

# 15. భగవద్గీత ప్రాముఖ్యము

"భగవద్గీత" భారతీయులకు అత్యంతప్రామాణికమై సర్వమత సమన్వయ మొనర్చి, వివరముగా తేలికగా ప్రబోధించెడి గ్రంథము. ఈ విషయము జగద్విఖ్యాతమై యున్నది. దీనికి గల ప్రాశస్త్యము, గౌరవము, ప్రచారము మరొక గ్రంథానికి లేదు. ప్రపంచములో ఏ మూలకు వెళ్లి చూచినా, కనీసం భగవద్గీత పేరు వినని వారుండరు. జనసమూహంలో ఇంతటి ఆత్మీయతను పొందుటకు సాక్షాత్ భగవత్స్వరూపుడైన శ్రీకృష్ణ పరమాత్మ నోట వెలువడిన గానము కాబట్టి ఆధ్యాత్మిక వాఙ్మయంలో దీనికి గలస్థానము మరియొక దానికి లేదని భావించెదరు. పంచమ వేదమయిన భారతములో కీలకస్థానములో వ్యాసుడు సర్వవేదాంతసారము సమకూర్చి యుండెను. శంకరభగవత్పాదులు "గేయం గీతానామ సహస్రం" అని ప్రపంచానికి బోధించెను. "భగవద్గీత" అంటే భగవంతునిచేత కీర్తింపబడినదని యర్థము. ఏది ధర్మం–ఏది అధర్మం–ఏది పాపం–ఏది పుణ్యం–ఏమి చెయ్యాలి–ఏమి చెయ్యకూడదు అనే విషయములో అర్జునుడు మీమాంసలో పడినప్పుడు ఆ చిక్కునుండి అతనిని బయటి లాగి సరియైన దృష్టిని అతనికి ప్రసాదించేందుకే శ్రీకృష్ణపరమాత్మ పాటుపడి సఫలీకృతుడైనాడు. భగవద్గీత పంచమవేదమని ప్రఖ్యాతి గాంచిన భారతములో భీష్మపర్వము లోనిది. భక్తితో కోరిన అర్జునుని కోరికను మన్నించి, తనయొక్క విశ్వరూపము చూపించి, అర్జునుని తన వానినిగా చేసుకొనెను. చేయవలసిన పనిని చేసి తీరాలి. ఆత్మానాత్మవివేకముతో తెలిసి చెయ్యాలి అని బోధించెను.

కర్మ–జ్ఞానములలో ఏది ముఖ్యమని తాత్త్వికులు మథనపడుచుండెడివారు. గీత రెంటిని సమన్వయపరచి సమాధానమిచ్చిన

ఉద్గ్రంథము. గీతలో 18 అధ్యాయాలున్నాయి. 700 శ్లోకములు గలవు. అందువలననే దీనిని మోక్షసప్తశతి అని చెప్పుదురు. ఎక్కువ తక్కువ అనే భేదం లేదు. జ్ఞానమే ప్రధానం. ప్రాచీనమహర్షుల అభిప్రాయములనుపామరజనులకు అందేటట్లుచేసినది భగవద్గీత మాత్రమే

భారతీయతత్త్వమునకు, ఆధారభూతములైన గీత-ఉపనిషత్తులు బ్రహ్మసూత్రములు- ఈ మూడింటిని కలిపి ప్రస్థానత్రయ మనెదరని తెలుసుకొంటిమి. ఈ మూడింటిలో అందరికి అందుబాటులో నుండుటచే భగవద్గీత మాత్రమే ప్రధానమై యున్నది. ఉపనిషత్తులలోని సారం-బ్రహ్మసూత్రములలో చెప్పబడిన రహస్యములు గీతలో చెప్పబడియుండెను. మానవుని నిజజీవితములో ఏ చిక్కు ప్రశ్న తటస్థించినా గీతలో ఏదో ఒక శ్లోకము తగిన సమాధాన మిచ్చి తృప్తి పరుస్తుంది.

భారతీయ వాఙ్మయములో ఎన్నో గీతలున్నను, భగవద్గీతకు మాత్రమే విశిష్టస్థానముంది. గీత అనగనే భగవద్గీత అని మాత్రమే చెప్పుదురు. శ్రీమద్భగవద్గీత సర్వవేదాంతసారము. గీతామృతములోని కర్మ-జ్ఞాన-భక్తి మార్గములు జీవితపరమార్థాన్ని ఎలా సాధించాలో తేటతెల్లముగా విశదీకరిస్తాయి. ఇంత స్వల్పప్రమాణములో ఒక్క వైదిక ధర్మమే గాక, సర్వమతసారము ఇమిడి యున్నది! గీతాజ్ఞానము నాశ్రయించియే, ముల్లోకములను ఏలు చున్నానని విష్ణుదేవుడు వరాహపురాణ మందలి "గీతామాహాత్మ్యమున"-

"గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీన్ లోకా న్పాలయామ్యహమ్"

అని చెప్పియుండెను.

త్రిలోకరాజ్యాంగ విధానములకు అవసరమగు మూలసూత్రములన్నియు గీత యందు గలవు. కనుకనే దేశ, కాల, జాతి, మత, వివక్షత లేక ప్రపంచమానవు లందరికి గీతాసిద్ధాంతములు అను

వర్తించును. వేలాది సంవత్సరముల క్రిందట నుపదేశింపబడినదే అయినను నేటికిని గీతార్థము వలన మానవలోకము లాభము పొందు చునే యున్నది. నవీన భావములు గోచరించుచునే యున్నవి. భారతీయులే గాక, అన్యదేశీయులును, పెక్కుమంది గీతాజ్ఞానము నాశ్రయించియే తమ జీవితములను పవిత్రములను జేసుకొను చున్నారు. కనుకనే వివేకానందుడు "గీత" లోకైక గ్రంథమని చెప్పి యున్నాడు.

పలుప్రాంతములలో గీతా మందిరములు నిర్మించి, భక్తజనులు నిత్యము అక్కడ గీతను పారాయణము చేయుచున్నారు. గీతలోని పవిత్రవిశాలభావములు గుర్తింపబడి మందిరములు నిర్మించుటద్వారా పండితుల ప్రచారముల ద్వారా, నిత్యము పారాయణము ద్వారా గీత వ్యాప్తిగాంచుట ప్రోత్సాహకరముగనే యున్నది. ఈ కృషి చాల వరకు ఫలించినను కొద్దిమంది మాత్రమే పాల్గొని చేయుచున్నారు. ఈ కాలములలో కేవలము గీతలోని శ్లోకములు కంఠస్థము చేసి ఏదో గీతాపారాయణము చేయుచున్నాము గదా యని తృప్తి బొందుట విశాలభావముతో గూడిన కార్యము గాదు. మతాచార్యులు, పండితులు విద్యావంతులు ఏ భేదములను పాటించక సమస్తజనులకు గీతలో గల విషయములు తేటతెల్లముగా అందరికి తెలియ జెప్పి, సమష్టిగా గీతా మిషనుగా ఏర్పడి కులమత భేదములను పాటింపక మెలంగుట వారి ముఖ్యకర్తవ్యమై యున్నది.

ఈ కార్యము క్రైస్తవమిషనరీల వలె, రామకృష్ణా మిషన్‌వారి మాదిరిగా ప్రచారము చేయుట ఈ గీతామిషన్‌వారి విధ్యుక్తధర్మమై యున్నది. కేవలము ఏవో కొన్ని ఉపన్యాసములిచ్చి వారు నిర్వర్తించ వలసిన పని అంతటితో అయిపోయినదని భావించుట ఆత్మవంచనయే కాగలదు. గీతయొక్క ప్రాముఖ్యము విదేశీయులు తెలుసుకొనవలెనని కనపరచే ఉత్సాహము, మన దేశీయులలో లేకపోవుట చాలా విచార

కరమైన విషయము. దీనికి కారణము, మన వారిలో కొంతమందికి గల సంకుచిత భావములు హేతువైనట్లు తోచుచున్నది. ఇప్పటికీ చాలామంది మహనీయులు గీతకు అనేకవిధములుగ భాష్యములు వ్రాసి వాటిలో గల అమూల్యాభిప్రాయములు బోధనల ద్వారా ప్రచారము జేసినను, జరిగిన పని చాలా స్వల్పమనియే చెప్పవలసి యున్నది. పవిత్రసేవా భావములతో గీతయొక్క ప్రాముఖ్యమును విరివిగా ప్రచారము చేయుట భారతీయుల ప్రధాన కర్తవ్యమై యున్నది.

# 16. దేవాలయములు-పోషకవర్గము

గత ప్రకరణములలో భగవంతుడు, భగవత్తత్త్వముల వివరణ, భక్తి, మతతత్త్వవేత్తల జీవిత విశేషములు, వారు బోధించిన మహా మంత్రములు, ఉపదేశములు, భగవద్గీతా ప్రాముఖ్యము మొదలగు విషయములు తెలుసుకొంటిమి. దేవాలయములు, ధర్మసంస్థలు, మతసంస్థలు మొదలగునవి నిర్వహించ వలయునన్న ఏ ఒక్కరి వల్ల సాధ్యపడు విషయము గాదు.

అనాదినుండియు వేద ప్రతిపాదితమై ఆర్యధర్మము అనేక శాఖలుగ విస్తరించి జగత్తును సంరక్షించు చుండగా, వేదాంగములను అవగాహన మొనర్చు కొన్న మహర్షులు వాటి ప్రచారమునకు సహకరించు చుండగా, మతత్రయాచార్యులు మొదలుగా గల తత్త్వ వేత్తలు, భక్తి తత్త్వ వేత్తలు, వాటి భావములను విశదీకరించి బహుళ ప్రచారము జేసియుండిరి. అర్చావతారుడైన పరమాత్మను అనేక రూప ములలో అనేక విధములుగ అనేకమంది భక్తులోక మర్చించుచుండగా భక్తిప్రపత్తులు గలిగిన ప్రభువులు, దాతలు వేలాది ఎకరముల భూమిని, లక్షలాది రూప్యములను దేవాలయ, మత ధర్మ సంస్థలకొరకు దాన ములు చేసి నిర్వహించి యుండిరి. దేవాలయములలో నిత్య, ధూప, దీప, నైవేద్య కైంకర్యములు, అర్చకులును, మతప్రచారము కొరకు మతాచార్యులును నిర్విఘ్నముగ నొనర్చు చుండిరి. తరువాత కాల ములో పైనుదాహరించిన సంస్థలు పోషకవర్గములుగను, ధర్మకర్తృత్వ సంఘములు గను, ప్రజలచే ఎన్నుకోబడి ఆ సంఘముల ద్వారా ఆ యా కార్యములునిర్వర్తించు చుండిరి.

కొన్ని సంవత్సరముల క్రిందట ప్రభుత్వము వారు "హిందూ దేవాదాయ మతసంస్థల, ధర్మసంస్థల" నిర్వహణకొఱకు ప్రత్యేకశాఖ

ఒకదానిని ఏర్పరచిరి. మిగలిన శాఖలతోపాటు ఆ శాఖకు ఒక మంత్రి, ఉపమంత్రి, రాష్ట్రమంతటికిని ఒక కమిషనర్, కొన్ని జిల్లాలకు కలిపి డిప్యూటికమీషనర్, జిల్లాకొక అసిస్టెంటు కమీషనర్-వీరిపరిపాలన క్రింద కొంతమంది ఇన్‌స్పెక్టర్లు, కొన్ని సంస్థలకు కలిపి పరిపాలనా సౌలభ్యము కొరకు వివిధ తరగతులుగా ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు మొదలగు వారు నియుక్తులై, ధర్మకర్తృత్వ సంఘమువారి సహాయ సహకారములతో ఆ సంస్థలను పరిపాలించుచుండిరి. ఈ సంస్థల నిర్వహణ పూర్వకాలము నుండి నేటివరకు ఏ విధముగా జరుగుచున్నది ఈ ప్రకరణములో వివరించడమైనది.

పూర్వకాలము నుండియు దేవాలయములు, ధర్మసంస్థలు, మతసంస్థలు, చక్రవర్తులు, మహారాజులు, జమిందారులు, దాతలచే మాన్యము లివ్వబడి, వాటివల్ల వచ్చు ఆదాయముతో పై సంస్థల నిర్వహణకు సంబంధించిన సమస్త కార్యములు చూచుచు, వారే పరిపాలకులుగా నుండి పోషించుచుండెడి వారు. వారు సొంతముగాగూడ కొంత ధనమును వెచ్చించి వాటి అభివృద్ధిపనులు జరుపు చుండినను పై సంస్థలపైన వచ్చు ఆదాయముతో దేవాలయ నిర్మాణములు వాటి మరమ్మత్తులు జరుపుచుండెడి వారు. ధర్మసంస్థల, మతసంస్థల నిర్వహణగూడా వారే నిర్వహించుచుండెడి వారు. వారే పై సంస్థల సిబ్బందిని పోషించి శిల్పులను విద్వాంసులను, కళాకారులను, తదితరమైన వారిని ఎంతోమందిని పోషించి జీవనాధారములను గల్పించిరి. ఈ సంస్థలమీద ఆధారపడి పెక్కు కుటుంబములవారు వారిపనులు నిర్వర్తించుకొనుచు జీవించుచుండిరి. దేవాలయ శిఖరముల మీద గాలి గోపురములమీద గొప్ప గొప్ప శిల్పులచేత శిల్పములు చెక్కించి వాహనములు చేయించి, భక్తజనుల నాకర్షించుటకు పురాణములు, హరికథలు మొదలగు కార్యక్రమములు నిర్వహించెడివారు.

ధర్మ సంస్థలు సత్రములు నిర్మించి ప్రయాణికులకు ఇతర గ్రామవాసులకు, యాత్రికులకు వలయు వసతులు ఏర్పరచి, బీద వారలకు అన్నదానము చేయుచు, ఎన్నో విధములైన సౌకర్యములు గలుగ చేయుటవలన ప్రజలు పుణ్యక్షేత్రములకు బోయి భగవంతుని దర్శించి సేవించి పుణ్యనదులలో స్నానము చేయుచుండిరి.

ఈ మతసంస్థలు వివిధ మతాచార్యులను ఆదరించి, వారి అభిప్రాయములు ప్రజలకు బోధపరచి సర్వమతములలో గల అమూల్యాభిప్రాయములు విరివిగా ప్రచారము చేయు ఏర్పాట్లు గావించి, ప్రజలు ఐకమత్యముగా నుండుటకు పాటుపడుచున్నవి. చక్రవర్తులు, మహారాజుల కాలము తరువాత, పట్టణములలో, గ్రామములలో ప్రజలె ఒక ధర్మకర్తృత్వ సంఘముగా ఏర్పడి, వారే పాలకులుగా నుండి ఆ సంఘముల ద్వారానే సమస్త దైవ, ధర్మకార్యములు నిర్వర్తించుచుండిరి. మతసంస్థలు మాత్రము ఆ యా మతములకు సంబంధించిన పీఠాధిపతులు నిర్వహించుచుండిరి. ఇట్టి సంస్థలు చాలకాలము నుండియు కడు సమర్థనీయముగానే నడుపబడినవి.

ఉమ్మడి మద్రాసురాష్ట్రములో కొంతకాలము నుండి హిందూ మత, దేవాలయ ధర్మసంస్థలకు గవర్నమెంటు వా రొక శాఖను ఏర్పాటుచేసియుండిరి. ఈ శాఖకు సంబంధించిన అధికారులు, గ్రామములలో గల పాలకవర్గములు కలిసి పరిపాలన సాగించుచుండిరి. కొన్ని సంస్థలు ఈ శాఖతో సంబంధము లేకయే పై కార్యములు నిర్వర్తించుకొనుచుండిరి.

ప్రత్యేకాంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత, ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో ఏర్పరచిన విధముననే దేవాదాయ ధర్మాదాయ సంస్థల కార్యక్రమములు నిర్వహించుచుండిరి. ఈ శాఖ ప్రత్యేకముగా ఏర్పాటు చేసిన కాలము నుండియు చాలవరకు దేవాదాయ, ధర్మాదాయ సంస్థలు గతములో కన్న ఎంతగానో అభివృద్ధి గాంచిన వనుటలో

సందేహము లేదు. ఈ శాఖవారు సంస్థల అభివృద్ధి కార్యక్రమములు మొదలగునవి, పాలకవర్గ సహాయ-సహకారములతో చేయుచున్న పెక్కుసంస్థలు ఎంతగనో అభివృద్ధి చెంది, ప్రశస్తి వహించి యున్న వనుటలో అతిశయోక్తి లేదు. ముఖ్యముగ తిరుపతి-శ్రీశైలము-భద్రాద్రి-సింహాచలము-అన్నవరము మొదలగు ప్రసిద్ధిగాంచిన క్షేత్రములే గాక, ఇతర ప్రాంతములలో గూడ ఎన్నో సంస్థలు అభివృద్ధి చెందియున్నవి. ఈ క్షేత్రములలో జరిగిన అభివృద్ధి కార్యములు, ప్రయాణ సౌకర్యములు, దైవదర్శన సదుపాయములు, భక్తజనులు నివసించుటకు సమస్త సౌకర్యములుగల ధర్మసత్రములు, మంచినీటి వసతులు, భోజన వసతులు గణనీయములు.

# 17. భక్తజనంలు-కర్తవ్యము

ప్రపంచములో ఏ కాలము నందైనను, ఏ ప్రాంతములోనైనను ప్రతి కార్యమునకు ప్రజల సహకారము, వారి అండదండలు, సానుభూతి, సహాయము లేనిదే ఆ కార్యము సక్రమముగా సరియైన మార్గములో నడువజాలదనెడి విషయము నగ్నసత్యము. ప్రజల భావములను గైకొనక, ప్రజాసహకారము లేక ఏ కార్యమునైనను స్వతంత్రించి చేసిన, తాత్కాలికముగా ఏదో విజయము సాధించినట్లు కనపడినను, అది పూర్తి సాఫల్యము నొందక ఏదో ఒక లోటు గలిగి అసంతృప్తికి కారణమై, చివరకు ఏ మంచిని సాధించుటకు ప్రారంభించబడినదో, ఆ మంచి నెరవేరకపోగా, అశాంతికి కారణమగును. ప్రతి రంగములోను ప్రజలమనస్తత్త్వము తెలుసుకొని, వారి అభిమతానుసారముగ నెరవేర్చిన పనులు చిరస్థాయిగానుండి పేరుప్రతిష్ఠలు గలిగియుండును. ఎంత గొప్పవారైనను, ప్రజాభిప్రాయము తెలుసుకొనక, వారికి వ్యతిరేకముగా జరిపిన పనులు ప్రజాదరణను గోల్పోయి, అప్రతిష్ఠపాలైన విషయములు చరిత్రలవల్ల స్పష్టముగా తెలియుచున్నది.

భగవద్గీతలో భక్తులను గురించి భగవానుడు ఈ విధముగా చెప్పియుండెను. "ఆపదలో నుండి నన్ను సేవించుచున్నవారు, నన్ను తెలుసుకొనుటకు ప్రయత్నించువారు, ధనము మొదలగు కోరికలు గలిగి ప్రేమతో నన్ను పూజించువారు, ఆత్మజ్ఞానము గలిగి ప్రతిఫలాపేక్షలేక భక్తితో నన్ను నిత్యము సేవించుచున్నవారు మొదలైన వారందరు నా భక్తకోటిలోని వారే" యని సెలవిచ్చి యుండిరి. అందులో ప్రతిఫలాపేక్షలేని భక్తులు చాల అరుదు. 'ఆపదలో నున్నవారు ధనాపేక్షగలవారే ఎక్కువమంది నన్ను ప్రార్థించుచున్నారు. అయినను, ఏ విధముగా నన్ను ప్రార్థించిను నేను నా భక్తుల కోరిక

లను తీర్చి, వారిని కాపాడెద'నని భక్తకోటికి వాగ్దానము చేసి యుండిరి.

సమస్త ప్రజలు తర, తమ, వర్గ, వర్ణ భేదములు లేక నన్ను ప్రార్థించి ముక్తి బొందుటకు సమానులే యని నిర్ద్వంద్వముగా భగవంతుడు చెప్పియుండెను. "ఎవరు, ఇతరభావములు లేనివారై నన్ను గురించి చింతించుచు, ఎడతెగక ధ్యానించుచున్నారో, ఎల్లప్పుడు నా యందే నిష్ఠ గలిగి యుందురో, వారియొక్క క్షేమములను నేనే వహించుచున్నాననియు చెప్పెను."

అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

భ. గీ. 11-22

మరియు భగవంతుడైన శ్రీకృష్ణపరమాత్మ గీతలో భక్తుల వివరమును గురించి అర్జునునికి ఈ విధముగా బోధించియుండెను.

అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః.

భ. గీ. 9-30

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్,
విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే.

భ. గీ. 18-53

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః.

భ. గీ 9-26.

సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః.

భ. గీ. 18-66.

మిక్కిలి దుర్మార్గుడు గూడా నన్ను సాటిలేని భక్తితో సేవించిన సజ్జనుడుగనే పరిగణింపబడును. ఎందుచేతనన వాడు పశ్చాత్తాపముతో ఉత్తమ నిర్ణయమునకు వచ్చినవాడగుట వలన ఆ నిశ్చయము వలన వాడు కొద్దికాలముననే ధర్మాత్ముడై శాశ్వతమగు శాంతిని బొందును.

అహంకారము, బలము, దంభము, క్రోధమును, సమస్త సంగ్రహణమును బాగుగ వదలివైచు వాడు, మమకారము లేని వాడును, శాంతము గలవాడును మోక్షమును బొందుటకు సమర్థుడనియు, భక్తితో ఎవడు దళమును, పుష్పమును, ఫలమును, జలమును నాకు సమర్పించునో వాటినే ప్రేమపూర్వకముగా తీసుకొందు ననియు, అందుచే నాకు భక్తియే ముఖ్యము గాని పదార్థములు ముఖ్యములు గావనియు సమస్త ధర్మములను విడచి పెట్టి నన్నొక్కని మాత్రమే శరణు బొందిన సమస్త పాపములనుండి భక్తుని విముక్తి చేసెదననియు భక్తుడు తన మనస్సును నా కర్పించినచో నా ప్రసాదము వలన అన్ని కష్టములు దాటగలడనియు శ్రీకృష్ణ పరమాత్మ భక్తుని లక్షణములను గూర్చి వివరముగా బోధించి యుండెను.

మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్,
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః.

భ. గీ. 8-5.

నన్ను పొందిన మహాత్ముడు సర్వోత్కృష్ట మగు స్థితిని బొంది, అనిత్యమును దుఃఖభూయిష్ఠమును అగు నీ లోకమున మరల జన్మించడని అర్జునునికి భక్తిని గురించి భక్తుల లక్షణములను గురించి బోధించి యుండెను.

ప్రజలు శాశ్వతమైన పరమానందాన్ని మరచిపోయి పాంచ భౌతికమైన యీ శరీరమే తామని తలంచు చున్నారు. ఇందుకు కారణంగా అనేకబాధలు పడుతున్నాము. ఆ బాధలనుండి బయటపడి

మన నిజస్వరూపాన్ని తెలుసుకోవటమే "ముముక్షుత్వం" అంటారు. దాని పర్యవసానమే మోక్షం. మోక్షం అంటే దుఃఖనివృత్తిని చేసుకొని శాశ్వతమైన సుఖప్రాప్తి గలిగించుకొనుటయే. ఈ శాశ్వత సుఖప్రాప్తి బొందుటకు అనేకమార్గము లున్నప్పటికిని విశిష్టమైనది, సులభమైనది భక్తిమార్గం ఒక్కటే. ఈ మార్గములో తన నిజస్వరూపాన్ని తెలుసుకొన్నవారే ముముక్షువులు. ఆ విషయాన్నే ఆదిశంకరులవారు "మోక్ష కారణ సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అని చెప్పియుండిరి. మోక్షమును బొందుటకు భక్తిమార్గమే అత్యంత ముఖ్యమైయున్నది. అందుకనే నారదమహర్షి "స్వస్వరూపాను సంధానం భక్తిరి త్యభిధీయతే" అని చెప్పిరి. జీవాత్మను పరమాత్మతోచేర్చి మన ఇంద్రియాలన్నిటి ద్వారా ఇంద్రియాల కధిపతియైన పరమాత్మను సేవిస్తూ ఉండటమే భక్తి అని చెప్పియుండిరి. భాగవతోద్యమమునకు యోగ, జప, ధ్యాన, భక్తి, సేవాసాధనాలు అతి ముఖ్యములై యున్నవనియు, వీటిలో భక్తిమార్గమే అత్యంత ముఖ్యమైనదని చెప్పియుండిరి. కలియుగములో కలి దోషనివారణార్థమై సరియైన మార్గము ఏమిటని నారదమహర్షి బ్రహ్మదేవు నడుగగా_

"కలియుగములో మానవులకు హరినామస్మరణ ఒక్కటియే గతి యని సమాధాన మిచ్చిరి.

> **సర్వశ్రుతి రహస్యం గోప్యం తత్ శృణు యేన కలిసంసారం తరిష్యసి, భగవతః ఆదిపురుషస్య నారాయణస్య నామోచ్చారణమాత్రేన నిర్ధూతకలి ర్భవతి**

అని సమాధాన మిచ్చిరి. ఆ యభిప్రాయాన్నే-

> **హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలమ్,**
> **కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా.**

అని సులభముగా బోధించియుండెను. సహస్రనామములంటే అనంత

నామములని చెప్పియుండిరి. ఏ మంత్రము రాకున్నను భక్తజనులు "హరే రామ-హరే రామ" అనే తేలికపదములను భక్తితో జపించిన నిస్సంశయముగ మోక్షము బొందవచ్చునని తెలియుచున్నది. కులశేఖ రాళ్వారు ముకుందమాలలో భక్తిమార్గములలో శ్రేష్ఠమై ఆచరణీయమై అహంకారము లేని భక్తి "దాస్యభక్తి" అత్యంత ముఖ్యమని తాను ఆచరించి ఇతరులకు బోధించెను.

మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే
మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ,
త్వద్భృత్య భృత్య పరిచారకభృత్య భృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ.

భగవంతునికి భృత్యులై, వారికి భృత్యులై భగవత్సేవ చేసే పరిచార కుల భృత్యులకు భృత్యులైన వారిని స్మరించుచుందునని, అట్టి నన్ను అనుగ్రహించి కాపాడుమని భగవంతుని ప్రార్థించి తరించిన మహాను భావుడు కులశేఖరుడు.

సమస్తప్రజలు ఏ భేదములను పాటింపక భగవదాలయము లకుబోయి, భగవంతుని దర్శించి, సేవించి, కీర్తించి, తమ తమ జన్మలుసార్థకము చేసుకొని ముక్తి బొందవలయు ననెడి సంకల్పముతో భగవత్సేవ చేయుట భక్తజనుల ముఖ్యధర్మము కర్తవ్యమునైయున్నది. ప్రజలలో గల భక్తి, ఉత్సాహశక్తుల చేతనే దేవాలయములకు సంబం ధించిన సమస్తకార్యములు నిర్విఘ్నముగా జరుగుచున్న వనుటలో ఏ మాత్రము సందేహము లేదు. ప్రజలలో అట్టి శక్తి లేకున్న ఎవరెన్ని కార్యములు నిర్వహించినను, ఆకర్షవంతముగా నుండదు.

దేవాలయములలో అర్చక, పాచక, పరిచారక, పాలకవర్గము వారు, తమ పనులు తాము సక్రమముగా నిర్వర్తించునప్పుడే ఆ సంస్థలు దినదినాభివృద్ధి నొందుచుండును. వీరిలో ఏ ఒకరు తాము

నిర్వర్తించవలసిన పనులలో అశ్రద్ధ, నిరుత్సాహము, పక్షపాతము కనపరచినను లోటుగనే కనపడును. భక్తజనులు మాత్రము తాము చేయవలసిన పనులు వ్యక్తిగత స్పర్ధలు, మతాతత్వములు, వర్ణ భేదములు విస్మరించి ఐకమత్యముతో నిర్వహించినప్పుడే సమస్త దైవకార్యములు విజయవంతము లగును.

భగవదాలయములలో హరికథలు, పురాణములు, మొదలగు కార్యక్రమములు తిరుపతి - భద్రాచలము - శ్రీశైలము - అన్నవరము - మొదలగు గొప్ప క్షేత్రములలో, కొన్ని ముఖ్యమైన పెద్దపట్టణములలో ముఖ్యమైన పండుగ సమయములందు, బ్రహ్మోత్సవసమయములందు జరుపబడును.

"మద్భక్తా యత్ర గాయంతి-తత్ర తిష్ఠామి నారద"

భక్తులు, ఎక్కడ భగవంతుని గురించి గానము చేయుచున్నారో అక్కడ నేనుందునని భగవంతుడు నారదునితో చెప్పెను.

భక్తజనులు నిత్యము భగవదాలయములకు బోయి భగవంతుని సేవించి, అందలి అర్చకు లిచ్చు తీర్థప్రసాదములు భక్తితో తీసుకొనుట ధర్మమై యున్నది. గృహములలో గూడ దేవుని గది నిర్మించుకొని తమ యిష్టదైవమును విగ్రహరూపము గాని, పటమును గాని అందుంచి నిత్యము ధూప, దీప, నైవేద్యములు సమర్పించి, ఆ ప్రసాదములు స్వీకరించుట ముఖ్యమై యున్నది.

# 18. హిందూమతము—వ్యాప్తి

హిందూమతము ఉదారమతము. ఇందు అన్ని మతములకు స్థానము గలదు. దీనిని ప్రత్యేకమత మని చెప్పుటకన్న "సర్వమత సమన్వయ రూప" మనుట సత్యదూరము కాదు. వేదములు, ఉపనిషత్తులు, స్మృతులు, పురాణములు, భగవద్గీత మొదలగునవి హిందూమతమునకు పునాదులు. మానవుని పరమావధి మోక్షము. మోక్షమును బొందుటకు ఆధ్యాత్మికభావము అవసరము. ఐహిక సుఖములకన్న, ఆత్మను జయించిన శాశ్వతమైన సుఖానందముగలదని పూర్వులు విశ్వసించిరి. ధన, కనక, వస్తు వాహనములు, దార పుత్రాదులవల్ల గలుగు సుఖము తుచ్ఛ మనియు, అశాశ్వతమనియు, పరమాత్మను పొందుటకు భక్తి-కర్మ-జ్ఞాన మార్గములు ముఖ్యమనియు, జనన మరణముల నుండి ముక్తిని పొందుటయే మోక్ష మనియు, ఆ మోక్షమును పొందుటకు సర్వ భూతదయయు ప్రధానమని మన తత్త్వవేత్తల ముఖ్యోద్దేశ్యము.

హిందూమతము యొక్క ప్రాశస్త్యమును, ఆధ్యాత్మిక, వైజ్ఞానికాది విషయములను వివరించెడి గ్రంథములు పెక్కుమందికి తెలియని సంస్కృతభాషలో గలవు. ఆ భాష చదివి, గ్రహించి చెప్పగల మేధావులు తక్కువ. వాటిలోని విషయములు వారు చెపతేనేగాని ఇతరులకు తెలియవు.

ఉత్సాహవంతులైన విదేశీయులలో గ్రీకు, రోమన్, ఈజిప్ట్, చైనా, పర్షియా మొదలగు దేశముల వారు మన భారతదేశమునకు వచ్చి మనకుగల అపారవిజ్ఞానసంపదను మన మేధావులవల్ల తెలుసుకొని, అనేకవిధములుగ శ్లాఘించిరి. ఆనాటి బౌద్ధయుగములో చీనా, జపాన్, సుమత్రా, జావా మున్నగు విదేశీ విద్యార్థులు అత్యున్నతవిద్య నభ్యసించుటకై సకలవిద్యలకు పుట్టినిల్లయిన తక్షశిలకు వచ్చెడివారు.

నాగరికతలో, సంస్కృతిలో తక్షశిల విదేశాలకు మూలస్థానముగా నుండెడిది. దిగ్గంతులవంటి శాస్త్రవేత్తలు, మతాచార్యులు తక్షశిలా విద్యాలయములో అధ్యాపకులుగా నుండెడివారు.

కాలక్రమేణ సంస్కృత భాషకు ప్రాధాన్యము తగ్గి, మన గ్రంథములను మనమే చదివి అర్థము చేసుకొనుటకు శక్తి లేని వారమైనాము. మహమ్మదీయుల, పాశ్చాత్యుల పాలనలో మన విష యములో వారాసక్తి చూపకపోవుటకు కారణములున్నను, భారత స్వాతంత్ర్యానంతరము స్వదేశ పరిపాలనలో గూడ ప్రభుత్వము గాని, ప్రజలు గాని సంస్కృత భాషాభివృద్ధిలో ఆసక్తి చూపకపోవుట మిక్కిలి విచారకరమైన విషయము.

నేటికిని పెక్కుమంది విదేశీయులు మన దేశమునకు వచ్చి, మన శాస్త్రములలోని అమూల్య విషయములు, వాటి విలువలు తెలుసు కొనుట యందెంతో శ్రద్ధ చూపుచున్నారు. వారు భారతదేశమునకు వచ్చి సంస్కృతభాషను నేర్చుకొని, మన మేధావుల వద్ద సమస్త విషయములు క్షుణ్ణముగా తెలుసుకొని, వారిభాషలలో మన శాస్త్ర విషయములు, ఎన్నో గ్రంథరూపమున వ్రాసియుండిరి. కొన్నికొన్ని సందర్భములలో మన శాస్త్రవిషయములు వారు విడమరిచి చెప్పి నపుడే మనము మన విషయములను గ్రహించుచున్నాము. మనలో చాలమందికి సంస్కృతభాష బ్రాహ్మణుల భాష యనియు, మృత భాష యనియు భావముండుట అజ్ఞానమే కాగలదు. ఈ భావములు సంకుచితత్వమును కనపరచుచున్నవి. భాషాభేదము పాటింపక ఏ భాషయైనను చదివి అందులోని విజ్ఞానమును గ్రహించుట విజ్ఞుల లక్షణము.

చాలకాలము నుండి కొద్దిమంది మేధావులు మాత్రమే సంస్కృతములో గల గ్రంథములు చదివి అర్థము చేసుకొని అందలి విషయములు ఇతరులకు చెప్పుచుండిరి.

హిందూమతములో కులవ్యవస్థ, అస్పృశ్యత మొదలగునవి అనాదికాలమునుండి యున్నట్లు కనపడుట లేదు. కొందరు తమ స్వార్థముకొరకు కల్పించి యుండవచ్చునని తోచుచున్నది. పురాణములలో కొంతమంది మహర్షాదుల జన్మలు పరిశీలించిన ఈ కులవ్యవస్థ ప్రథమములో పాటింపబడనట్లు తెలియుచున్నది. శ్రీకృష్ణపరమాత్మ అర్జునునికి బోధించిన అతిపవిత్రమైన భగవద్గీత యందు వారి వారి కర్మస్వభావముల చేతనే కులములు సృష్టించినట్లు స్పష్టముగా చెప్పి భక్తిమార్గమునకే ప్రాధాన్యమిచ్చెను గాని కులమునకు ప్రాధాన్యమివ్వనట్లు దెలిపి యుండెను

తమ జన్మలచే బ్రాహ్మణకులమున జన్మించినను, పరశురామ, ద్రోణ, కృప, అశ్వత్థామలు, తమ బ్రాహ్మణ ధర్మములను త్యజించి, క్షత్రజీవికను చేపట్టి రణరంగములో ప్రవేశించి దారుణయుద్ధములను చేసియుండిరి. అర్ధరాత్రిసమయమున రాక్షసత్వముతో, చిన్నవారని కనికరము గూడా చూపక ఉపపాండవులను అశ్వత్థామ చంపి యుండెను.

భీష్ముడు క్షత్రియుడైనను, తనధర్మమును పాటించినందుననే శ్రీకృష్ణపరమాత్మదయకు పాత్రుడై మోక్షమును బొందెను. నేటికిని మనము భగవంతుని యవతారములలో అత్యంత ప్రాముఖ్యము వహించి సమస్తజనులచే పూజింప బడుచున్న శ్రీరామచంద్రమూర్తి క్షత్రియకులములోను, శ్రీకృష్ణ భగవానుడు యాదవ కులములోను జన్మించిరి. ఆదికావ్యమై నేటికిని పూజనీయమై సర్వులచే పారాయణము చేయబడుచున్న శ్రీమద్రామాయణము రచించిన మహానుభావుడు వాల్మీకి బోయకులమున జన్మించెను. గుహుడు, శబరి, పరశురాముని తల్లియైన రేణుక, గర్గమహర్షి, విశ్వామిత్రుడు, మొదలగువారే గాక ఆళ్వారులు, నాయనారులలో కొందరు కులములచే గాక గుణముల చేతనే మహనీయులై, భక్తులై, మార్గదర్శకులై మోక్షమును

పొందియుండిరి. పై ఉదాహరణములను బట్టి గుణములచేతను, స్వభావములచేతను, కుల నిర్ణయము చేసినట్లు తెలియు చున్నది.

క్రైస్తవులుగాని మహమ్మదీయులుగాని ఏ ప్రాంతమునందున్నను స్వల్పశాఖాభేదము లున్నను, మేము క్రైస్తవులము, మాది క్రైస్తవమత మనియు, మేము మహమ్మదీయులము, మాది ఇస్లామ్ (మహమ్మదీయ) మత మనియు చెప్పుకొనెదరు. హిందువులు మాత్రము ఒక కులము పేరో, మతముపేరో చెప్పు కొనెదరుగాని మేము హిందువుల మనియు, మాది హిందూ మతమనియు చెప్పరు. ఏకజాతి యనెడి భావము హిందువులలో నేటికిని లేక పోవుట గమనించవలసిన అతి ముఖ్యవిషయము. హిందువులలో గల వర్ణభేదములు, ఒకరికొకరి యందుగల ద్వేషభావములు, అనైక్యతకు దోహదము చేయుచుండుట వలన హిందూమతాభివృద్ధికి ఆటంకములు కలిగినవి.

హిందూమతాభివృద్ధికి, భారతీయ విజ్ఞానాభివృద్ధికిగల ఆటంకములకు గల కారణములు, కొందరు మేధావులు వెలిబుచ్చిన అభిప్రాయములు విశదీకరించడమైనది.

1. 1948 మే 19వ తేదిన ఆంధ్ర వారపత్రికలో శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, "వైఖానసులు-వైష్ణవు"లనెడి వ్యాసములో జన బాహుళ్యంగల బ్రాహ్మణులు, జనబాహుళ్యం తక్కువగల బ్రాహ్మణుల యెడ (అర్చకుల యెడ) ఎంతో దురహంకారముతోను, పక్షపాతముతోను ప్రవర్తించెడివారు. ఈ స్థితి మహమ్మదీయ యుగమున గల సాంఘికస్థితి కన్న చాలా ఘోరముగా నున్న దని వ్రాసిరి. నిష్పక్షపాత భావముగలిగి విశాలహృదయులు గావున వారు ఉన్నది ఉన్నట్లు వ్రాసినారు. ఈ విషయమున అంతకంటె తార్కాణము ఏమి కావలయును?

2. 1958వ సంవత్సరము, డిసెంబరునెలలో తిరువేంద్రములో జరిగిన 21వ భారతచారిత్రక మహాసభను ప్రారంభించుచు, భారత

దేశచరిత్రను, అన్ని విషయములలోను, ఎట్టి పక్షపాతభావము లేకుండా సర్వసమగ్రమైన దేశచరిత్రగా, తిరిగి వ్రాయుట చరిత్ర కారుల విధుక్తధర్మమని కేరళ రాష్ట్రగవర్నర్ బూర్గుల రామకృష్ణా రావుగారు వచించిన దానిలో అతిశయోక్తి లేదు. అది ముమ్మాటికి ప్రధాన కర్తవ్యము. చారిత్రక మహాసభ యన్న దానిలో మతాది సమస్త విషయములున్నప్పుడే దానిని చరిత్రయనుట సంభవించును.

8. 1964వ సంవత్సరము జులై నెలలో భారతరాష్ట్రపతి శ్రీరాధాకృష్ణన్ శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయములో గ్రంథాలయ భవన ప్రారంభోత్సవ మొనర్చుచు, గ్రంథాల నొకచోట చేర్చినంత మాత్రమున గ్రంథాలయము ప్రయోజనకారి గాదనియు, వానిని పూర్తిగా చదివి వినియోగించు కొనినప్పుడే వాటి ప్రయోజనము స్థిర పడగల దనియు చెప్పుచు, భారతదేశములో మతమునకు సంబంధిం చిన విజ్ఞానము, సాహిత్యము, ఎంతోగలదని చెప్పుచు, ఈ మతము లతో మనము ఏమి చేయగలిగినాము? ఎల్లరము ఒకే కుటుంబము వారని భావించుకొను చుంటిమా? ఇతరుల దుఃఖములను, మన దుఃఖములుగను, ఇతరుల సుఖములను మన సుఖములుగను భావించు కొనుచుంటిమా? ఇట్లు జరుగనంత కాలము మన మతము కేవలము బూటకము మాత్రమే కాగలదని వక్కాణించెను.

1964 జులై 12వ తేదీన ఆంధ్రప్రభ దినపత్రికలో రాష్ట్రపతి రాధాకృష్ణన్‌గారు మహాత్ములు, మహర్షులు, ఎక్కడో నూటికి ఒక్క రుందు రనియు, అట్టి వారి విషయములో జాగ్రత్తగా, దూరముగా వైదొలగి యుండవలెననియు, యజ్ఞోపవీతము, కాషాయవస్త్రములు ధరించినంత మాత్రమున 'బ్రహ్మవేత్తలు' లేదా సన్న్యాసులు కాజాల రనియు, సర్వసంగపరిత్యాగము చేయగలిగినవాడే నిజమైన సన్న్యాసి యనియు, దొంగసన్న్యాసుల యెడ ప్రజలు అప్రమత్తులై యుండి వారికి బుద్ధి చెప్పవలెననియు ఉగ్గడించెను.

1964వ సంవత్సరము, జూలై నెల 13వ తేదీన మద్రాసులో వివేకానందుని విగ్రహమును ఆవిష్కరించుచు, భారత రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్, "మానవసేవయందు నమ్మకము లేని మతము విశ్వసింపరాదు. మతములపట్ల విశ్వాసమున్నట్లు నటించుచు, మానవ సేవకే వ్యతిరేకముగా జరిగెడి, అకృత్యములను సహింపగలవారికి, మతముపట్ల విశ్వాసము గలదని యెట్లు భావించగలము? భగవంతుని నిజముగ నమ్మినవారు మానవసేవను, పరమకర్తవ్యముగ నెంచు దురు. మానవాళిని సంశయావర్తముల నుండి యుద్ధరింపవలె ననిన మతము మిక్కిలి ముఖ్యము. మతమనునది ఒకనమ్మకము మాత్రమే గాదు. అది అనుభవైకవేద్యమై నట్టిది. మానవుని పరివర్తన చెందింప గలిగినదే మతము. మతమును గూర్చి భాషింపవచ్చును, ప్రచారము చేయవచ్చును, కాని అదియంతయు పవిత్రదృష్టితో జరుపవలయును. ఏ ఒక్క సిద్ధాంతమునకు విద్య పరిమితము గాదు. ఏ మతమును తిరస్కరింపరాదు. విద్య దైవసాక్షాత్కారమును బొందుటకు సాధన మాత్రమే. ప్రతి మతమునకు యొక సందేశము గలదు. మానవుని స్వభావము మారినదా? లేదా? అనునదే ముఖ్యము. ఒకవ్యక్తికి దైవ సాక్షాత్కార మున్నదా? లేదా? అనుదానికి నిదర్శనము. నిజముగా దైవసాక్షాత్కారము పొందియున్నచో, మనిషి మారవలెను. మనిషి మారక, మనస్సును మార్చుకొనక మతమును గురించి మాట్లాడినంత మాత్రమున ప్రయోజనములేదు. అనాథల విచారము తొలగించలేని నిరాశ్రయుల కొరకు ముద్ద వేయలేని మతము, మతమేగాదని స్వామి వివేకానందులవారు చెప్పినట్లు" రాష్ట్రపతిగారు వివరించిరి.

మరియు రాష్ట్రపతి అదే సమావేశములో వివేకానందునిగూర్చి "మానవసేవయే-మాధవసేవ" యని ఎంచినవారిని నే నారాధింప గలను. విశాలదృక్పథము, సాంఘిక సేవ చాలా ముఖ్యము. మన దేశములో అనాదినుండియు మతము లున్నను దైవాజ్ఞ యను పేర

అకృత్యములు సహించియుండుట, చాలా దురదృష్టకరము. ఇంత కంటె నికృష్టమైన సంగతి వేరొకటి యుండదు. శ్రీరామకృష్ణుడు సన్యాసియైనను స్వీయమతోత్కృష్టతను నిరూపించుటకు సర్వమత ముల ననుసరించిరి. మానవులందర రొక్కటే యను సందేశమును ప్రపంచమంతటను ప్రచారము చేసిన మహనీయవ్యక్తి శ్రీరామకృష్ణ పరమహంస. ప్రాచ్యదేశముల కాధ్యాత్మిక సందేశము నందచేసి, సాంఘికసేవా వ్యవస్థ యేర్పాటు చేసి, పశ్చిమదేశములకు వేదాంత సారమును బోధించిన పూజ్యమహర్షి. వేదాన్తసారము సార్వజనీన మగుటకు ప్రాక్పశ్చిమముల మధ్య అనుసంధానశక్తిగా పనిచేసిన మహానుభావుడని వివేకానందులవారే వివరించినట్లు శ్రీరాధాకృష్ణన తన ప్రసంగమున పేర్కొని యుండిరి.

1965 ఆగష్టు 6 ఆంధ్రజ్యోతి దినపత్రిక సంపాదకీయములో అప్పటి కేంద్రవిద్యామంత్రి శ్రీ యమ్. సి. చాగ్లా సిమ్లాలో రాష్ట్రపతి నిలయములో జరిగిన "ది ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ అడ్వాన్స్డ్ స్టడీస్" అను పేరుతో ప్రారంభం కానున్న నూతన పరిశోధనా సంస్థ ఏర్పాటు సందర్భములో భారతదేశ చరిత్రను త్రిప్పి వ్రాయవలసిన అవసరమెంతైనా యున్నదనియు, గతములో మన జాతి పురోగతికి ఏ యే శక్తులు ఏర్పడినవో? ఏ వేవి పతనమునకు దారి తీసినవో? తెలుసుకొని మన పూర్వచరిత్ర రూపొందించు కొనుటకొరకు ఊహ పోహలతో స్వకల్పనలతో వ్రాసిన చరిత్రలు దేశానికి అన్ని రంగము లలో చాలా నష్టము తీసుకొని వచ్చినవనుటలో ఏ మాత్రము సందే హము లేదని చెప్పి యుండిరి.

పై సూచనలు చేసినవారు ఏనాడో చెప్పిన పురాతన వ్యక్తులు గాదు. ప్రస్తుత దేశకాల పరిస్థితులను క్షుణ్ణముగా పరిశీలించి, దేశము లోగల సకల విజ్ఞాన పురోభివృద్ధికి మానవజాతి నుద్దేశించి ఎలుగెత్తి చాటిన మహావ్యక్తులు.

విశాల భావములు గల హిందూమతము వ్యాప్తి గాకుండుటకు వర్ణవ్యవస్థ భేదములే గాక శైవ, వైష్ణవ, శాక్తేయాది మతములలో గల వైషమ్యములు గూడా చాల ప్రోత్సహించిన వనుటలో అతిశయోక్తి లేదు. ఈ మతప్రవక్తలు ఎవరికి వారే గొప్పవారని భావించి వారికి ఇష్టముగాని మతముపై విషమప్రచారములు గావించి, వారి ప్రత్యర్థులపై జరిపిన అత్యాచారములు హిందూమత ప్రతిష్ఠకే హాని గావించినవి. పై మతములకు సంబంధించిన మతాచార్యులు హిందూమత వ్యాప్తికి గావించిన ఆటంకములు చెప్ప నలవిగాదు. వీరందరు హిందూమతాభివృద్ధికి ఎన్ని ఆటంకములు కలుగ చేయవలయునో అన్నియు చేసి, తరువాత చేయవలసిన కర్తవ్యము గానక మిన్నకుండిరి. హిందూమతములో గల శైవ, వైష్ణవమతభేదములు నేటికిని కొట్టవచ్చినట్లుగా కనపడుచున్నది. శైవులలో శైవులకు, వైష్ణవులలో వైష్ణవులకు గల అంతర్భేదములు పెక్కు గలవు. వైష్ణవ సంప్రదాయములో గల తీవ్రభేదములు మరీ స్పష్టముగా గనపడు చున్నవి.

## నంబిశబ్దార్థ వివరణము

నంబి యను తమిళ పదమునకు భగవంతుడు, భక్తుడు అని యర్థము. దీనికి పూర్ణుడను సంస్కృత పదమును పర్యాయపదముగా ద్రవిడ ప్రబంధ వ్యాఖ్యాతలు వాడినారు. పూర్ణుడను శబ్దమునకు భగవంతుడని యర్థము. "పూర్ణః పూరయితా పుణ్యః" అని మహాభారతమునందు నామసహస్రాధ్యాయము పూర్ణశబ్దమును భగవద్వాచకముగా చెప్పు చున్నది.

నంబి శబ్దము భగవత్పరముగా నాళ్వారులచే (నాలాయిరము) ద్రవిడప్రబంధము నందు పలుతావుల బ్రయోగింపబడి యున్నది. "శెల్వనంబి, తిరుప్పార్కడల్‌నంబి, శంగవణ్ణ నంబి, నంబి మూర్తి పిరాన్, నారణనంబి, నడిక్కన్నానెన్నైదిర్, నమ్మై యుడైయవన్ నారా

యఱ నంబి, మైత్తునన్ నంబి మదుశూదన్ వన్దెన్నై, కణ్ణన్ కేశవన్ నంబి పిఱందమై, వణ్ణమళగియ నంబి, మంజనమాడ నీవారాయ్" ఈ మొదలగు ప్రయోగములను పెక్కింటిని దివ్యప్రబంధము లందు జూడ నగును. తమిళనాడున దివ్యదేశములందు అర్చారూపముతో వేంచేసియున్న స్వామి నంబి యను పేరుతో బిలువబడు చున్నాడు.

1. తిరుమాలిరుంజోలై యను దివ్యదేశమునందు వేంచేసి యున్న స్వామికి తిరుమాలిరుంజోలై నంబి యనిపేరు.

2. తిరుక్కురుంగుడి యను దివ్యదేశమునందలి స్వామికి తిరుక్కురుంగుడి నంబి యని నామధేయము. శ్రీమద్రామానుజులవారు ఈ స్వామిని శ్రీవైష్ణవనంబి యని స్తుతించిరి. ఈ పెరుమాళ్లు భగవద్రామానుజులకు రామానుజనంబి యను దివ్య తిరునామము ననుగ్రహించిరి.

శ్రీమద్రామానుజాచార్యుల వారికి గల పండ్రెండు తిరునామములలో నీ తిరునామము శ్రీరంగనగరీ పూర్ణులచే (తిరుక్కురుంగుడి నంబిచే) ననుగ్రహింప బడినందున సత్యోత్తమ తిరునామమై యున్నది. నంబిసన్నిధి లేక పంచనంబుల క్షేత్రము గలదు. ఈ దివ్యస్థల మందు, అర్చామూర్తులైదుగురు కలరు. సింద్రనంబి, ఇరుంద నంబి, కిడందనంబి, మలమేల్ నంబి, తిరుప్పార్ కడల్ నంబి అను పంచనంబులు వేంచేసి యున్నారు. ఈ క్షేత్రము తిరుక్కురుంగుడి క్షేత్రమునకు కొలది దూరములో నున్నది.

నాచ్చియార్ కోయిల్ అను దివ్యదేశము నందలి స్వామిపేరు నంబి లేక నంబిపెరుమాళ్ అనియు తాయార్లకు నంబిగై నాంచారు అనియు నామధేయములు.

అన్బిల్ అను దివ్యస్థల మందున్న పెరుమాళ్లకు "తిరువడి వళగియ నంబి" యనిపేరు. శ్రీరంగక్షేత్రము నందు వేంచేసియున్న

శ్రీరంగనాయకస్వామికి "నంబెరుమాళ్" అని ద్రవిడ దివ్య తిరు నామము.

ఇట్లనేక క్షేత్రములందు నంబిసంజ్ఞ గల భగవదర్చావతార మూర్తులు గలరు. విష్ణుభక్తులగు ఆళ్వారులలోను ఆచార్యులలోను నంబి సంజ్ఞ కలవా రనేకులు గలరు.

ఆళ్వారులలో నంబిసంజ్ఞ గల ప్రముఖులలో నమ్మాళ్వారు ముఖ్యులు. వీరికి కురుకూర్ నంబి, నంబిగళనాదర్ అను ద్రవిడ తిరునామములు గలవు. వీరు కురుకూర్ అను గ్రామమునందు వేం చేసి యుండువారు గనుక ఆ గ్రామనామముతో కలిపి కురుకూర్ నంబి యను నామ మేర్పడెను. కురుకూర్ + నంబి = కురుకూర్ నంబి. వీ రాళ్వారులలో నతిముఖ్యులు ప్రపన్నజనకూటస్థులు, దివ్య ప్రబంధ చతుష్టయకర్తలు. వీరికి పరాంకుశముని, శఠారి మున్నగునవి సంస్కృతనామధేయములు. పెరియాళ్వార్ (పెరియ = పెద్ద) పెద్ద ఆళ్వారని ప్రఖ్యాతి గడించిన వారు. వీరు గోదాదేవి (ఆండాళ్) జనకులు. వీరికి విట్టుశిత్త నంబి యని మరియొక తమిళతిరునామము గలదు. (విట్టుచిత్త-విష్ణుచిత్త) విష్ణుచిత్తులని వీరికి సంస్కృతనామము.

## ఆచార్యులలో నంబి సంజ్ఞ గల ప్రముఖులు

1. వంగిపురత్తునంబి = వీరు శ్రీమన్నాథమునులకు మామగారు. వంగి పురత్తు + నంబి = వంగిపురత్తునంబి, వంగిపురత్తు గ్రామ నివాసులు.

2. మణక్కాల్ నంబి = మణక్కాల్ + నంబి = మణక్కాల్ నంబి. మణక్కాల్ గ్రామ వాస్తవ్యులు. ఆళవందారులకు గురువులు. వీరికి శ్రీరామమిశ్రులని సంస్కృతనామము.

శ్రీయామునాచార్యులవారి శిష్యులు పంచనంబులు. ఈ పంచ నంబుల శిష్యరత్నమే భగవద్రామానుజాచార్యులవారు.

పంచనంబులు

1. తిరుక్కచ్చినంబి =(కాంచీపూర్ణుడు)
2. పెరియనంబి =(మహాపూర్ణుడు)
3. తిరుమలనంబి =(శ్రీశైలపూర్ణుడు)
4. తిరుక్కోట్టియూర్ నంబి =(గోష్ఠిపూర్ణుడు)
5. మారనేర్ నంబి

ఇట్లు శ్రీరామానుజులు గురువులు వారి పరమగురువులు నంబి నంజ్ఞ కలవారగుటయే గాక, శ్రీరామానుజ శిష్యప్రశిష్యులలో నంబి నంజ్ఞగలవారు పలువురు గలరు.

వడుగ నంబి (ఆంధ్రపూర్ణుడు), శెల్వ నంబి (సంపత్పూర్ణుడు), వంగిపురత్తు నంబి, తొండనూర్ నంబి, పుళక్కరిశె నంబి, శొట్టైనంబి, పిళ్లతిరుమలై నంబి, ఉత్తమ నంబి, కుఱువై నంబి, మరుధూర్నంబి, మళపూర్ నంబి, తిరుక్కురుంగుడి నంబి, ముడుంబై నంబి, పరాంకుశ నంబి, పెరియకోయిల్ నంబి, నంబి కురుందేవర్, నంబియూరిల్ శ్రీరంగరాజభట్టర్, నంబి తిరువళిధినాడదాసర్ ఈ మొదలగు మహానుభావు లింకెందరో గలరు.

శివభక్తులగు నాయనార్లలో నంబి సంజ్ఞగల వారిలో ముఖ్యులు చిఱుతొండ నంబి (వీరినే సిరియాళ నంబి యని యందురు), ఒడయ నంబి_వీరికి సుందరనాయనార్, నంబినాయనార్ అనునవి నామాంతరములు. కడమల నంబి, సుందరనంబి, నంబియార్ నంబి మొదలగు శివభక్తు లెందరో గలరు.

"అవడయార్ కోవిల్" అను శివక్షేత్రము నందు అర్చకులు నంబియార్లు. నంబియార్ బిరుదును ధరించువారు కొందరు గలరు. ఇందు వలన "నంబియార్లు" అను నొకశాఖ యున్నట్లు దెలియు చున్నది. (చూ. యాత్రామార్గదర్శి, పే. 255-57)

రామేశ్వర పరిసరములలో దర్శింప దగిన క్షేత్రములలో "నంబి నాయకి అమ్మన్" అను క్షేత్ర మొకటి గలదు. ఈ క్షేత్రము రామేశ్వరమునకు దక్షిణముగా రెండుమైళ్ల దూరములో గలదు. ఆ పేరుగల దేవత ఒక గ్రామమును రక్షించెననియు, అందువలన ఆ గ్రామము ఆ దేవతపేరుతో పిలువబడుచున్న దనియు చెప్పెదరు. శ్రీకల్యాణానంద భారతీస్వాముల వారు 'ప్రజావైచిత్ర్య' మను గ్రంథమునందు నంబుల మనియు, ఆరామ ద్రావిడుల మనియు జెప్పుకొనుచుండు స్మార్త బ్రాహ్మణులను గూర్చి ఇట్లు వ్రాసిరి.

"ఉత్తర సర్కారుల యందుండెడి ద్రావిడులు నాలుగు జాతులలో ననగా, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతులలో నొప్పుచున్నారనియు, నందు బేసూరి ద్రావిడులు బ్రాహ్మణు లనియు, దివిలె ద్రావిడులు క్షత్రియు లనియు, నారాము ద్రావిడులు వైశ్యు లనియు, ఇక నాలుగవ వారన్ననో పై ముప్వురి వలె నెట్టి యుప నామముల తోడను దెలియబడక తాము ఆరామద్రావిడులకు సన్నిహితుల మని యెట్టి సంబంధము లేకపోయినను జెప్పుకొనుచుండు "పుట్టు నంబులు" అను తరగతివారలు. ఇట్టి నంబులను గూర్చియే "కృతేఽపి సోమయాగే తు నంబిత్వం నైవ ముచ్యతే"(నంబిత్వం తు న ముచ్యతి అని కొందరు) అను హాస్యోక్తి గలదు. సోమయజ్ఞమును జేసినను నంబితనము వదలిపోలేదని పరిహాసము. ఇందుకు తార్కాణముగా గంజాం జిల్లాయందు నొక నంబి వానిచే వేదుల కన్నమ చయనులను మహాజ్ఞ చిత్తు యొక సోమయాగమును చేయించి, యద్దాని నుండి హతడు కొంచెము అనాదరము సాటివారివలన బొందినటులను విదితమైన విషయము. కన్నమచయనులు నంబివాని నెట్టి వానినిగ బరిగణించి యగ్న్యాధానము జేయించెనో తెలియదు గాని యందొక ధర్మసూక్ష్మము మాత్రము గలదు. (వసంతే బ్రాహ్మణోఽగ్ని మాదధీత, గ్రీష్మే రాజన్యః, శరది వైశ్యః, వర్షాసు రథకారః)

అని బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్యులకన్న భిన్నముగ రథకారు డనువాడు అగ్న్యాధానమునకు నధికారిగ విన వచ్చుచున్నాడు.

అటులనే అగ్న్యాధాన మంత్రములయందు, వర్ణభేదముచే నా యా మంత్రవ్యవస్థ వినబడుచున్నది. కాగా పై కన్నమచయనులు, అనకాపల్లి వేదులవారిలో నఖండ ప్రజ్ఞావైభవము గల మహాజ్ఞి చిత్తు; అట్టి వాడొ కనంబివారిచే నొక క్రతువు చేయించెనన, శ్రౌత ధర్మసూక్ష్మములను గుర్తెరుంగజాలని శ్రౌతులకును, శ్రౌత కర్మల నత్యంతము దెలియని పండితులకును వింతగను నపహాసముగను దోచిన దోపవచ్చును గాని యంత మాత్రమున గన్నమచయనుల కొక లోపమెంత మాత్రము గలుగదు.

"శ్రీ ఇజ్జత్సార్ కందుకూరి బాలసూర్య ప్రసాద్ భూపాలుడు, జమిందార్ ఆఫ్ దేవిడి". వీరు తమ ఆంధ్రవిజ్ఞానమునందు, ఆంధ్రబ్రాహ్మణ భేదములను వ్రాయుచు నంబులను గురించి ఈ విధముగా వ్రాసిరి-

**నంబులు:** వీరిది స్మార్తబ్రాహ్మణశాఖ. ఆరామద్రావిడులమని జెప్పుదురు గాని ఆరామద్రావిడుల మని జెప్పుకొను వేరొక శాఖ వారితో వీరికి సంబంధము లేదు. పెక్కండ్రు పౌరోహిత్యము వృత్తిగా గలవారు, జ్యోతిషశాస్త్రము నందారిదేరిన విద్వాంసులు వీరి యందు గలరు. వైద్యులును అచ్చటచ్చట గాన నగుదురు.

**ఆరామద్రావిడులు:** వీరిలో కొంద రాంధ్రదేశమునకుం జేరియు నారామద్రావిడు లను పేరుననే బరగుచున్నారు. కాని అయ్యర్ బిరుదనామము వాడుట లేదు. స్మార్తశాఖకు, గురుక్కల్ శాఖకు జెందిన నంబులు ఆంధ్రదేశమున నివాసమున కుదిరి వారు తాము ను ఆరామద్రావిడశాఖయే యందురు.

**నంబిశాఖ ద్రావిడులు:** ఆంధ్రదేశమునకు గొంద రేతెంచి, తాము ఆరామద్రావిడుల మనియు, నంబుల మనియు వాడుకొను చున్నారు. కన్నడదేశమునందు గూడ నివాస మేర్పరచుకొనిన వారు కలరు. నంబియార్ బిరుదము వీరిది కాదు.

శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు ది. 14-4-1948 ఆంధ్రవార పత్రికలో బ్రాహ్మణ శాఖలు అను శీర్షిక క్రింద నీ దిగువ విధముగా వ్రాసి యున్నారు.

తూర్పున పుట్టనంబులు అంటూ గంజాం ప్రాంతములో ఒక శాఖ వుందనిన్నీ, వారు చెప్పుకోవడం ఆరామద్రావిళ్లుగా చెప్పు కుంటారు. గాని ఆరామద్రావిళ్లు కాదనిన్నీ మా శాఖీయులు చెప్పగా విన్నాను. ఎంతవరకు సత్యమో గాని వీరిలోగూడా మంచి విద్వాంసు లున్నారు. వెలనాటివారో లేక పేరూరిద్రావిళ్లో వీరి కన్యను వివాహము చేసుకున్నారని విన్నాను. కాని ఆ వివాహము సంస్కర్తలకు సంబంధించింది (పునర్వివాహము) కావడంచేత తావన్మాత్రం వల్ల ఆ శాఖకి, ఈ శాఖకి బాంధవ్యం నిరాఘాటు మనడానికి వీలు కాదు. పుట్టనంబులకు, మా ఆరామద్రావిడానికి బాంధవ్యం లేకపోయిందనే ప్రసక్తిలో ఇతరవిషయం నడచింది. ఆ యా నంబులు గూడా ఆంధ్ర బ్రాహ్మణ జాతీయులే .... ....

....ఇందువలన గంజాంజిల్లా ప్రాంతము లందు నంబు లని వ్యవహరింపబడుచున్న స్మార్తబ్రాహ్మణశాఖ యొకటి కలదని దెలియ దగియున్నది.

నంబి శబ్దమును గురించి—

శ్రీపాంచరాత్రాగమదీక్షితాశ్చ యే
యే ద్రావిడామ్నాయరహస్యవేదినః,
యే వాసుదేవార్పితచిత్తవృత్తయః
తే నంబిసంజ్ఞా స్యురుపేంద్రదాసకాః.

అను ఆర్యోక్తి ననుసరించి ఎవరు పాంచరాత్రాగమము నందు చెప్ప బడిన విధమున తప్తచక్రాంకనరూపమగు దీక్ష గల వారో! ఎవరు ద్రవిడ వేదము నందలి రహస్యము నెరిగిన వారో! ఎవరు వాసు దేవార్పణము చేయబడిన మనోవ్యాపారము గలిగిన వారో! ఎవరు శ్రీమహావిష్ణువునకు దాసభూతులో వారు నంబి సంజ్ఞ గలవారని తెలియుచున్నది.

ఇట్లు విష్ణుభక్తులు, శివభక్తులు, నంబి శబ్దముతో వ్యవహరింప బడుచుండగా, ముఖ్యముగా శ్రీరామానుజీయ వైష్ణవులలో కొందరు, నంబి శబ్దముగల భగవద్భక్తులను, ఆచార్య ప్రముఖులను విస్మరించి, ఈ నంబిశబ్దముతో తమకు ఏ విధమైన సంబంధము లేదనుట, ఈ శబ్దము యితరులకు అంటుగట్టుట చింతనీయము. ఆ శబ్దమునకు విష్ణు పూజకుడని అర్థము చెప్పినను, విష్ణుభక్తుడని యర్థము చెప్పినను వీరు గూడ విష్ణుపూజకులు, విష్ణుభక్తు లగుట వలన శ్రీవైష్ణవులు నంబులు గాక తప్పదు.

ఈ తీరున తమిళులగు వైష్ణవ భక్త మహాశయులు, శైవభక్త శిరోమణులును, భగవన్నామంబగుట చేసి పరమపవిత్రమైన, "నంబి" శబ్దమును తమకు స్వనామముగను, బిరుద నామముగను ధరించి యున్నారు. నంబి శబ్దము, పరమోత్కృష్టార్థము గలదని, నుడువుట కింతకంటె వేఱు ప్రమాణ మేమి కావలయును?

## తంబళశబ్ద వివరణము

తంబళ శబ్దము తంబి శబ్దము నుండి పుట్టి యుండవచ్చును. తంబి శబ్దము తమిళ భాషాపదమనియు, దాని రూపాంతరము తంబ యనియు, దీనికి అర్థము తమ్ముడనియు, తెలుగు నిఘంటుకారులు వ్రాసియున్నారు. తంబి అను తమిళశబ్దము, వర్ణలోప, వర్ణాగమ, వర్ణ వ్యత్యయములతో "తంబల, తంబళ, తమ్మల, తమ్మళ" అను రూపములు పొంది యుండవచ్చును.

సూర్యరాయాంధ్ర నిఘంటువు, మొదలగు నిఘంటువుల యందీ పదమును దేశ్య మన్నారు గాని ఏ దేశ్యమైనది వివరించ లేదు. శివార్చన చేసి బ్రతికెడు జాతి యని యర్థము వ్రాసినారు. 'సకలార్థసాగరము' అనెడి పుస్తకములో పుట 226-227లో దూదుగాం, జగనంపల్లె మొదలగు స్థలములలో తంబళ జాతి వారు, పాలు, పెరుగు-పుష్పములు విక్రయించెదరు. మేళములను, వాయించెదరని వ్రాసి యుండెను. పై ఉదాహరణలను బట్టి ఇది ఒక జాతిని దెలుపు పదమని తెలియుచున్నది. తెలుగు నిఘంటువుల కన్న ఆంగ్లేయ పండితుడైనను, తెలుగుభాష నభ్యసించి కీర్తి గాంచిన "బ్రౌణ్యదొర" తాను వ్రాసిన నిఘంటువులో తంబళ పదమును గూర్చి ఎంతో వివరముగా వ్రాసినందులకు మిక్కిలి కొనియాడవలసి యున్నది.

"A class of beggars, who worship Siva and who beat a drum. A secular priest, a sacristan. These men are generally "Sudras" but wear the sacred thread. They sometimes perform conjuring tricks. They are similar tc Eddas(ఎడ్డెవాళ్లు)who worship Sakti or Venus

వీరు యాచకులలో ఒక తెగ. శివుని ఆరాధింతురు. డోలు మొదలగు వాద్యములు ప్రయోగించుదురు. ఏ మతమునకు చెందని లౌకికపూజారి. ఆ దేవతకు పూజచేయుచు, పవిత్రపాత్రలు, భూషణములు మొదలగునవి జాగ్రత్త చేయుచుందురు. వీరు సాధారణముగా, శూద్రకులమునకు చెందినవారై యుందురు. కాని యజ్ఞోపవీతమును (జంధ్యమును) ధరింతురు. వీరు అప్పుడప్పుడు గారడీ విద్యలను ప్రదర్శించుచుందురు. వీరు ఎడ్డెకులస్థుల మాదిరిగ వ్యవహరించుచుందురు. వారి వలె శక్తిని గాని ప్రేమదేవత (వీనస్-రతీదేవి)ను పూజింతురు.

"తంబళులు" ప్రత్యేక జాతి వారై యున్నట్లు పై నుదాహరించిన వాటిని బట్టి తెలియుచుండగా, శివార్చన చేయు బ్రాహ్మణులను (బోధాయనసూత్రీయులను) తంబళులని, వ్యవహరించుట పొర

పాటే గాక, పక్షపాత-అసూయలతో గూడుకొని యున్నదనుటలో అతిశయోక్తి లేదు. సమస్త జాతులలో శివుని పూజించువారు గలరు గదా !

## అస్పృశ్యత

అస్పృశ్యత అనే తీవ్రవ్యాధి ఏ కాలములో, ఏ మహనీయుడు ప్రవేశ పెట్టినాడో గాని, నేటివరకు, మన భారతదేశములో ఎందరో మహనీయులు, మతకర్తలు, సంఘసంస్కర్తలు అనేక త్యాగములు చేసి, అష్టకష్టములకోర్చి, అస్పృశ్యతానివారణకు, హరిజనోద్ధరణకు, తీవ్రముగా కృషిచేసి యుండిరి. భారతస్వాతంత్ర్యానంతరము గూడ ఏదో ప్రగతి సాధించామని గొప్పలు చెప్పుకొని తృప్తిపడినను అధోగతిలోనే యున్నాము. ప్రస్తుత పరిస్థితులలో గూడా ఈ అస్పృశ్యతా రుగ్మత పెచ్చుపెరిగి ప్రబలుచున్నదే గాని నివారణోపాయములకు మార్గములు గనబడుట లేదు.

అస్పృశ్యులుగా పరిగణింపబడే ఈ హరిజనులెవరు? వీరిని అస్పృశ్యులుగా ఏ కాలము నుండి ఎందుకు చూచుట తటస్థించినది? వీరిని తాకినంత మాత్రముననే వచ్చే చెడు ఏమిటి? వీరిని ఊరికి వెలుపల ఎందుకు ప్రత్యేక ప్రదేశమునం దుంచవలెను? మొదలగు సందేహములకు ఏవో వారు ఆచరించుచున్న ఆచార పద్ధతులనియు, అనాదిగా వచ్చుచున్న సంప్రదాయములనియు చెప్పెదరు గాని, సూటిగా సరియైన సమాధానము చెప్పరు. ఈ హరిజనులనే వారు, అనాది నుండియు, హిందువులపేర్లు గలిగి హిందువులచే ఆచరింపబడుచున్న పండుగలు జరుపుకొనుచు, హిందువుల సంప్రదాయములనే అనుసరించు చుండిరి.

హిందువులలో అగ్రవర్ణములవారు, వీరిని తిరస్కరించి, బహిష్కరించి, హేయముగాను నీచముగాను చూచుటయు, వీరిచే వారికి

కావలసిన పనులు చేయించుకొనుటయు, న్యూనముగా చూచుచుండు టను బట్టియే, వీరు తమను అన్నివిధాలా ఆదరించి ఆప్యాయతతో చూచుటను బట్టి, క్రైస్తవులైరి. మహమ్మదీయయుగములో గూడా పై కులములచే బహిష్కరింపబడిన కొంతమందిహిందువులు, మహమ్మదీయులుగా మారియుండిరి.

హిందూమతములో గల విశాల భావములు, వీరికి చక్కగా అర్థమయ్యే రీతిలో చెప్పి, ఆదరించి, మనవారిని చేసుకొనుటకు ఎంత మంది కృషిచేసినా రనెడి విషయము ఆత్మపరిశీలన చేసుకొనవలసి యున్నది. వీరినేగాదు హిందూమతములోని ఛాందసదృష్టిగల పెద్దలు ఏ కొంచెమైనను మత సంప్రదాయ విరుద్ధముగా ప్రవర్తించెడి వారిని వెలివేయుట, బహిష్కరించుట వలన వీరికి తగిన ఆశ్రయము లేనందున ఇతర మతములవా రాశ్రయమిచ్చుట పరిపాటియైనది.

హిందూమతము గాదు, హిందూ సంప్రదాయము గాదు, హిందూపద్ధతులకు ప్రతి స్వల్పవిషయములోను చాల తీవ్ర వ్యతిరేక భేద భావములు గలిగి, హిందూ దేవాలయములను ధ్వంసము చేసి, హిందువులను నానాబాధలకు గురి చేసి అనేక విధములుగ కొన్ని శతాబ్దములుగ అవమానములు, అత్యాచారములు గావించిన మహమ్మదీయులను, మన సరసకు దీసుకొని ఆశ్రయ మిచ్చి. మన యిళ్లలో ప్రవేశింప చేసికొని, సంఘములో వారికి ప్రత్యేక హక్కు లిచ్చి, మన సహోదరులుగా చూచుకొను చున్నాము గదా! ఇంత విశాల హృదయము గల హిందువులు మన మతమునే అనుసరించుచు, హిందువులలో నొక తెగవారైన హరిజనులను హీనము గాను, నీచము గాను, చూచి ప్రవర్తించుట సంకుచితతత్త్వముతో గూడినదై యున్న దనుటలో అతిశయోక్తి లేదు. విశాలభావము గల హిందూ మతమునకే కళంకము గలిగించు చున్నారనుట సత్యదూరము గాదు.

ముఖ్యముగా హరిజనులు తమ పేర్ల చివర దాసులు అనే పేరు పెట్టుకొని మన దేవుని ప్రార్థించుచు, పుండ్రములు (బొట్టు) ధరించి మన సంప్రదాయములే అనుసరించు చున్న వారు పెక్కు మంది గలరు. ఈ పరిస్థితులు గూడ గమనించక నేటికిని హరిజనులను దరిజేరనీయక వారిని తక్కువగా చూచుట న్యాయము గాదు. ధర్మము గాదు. పూర్వాచార్యులలో శ్రీమద్రామానుజాచార్య లాదిగా గల మహనీయులు, జాతిపిత మహాత్మాగాంధి మొదలగు విశాల భావములు గలిగిన పెక్కుమంది అస్పృశ్యతానివారణ కొరకు హరిజనోద్ధరణ కొరకు గావించిన యత్నములు వెనుకటి ప్రకరణములలో తెలుసుకొని యుంటిమి.

ప్రస్తుతకాలములో జరుగుచున్న నూతన పరిణామములు సంఘ పరిస్థితులు గూడ గమనించక మతశక్తులకు తోడు రాజకీయ పక్షముల వారు గూడ వారి స్వప్రయోజనము స్వలాభము పదవీకాంక్షలతో, ప్రజాశ్రేయస్సును మరచి, హరిజనులు, గిరిజనులు, వెనుకబడ్డ తరగతులు, దళితవర్గము లని విభజించి వారి నుద్ధరించెద మనే శుష్క నినాదాలతో శూన్యహస్తాలతో వర్గవైషమ్యములు పెంచుచున్నారే గాని నిర్మూలము చేయుటకు తగినంత కృషి సల్పలేదనుట నగ్న సత్యము. "స్వాతంత్ర్యానంతరము గూడ మన పాలకులు మతప్రమేయము లేని లౌకిక సోషలిజ భావములు గల సర్వమానవ సౌభ్రాతృత్వముతో గూడిన రాజ్యాంగమునే రచించిరి. గాని ఆచరణములో మాత్రము వాటికి వ్యతిరేకముగా నుండి ఆ ఆశయములే చాలవరకు మృగ్యమైనట్టుల గనపడుచున్నది. రాజకీయములకు, పదవులకు ప్రాముఖ్యమిచ్చి ప్రవర్తించెడి నేటి నాయకులు, వారిలో వారికి గల వైషమ్యములు భేదములు చాలవేమో యన్నట్లు మరీ భేదములు కల్పించినందున ఆ భేదములు విస్తృతముగా వికారరూపములు ధరించి అనైక్యతకు మరీ ఎక్కువగా దారితీసిన వనుటలో సందేహము లేదు.

కొన్ని సందర్భములలో మానవతయే లోపించి నటుల స్పష్టముగా గోచరించుచున్నది. ఉద్యోగ, ఆర్థిక ఇతర విషయములలో కులముల పేర్లు వ్రాయుట కులములకు ప్రాముఖ్యమిచ్చినట్లే గదా? మహమ్మదీయులకు, క్రైస్తవులకు, సిక్కులకు ప్రత్యేకరక్షణ సదుపాయములు గల్పించి, ఒక్క హిందువులలోనే వర్ణవ్యవస్థనే ఆంక్షలు బెట్టుట పక్షపాతముతో గూడినదై యున్నది.

నేటికిని హిందూ శబ్దములో ఏమి దోషమున్నదో గాని కొంత మంది స్వార్థ పక్షపాత భావములు గలిగిన రాజకీయవేత్తలు తమ స్వప్రయోజనము కొరకు హిందూపదముమీద ద్వేషభావము గలిగి ఆ పదమే పనికిరాదని చెప్పుట చింతించవలసి యున్నది

1979 ఆగష్టునెలలో ఒక తెలుగు దినపత్రికలో మాజీ భారత ప్రధాని శ్రీమొరార్జీదేశాయి "హిందీ రాష్ట్రమని గాని, భారతరాష్ట్రమని గాని చెప్పుటయే సమంజస మనియు, హిందూరాష్ట్రమునకు తాను పూర్తిగా వ్యతిరేకినని చెప్పుట విశాలభావమని వారు తలచినను హిందూదేశ మని. హిందూ మహాసముద్రమని పిలుచుట గూడ సంకుచిత భావముగనే యున్నది గదా! భారతీయులము, భారతీయ తత్త్వము అనే విశాల భావములు, ఉపన్యాసములలోను, పత్రికలలో మాత్రమే కనపడుచున్నవే గాని, ఆ విశాల భావములు ప్రజలలో వ్యాప్తిచేసిన మహనీయులు మాత్రము కొద్దిమంది మాత్రమే.

ఒకప్పుడు మన ఐక్యతకు భారతీయ సంస్కృత్యభివృద్ధికి మతాభివృద్ధికి నిరోధకులుగా పరిగణింప బడిన మహమ్మదీయుల, తరువాత కాలములో ఆంగ్లేయుల పరిపాలనయే ముఖ్యకారణ మనియు అందువలననే మన మతాభివృద్ధికి ఆటంకములు గలిగిన వని ప్రజలను ఒప్పించినను మనము, మూడుదశాబ్దములకు పైగా జరిగినను, నేటికిని అన్ని రంగములలోను మన పాలకులు గావించిన అభివృద్ధి కార్యములు ఐక్యతకు గావించిన ప్రయత్నములు పూర్తిగా

ఫలించలేదనియే చెప్పవచ్చును. కాలము గడచిన కొలది ప్రజలలో నిరుత్సాహము, అశాంతి, పేదరికము, అనైక్యత, ఈర్ష్యాద్వేషములు మొదలగునవి పెరుగుచున్నవే గాని వాటి నివారణోపాయమునకు తగిన మార్గములు చేపట్టు లేకపోవుట మిక్కిలి చింతించ వలసి యున్నది. "యథా రాజా - తథా ప్రజా" అన్నట్లు న్యాయముగా పరిపాలించి సమస్తప్రజలకు సదుపాయములు కల్పించి ప్రజలకు మేలు చేయవలసిన ప్రభుత్వ పక్షములో నుండెడివారు ప్రజాక్షేమము లను విస్మరించక స్వప్రయోజన పరులు కానప్పుడు దేశ జాతి పురోభి వృద్ధికి ఎంతయో ఉపకారము అగును. నాయకులు దేశ, జాతి, శ్రేయస్సును మనస్సు నందుంచుకొని స్వార్థరహితముగ ప్రతివారికిని తర తమభేదము లేక ఆర్థికముగను సమస్త విషయములలోను సహాయ పడినప్పుడే దేశము సుఖశాంతులు గలిగి యుండును.

చరిత్రలు వ్రాయుట, వారు ఆచరించక, ఇతరులను ఆచరింప మని చెప్పే మతబోధకులు, కేవలము మన పూర్వుల గొప్పలు చెప్పుకొని మెప్పులు పొందుట కొఱకు గాదని తెలుసుకొనవలసి యున్నది. చరిత్రల ద్వారా ప్రతి జాతి గతచరిత్ర నాధారముగా చేసుకొని, జాత్యౌన్నత్యమును, గుణవిశేషమును, దాని లోపాలను, దౌర్బల్యాలను గ్రహించి భవిష్యత్తులో తమ పురోగతిని తీర్చి దిద్దుకొని మంచిని అనుభవించినప్పుడే దేశము, జాతి, మనమతము పురోభివృద్ధిని బొందును. సత్యమును మరుగుపరచి, భారత జాతిని సంస్కృతిని మతమును నిందలపాలు చేయుచు, అసూయా పరులైన కొందరు విదేశీయులు వ్రాసిన చరిత్రల కంటె స్వార్థపరులైన మన దేశీయులు గూడ సత్యము విడచి పక్షపాతబుద్ధితో తమ జాతి, కులము, మతము యొక్క ఔన్నత్యము నతిశయోక్తులతో వర్ణించి తమకు గిట్టని జాతి వారు ఎంతగొప్పవారైనను, విజ్ఞానవంతులైనను నిందించుచు వ్రాసిన చరిత్రలు, మన హిందూ జాతికి, మతమునకు, సంస్కృతికి తీరని

నష్టము ద్రోహము కలుగచేసిన వనుటలో సందేహము లేదు. మన మహాత్ముల పేర్లు చెప్పి వారల జయంతి వర్ధంతిసభలు బాహాటముగా జరుపుచు, వారి ఆత్మలు క్షోభించకుండ వారి సమాధుల మీద పుష్పగుచ్ఛములుంచి, ఏదో ఘనమైన పనినినిర్వర్తించామని సంతృప్తి పడుచుండుట సర్వసామాన్య లక్షణముగా నున్నది. మహర్షులు, మహనీయులు తెల్పిన పద్ధతులు కొన్నింటినైన త్రికరణశుద్ధిగా ఆచరించినప్పుడే వారి బోధనలలోగల విలువలు అందరూ తెలుసుకొనగలరు. అప్పుడే వారి ఆత్మలకు శాంతి గలుగును.

అనేక వేల సంవత్సరముల నుండి యెంతయో గొప్పతనము నార్జించిన భారతజాతి, పలు జాతులను, సంస్కృతులను తనలో లీనము చేసుకొని ప్రపంచములోని అతిప్రాచీన జాతులలో మణి పూసగా వెలిగినది. అట్టి జాతికి సర్వాంగ సుందరమై, ప్రామాణికమై అందరికి నందుబాటులో నుండ దగిన సరియైన చరిత్ర లేకపోవుట లోపమని చెప్పక తప్పదు. ఇప్పటి కైనను దేశము నందలి చరిత్ర కారులు ప్రజ లందరికి నందుబాటులో నుండి సమస్త ప్రజలు తెలుసుకొనే రీతిగ సమగ్ర చరిత్ర అంద చేయవలసి యున్నది.

హిందూ మఠాధిపతులు, మతాచార్యులు కాలప్రవాహమున కెదురీదక, శాస్త్రములలోని సత్యవిషయముల గప్పి పుచ్చక, భగవంతుని దృష్టిలో అందరూ సమానులేయని గ్రహించి అహంకార సంకుచిత భావములు, స్వార్థపరత్వము వదలి చిత్తశుద్ధి గలవారై ప్రజలకు మన మతములో గల అమూల్య విశాల భావములు ప్రచారము చెసి, బోధించి భారతదేశ ఔన్నత్యమును ప్రపంచమంతటను చాటుటయే ప్రథమ కర్తవ్యమైయున్నదని గ్రహించుట అత్యంత ముఖ్యమై ఉన్నది. వీరు రాజకీయములకు దూరముగానుండి ప్రజాశ్రేయస్సును మాత్రమే మనస్సుల యందుంచుకొని ఐక్యతగా ఒక చోటికిచేరి, మన మతమునకు సంపూర్ణ భావములు గలుగచేసి మిషనరీలు (సంఘములు) గా

ఏర్పడి ప్రతి గ్రామమునకు బోయి హిందూమత విశిష్టతను ప్రచారము చేయవలసి యున్నది.

గొప్ప పట్టణములలోను ఆర్థికస్తోమతు గలిగిన సంస్థల వారు, వీరిని ఘనముగా సన్మానము చేసిన సభలలోను, వీరు మతమును గురించి భగవద్గీత మొదలైన వాటిని గురించి గంభీరోపన్యాసము లిచ్చి నంత మాత్రమున వీరి కర్తవ్యము నెరవేరి నట్లు భావించ గూడదు.

ఇతర మత ప్రచార సంస్థలు చేయు చున్న కార్యక్రమముల విధానములు గమనించి మన ప్రయత్నములు సాగుట చాల మంచిది.

మంచి విషయములు, నియమములు, పద్ధతులు, ఏ మతములో నున్నను, ఏ భేదములు లేకుండా పాటించుట ప్రతివారి ముఖ్య ధర్మము.

దేశములో భక్తి, మత తత్త్వములు విరివిగా ప్రచారము గావించవలసిన తరుణమాసన్నమై యున్నదని గ్రహించి, మతాధిపతులు మతాచార్యులు వారి వారి భేదభావములు విస్మరించి హిందూమత ఔన్నత్యము, భారతజాతి పురోభివృద్ధికి పాటుపడ గలరని విశ్వసింపవచ్చును.

# 19. మహమ్మదీయ మతము

ఈ మతము మహమ్మద్ అనువారిచే స్థాపింపబడినది. వీరు క్రీస్తుపుట్టిన 576వ సంవత్సరము ఆగష్టునెల 29వ తేదిన సోమవారము ఖురైష్ గోత్రమువాడును, హాషిం కుటుంబపు వాడైన అబ్దుల్లా అను నతనికి అమీనా అను భార్యయందు మక్కాలో జన్మించెను. అబ్దుల్లా తన భార్య గర్భవతిగా నున్నప్పుడే చనిపోయెను. తల్లియైన అమీనా గూడ మహమ్మద్ పుట్టిన నాలుగవ సంవత్సరమున గతించెను. మహమ్మద్‌తాతయు, అబ్దుల్లాకుతండ్రియునైన అబ్దుల్ ముతల్లిక్ అనునతడు మహమ్మదును సంరక్షించుచుండెను. ఇతడు గూడ కొలదికాలముననే తన పెదతండ్రితో వ్యాపారముచేయుచు, తన 25వ సంవత్సరములో ఖదీజా (ఖుదైజా) అనే భాగ్యవంతురాలైన విధవ స్త్రీ యొక్క వ్యవహారము నడపుచు నలుబది సంవత్సరముల వయస్సుగల ఆమెను వివాహము చేసుకొనెను. వారికి ఇరువురు కుమారులు, ఇరువురు కుమార్తెలు గలిగిరి. తరువాత అలి అను వానిని, సయ్యదు అను వానిని దత్త స్వీకారము చేసుకొనెను. మహమ్మద్ 40సంవత్సరములు వయస్సు రాగానే మత విషయము లందాసక్తి గలవాడయ్యెను.

అప్పుడు బొస్రావువాడైన బుహిర అను, నెస్తోరియ యను సన్యాసియు, తన భార్య జ్ఞాతియైనట్టియు, యూదు, క్రైస్తవ మత గ్రంథములయందు పాండిత్యము గలిగి, బాగా తెలిసినట్టి వరక అను నతడు మహమ్మదుకు మత విషయమున సహాయము చేయుచుండిరి. మతము యొక్క సత్యమును తెలుసుకొనుటకు పర్వతములలోని గుహలయందు ఏకాంతముగ వాసము చేయుచుండెను. అప్పుడు జిబ్రాయెల్ అను దేవదూత మతసంబంధమైన సంగతులు మహమ్మదుకు తెలియచేసెను. మహమ్మదు తాను నూతన మతనిర్మాణము

నకు వచ్చితినని చెప్పెను. కొందరు ఆయన మాటలు విశ్వసించలేక పోయినను ఆయనతో చేరినవారు మాత్రము నమ్మియుండిరి. ఖురైష్ గోత్రస్థులైన అబ్దుల్ ముతల్లిబ్ సంతతి వారందరును, మహమ్మద్ నూతనముగా స్థాపించిన మతము ననుసరించనివారై ఆయనను విరోధించుచు, చంపుటకు ప్రయత్నించిరి. అబ్దుల్ ముతల్లిబ్ అతనికి కీడురాకుండ కాపాడుచుండెను. తరువాత కొంతకాలమునకు ఖురైష్ గోత్రము వారు తప్ప మిగిలిన వారందరు మహమ్మదు మత మవలంబించిరి. తన నలువదవ సంవత్సరమున పెదతండ్రియైన అబూతలిబ్ చనిపోయెను. మహమ్మదు శత్రువులు (కాఫర్లు) తిరిగి విజృంభించి మహమ్మదును కష్టపెట్టుచుండిరి. అబూతాలిబ్ చనిపోయిన తరువాత ఖదీజా గూడా మరణించెను.

తరువాత మహమ్మదు సూదా, అయేషా, హఫ్జా, ఓంశలా యను స్త్రీలనే గాక, తన పెంపుడు కుమారుడైన సయ్యాదు భార్యను చూచి మోహించి ఆమెను, సిఫియా యనునామెను, మరియ యను నామెను, మైమూనా అనే వారిని ఇంక మరి ఇద్దరు స్త్రీలను ఉంచుకొనియుండెను. కొంతకాలము గడచిన తరువాత మహమ్మదు తాను దేవలోకమును దర్శించి వచ్చి దైవదర్శన మయినదని మరికొన్ని మత విషయములు బోధించెను. ఖురైష్ గోత్రస్థులు మరింత ఆగ్రహం చెంది, మహమ్మదును చంపవలయునని నిశ్చయించుకొనిరి. శత్రువుల బారినుండి ప్రాణరక్షణకై అతడు మక్కాను విడచి 'యత్రిబ' అనబడు మదీనాకు పోయెను. అరబ్బీభాషలో పోవుటకు 'హిజర' అని పేరు ఈ హిజర మహమ్మద్ పుట్టిన 52వ సంవత్సరమున కలిగెను. క్రీస్తు పుట్టిన 622వ సంవత్సరము జులై 15వ తేదిన 'హిజర' సంవత్సరము ప్రారంభమైనది. మదీనాకు పోయిన మహమ్మదుకు అక్కడ చాల మంది శిష్యులైరి.

మక్కాలో నుండిన శిష్యబృందము గూడ మదీనాకువచ్చి వీరి నాశ్రయించిరి. మహమ్మదు మదీనాలో మసీదునునిర్మించి మతప్రసంగములు చేయుచుండెను. ఖురైష్ గోత్రమువారు మాత్రము మహమ్మదుమీాద గల ద్వేషభావము వదలక, వారితో యుద్ధము జరుపుచుండిరి. తుదకు మహమ్మదే జయించి మక్కా మొదలగు పట్టణములు స్వాధీనము చేసుకొనెను. మహమ్మద్ మక్కా సమీాపమున కాబకు ఏడు పర్యాయములు ప్రదక్షిణములు చేసి అక్కడగల విగ్రహములను పాడుచేసెను. ఒక యూదుస్త్రీ మహమ్మదుకు విషమిచ్చి చంపినట్లు కొంతమంది చెప్పినను, క్రీ. శ. 632వ సంవత్సరము జూన్‌నెల 8వతేది అతడు మృతిచెందినట్లు తెలియుచున్నది.

మహమ్మదు చనిపోయిన తరువాత, ఆతని కుమార్తె ఫాతిమ భర్త 'ఆలి' అను నతడు మహమ్మదు పీఠము నధిష్ఠించెను. మహమ్మదు భార్య అయేషాయొక్క తండ్రియైన అబూబకర్ అను నతడు గూడ గురువై ఇరువురు మహమ్మదీయ మతమును పారసీకము–అరేబియా–ఈజిప్టు దేశములయందు వ్యాప్తి చేసిరి.

## మహమ్మదీయ మత సిద్ధాంతములు

ఈ మతమునకు "ఇస్లామ్" మతమని పేరు. ఇస్లామ్ అనగా భక్తి యని అర్థము. వీరి వేదమునకు "ఖురాన్" అని పేరు. ఇది జిబ్రాయల్ వలన మహమ్మదుకు లభించినది గాన వేద వాక్య మనబడును. "ఖురాన్" శ్రేష్ఠమైన (అలికితా) అని చెప్పుదురు. ఇస్లామ్ మతములో రెండు ప్రధానభాగములు గలవు.

1. విశ్వసింపదగిన (నమ్మదగిన) దానిని ఇమాం అనియు, 2. అచరణీయమైనది (అనుసరించుటకు వీలయినది) దీన్ అనియు గలవు.

1. ఇమాం (నమ్మదగినవి) ఆరు విధములుగా నున్నవి.

1. అల్లా (దేవుడు)-ఒకడున్నాడు (అతనికే, రబ్ అనియు పేరు గలదు.)
2. దూతలున్నారు—జిబ్రాయెల్- మిగాయెల్- అస్రాయెల్-ఇస్రే యేల్ అను దేవదూత లున్నారు. ఇబలిస్ అను సైతాను (పిశాచి) ఉన్నది.
3. వేదముగలదు—తౌరాతు, జబూరు, ఇంజల్, ఖురాన్ అనునవి వేద పుస్తకములు.
4. నబీ పురుషులు గలరు—2,24,000 నబీ లున్నారు. వారిలో ఆదాం, మోవా, అబ్రహామ్, మోసే-ఈసా-మహ్మద్ అను వారలు శ్రేష్ఠులు.
5. మృతశరీరము జీవించి న్యాయతిర్పు బడయును—ఏడు మోక్ష ములు ఏడు నరకములు గలవనియు, పుణ్య పాపములు త్రాసులో నుంచి తూయబడుననియు విశ్వాసము.
6. నజిబ్ అను విధి ప్రకారము నడచుకొనవలయును. లోక మాద్యంతము, "నజీబ్" చెప్పినదే ముఖ్యము.

2. దీన్ఆచరణ క్రమమైనవి నాలుగువిధములుగా నున్నవి.

1. నమాజ్‌చేయుట-ప్రతిదినము మనుజుడు స్నానముచేసి దినము నకు అయిదు పర్యాయములు మక్కా వైపునకు (పడమటి దిక్కునకు) ముఖము నుంచి, కిబ్లాను జూచి ప్రార్థన చేయ వలెను. 99 పూసలుగల జపమాలను ధరించి, 99 మహమ్మద్ నామములు జపము చేయుచుండవలెను.
2. భిక్షాక్రమము-తన ఆస్తియందు, సగము దేవున కర్పించి, తక్కినదానిని ఉత్సాహముతో తగిన వారికి దానము చేయవల యును. ధనముగలవారు "జకాతు" (విధిదానము) బీదల కియ్యవలెను.

ఉపవాసము-రంజాన్‌నెలలో ఖురాన్ వచ్చినది గాన ఆ నెలలో (30 దినములు) పగటికాలమంతయు, ఉమ్మియైనను మ్రింగక ఉపవాసము చేయవలయును.

మక్కాయాత్ర-ఇస్లామ్ మతస్థుడు, తన జీవిత కాలములో మక్కాయాత్రను తప్పక చేయవలయును.. మహమ్మద్ నబి మక్కాకు శుక్రవారము పోయినందున, శుక్రవారము నాడు విశేషముగ మిగుల భక్తితో దేవుని ధ్యానింతురు. ఈ నమాజులో "ఫాతిహాం" అను దేవుని స్తోత్రము విశేషమైనది.

## ఇస్లామ్‌మత ఉద్దేశ్యములు

1. విగ్రహారాధనను విడనాడవలెను.
2. మత్తుపదార్థములు సేవింపరాదు.
3. ఒకరియొద్ద మరియొకరు డబ్బు అప్పుగా దీసుకొనిన యెడల వడ్డీ పుచ్చుకొనగూడదు.
4. భగవంతునికి సమర్పింపని పదార్థములు తినరాదు.
5. పుణ్యపాపములు జాస్తిగ చెప్పబడి యుండెను.
6. వ్యభిచారము-దొంగతనము-జూదము పనికి రావు.

1. ఈ మతములో "అలిని" చేరినవారు "షియా" మతస్థులు. ఖురాన్ మాత్రమే నమ్ముదురు. వీరిలో జ్ఞానులకు "సాబ్బీ" పేరు. మొహరం పండుగ జరుపు కొందురు.

2. అబూ బకరును చేరినవారు సున్నీ తెగవారని చెప్పబడిరి. ఖురాన్‌ను మాత్రమే గాక, మహమ్మద్ నబీ చెప్పిన దంతయు యమని గ్రహించి ఆ పద్ధతి ననుసరించెదరు. మహమ్మదీయ ంతప్రవక్తలకు మౌల్వీ లని పేరు. మహమ్మదీయులలో నలుగురిని ాహమాడ వచ్చునని వీరి సిద్ధాంతము తెలిపియున్నది.

ఇస్లామ్ మతములో చేరదలచినవారు మహమ్మదుని, దేవుని ప్రవక్తగ విశ్వసిస్తున్నానని, ఇరువురు ముస్లిం పెద్దలను సాక్షులుగా నియమించి, తాను ఇస్లామును స్వీకరించితినని వారిముందు ప్రమాణము చేయుచు, అయిదు సిద్ధాంతములను అంగీకరించవలెను. విశ్వాసమునకు ఒకే దైవముపై దృఢనిశ్చయము గలిగి యుండవలెను అందుకు సాధనము "కలిమితయ్యబ్" మనస్ఫూర్తిగా జపించవలెను.

మొత్తముమీద పరిశీలించిన నీతి–న్యాయము–ధర్మము–దానము మొదలగునన్ని పద్ధతులు హిందూమతము ననుసరించియే యున్నవి. ప్రపంచములో మహమ్మదీయ దేశములలో మాత్రమే, ఈ మతము ప్రచారమైయున్నది గాని వ్యాప్తి జెందలేదు. మహమ్మదీయులలో తర తమ భేదములు–న్యూనాధిక్యములు లేక ప్రార్థనా సమయమందు భోజన సమయములందు, అందరు నైక్యముగా నుండి సోదరభావముతో మెలగెదరు. కాని వీరిలో ఆవేశము, రోషము, రౌద్రము, ఎక్కువైనందున తమకు వ్యతిరేకమైన వారిని నిర్దాక్షిణ్యముగా శిక్షించుటలో ఏమాత్రము వెనుదీయరు. వీరికి మతాభిమానము మిక్కుటము.

# 20. క్రైస్తవమతము

క్రైస్తవమతమునకు మహమ్మదీయ మతమునకు యూధ (యూదు) దేశము మాతృస్థానమై యున్నది. యూదుదేశమునందు మతమునకు యూదు మత మని పేరు. ఆదియందు ఈ దేశము నుండియే బైబిలు-ఖురాను మతగ్రంథములు కలిగెను. యూదుదేశము నందు వాడబడు హిబ్రూభాష సంస్కృతమునకు సమీపముగా నుండును. ఈ భాష క్రీ. పూ. 5 శతాబ్దమున కలిగినట్లు చెప్పెదరు.

యూదులు లూ, బెల్, సెట్ అను మూడు దేవతలను, విగ్రహములను చేసి పూజించు చుండిరి. యూదు మతము యొక్క వివరములు బైబిలు మొదటి పుస్తకమునం దున్నట్లు చెప్పబడినది. యూదులు క్రైస్తవులు, మహమ్మదీయులు అను నీ ముగ్గురు మతస్థులకు బైబిలు మొదటి పుస్తకము, కొంచెము భేదముతో సిద్ధాంతమై యుండును. 1. నోవహు, 2. అబ్రహామ్, 3. మోసె, 4. దావిద్ మొదలగు వారిని ఈ ముగ్గురు మతస్థులు ఒప్పుకొన్నారు.

### క్రీస్తు మతము

ఈ మతస్థులకు ప్రథమ ప్రమాణమైన బైబిలు ప్రకారము లోకమంతయు ఆరు దినములలో సృష్టి చేయబడినదని చెప్పి యుండెను. మొదటి దినమున 1. ప్రకాశమును, 2. రెండవ దినమున గాలిని, మేఘములను, 3. మూడవదినమున భూమిని, సముద్రమును, మొలచునట్టి పదార్థములను, 4. నాలుగవ దినమున సూర్యచంద్ర నక్షత్రములను, 5. ఐదవ దినమున చేపలను, పక్షులను, 6. ఆరవ దినమున మృగములను,మనుష్యులను సృష్టిచేసి, 7. ఏడవ దినమున ఆదివారము నాడు దేవుడు విశ్రాంతి నొందెను.

ఈ దినము సబ్బాతు దినమని చెప్పుదురు. ఇది భగవంతుని స్తుతించు దినము. దేవుడు మనుష్యులను సృష్టించుటకు పూర్వము ఆదిమనుష్యునిగా "ఆదాము"ను సృష్టించి ఆదాము యొక్క ఎడమ భాగములోని కొంచెము మజ్జాస్థిని గ్రహించి హవ్వను సృష్టించెను. ఆ యిర్వురును ఏడెను తోటలో నుండగ సైతాను వలన దేవుని ఆజ్ఞ అతిక్రమించి తినవలదనిన పండును తిని పాపమును బొందిరి.

తరువాత ఆదాము హవ్వలకు కాయీను, ఏబెలు అను ఇరువురు కుమారులు జన్మించిరి. కాయిను దుర్మార్గుడైనందున ఏబెలు తన అన్నను చంపెను. అపుడు దేవుడు ఏబెలును చూచి నీ యన్న ఎక్కడున్నాడని యడుగగా నే నెరుగను పొమ్మని చెప్పెను. తరువాత దేవుడు ఆదాము, హవ్వలను కనికరించి "సేతు" అను కుమారు నిచ్చెను. ఈ సేతువునకు ననేకులు జన్మించి అందరును దుర్మార్గులై యుండిరి. అందు "నోవాహు" అను వాడు మంచివాడై యుండెను. తరువాత ఆదాము, హవ్వ, సేతు అను వీరందరు గతించిరి.

అప్పుడు దేవుడు "నోవాహు"ను ఓడను నిర్మించుకొని యందు సమస్త పదార్థములను, క్రిమి కీటకాదులను ఓడయం దెక్కించుకొమ్మన, నతడు తన భార్యతోడను ముగ్గురు కుమారులతోడను ముగ్గురు కోడండ్రతోను ఓడ నెక్కెను. తరువాత 40 రోజులు రేయింబవళ్లు వర్షము కురిసినందున జలప్రళయమై ఈ ఓడలోనివారు తప్ప మిగిలిన దంతయు నాశన మయ్యెను.

తరువాత జలము ఇంకిన వెంటనే ఓడలోని వస్తువులు లోకమున వ్యాపింప చేసెను. తన సంతతి వారి వలన లోకము వృద్ధి నొందెను. ఇది క్రీస్తుమతసృష్టి క్రమమై యున్నది. లోకము సృష్టియై 6000 సంవత్సరము లైనట్లుగా చెప్పెదరు.

ఈ మతమునకు ఆదిపురుషుడు "అబ్రహాము". అతని సంతతితో చేరిన యోసేపునకు మరియ అను భార్యయందు పరిశుద్ధమైన ఆత్మవలన, సంగమము లేకనే, బెత్లహేము దేశమున క్రీస్తు జన్మించెను. ఆయనకు ఏసు అను పేరు గలదు. ఇట్లు జన్మించిన దేవుని కుమారుడైన ఏసును సైతాను అనేక హింసలపాలు చేసెను. దేవుని యాజ్ఞ ప్రకారము క్రీస్తు తనను కొలువవలసినదిగా చెప్పుకొనెను.

క్రీస్తు మాటలను యూదులు నమ్మలేక పోయిరి. క్రీస్తు తన యొక్క మహిమ వలన ముసలి వారిని వయసు వారిగను, చచ్చిన వారిని బ్రతికించుటయు, రోగములు నివర్తింప చేయుటయు మొదలగు అనేక అద్భుతకార్యములు చేసెను. అయినను జెరూసలములోని యూదులు, క్రీస్తు దేవుని కుమారుడు కాడని చెప్పి, ఆ యేసును ముప్పదినాలుగు సిలువలలో వేసి చంపి పాతించిరి. మరణ సమయములో దయామయుడైన ఏసు శాంతస్వభావము గలిగి పరులను నిందించ లేదు. క్రీస్తు మరల మూడవ దినమున సమాధి యందుండి లేవగా నతని శిష్యులు మిగుల విశ్వాసముతో ప్రవర్తించిరి. యూదులలో గూడ అనేకమంది క్రీస్తునకు భక్తులైరి.

### క్రైస్తవమత సిద్ధాంతములు

1. జనులందరికిని చచ్చినతరువాత న్యాయవిచారణ జరుగును.

2. క్రీస్తును భక్తి విశ్వాసములతోనమ్మినవారికి మోక్షలోకమును, ఇతరులకు నరకలోకము సిద్ధించుననియు, న్యాయవిచారణ జరుగనంతవరకు వారి ఆత్మలు సమాధి యందుండుననియు నమ్ముదురు.

3. క్రీస్తుకాలమున సున్నతి (సుంతి) మిగుల ప్రచారములో నున్నది. వారు దానిని నిరసించి జ్ఞానస్థానమును స్థాపించిరి.

(జ్ఞానమనగా) ఈ జ్ఞానస్థానమును పొందగోరిన వారిని నదీ, సరోవరములకు గొనిపోయి, నీటిలో మునుగునట్లు చేసి, అ

తరువాత పాతగుడ్డలను తీసివేసి, తెల్లని గుడ్డల నిచ్చి, గుడికి పిలుచు కొని పోవుచుండిరి. ఐరోపాలో చలి యధికమగుటచే, ఆ పద్ధతిని విడచిపెట్టి, తలమీద నీళ్లను ప్రోక్షించు వాడుక ప్రబలమైనది. ఈ స్నానము చేయించుటకు, ఫాదరీలును, వారివద్దనుండి యధికారము బొందిన వారును అర్హులు. క్రీస్తుమతమున ఆ మార్గము నవలంబించిన వారు జ్ఞానదీక్షను బొందవలయును.

క్రీస్తు పరలోకము బోవుటకు ముందు, తన శిష్యుల (అపోస్తులు)తో గూడి రాత్రి జ్ఞానభోజనము చేయుచుండిరి. తరువాత క్రీస్తు, పరమండలమునకు బోవునప్పుడు, తమయొక్క మాంసము అప్పముగను, తమ రక్తము రసముగను, భుజింతురుగాక యని చెప్పిరి. క్రీస్తు చెప్పిన ప్రకారము ఆ దినమున రొట్టె (అప్పముగను) ద్రాక్షసారాయి (రసముగను) పుచ్చుకొనెదరు.

మిగతా పదార్థములను గృహములలోని వ్యాధిగ్రస్తులకు ఇత్తురు. ఈ అప్పము రసమును, ఏసుక్రీస్తు యొక్క మాంసము రక్తములై యుండుటచే దీనిని స్వీకరించువారు పరిశుద్ధు లగుదురు.

17వ శతాబ్దమువరకు, క్రీస్తు మతస్థులలో ననేక కలహములు జరుగు చుండెను. రోమన్ కేథలిక్ వారనియు, ప్రొటెస్టెంటు వారనియు ఇరు తెగలుగ నుండి, పోరాడుకొను చుండిరి. తరువాత అనేక భేదములతో క్రీస్తు మతము వ్యాపించినది. ప్రస్తుతము 250 క్రీస్తుమత సంఘము లున్నట్లు తెలియుచున్నది.

వీటిలో గ్రీకుసంఘము, రోమాసంఘము, లూథరుసంఘము, ప్రొటెస్టెంటు సంఘము-బాప్టిష్టు సంఘము-లండన్‌సంఘము-స్కాట్సు సంఘము-స్వీడన్‌బర్గుసంఘము మొదలగు అనేక సంఘములు, ప్రపంచములో వ్యాప్తమై యున్నవి. మిగతా మతముల కన్న, ప్రపంచములో, ఈ మతప్రచారము విరివిగా వ్యాప్తి జెంది, పెక్కుమందిచే

నాకర్షింప బడుచున్నది. ఈ మతము వ్యాపింపజేయుటలో పాశ్చాత్య దేశమునందు గల మిషనరీ సంస్థలు నిర్విరామముగా ప్రపంచమంతటను, ప్రతిదేశములో, ఎంత చిన్నప్రాంతమైననూ, మారుమూలలకు బోయి, పురుషులు, స్త్రీలు ఎంతో శ్రద్ధతో మతప్రచారము గావించుచున్నారు. ఈ నాటివరకు, వీరు ఎంతో శ్రమకోర్చి మతప్రచారము చేయుటలో చూపెడి ఉత్సాహము, ఎంతగనో కొనియాడ దగినదిగా ఉన్నదనుటలో అతిశయోక్తి లేదు.

ఈ మిషనరీలు మతవ్యాప్తితో బాటు, తమ మతములో చేరిన వారికి, ఉచితవిద్యా సౌకర్యములు కల్పించి, పాఠశాలలు నిర్మించి యుండిరి. వైద్యాలయములు నిర్మించి బీదవారికి ఉచితవైద్య సౌకర్యములు చేసి యుండిరి. వీరు మానవసేవ చేయుటలో గూడ ఉత్సాహము చూపుచుండుట మిక్కిలి కొనియాడదగి యున్నది. హిందూదేశములో అగ్రవర్ణములవారిచే ఈసడింపబడుచు హీనముగా చూడబడుచున్న కొన్నివర్ణములవారు, ఈ మతములో జేరి విజ్ఞానవంతులై పెక్కు సౌకర్యములు పొందుచుండిరి. వారుచేయు ప్రచారమువల్ల, కల్పించున్న ఉచితసౌకర్యముల వల్ల చాలమంది ప్రజలు ఆకర్షింపబడి, క్రైస్తవమతమును స్వీకరించి, వారి ననుసరించుచుండిరి.

ఈ మిషనరీలు ప్రతి చిన్న గ్రామములో గూడ భగవంతుని ప్రార్థించుట కొరకు చర్చీలు నిర్మించిరి. వారిలో ఎన్నోరకముల సంఘములున్నను మేమంతా క్రైస్తవుల మనియు, మాది క్రైస్తవమతమనియు, మా భగవంతుడు క్రీస్తుప్రభువనియు చెప్పెదరు. ప్రపంచములో ఈ మతము వ్యాప్తి చెందినట్లు ఏ యితరమతములు వ్యాప్తి చెందలేదనుటలో అతిశయోక్తి లేదు. వీరు సమస్తప్రజలను ఏ భేదభావములు చూపక తమ మతములోనికి చేర్చుకొని ఆశ్రయ మిచ్చుట ప్రధానముగా గనపడుచున్నది.

శ్రియః కాంతాయ కల్యాణ నిధయే నిధయేఽర్థినామ్,
శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః,
గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు.

ధర్మస్య విజయోఽస్తు - అధర్మస్య నాశోఽస్తు,
ప్రాణిషు సద్భావనాస్తు - విశ్వస్య కల్యాణమస్తు.

---

# ఉపయుక్త గ్రంథసూచి

తత్త్వవేత్తలు (సిద్ధాంతములు - జీవితవిశేషములు):
శ్రీ గోపీచంద్.

సకలార్థసాగరము:
ఓ. వై. దొరస్వామయ్యగారు, చెన్నపురి - 1905.

సర్వమతసిద్ధాంత సౌరభము:
పరమహంస-పరివ్రాజకాచార్య అమలానందస్వాములవారు, బాపట్ల.

రామకృష్ణ బోధామృతము:
అనువాదకులు-చిరంతనానందస్వామి.

శ్రీరామానుజాచార్యుల జీవితచరిత్రము:
శ్రీమాన్ యస్. రంగాచార్యులుగారు.

వైఖానసులు:
శ్రీమాన్ డా॥ యన్. కేశవాచార్యులుగారు.

విఖనోముని - వైఖానసులు:
లలితభారతి దేవీలక్ష్మీ నరసింహాచార్యులుగారు, పట్టాభిపురము,
గుంటూరు - 4.

ఆర్షవాఙ్మయ చరిత్రలు:
వేదాన్తం శ్రీనివాసాచార్యులుగారు, మంచికలపూడి, గుంటూరు జిల్లా.

ఆళ్వారులు:
శ్రీమాన్ శతావధాని పండిత టి. లక్ష్మణాచార్యులుగారు, శ్రీమాన్ గట్టుపల్లి శేషాచార్యులవారిచే ఏర్పరుపబడిన శ్రీమాన్ తచ్చూరి నరసింహాచార్యులచే చెన్నపురి, శశిరేఖాముద్రాక్షరశాలలో ముద్రింపబడి ప్రకటింపబడిన ఆళ్వారుల - ఆచార్యుల చరిత్రము - 1911.

శ్రీరామానుజ కీర్తికౌముది:

శ్రీ వైద్యవిద్యాసంస్థానము, అలపాడు.

గృహ్యసూత్రధర్మములు:

శ్రీమాన్ ఎక్కిరాల రాఘవాచార్యులవారు.

వేమనయోగి:

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.

బ్రహ్మంగారు:

శ్రీ తాడికొండ వేంకటరాఘవాచార్యులుగారు.

రమణమహర్షి:

శ్రీ నిరంజనస్వామి, రమణాశ్రమము, తిరువణ్ణామలై - 1936.

అరవిందయోగి:

శ్రీయుత తు. కోదండరామస్వామి, బి.ఎ. బి.ఎల్. ఆంధ్రపత్రికా ముద్రణాలయము - 1936.

ఇస్లామ్ మతము:

"విశ్వప్రవక్త" అను పుస్తకములోని "మహమ్మద్ జీవితచరిత్ర".

అనువాదం:

ము. అవ్విలుల్ అమీరి.

ప్రబోధిని:

ఇస్లామి మాసపత్రిక.

నిఘంటువులు

